నిరుక్త భారతి గ్రంథమాల – 8

# వన్దే వాల్మీకి కోకిలమ్

(రామాయణ తత్త్వదర్శనము)

(మొదటి భాగము)


రచయిత :

హరి లక్ష్మీనరసింహ శర్మ



ప్రకాశకులు :

వేదశాస్త్ర రక్షణ పరిషత్తు (రిజిష్టర్డు)

విజయవాడ – 10

విరక్తభారతి గ్రంథమాల 2

# వన్దే వాల్మీకి కోకిలమ్

( రామాయణ తత్త్వదర్శనము )

[ మొదటి భాగము ]

రచయిత.

హరి లక్ష్మీనరసింహ శర్మ

ప్రకాశకులు.

వేదశాస్త్ర రక్షణ పరిషత్తు (రిజిష్టర్డు)

విజయవాడ 10

ప్రతులు 1000

మూల్యము . 45 00

క్రోధన మాఘ చతుర్దశి (శివరాత్రి) శనివారము

8 మార్చి 1986



ప్రాప్తి స్థానములు

1. శోధన్ గృహము, బందరు రోడ్డు, విజయవాడ 10
2. శోధన్‌గృహము కొత్తపేట, తెనాలి
3 శోధన్‌గృహము, 1 10 54, బేగంపేట, హైదరాబాదు 16

---

ముద్రణ . శ్రీ లక్ష్మీనారాయణ ప్రింటింగ్ ప్రెస్
మాచవరం. విజయవాడ 4

# విషయసూచిక

జగద్గురువులు శ్రీ శ్రీ శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు
శ్రీమ దభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వామివారి

# సందేశము

అస్మ దత్యంత ప్రియశిష్యులు శ్రీ హరి లక్ష్మీనరసింహ శర్మ గారు అస్మ దాశయానుగుణముగా "వన్దే వాల్మీకికోకిలమ్" అను గ్రంథము ననతికాలములో రచించి మా కందించి నందుల కెంతయో సంతసించుచున్నాము శ్రీమద్రామాయణ భారతాదుల నాధారము చేసికొని వీరు వాల్మీకిచరిత్రమును లోకమున కందించుట యెంతయు ప్రశంస నీయము. శ్రీ వాల్మీకి మహర్షి యొక్క "వాల్మీకి", "వాల్మీక" యను నామముల యౌచిత్యము విచారము జేసి యందు 'వాల్మీకి' యనునామము వల్మీక మహర్షి యొక్క ఔరసాపత్యత్వమును, 'వాల్మీక' యను నామము ఆ మహర్షి యొక్క లోకవిలక్షణ తపస్సంప ద్విభూతి స్ఫోరకమై వల్మీక సంబంధమును సూచించుచున్న దని వీరు వివరించుట గమ నార్హము ఇంకను వాల్మీకియొక్క మంత్రద్రష్టృత్వాది మహత్త్వవిశే షములను సప్రమాణముగా వెలుగులోనికి దెచ్చుట ఆ మహర్షి యెడ ఈ రచయితకు గల ప్రగాఢ ప్రతిపత్తిని చాటుచున్నది ఇందు వాల్మీకి చరిత్రతోపాటు ఆ యాదికవి గానము జేసిన మధురాక్షరాత్మకమైన శ్రీమద్రామాయణమహాకావ్యము నందలి తత్త్వము నుద్దీపింపజేయు

వ్యాసముల గూడ నిందు జేర్చి ప్రకటించుట పాఠకజనుల కెంతయు నుపకారకము గాగలదని యాశించుచున్నాము మా వేదశాస్త్రరక్షణ పరిషత్తు లక్ష్యమున కనుగుణముగా పరిషత్తు ఆధ్వర్యమున తొలికుసుమముగా నీ గ్రంథము వెలువడుట యెంతయు ముదావహము అనతికాలములో నిట్లే శ్రీరామకథా దివ్యసౌరభముల వెదజల్లుచు రెండవభాగము వీరు వెలుగులోనికి దీసికొని రాగలరని యాశించుచున్నాము శ్రీ శారదాచంద్ర మౌళీశ్వరులు వీరికి దీర్ఘాయు రారోగ్యసంపదను ప్రసాదించి వర్ధిల్ల జేయుదురు గాక ।

ఇతి నారాయణస్మృతిః

మకాము హైదరాబాదు
16-2 1986.

నమామి వేదమాతరమ్

# పరిషత్తు మాట

శ్రీ శ్రీ శ్రీ జగద్గురువులు, పుష్పగిరి పీఠాధిపతులు శ్రీమదభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వామివారు సుమారు దశాబ్దములకు పూర్వము తెనాలి గ్రామమున చాతుర్మాస్య దీక్షను నిర్వర్తించు సందర్భమున నట గల ఆస్తిక, విద్వజ్జన ప్రోత్సాహముతో నీపరిషత్తును స్థాపించిరి అప్పటినుండి యథావకాశముగ పరిషదధ్వర్యమున శాస్త్ర విద్వత్సభలు ఆంధ్రదేశమున జరుపబడినవి ప్రముఖులైన విద్వాంసులెందరో నీ సభలయందు పాల్గొనిరి

ఇటీవల చాపట్లలో పరిషదధ్వర్యమున వాల్మీకి జయన్తి వైభవముగ జరిగినది. ఆ సందర్భమున శ్రీ శ్రీ శ్రీ జగద్గురువులు తమ అనుగ్రహభాషణమున శ్రీమద్రామాయణ వైభవమును, లోక విఖ్యాతమైన నట్టి మహాకావ్యమును లోకమున కందించిన నాదికవి యగు శ్రీ వాల్మీకి మహర్షి యొక్క మహత్త్వమును, దివ్యచరితమును బహుధా ప్రశంసించిరి మఱియు, ప్రప్రథమమున పరిషత్తు తరఫున నా మహాపురుషుని యొక్క జయన్తి యీ నగరమున జరిగినందువలన నిచట ఆ మహాత్ముని స్మృతిచిహ్నముగ "శ్రీ వాల్మీకి మహర్షి మందిరం" నిర్మాణము జరుగుట యుచితమని యుద్బోధించిరి జగద్గురూపదేశముచే ప్రభావితులై అచటి

ఆస్తిక ప్రముఖులు కొందఱు మందిర నిర్మాణమునకై సంకల్పించి శ్రీ వాల్మీకి చరితమును వివరముగా ప్రచురించుట మంచిదని నగరవాసులు విన్నవించుకొనగా శ్రీ వాల్మీకి చరితముతోపాటు మధుర వాల్మీకి కోకిల గాన స్వరూపమైన రామాయణతత్త్వము నుద్దేశింపజేసెడి వ్యాససంపుటిని యీ వేదశాస్త్ర రక్షణ పరిషత్తు తరపున ప్రచురింప జగద్గురువులు సంకల్పించిరి.

శ్రీవారి సంకల్పము నేడు యీ గ్రంథ రూపము దాల్చినదని తెలుపుటకు ఎంతయో సంతసించుచున్నాము. శ్రీ శ్రీ శ్రీ జగద్గురువుల సంకల్పమునకు రూపకల్పనజేసి యీ గ్రంధమును అందించిన జగద్గురువుల ప్రియశిష్యులు శ్రీ హరి లక్ష్మీనరసింహశర్మగారికి మా పరిషత్తు తరపున నభినందనలు దెల్పుచున్నాము.

వేంకటేశ్వరపురం
విజయవాడ 10
3 3 1988

ఇట్లు
బుధజనవిధేయుడు
భాలకి విశ్వనాథరావు
వేదశాస్త్ర పరిషత్ కోశాధికారి

# రచయిత మనవి

"కామకోటిమహాపీఠవాసినీం కామితార్థదామ్,
వందేమహి చ తాం దేవీం చంద్రశేఖరసుందరీమ్॥"
"శ్రీ పుష్పగిరిపీఠస్థాం చంద్రమౌళీశ్వరాంకగామ్,
శారదాం భావయే విద్యాశ్రీనృసింహాఖ్య భారతీమ్॥"

భారతీయసంస్కృతికి రూపురేఖలు దిద్దిన వ్యాసవాల్మీకుల వాఙ్మయము మొదటి నుండియు నన్నాకర్షించినది. ఆ వాఙ్మయ మజరామరము. తత్రాపి వాల్మీకి ప్రసన్న గంభీరకవిత నా దృష్టి నెక్కుడుగ ఆకర్షించినది. రామాయణ మొక విచిత్రసృష్టి, అర్థమైనట్లే కన్పించును కాని నా యూహ కందని మహోన్నత భావగాంభీర్య మా గ్రంథమందు నిగూఢముగా నున్నట్లు నేను పారాయణ జేయుకొలది స్ఫుటతరము కాజొచ్చినది, రామాయణము నిజముగా వేదావతారమా? కాదా? వేదావతార మని చెప్పెడు వాక్యము కేవల మర్థవాదమా? వేదావతార మని యంగీకరించుచో వేద లక్షణము లన్నియు వ్యక్తముగానో, అవ్యక్తముగానో, బీజప్రాయముగానో ఉండియుండవలను అట్లు కాదని, ఋషివాక్యముల కపార్థముగల్పించుట సాహసము. ఈ దృష్టితో నా పరిశోధన సాగినది కాని లోతుకు దిగినకొలది అంతు దొరకుట కష్టమై నే చేయు యత్నము నావంటి యల్పజ్ఞానికి తగదేమో యని వెనుకంజ వేయుద మనిపించినది కాని ఆ వాల్మీకి కోకిల కుహూకుహూ రావములు నన్ను వెంటాడినవి, నాచే ముందంజవేయించినవి. అట్టి తరుణమున శ్రీ కంచిజగద్గురువులు చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు విజయవాడలో మా శోధన్ గృహమునకు మకాం చేయుట

కలస్థించినది. ఆ సందర్భమున మా పరిశోధనవ్యవసాయమును శ్రీవారి దృష్టికి తీసికొని వచ్చితిమి వారు తీరిక గల్గినపుడెల్ల. సావధానముగ మా రచనలను విని ఎంతయో ఆనందించి ఇట్లు ఆజ్ఞాపించిరి

“మీరచనలలో ముఖ్యముగ మూడు నియమాలను పాటించండి. ఈ నియమాలను పాటిస్తె మీ గ్రంథము చిరస్థాయియై వెలుగొందు తుంది. మీ -

1. రచనల యందెక్కడగూడ మీ అహంకారము పొంగిపడరాదు.

2. రచనలయందు ఇతరులకు బాధాకరమైన పరనిందకు తావీయరాదు.

3 ఈ గ్రంథరచన కేవలవ్యాపారదృష్టితో సాగరాదు.

శ్రీవారి ఈ అనుగ్రహపూర్వకములైన ఆశీస్సులు మాఆనందోత్సాహముల ఇనుమడింపజేసినవి.

ఇంతియేగాక, నా యీ ప్రయత్నమునకు సంతసించి, ఆశీర్వదించి, అనుమతించి నన్ను ప్రోత్సహించినది నాప్రియతమ సోదరులు గురువరేణ్యులు శాస్త్రపారంగతులు బ్రహ్మశ్రీ హరి సాంబశివ శాస్త్రిగారు. వాత్సల్యపూరితమైన వారి ఆశీస్సులే లేకున్న నే నీ ప్రయత్నమునందు కృతకృత్యుడను కాలేక పోయెడివాడను వారి ఆశీస్సులముతోనే నా రచన ముందుకు సాగినవి. రామాయణమున గల గంభీరార్థస్ఫోరక ఘట్టములను వివరించునట్టి సిద్ధాంత భంగము కాకుండునట్లు శాస్త్రీయనిర్ణయము చేయుటలో నాకు నిరంతరము సాయపడుచు వెలుగుబాటల జూపి, సంప్రదాయ మర్యాదలను నాకుపదేశించి నడిపించిన దేశికులు మాసోదరులు హరి సాంబశివశాస్త్రిగారు వారికి నేను సదా కృతజ్ఞుడను, అజ్ఞాబద్ధుడను.

మాలో నొకరై నిత్యసంనిహితులై శాస్త్రీయచర్చలలో మా తోపాటు పాల్గొనుచు నిండుహృదయముతో ప్రోత్సహించుచు నా యీ కృషికి దోహదము చేసిన పండితవర్యులు విమర్శకులు, సహృదయులు, సంప్రదాయజ్ఞులు నైన బ్రహ్మశ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సౌహృదయము నాకు మరువరానిది. కోరినంతనే ఈ గ్రంధమునకు తిలకాయమాన మగు నట్లు మున్నుడిగా ప్రరోచన వ్రాసియిచ్చిన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఇందు వాల్మీకి యొక్క యధార్ధ జీవితచరిత్రను శ్రీమద్రామాయణమును తదితరార్ష వాఙ్మయమును ఆధారము జేసికొని లోకము కందించుటకు యథాశక్తి ప్రయత్నించితిని. ఇంకను ఆ మహాత్ముని విషయమై ఎన్నియేని విశేషము లుండవచ్చును. రామాయణము వేదావతారమని నిరూపించుటయే ఈ రచన లక్ష్యము. అందుకై కొలది సంనివేశములు మాత్రమే తీసికొని యందలి యర్థగౌరవము ప్రదర్శించుటకు యత్నము జరిగినది. అందు నాకు లభ్యరత్నములు కొలదిగనే దొరికినవి. వెదకి వెలిదీయవలసిన రత్నము లెన్నియో యుండవచ్చును. శ్రీ సీతారాముల యనుగ్రహముచే వానిని మరియొక సంపుటమున వెలుగులోనికి తీసికొని రావలనని సంకల్పము పైన ఈశ్వరేచ్ఛ

ఈ వాల్మీకి చరిత్రమును వ్రాయవలె ననెడి సంకల్పము కేవలము నాది గాదు. లోకమున భక్తులకు, ఎందరికొ మందిరములు గలవు. వారు వీరని భేదములేక అందరు కారాధ్యుడైన వాల్మీకి మందిరము లేకి కుంపుట యేమి? అనెడి నా ఆవేదనను గుర్తించి వాడవాడలలో వాల్మీకి మందిరనిర్మాణమునకై ప్రచారము చేయుచు వాల్మీకి చరితమును వ్రాయుడని శ్రీ పుష్పగిరి జగద్గురువులు నన్నాదేశించిరి. వారి యాదేశము నాకు శిరోధార్యమై వాల్మీకి

చరిత్రరచనకు దోహదముచేసి నది. ఇంతియేగాక శ్రీ జగద్గురువులు తమచే స్థాపించబడిన వేదశాస్త్రరక్షణ పరిషత్తు ద్వారా ఈ గ్రంథమును ప్రకటించుట నా మహద్భాగ్యము శ్రీ చరణులకు నా సప్రశ్రయ ప్రణామ శతములు.

ఈ పరిషత్తుకు కోశాధి కారులు సహృదయులు ప్రియమిత్రులు నగు శ్రీ బాలకి విశ్వనాధరావుగారు నా యీకృషికి చెయూతనిచ్చి నాయీ గ్రంథమునకు అభిప్రాయ మొసగి ప్రోత్సహించినందుకు వారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

అనతికాలములో ఈ గ్రంథమును వెలుగులోనికి తీసికొనివచ్చుటకై అహర్నిశలు శ్రమించి తోడ్పడిన మా చిరంజీవులు గీర్వాణ భాషాభిజ్ఞులు మా అన్నగార్ల కుమారులునైన హరివెంకటేశ్వరశర్మకు హరి శ్రీరామమూర్తికి నా హృదయ పూర్వక శుభాశీస్సులు.

ఈ గ్రందమును సుందరముగా ముద్రించియిచ్చిన లక్ష్మీనారాయణ ప్రింటింగ్ ప్రెస్‌వారికి నా హృదయపూర్వక అభినందనలు.

రామాయణ తత్త్వార్థదర్శనమున నా యీ కృషి కొంతదిగనైన దోహదము చేయగల్గినచో భగవద్వాల్మీకి కరుణా కటాక్షములకు పాత్రుడనైనట్లు భావించి ధన్యుండ నగుదును.

శ్రీరామ శ్శరణంమమ
శోదన్‌గృహ
బేగంపేట 1 10_64
హైదరాబాద్ 16

16 4_86
అక్షయ శ్రీరామనవమి

ఇట్లు
బుధజన విధేయుడు
హరి లక్ష్మీనరసింహ శర్మ

# నమామి వేదమాతరమ్

## ప్రరోచన

"సూర్యమండలమధ్యస్థం రామం సీతాసమన్వితమ్।
నమామి పుండరీకాక్ష మమేయం గురుతత్పరమ్॥"

పురాణేతిహాసములు భారతీయ సంస్కృతికి మూలకందములు. వాల్మీకి వ్యాసమహర్షులు రామాయణమహాకావ్య భారతాదిపురాణేతిహాసముల ద్వారా భారతీయసంస్కృతిని సర్వాతిశాయి సౌందర్యముతో తీర్చిదిద్ది, తత్ప్రభాపుంజములను వెదజల్లి సమస్తవిశ్వమును జ్యోతిర్మయ మొనర్చిన మహాతపస్సంపన్నులు, క్రాంతదర్శనులు, మహాకవిశిఖరాయమాణులు; వేదతత్త్వార్థోపబృంహణమునకై వేదస్వరూపిని రామాయణ, భారతాది రూపమున భూలోకములో నవతరింపజేసి మానవజాతిని అప్లావితము, పావితము నొనర్చిన మహాకరుణరసార్ద్రహృదయులు. భారతీయ సంస్కృతి యందు వ్యాస వాల్మీకులకు గల స్థానము అనదృశము. కాళిదాసాది కవీంద్రులు తన్మార్గానుయాయులై అజరామర యశఃకాయులై వెలుగొందిరనుట పండితహృదయైకవేద్యము.

శ్రీరాముని అవతారము ఎంత మహత్త్వసంపన్నమో, ఎంత యర్థవంతమో, రామాయణము గూడ నంత మహామహిమోపేతము, అంతటి యన్వర్థము. వేదమాతృహృదయము మహాగభీరము. అందలి తత్త్వము సామాన్యులకు దురవబోధము, ఆచరణదుస్సాధము. తత్తత్త్వమును వ్యావహారిక జగత్తు నందలి మనుష్యజీవితములో అనుక్షణము అనుభవించి, ఆచరణమున ప్రతిఫలింపజేసి ఉత్తమ భూమికల నందుకొను నుపాయముల నుద్బోధించి మర్త్యశిక్షణము చేయసంకల్పించి పరమేశ్వరు

డష డపుడు మానుషరూపమున భువిపై నవతరింపట జరుగుచుండును. తదవతారతత్త్వాభివ్యక్తికై ఋషులవతరించి,తత్త్వమును అంత ర్దృష్టితో దర్శించి యా యవతారపురుషుల జీవ చరిత్రమును రసవంతమయిన వాక్కులతో ముగ్ధమోహనముగా వర్ణించి జీవకోటికి మార్గదర్శకు లగుచుందురు. ఋషిప్రోక్తమైన మహావాక్యములు, పురాణేతిహాసాదులు వేదావతారరూపములె యని మహనీయుల కథనము.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా॥"

వేదవేద్యుడైన శ్రీమన్నారాయణుడు భువిపైన నవతరించి,స్వీయ వైభవమును ప్రదర్శించుచుండగా, శ్రీవాల్మీకిమహర్షి తపస్సమాధి జన్య ఋతంభరాప్రజ్ఞతో వేదప్రతిపాద్యము, ఉపనిషత్తత్త్వఖ్యాపకము, నారదోపదిష్టము నయిన శ్రీరామతత్త్వమును దర్శించి రామాయణ మహా కావ్యరూపమున నావిర్భవింపజేసిన క్రాంతదర్శి.

కాలమహిమ యేమో గాని వాల్మీకిరామాయణ మావిర్భవించిన పిమ్మట భారతీయభాషలలోనే గాక,ప్రపంచ భాష లన్నిటియందు శ్రీరామ కథాకావ్యములు వెలసినవి. వారి వారి చిత్తవృత్తులతో, సంస్కారవిశేషము లతో శ్రీరామగాథలో ఎన్ని మార్పులు,చేర్పులు చేయబడినవో। ఆ కావ్య ములలో కొన్ని భక్త్యతిశయ పరిచాయక విచిత్రగాథ లయిన,మరికొన్ని వేదవిరోధభావదూషిత సంస్కారములతో చేసిన అసభ్య,అశ్లీల,అనైతిక భావసంభృతగాథలు. ఋతంభరాప్రజ్ఞాదర్శనమైన శ్రీమద్వాల్మీకి రామాయణమునందె దెచటను అనృత మనునది యుండజాలదని పీరెవరును గుర్తింపరైరి.

అటులనే, రామాయణముపై బయలుదేరిన విమర్శలు కొకొల్లలు, బుల్కేవంటి పాశ్చాత్యవిమర్శకులు చేసిన విమర్శలు, నిర్ణయములు రామాయణ యథార్థతత్త్వప్రతిపాదకములె గాక, వేదవిరుద్ధభావప్రవర్త కములు. శ్రీమద్వాల్మీకికాలమును, రామాయణరచనాకాలమును క్రీస్తుశకాంతరద్భూతము లని నిర్ణయించి చెప్పుటకు ఆ విమర్శకులు చేసిన ప్రయత్నములు వారి వైదికసంప్రదాయానభిజ్ఞతను చాటునేగాని, రామాయణ తత్త్వజ్ఞానావగతికి సాయపడజాలవు. రామాయణమహిమాప్రఖ్యాపకములైన విమర్శగ్రంథములు భారతీయభాషలలొ రాకపోలేదు. అవి సమాదరణీయములని చెప్పుటకు సంశయింప నవసరములేదు. వానిలో కొన్ని శ్రీరామాదుల వైభవప్రస్తావకములు, తన్నిహితమాతృపితృ. భ్రాతృ భక్తి, భార్యా భర్తృసంబంధము, దయా దాన, సౌహార్ద సౌశీల్యాది మానవతాగుణములు, ధర్మపరాయణత, రాజనీతి ఇత్యాద్యనేకానేక స్తావక గుణప్రదర్శకము లయిన, మరికొన్ని, ఆదికవి మధురకవితా సౌందర్య సౌరభ ప్రసారకములు. పఠాదృశ సమీక్షలు, సమాదరణీయములు, ఆవశ్యకములును గూడ. అదేవిధముగా దేశవిదేశ ములలో రామాయణముపై ఎన్నియో కల్పవృక్షములు వెలసినవి. మరెన్నియో విషవృక్షములు మొలకెత్తినవి. రామాయణము వేదతత్త్వార్థ స్ఫోరకము, లౌకికజీవనవిధానప్రతిపాదకము నగుటయేగాక, మహాగభీరము, తన్మహర్షిధ్యానగమ్య ఆత్మతత్త్వస్ఫోరక మను విషయముపై నెవరును విశేషించి తమ ప్రతిభాదీప్తులను ప్రసరింపజేయలెదు. రామాయణము వేదతత్త్వార్థస్ఫోరకమైన మహాకావ్యము గాకపోయినచో

"స తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ.

వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః"

వాల్మీకి వేదార్థోపబృంహణార్థమై రామాయణమును రచించి కుశలవుల కుపదేశించె నని రామాయణమున గన్పట్టు పై వచనము పరీతిగ సంగతమగునో, సరససమన్వయముతో అనుశీలనతో దర్శించి, తత్త్వమును సమున్నీతము చేయుట విమర్శకుల కర్తవ్యము కాదని యనగలమా।

అలౌకిక తత్త్వార్థమును రామాయణమున దర్శించక పోయిన, రామకథావైభవమును చూచితి మని యెట్లు చెప్పగలము। పోనిండు, మహనీయము వేదతత్త్వార్థసంభితమైన రామాయణ మహాకావ్య ప్రణయనము గావించిన ఆదికవి, మహర్షి వంశసంజాతుడు నయిన వాల్మీకి చరిత్రమహత్త్వమును గురించి యెవరికిని పట్టదేమి। లౌకిక కవుల గుణగానముచేయునట్టి యీకాలములో వైదికసంస్కృతి ప్రచారప్రసారము లకుమూలపురుషుడైన వాల్మీకినామమును స్మరించినవారై నను గన్పట్టరు। ఇది కాలమహిమ యేమో। ఇక రామాయణముపై వచ్చిన పూర్వవ్యాఖ్యానములు సైతము అందలి వేదతత్త్వార్థావిష్కారకములుగా గన్పట్టుట లేదు, శబ్దార్థములను వివరించుటయందే ఆ వ్యాఖ్యము తృప్తిని భజించిరి. ఎడనెడ వేదతత్త్వార్థవివేచనము ఆ వ్యాఖ్యలలో గన్పట్టినను అల్పాల్పమే. అయినను ఆ వ్యాఖ్యాతలు అంత మాత్రమైనను వ్యాఖ్యానము చెయకున్న రామాయణ మింకను ఎంత దుర్వ్యాఖ్యావిషమూర్ఛిత మయ్యెడిదో। ఆ మేరకు తద్వ్యాఖ్యాతలకు కృతజ్ఞులు చెప్పవలసియే యున్నది.

వేదతత్త్వార్థోపబృంహణమునకై ఎందఱుమహనీయులు ఎన్నిమార్లు ఎన్నివిధముల ప్రయత్నించలేదు। అన్ని పర్యాయములేల ప్రయత్నింప వలసివచ్చినది: కాలప్రవాహమున ఎన్నియో తాత్త్విక విషయములు విస్మృతము లగుచుండును. అట్టి సమయములలో వానిని పునరుజ్జీవింప జేయవలసియుండును, ఆ విధముగా జేయుట భగవత్సంకల్పమే. తత్సంక

ల్పను రూపుదాల్చుటయు. జగద్గురుప్రభావసంజనితమే. జగద్గురువులు రమేశ్వర ప్రతినిధిస్థానీయులు గదా!

శ్రీ జగద్గురు కరుణాకటాక్ష ప్రభావఫలమే యిపుడు పాఠకుల ముందున్న "వందే వాల్మీకి కోకిలమ్" అను గ్రంథరత్నము. ఏతద్గ్రంథ ప్రణేత శ్రీ హరి లక్ష్మీనరసింహశర్మ గారు. ఈయన సంస్కృతాంధ్ర భాషలయందు దాటితేరిన పండితుడు, వ్యాకరణ - అలంకారశాస్త్రములలో విశ్వవిద్యాలయములందు పట్టము నందుకొనుటయే గాక, తెలుగుభాషాప్రవీణ పట్టము నందుకొనిన మేధావి. మనదేశమున పట్టభద్రులెందఱు లేరు! వారందఱు రామాయణ తత్త్వావిష్కరణమున కుద్యమించిరా! అయిన, శ్రీశర్మగారు ఇంతటి మహోద్యమమున కేల సమకట్టిరి? అనిన, ఈ పట్టభద్రతకు మించిన విశేషసంస్కారము లేవియో యీయనయందుండ వలెను. ఇంతటి మహోద్యమప్రచోదకములైన ఆ సంస్కారవిశేషము లెవి? వానిలో మొదటగా పేర్కొనవగినది "వేద"మనిన వీరికి గల అపారశ్రద్ధాతిశయము: రెండవది, వేదార్థోపబృంహణమునకై వలసిన రామాయణ, భారత, భాగవతాది పురాణేతిహాసాదులు, యాస్కనిరుక్తశాస్త్రము సాయణాది వేదభాష్యాదులు, కాళిదాసాది మహాకవుల సంస్కృతవాఙ్మయము మున్నగువానియందు వీరికి గల అసాధారణ పరిచయము; మూడవది, వ్యాసవాల్మీకాదులందెనలేని జగద్గురుభావము. ఈ సంస్కారములు వీరి హృదయమున ముప్పేరగా పెనవేసికొని యున్నవి. ఏతత్ఫలముగా ఈ జీవుని యందు ఒకానొక గాఢవేదన పెల్లుబికినది. తత్ఫలమే యీ వందేవాల్మీకి కోకిలమ్.

శ్రీ లక్ష్మీనరసింహశర్మ గారి ప్రతిభ గభీరవైదుష్య సముద్యోతితము. ప్రతిభాశూన్యమైన వైదుష్యము వన్నెకు రాదు; అటులనే వైదుష్యరహితమైన ప్రతిభ, కాల మనుకూలించినపుడు ఒక్కమారు

2)

తళుక్కుమని మెరిసి వెనువెంటనే అంతర్హిత మగును. కాని, శర్మగారి విషయము దీనికి అపవాదము. వీరిలో ప్రతిభావైదుష్యములు సమరసముగా వికసించినవి. వీరియందు గల ప్రతిభావ్యుత్పన్నతలు అహమహమికతో పాఠకుల హృదయములలోనికి చొచ్చుకొనిపోయి వారిని ముగ్ధులను జేయును, ఆనందరసప్లావితులను చేయును హరిసోదరప్రణీతమైన వేదస్వరూపస్వభావప్రదర్శక "భారతీనిరుక్తి" ప్రణయనములో అగ్రస్థానీయులు, ప్రసన్న గంభీర హృదయులు, అసమాన ప్రతిభావైదుష్యసంపద్విలసితులు, అగ్రజులు నయిన శ్రీ హరిసాంబశివశాస్త్రిగారి యామోదమునకు భాజనమైన శర్మగారి ప్రతిభ కీర్తనీయము శ్రీ శర్మగారికి గుర్వనుగ్రహమే గాక, జగద్గురువుల యనుగ్రహము గూడ పుష్కలముగా నున్నది. భగవదనుగ్రహము మహాత్ములగు గురువులచే శక్తిపాతరూపమున ప్రసాదింపబడును. అట్టి సంపద గలవారు గనుకనే శ్రీ శర్మగారు ఏతద్గ్రంథప్రణయనమునకు పూనుకొని కృతార్థులైరి. శ్రీ కామకోటి పీఠాధీశ్వరులు శ్రీ శ్రీ శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామిపాదుల యాశీఃపరంపరను, శ్రీ పుష్పగిరిపీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ ఉదధినవోద్దండ శ్రీవిద్యానృసింహ భారతీ శ్రీ చరణుల యనుకంపావిశేషమును జూరగొనిరి. జగద్గురువుల యాశీఃఫలముగా శ్రీశర్మగారు తపఃపూత వాల్మీకికోకిల కుహూకుహూరావ తత్త్వమును శ్రవణ పేయముగా వినిపించి పాఠకులహృదయములను తత్త్వానుసంధాననిమగ్నులను జేయుటలో కృతకృత్యు లయిరి. గ్రంథస్థవిషయమును కొంత పరిశీలింతము.

శ్రీ సీతారాములు వాల్మీకికృత పాత్రలా? అనిన, అంతరంగ బహిరంగ ప్రమాణముల ననుసరించి కల్పితపాత్రలు కావని చెప్పుటయే సంగతము. అయిన, ఆ పాత్రలు కేవల లౌకికములా, లేక భగవత్తత్త్వాభివ్యక్తికై యవతరించిన యవతారమూర్తులా? వారు అవతారమూర్తులని,

షోడశకళాపూర్ణ చిచ్ఛక్తిసమవేత శ్రీమన్నారాయణస్వరూపులని యుప నిషత్తులుద్ఘోషించుచున్నవి. ఆగమశాస్త్రము లందును తదభిప్రాయోప ష్టంభకవాక్యములే కన్పట్టుచున్నవి. శ్రీవాల్మీకియు "రామాయణమ్" "సీతాయాశ్చరితమ్"అను నామముల చేతనే పూర్వోదాహృత తత్త్వమును కాంతాసంమితముగా ధ్వనింపజేసినాడు.

శ్రీ సీతారామచంద్రతత్త్వము సకలభువనాధిష్ఠానము, స్వయం ప్రకాశము, సచ్చిదానందఘనము నగు సాక్షాత్పరబ్రహ్మతత్త్వము. సీతారామచరితము వేదమూలమే గాని, కేవల కవిప్రతిభాసమున్మేషము కాదని శాస్త్రకోవిదుల నిశ్చితాభిప్రాయము. సీతారామచంద్రుల స్వరూప స్వభావాదికము సౌందర్యసారసర్వస్వము, మాధుర్యగుణ విలసితము, వేద శాస్త్రైక సమధిగమ్యము నయిన పరమేశ్వరతత్త్వము. తత్తత్త్వము లోకసంగ్రహార్థమైన తనను ద్విధా విభక్తమొనర్చుకొని శ్రీ సీతారామ చంద్రరూపమున భువిపై నవతరించినది. శ్రీరాముడు హరిహరవిరించ్యు తత్త్వమును పుణికిపుచ్చుకొని దశరథాత్మజుడుగా నావిర్భవించెను. శ్రీ సీతాదేవి మహాలక్ష్మి, మహాసరస్వతీ,మహాత్రిపురసుందరీ పరాభట్టారికా సమష్టితత్త్వరూపిణియై జనకాత్మజగా నాత్మాభివ్యక్తి చేసికొనిన దని తపస్సమాధినిష్ఠుల దర్శనము. కావున, శ్రీసీతారాములు వేదప్రతిపాదిత మూర్తులుగాని, కేవల చారిత్రికవ్యక్తులు గారని సంప్రదాయవేత్తల యభిమతము. మంత్రబ్రాహ్మణగ్రంథములందు శ్రీసీతారామచంద్రుల ప్రశస్తితోపాటు జనక, దశరథాదుల ప్రసక్తియుగన్నట్టును రామరహస్యో పనిషత్తు, రామపూర్వతాపినీ, ఉత్తరతాపినీ ఉపనిషత్తులు, సీతోపనిషత్తు, తారసారోపనిషత్తు మొదలగు అనేకానేక ఉపనిషత్తులు శ్రీసీతారాముల పారమైశ్వర్యవైభవములను సంకీర్తనము చేసినవి; తత్సంబద్ధ మంత్రము లను బీజాక్షరసంపుటితో ప్రపంచించినవి.

"రామ ఏవ పరంబ్రహ్మ రామ ఏవ పరం తపః
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మతారకమ్"

అనుచు రామరహస్యోపనిషత్తు శ్రీరామ చంద్రుని పరబ్రహ్మతత్త్వముగా సంకీర్తించుచున్నది. అటులనే

"రమంతే యోగినోఽనంతే నిత్యానందే చిదాత్మని।
ఇతి రామపదేనాసౌ పరంబ్రహ్మభిధీయతే"

అనుచు రామ పూర్వతాపనీయోపనిషత్తు రామచంద్రుని సచ్చిదానంద ఘన పరబ్రహ్మగా గానము చేయుచున్నది.

ఓం యో హవై శ్రీరామచంద్రః స భగవా నద్వైతపరమా నంద ఆత్మా యత్పరంబ్రహ్మ భూర్భువస్సువ స్తస్మై నమో నమః"

అనుచు రామఉత్తరతాపనీయోపనిషత్తు భూర్భువస్సువర్లోక కర్తయైన పరంజ్యోతిరూపము అద్వయపరమానందరూపము నగు, బ్రహ్మయే శ్రీరామచంద్రమూర్తి యని ఘంటాపథముగా జెప్పుచున్నది.

"కలాతీతా భగవతీ స్వయం సీతేతి సంజ్ఞితా:
తత్పరః పరమాత్మా చ శ్రీరామఃపురోషోత్తమః"

అనుచు తారసారొపనిషత్తు సీతాదేవిని పరమేశ్వరి యని చెప్పుచున్నది"

"మూలప్రకృతిరూపత్వాత్ సా సీతా ప్రకృతిః స్మృతా"

"మహామాయా అవ్యక్తరూపిణీ వ్యక్తా భవతి।
ప్రథమా శబ్దబ్రహ్మమయీ స్వాధ్యాయకాలే
ప్రసన్నా ఉద్భావనకరీ సాత్త్వికా। ద్వితీయా భూతలే
హలాగ్రే సముత్పన్నా। తృతీయా ఈకారరూపిణీ

అవ్యక్తస్స్వరూపా భవతీతి సీతే త్యుదాహరంతి॥"

॥శ్రీరామసాన్నిధ్యవశాత్ జగదానందకారిణీ।
ఉత్పత్తిస్థితిసంహారకారిణీ సర్వదేహినామ్।
సీతా భగవతీ జ్ఞేయా మూలప్రకృతిసంజ్ఞితా।

సా సర్వవేదమయీ సర్వదేవమయీ సర్వలోకమయీ.. ........ యనుచు సీతోపనిషత్తు శ్రీసీతాదేవిని మూలప్రకృతిస్వరూపిణి, వేద మాత దేవనిలయ యనియు, శ్రీరామచంద్రుని సచ్చిదానందాత్మక బ్రహ్మస్వరూపు డనియు పెక్కుభంగుల స్తుతించినది. అటులనే, లక్ష్మణ,భరత,శత్రుఘ్నాదులను, సుగ్రీవ హనుమదాదులను ప్రణవప్రతి పాద్యులుగ నుపనిషత్తు లుద్ఘోషించుచున్నవి.

ఉపాసకలోకమున సీతారాములు ఏరీతిగ ధ్యానింపబడుచుందురో గమనించిన, నిత్యానపాయులైన సీతారాముల తత్త్వ మవగత మగును.

"రామో ధ్యాయతి త్వామేవ సుషుమ్నాం పారమేశ్వరీమ్।
సీతా ముపాస్తే వ్యోమాంతరీశ్వరీం బిందురూపిణీమ్।
సీతాం భగవతీం దేవీం వందే రాఘవసంయుతామ్
సువర్ణాభాంబుజకరాం రామాలోకనతత్పరామ్॥"
"కాలాంభోధరకాంతికాంత మనిశం వీరాసనాధ్యాసితం
ముద్రాం జ్ఞానమయీం దధాన మపరం హస్తాంబుజం జానుని।
సీతాం పార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం మకుటాంగదాది వివిధాకల్పోజ్జ్వలాంగం భజే॥"

"వేదాంతవేద్యం కవి మీశితార
మనాదిమధ్యాంత మచింత్య మాద్యమ్।
అగోచరం నిర్మల మేకరూపం
నమామి రామం తమసః పరస్తాత్॥"

ఈరీతిగ, శ్రీసీతామాతను సమష్టికుండలినీశక్తి యయిన పరమేశ్వరిగను, శ్రీరామచంద్రుని ఆదిమధ్యాంతరహితుడు, సచ్చిదానందఘనుడు, నిత్యాన పాయినీ పరమేశ్వరీ సంపరిష్వక్తుడు నగు। శ్రీమన్నారాయణస్వరూపుని గను భావించుట వేద ఆగమ శాస్త్రసంప్రదాయసిద్ధ మని యవగతమగును.

తాదృశ మహిమోపేతులైన శ్రీసీతారామచంద్రుల చరిత్రమును వర్ణించి చెప్పుటకు ఎంతటి ప్రాతిభచక్షుస్సు అవశ్యకము.ఎంత వేద వేదాంగతత్త్వజ్ఞానము అపేక్షణీయము। ఎంతటి మహోన్నత తప స్సంజనిత ఋతంభరాప్రజ్ఞ ఉపాదేయము। ఇది స్వయంప్రతిభాతవేదులకు మాత్రమే సాధ్యముగాని, అన్యులకు దుస్సాధ్యము గదా। అట్టితరి శ్రీ వాల్మీకిమహర్షి ని ఏతన్మాత్రునిగా దలచుట సంగతమా?కాదు.గనుకనే శ్రీ శర్మగారు వాల్మీకమునే గాక, ఎన్నియో పురాణ, నాటక, కావ్యాదులను గొప్ప ఓపికతో నేర్పుతో పరిశీలించి, పరిశోధించి. వాల్మీకి చరిత్రము నకు చక్కని నిరూపురేఖలు దిద్ది వాల్మీకియొక్క ఋషికులోత్పన్నత్వమును, బ్రహ్మర్షిత్వమును, బ్రహ్మిష్ఠత్వమును మహాప్రతిభతో ప్రధానమల్ల నిబర్హణన్యాయముగా మునుముందుగా వివేకించి ప్రదర్శించినారు. ఇది వాల్మీకిపట్ల వారికి గల భక్త్యతిశయమునకు ఒక చక్కని ఉదాహరణము. వాల్మీకిచరిత్రమును గురించి వారు చేసిన పరిశ్రమను,వారు చూపిన ప్రతిభను సహృదయ పాఠకుల ముందుంచుట నా కర్తవ్య మ్ము భావింతును.

వాల్మీకిమహర్షి వాగ్విదాంవరుడు, బ్రహ్మవిద్వరేణ్యుడు, బ్రహ్మ విద్యాసంప్రదాయకర్తలలో నన్యతముడు, ఋతంభరాప్రజ్ఞాదర్శనము గల యోగివర్యుడే గాక, వేదమంత్రద్రష్టగా గూడ భారతీయసంస్కృతికి అజరామరస్థానమును కల్పించిన మహాతపస్వి. ఋగ్వేదమందలి యనేక ఋక్కులను తపస్సమాధిలోదర్శించిన"వమ్రి"యను ఋషియు,వాల్మీకియు నొకరే యని శ్రీ శ్రీశ్రీ కరపాత్ర స్వామిచరణుల నిశ్చితాభిప్రాయము. "వమ్రి" "వాల్మీకి" శబ్దములకు చెప్పుకొనదగినంత సామ్య మున్నది

వాల్మీకికి కల్పభేదముచే పురాణములందు పెక్కు నామములు కన్పట్టును. నామవైవిధ్య మున్నను,కథలయందు ఐక్యత కన్పట్టును. వాల్మీకః, వాల్మీకిః, భార్గవః, ప్రాచేతసః ఇత్యాదినామములతో రామాయణము రచించినట్లు రామాయణ, భారత,పురాణ,ఇతిహాసాదులు చెప్పచున్నవి.

"ప్రాచీనబర్హిషః పుత్రాః శతద్రుత్యా దశాభవన్।

తుల్యనామవ్రతా స్సర్వే ధర్మస్నాతాః ప్రచేతసః॥"

అని భారతము వాకొనుచున్నది.

"ప్రచేతసోఽహం దశమః పుత్రః॥

అని వాల్మీకియే తననుగురించి చెప్పికొనియున్నాడు. వాల్మీకి ప్రచేతసుని దశమపుత్రు డగుట వలన"ప్రాచేతస" నామముతో రామాయణరచన చేసెనని తెలియనగును.

అథాబ్రవీ న్మహాతేజా బ్రహ్మలోకపితామహః।

వల్మీకప్రభవో యస్మా త్తస్మాద్వాల్మీకి రిత్యసౌ॥"

అనుచు బ్రహ్మవైవర్తపురాణము వాల్మీకి యొక్క వల్మీకప్రభవత్వమును

చాటుచున్నది. వేదమంత్రద్రష్టయగు వ్రజిమహర్షి వాల్మీకియే యనుట ప్రమాణసంగతమే యని తెలుచున్నది.

బ్రహ్మపుత్రులైన పదిమంది ప్రజాపతులలో ప్రచెతసుని నామమును మనుస్మృతి పేర్కొన్నది.

"మరీచి మత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రతుమ్।

ప్రచేతసం వసిష్ఠం చ భృగుం నారద మేవ చ॥

ప్రజాసృష్టికర్తలలో తొమ్మిదిమంది ప్రజాపతుల నామములే గానవచ్చు ననియు, పదియవవాడైన ప్రచేతసుని పేరు కానరాదనియు, ప్రచేతసుని కుమారుడైన ప్రాచేతసుడు-వాల్మీకి లోకకల్యానార్ధము రామాయణమహా కావ్యసృష్టి చేసె ననియు అభిజ్ఞులకథనము.

వాల్మీకిః నారదభాతృపుత్రః అని మహేశ్వరతీర్థ వ్యాఖ్యలో కన్పట్టుచున్నది.

"మహర్షే త్వం సమర్థోऽసి జ్ఞాతు మేవంవిధం నరమ్।

శ్రుత్వా చైతత్త్రిలోకజ్ఞో వాల్మీకే ర్నారదో వచః॥"బాల. ( 5

"ఏవం తద్విజ్ఞానార్థం స గురు మెవాభిగచ్ఛే దిత్యుక్తం గురూప సదనవిధి ముపబృంహ్య"యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామిత్యు,క్తం ప్రవచనవిధి ముపబృంహ యతి శ్రుత్వేత్యాదినా. తత్ర"నాసంవత్సరవాసినే ప్రబ్రూయా, దితి నియమస్య జ్యేష్ఠపుత్రవ్యతిరిక్తవిషయత్వాత్ వాల్మీకేశ్చ భృగుపుత్రతయా భ్రాతృపుత్రత్వాత్ శుశ్రూషానిరపేక్షం ప్రీత్యో పదిదేశేత్యాహ శ్రుత్వాచేతి।"

"నారదో బ్రహ్మపుత్రతయా తద్జ్ఞానార్థః ఏతత్పూర్వోక్తరీత్యా వ్యంగార్థగర్భం వాల్మీకేః స్వాభిమతస్య పుత్రస్య వచః పరిపూర్ణార్థం వాక్యం శ్రుత్వా నిశమ్య" మహేశ్వరతీర్థ వ్యాఖ్య. ఈ పైవచనముల వలన వాల్మీకి నారద భ్రాతృపుత్రుడని తెలియును ఇది యుక్తిసహమే ఎలన, మనుస్మృతి వచనానుసారము ప్రచేతస, వసిష్ఠ,భృగు,నారదాదులు బ్రహ్మమానసపుత్రులు. కావున,భృగు నారదాదులు సోదరులు కనుకనే వాల్మీకి నారదభ్రాతృపుత్రు డని మహేశ్వరతీర్థుడు వ్యాఖ్యానించుట ప్రమాణసంగతమే.

వాల్మీకి వ్యాకరణశాస్త్రవేత్తగా తైత్తిరీయప్రాతిశాఖ్య "సకార పూర్వశ్చ వాల్మీకేః" "కపవర్గపర శ్చాగ్నివేశ్య వాల్మీక్యోః," ఉదాత్తో వాల్మీకేః"అను సూత్రముల ద్వారా తెలియచేయుచున్న దని పెద్దలు చెప్పుదురు

విశ్వామిత్రుడు యాగసంరక్షణార్థమై రామచంద్రుని పంపవలసిన దని కోరిన సమయమున, దశరథమహారాజుసభలో మహాతపస్సంపన్నులైన భరద్వాజాది మునిపుంగవులతోపాటు వాల్మీకిమహర్షియు నుండెనని యోగవాసిష్ఠవచనము వలన తెలియునుచున్నది.

"క్రతుః పులస్త్యఃపులహః శరలోమా మునీశ్వరః।
వాత్స్యాయనో భరద్వాజో వాల్మీకి ర్మునిపుంగవః।
ఏతే చాన్యే చ బహవో వేదవేదాంగపారగాః
జ్ఞాతజ్ఞేయాః మహాత్మానః ఆస్థితా స్తత్ర నాయకాః॥

దీనిని బట్టి వాల్మీకి యొక్క మునిపుంగవత్వమేగాక, వేదవేదాంగ పారగుల మధ్య ఆయనకు గల స్థానము ద్యోతక మగును ఇంతేగాక, వాల్మీకి బ్రహ్మవిద్యాసంప్రదాయకర్త లౌనాడు. యోగవాసిష్ఠవ్యాఖ్యా కర్తయై నయతీంద్రులు శ్రీ ఆనందబోధేంద్రస్వామి వ్యాఖ్యారంభమున ఈ క్రిందివిధముగా నమస్కరించుటయు గమనార్హము

"ఓం నమో బ్రహ్మణే బ్రహ్మవిద్భ్యః బ్రహవిద్యాసంప్రదాయ కర్తృభ్యో వసిష్ఠ విశ్వామిత్ర వ్యాస వాల్మీకి శుకాదిభ్యః శ్రీరామ భద్రాయ చ।"

ఈవిధముగా వేదవేదాంగవేత్త, బ్రహ్మణ్యుడు, ప్రాచేతసుడు నగు వాల్మీకి జన్మనా నిషాదు డనియు, నారదుడు, సప్తర్షులు మున్నగువారిచే నుపదేశము నంది దీర్ఘతపశ్చర్యావ్రతుడై వల్మీకసంభవుడై వాల్మీకి నామముతో రామాయణమును రచించెనను గాథ యొకటి లోకమున ప్రచారములో నున్నది.

కాని స్కాందాది పురాణములలో అగ్నిశర్మ, లోహజంఘ, శమీముఖ, ఋక్షో నామములు గల బ్రాహ్మణులు జీవికాసముపార్జనకై బ్రాహ్మణవృత్తిని పరిత్యజించి చౌర్యాది వృత్తులతో జీవయాత్ర సాగించుచుండి రనియు, సప్తర్షుల యుపదేశమువలనవిరాగులై దీర్ఘ తపశ్చర్యలో మునిగి వల్మీక సంభవులై వాల్మీకినామముతో రామాయణ రచన చేసి రనియు కన్పట్టుచున్నది

స్వచ్ఛందా భారతీ దేవీ జిహ్వాగ్రేతే భవిష్యతి.
"కృత్వా రామాయణం కావ్యం తతో మోక్షం గమిష్యసి॥"

అనుచు సప్తర్షులు వర మొసగినట్లు స్కాందము చెప్పుచున్నది. ఇంతే గాక, విష్ణుపురాణము

"ఋక్షోఽభూత్ భార్గవ స్తస్మాత్ వాల్మీకిర్యోఽభిధీయతే"

అనుచు భార్గవ వంశీయుడైన "ఋక్ష"డనువాడు వాల్మీకి యనునామముతో బరగె నని చెప్పుచున్నది.

"అహం పురా కిరాతేషు కిరాతై స్సహ వర్ధితః

జన్మమాత్రం ద్విజత్వం మే శూద్రాచారరత స్సదా॥

అని అధ్యాత్మరామాయణమునందు వాల్మీకి తన పూర్వచరిత్రమును శ్రీరామచంద్రునితో చెప్పుకొనినట్లు కానవచ్చును

పై విచారణ వలన,వాల్మీకి బ్రాహ్మణవంశసంజాతు డనియు ఎంతటి దుశ్చారిత్రము గలవాడైనను తపశ్చర్యాదులవలన పునీతుడై బ్రహ్మణ్యుడగు ననియు నవగత మగును

ఇంతేగాక,ప్రతి యుగమునందును, ఒక్కొకరు వేదవిభాగకర్తలై వ్యాసపదము నధిష్ఠింతురు. అట్టివారిలో వాల్మీకియు వ్యాసపదము నలంకరించినట్లు ప్రమాణవచనములు గన్పట్టుచున్నవి వాల్మీకి ఏతాదృశ మహా మహిమోపేతుడు గను కనే,విష్ణుధర్మోత్తరము వాల్మీకిని ఆరాధ్యదైవముగా నారాధింప నగునని యుపదేశించి, తన్మూర్తిస్వరూప మీ రీతిగ భావనీయము అర్చనీయ మని యిట్లు వివరించినది

"గౌరస్తు కార్యో వాల్మీకిః జటామండలదుర్దృశః

తపస్యభిరత శ్శాంతో న కృశో న చ పీవరః॥"

ఇంతేకాదు, శ్రీరామయంత్రోద్ధారవివరణప్రసంగమున, ఒక్రి యామళవచనము సశక్తికముగా వసిష్ఠాదిమహర్షిన్యాసము రామమంత్రము నందు చేయవలయునని చెప్పుచు, వాల్మీకిమునిపుంగవుని న్యాసమును గూడ విధించుచున్నది

"అరుంధతీవసిష్ఠశ్చ భవానీవామదేవకః।
భార్గవీజాబాలిముని రదితిశ్యాచ కశ్యపః॥
అలనాచ భరద్వాజః కౌశిక్యా కౌశికో మునిః।
శాంత్యతీతా సవాల్మీకి రక్షయా సహ నారదః॥
సంవిచ్ఛక్త్యా సనకో జ్ఞానశక్త్యా సనందనః।
ఇచ్ఛా సనత్కుమారౌ చ యోగశక్త్యా సహక్రియే॥"

ఇంతేగాక,మరియొక విశేషము గూడ గమనింపదగియున్నది అది యేమన, గోత్రప్రవర ప్రవర్తకఋషులలో వాల్మీకినామము గూడ ఉల్లేఖింపబడియున్నది. అష్టాదశ జామదగ్న్యగణ ఋషులు పేర్కొన బడినారు.

"ప్రోక్తాష్టదగోష్ఠే వత్సశ్చ వత్సో శ్రీవత్సో వత్స ఒక్యపి,
తతో మాండవ్య మాండూక్యే తి శాయినః,
వైరోహితశ్చ వాల్మీకిః పాణిని ర్జమదగ్నికః।
ప్రష్టిషేణా,ష్టిషేణౌ చానేహో చిదవటా అపి।
ప్రాచీనయోగ్యా బైదాద్యా జామదగ్న్యగణర్షయః॥"
ధర్మప్రవృత్తిః గోత్ర ప్రవరనిర్ణయః

ఈ విధముగ శ్రుతిస్మృతి పురాణేతిహాస ధర్మశాస్త్రాదులచే కీర్తింప బడిన వాల్మీకిని సామాన్యునిగా భావించుట న్యాయసమ్మతము కాదు. కావుననే, ఈ మహనీయమూర్తిని ఆరాధించు సంప్రదాయము అనాదిగ నుండియుండును తత్సూచకముగనే నేటికిని నేపాలులో జనకపురమున వాల్మీకిమందిరమొకటియున్నదనియు, ఆద్దేశవాసులు భక్తిప్రపత్తులతోవాల్మీకికిఅర్చనాదికములు సలుపుచు రనియు చెప్పుదురు. కాలప్రవాహమున నీభూభాగమున ఆ సంప్రదాయ ముత్సన్నమైపోయి యుండవచ్చును. భారత దేశ మెన్ని సంప్రదాయములను, ఎన్నిశాస్త్రములను గోల్పోయి యుండ లేదు. గహనా కర్మణో గతిః।

శ్రీవాల్మీకిమహత్త్వమును ప్రజాహృదయకేదారములలోనిక్షేపించి పునః సనాతనసంస్కృతి జాగరణ మొనరింపవలయు ననెడి కమనీయ సంకల్పముతో పుష్పగిరిపీఠాధీశ్వరులు శ్రీమదభినవోద్దండ విద్యానృసింహ భారతీ శ్రీచరణులు ఆంధ్రదేశమున వాడవాడలలో వాల్మీకిమందిర నిర్మాణము,తన్మందిరమున వాల్మీకివిగ్రహప్రతిష్ఠయు చేయించి,తదారాధనా సంప్రదాయమును పునరుజ్జీవింపజేయ నమకట్టిరి శ్రీచరణుల సంకల్ప మమోఘము కదా! తత్సంకల్పము కార్యరూపముదాల్చి సంసిద్ధ మగు చున్నది శ్రీచరణుల యాదేశానుసారము శ్రీశర్మగారు వాల్మీకిచరితము నీగ్రంథమున నింత విపులముగా విశ్లేషించి,సమీకరించి ప్రదర్శించినారు. ఇంతేకాదు, వాల్మీకిచరిత ప్రచారప్రసారములు పండితసభలలో ప్రతిభా వంతమైన తమ వాణిద్వారా చేయుచున్నారు ఇది యెంతయు హర్ష దాయకము.



శ్రీ లక్ష్మనరసింహశర్మ గారు అనేక గ్రంథములను పరిశీలించి వాల్మీకికి గల భిన్ననామములందలి యౌచిత్యమును [illegible] ప్రతిపాదించి

పరముగా, సంప్రదాయానుగుణముగా ప్రదర్శించుటలో వారుచేసిన ప్రయత్నము వారి ప్రతిభావైదుష్యములకు దర్పణము పట్టేదిగా ఉన్న దనుట భూతార్థవ్యాహృతియే గాని, అతిశయోక్తి కాదు కానేరదు.

"వాల్మీకి రభవద్బ్రహ్మా వాణీవాక్త స్వరూపిణీ ।
చకార రామచరితం పావనం చరితవ్రతః"

అను స్కాందపురాణవచనము నాధారముగా గొని వాల్మీకి యొక్క బ్రహ్మత్వమును, అయన వాణి యందు గల సరస్వతీత్వమును నిరూపించిన విధము పండితామోదయోగ్య మనుటలో సందియము లేదు.

"వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖండ మాఖండలస్య॥"

అను కాళిదాసవచనమును నిశితముగా సూక్ష్మేక్షికతో పర్యాలోచన చేసి "వల్మీకము పారమైశ్వర్యసంపన్నమైన భూసారరూప మనియు, తద్వల్మీకము నుండి దివ్యప్రభాదీప్తమై నావిర్భూతమైన యింద్రధనుస్సు వలె నావిర్భవించినవాడు వాల్మీకి యనియు, అదేరీతిగా, సీతాదేవియు పారమైశ్వర్య సంపన్నమైనయజ్ఞ భూమి నుండి స్వయం ప్రభారూపిణియై యావిర్భవించిన దివ్య జాత యనియు, అందుచేతనే వాల్మీకి తన గ్రంధమునకు "రామాయణ" మనియేగాక, "సీతాయా శ్చరితం మహత్" అనియు మహాసంజ్ఞాకరణము చేసె ననియు ప్రదర్శించినవిధము శ్రీశర్మ గారికి గల వేదవిజ్ఞానమునకు, ప్రతిభాసమున్మేషమునకు నికషాయమాణము అనేకానేక వైదికతత్త్వసముద్భాసకమైన "వందే వాల్మీకికోకిలమ్" అను వ్యాసరాజము అనిదంపూర్వమే గాక ఈ గ్రంధమునకు శిఖరాయమాణ మని చెప్పుట యథార్థగుణకథనమే గాని, అతిశయోక్తి కాదు వేదార్థోపబృంహణమునకై యవతరించి, వేదావతారరూపమైన రామాయణ

మును రచించిన శ్రీమద్వాల్మీకిమహర్షి జీవిత వృత్తాంతమును తెలియ జేయు"వందేవాల్మీకికోకిలమ్" అనువ్యాసముతో నారంభించి, వేదతత్త్వార్థోపబృంహకములైన రామాయణము నామౌచిత్యము, రామాయణము వేదావతారము, విశ్వామిత్రుడు సీతారామకళ్యాణము, రామాయణము బంగారులేడి, రామదూత హనుమంతుడు, రామాలయములలో లక్ష్మణుడు, రామాయణము కాండనామౌచిత్యము,సుందరకాండ ప్రాశస్త్యము రామాయణము సంధ్యోపాసన, హనుమంతుడు సురసాసింహికలు ఇత్యాద్యనేకానేక వ్యాసమణిస్థగితమై భాసిలుచున్నట్టి యీ గ్రంథరాజమును శ్రీ శర్మగారు సర్వాలంకారభాసురముగ, వైదికసంస్కారోజ్జ్వలముగ తీర్చి దిద్దినారు. గ్రంథవిస్తర భీతితో తత్రత్యమణి దీధితులనెడనెడ స్పృశించుచు నా యీ ప్రయత్నమును కొనసాగించుట నా కర్తవ్యమని భావింతును.

వేదములకు వలెనె రామాయణమునకు సైతము అనేక నామము లున్నవి ఈ నామములు శ్రీ వాల్మీకిమహర్షి నిర్దేశితములు గావు. బ్రహ్మకృతములు వాల్మీకిరామాయణావిర్భావమునకు పూర్వమే రామచరితము శతకోటిశ్లోక విస్తరమై బ్రహ్మలోకమున విరాజిల్లినది. శ్రీ శర్మగారు పండితామోదయోగ్యమగునట్లు రామాయణనామౌచిత్యమును వ్యుత్పత్తి పురఃసరముగా ప్రదర్శించియున్నారు

"రామా వేదమాతా అయనం స్థానం యస్యసః రామాయణః,

తమధికృత్య కృతం కావ్యం రామాయణమ్॥"

"రామాయాః సీతాయాః అయనం చరితం రామాయణమ్॥"

రామాయా శ్చరితం మహత్, అను నామమందలి మహత్

శబ్దము వేదనామధేయమైన, "మహత్", శబ్దద్యోతక మనుచు వేదవాక్యః తత్ప్రతిపాదితపరబ్రహ్మకుగల అవినాభావసంబంధమును, వాగర్థమిధున సంపృక్తత్వమును నుపదేశించు నదియే రామాయణపరమతాత్పర్య మని సవిమర్శకముగా ప్రదర్శించుట యానందదాయకము అటులనే, రామాయణవర్ణితములైన కొన్ని యాఖ్యాయికలను (అన్నిటిని గ్రహించుటదుస్సాధ్యముగదా?) గైకొని వానియందు వేదతత్త్వోపబృంహణ మేరీతిగ నభివ్యక్తముచేయబడినదో యిందు సప్రమాణముగ ప్రదర్శితము

యుద్ధానంతరము సీత అగ్నికుండమున ప్రవేశించు సమయమున శ్రీమద్వాల్మీకి వైదికతత్త్వార్థస్ఫోరకముగా నిట్లువర్ణించెను

"దదృశు స్తాం మహాభాగాం ప్రవిశంతీం హుతాశనమ్॥

సీతాం కృత్స్నా త్రయో లోకాః పుణ్యా మాజ్యాహుతీ మివ॥"

"పతంతీం సంస్కృతాం మంత్రై ర్వసోర్ధారా మివ॥"

శ్రీశర్మగారు "పితచ్ఛ్లోకస్థ తత్త్వము నుద్భావితము చేసిన విధము ప్రతిభాస్ఫోరకము ఆజ్యాహుతికి స్వరూప నాశనములేనటుల, హుతాశనసమాలింగితయైన సీతాదేవికిని స్వరూపనాశనము లేదు ఆమె సాక్షాత్తు చిదగ్ని, అమె నిరింధనాగ్నిగాని, సేంధనాగ్నిగాదు. సేంధనాగ్ని యందు ప్రవేశించిన జానకి నిరింధనాగ్నిగా యగుటచేతనే లేశమాత్రమైనను స్వరూపచ్యుతి నొందక హిరణ్యవర్ణభాసురయై స్వస్వరూపస్థితిలో అగ్నికుండమునుండి వెలికివచ్చినది ఈరీతిగ, రామాయణము వేదావతారరూప మని సోపపత్తికముగ శ్రీశర్మగారు ప్రతిభా సంపత్తితో నిరూపించినారు.

"విశ్వామిత్రుడు సీతాకళ్యాణము"అను వ్యాసమునందు విశ్వా మిత్రపహత్త్వఖ్యాపకములైన

"విశ్వస్య హ వై మిత్రం విశ్వామిత్ర ఆసః
"విశ్వం హాస్మై మిత్రం భవతి య ఎవం వేద।"
"విశ్వత్రయేణ యో మైత్రీం కర్తు మిచ్ఛతి తత్త్వతఃస
విశ్వామిత్రః"

శ్రుతిస్మృతి పురాణాది వచనముల నుదాహరించి. విశ్వామిత్రుని మహత్త్వమునకు దర్పణము పట్టినారు. శివధనుర్భంగఘట్టమును గైకొని

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే।"
"అశోభత తదా రామో ధనుర్వ్యాదాయన్ మహత్।
భగవానివ సంక్రుద్ధో భవో వేదమయం ధనుః॥"

అను పెక్కు ప్రమాణములను జూపుచు,శివధను వనగా సాక్షాత్తు వేద ప్రతిపాదక ప్రణవ మనియు, శ్రీరామచంద్రుడు తాదృశ మహనీయ శివధనుస్సు నెక్కుపెట్టిన శివుడనియు, కావుననే, శ్రీ రాముడు వేదమాతృ రూపిణియగు శ్రీసీతాదేవీపాణిగ్రహణము చేయగలిగెననియు వివరించిన శ్రీ శర్మగారి రక్తవిష్ణమైన వేదమాతృదర్శన లక్షణము ఈ వ్యాసమున సర్వత్ర ప్రదర్శితము సీతారాముల కళ్యాణ మనగా, బ్రహ్మవిద్యా రూపిణి యైన బుద్ధి పరతత్త్వముతో ననుసంధానము చేయుటయే యనుచు వేదతత్త్వార్థమును శ్రీ సీతారామకళ్యాణవ్యాజమున శ్రీమద్వాల్మీకి మహర్షి రామాయణమునందు ప్రతిపాదించినాదని యుక్తిసహముగ ప్రదర్శించుట గ్రంధకర్తయొక్క బుద్ధినైశిత్యమునకు ప్రమాణము

"రామాయణము బంగారుబడి" యను వ్యాసమున శ్రీశర్మగారి ప్రతిభ పాదరసమువలె ప్రసరించినది. మారీచునిస్వరూపస్వభావాదులను అన్యతోదర్శనీయముగా ప్రదర్శింపజాలుట ఆయనకే తగునన్నట్లు ఉన్నది. "మరీచినా మయం మారీచః" అని మారీచ శబ్దమునకు వ్యుత్పత్తిని చెప్పి "మరీచయః స్వాయంభువాః యే శరీరాణ్యకల్పయన్" అను తైత్తిరీయశ్రుతివచనము ననుసరించి, స్వాయంభువ మరీచుల యుపాసనము వలన నుపాసకులు హిరణ్మయశరీరమును దాల్చుచున్నారనియు తాదృశుడే మారీచుడనియు మహాసాహసముతో ప్రదర్శించుట గమనార్హము. ఆయన హిరణ్యవర్ణహరిణి రూపమును శ్రుతివచన పురస్సరముగ ప్రదర్శించి సంసమన్వయము చేయగలుగుట పురాకృతసుకృత పరిపాక విశేషము. శ్రీసూక్త ప్రతిపాదితమునైన ఎరాదేవులకు గల విశేషణములే హిరణ్యహారిణ రూపమున్న ప్రసంగమున సమాశ్లిష్టమై నిట ప్రయుక్తము లగుటచే శ్రీ శర్మగారు "మారీచుడు రామబాణ విద్ధుడై, సంస్కృతాంతరంగుడై తాపసజీవితము గడుపుచు స్వీయ ఉపాస్యదేవత యగు సావిత్రీపరాదేవిని ఉపాసించుచుండెను. ఆ యుపాసనాబలముచే ఉపాస్యదేవీ తాద్రూప్యమును హిరణ్యవర్ణరూపమును పొందె"నని సోపపత్తికముగ వివరించినరీతి పాఠక హృదయములను ముగ్ధము లొనర్చునదిగ నున్నది. అరణ్యమున దిరుగాడు కనకహరిణము శ్రీ సూక్త ప్రతిపాదితయైన ఎరాదేవియొక్క రూపమే యని యెట్లు చెప్పనగు?" నను శంకను నివారించుటకై శర్మగారు "శ్రీర్ధృత్వా హరిణీరూప మరణ్యే సంచచార హ", "యజ్ఞోఽగ్ని ర్మృగరూపేణ ధావతిస్మ పురాఽధ్వరే" ఇత్యాది పురాణవచనములను ప్రమాణములుగాజూపి, పరాదేవత హిరణ్యహరిణీ రూపముగా నరణ్యమున సంచరించెనని యుక్తిసహముగా బుద్ధివైభవముతో ప్రదర్శించుట నాన్యతోదర్శనీయ మని చెప్పుట దుస్సాహసము

కాదనుకొందును శ్రీ మద్వాల్మీకి రామాయణమును పలు విధా దృష్టులతో నే గాక, తన్నిహిత రహస్యాన్వేషణముతో నధ్యయనము యనగును ఆ రీతిగ నిర్విరామముగ నెనసినవారే రామాయణాంతర్నిబద్ధములైన యేతాదృశానర్ఘరత్నములను నావిష్కరింపగలరు. శ్రీ శర్మగారు తాదృశులని భావించుట యందిది లోకము హర్షించదగిన విషయము

పరామేశ్వరానన్య గదా! ఉపాయ విశేషముచే మహి మమదు శ్రీ సీతానన్యరూపమైన హిరణ్య హరిణ రూపమును ధరించను గదా! పరమేశ్వరావతారరూపుడైన శ్రీ రామచంద్రుడు సీతానన్యరూపమైన కనకహరిణమును వధించి తీసికొనిరాదలచుటలో గల యౌచిత్యమేమి యను శంక ఉగుట సహజమౌనప్పుడు ననే, శ్రీ శర్మగారు రాజాధీనమైన మాయా హిరణ్యశరీరమును శిక్షాపమును వధించి, దైవీ సంపద్విలసితమైన హిరణ్య హారిణ్యమును ఎరాం తానన్యత్వమును శ్రీరామచంద్రుడు మారీచుని కనుగ్రహించెనని చెప్పుట "యద్ధ త్వం మాయినం మృగం తమ త్వం మాయయా...ధీః" అను మంత్రైకతాత్పర్యమును ప్రత్యుత కథాపరముగ సరస సమన్వయము చేయుట మోదావహము". ఏవం విధమైన సమన్వయమునకు ఎంతటి యార్షవిజ్ఞాన సంపద యపేక్షణీయము! ఎంత భావనాసైశిత్య మావశ్యకము! ఎంతటి ప్రతిభావైదుష్యము లుపాదేయములు! ఏతద్విషయానుశీలనసమర్థములు సరస పండిత విమర్శక హృదయములె గాని, యన్యములు కావనుట నిక్కము

ఈ మణిమంజూషికలో నిక్షిప్తమైన మరి యొక యనర్ఘరత్నము "రామాయణములో లక్ష్మణుడు" అను వ్యాసము అసమానదీధితులను వెలార్చుచు పాఠక హృదయములను దివ్యజ్యోతిర్మయము యునద్రి

యలరారుచున్నది. వాల్మీకి ప్రతిపదమున రామలక్ష్మణులు నిత్య సహచరులుగా వర్ణించెను అటుల వర్ణించుట యథార్థస్థితికథనమే కాక, తాత్త్వికభావ సముల్లసితము ఆ యిరువురి సంబంధమును నిశితముగా పరిశీలించినచో, అది జీవేశ్వర సంబంధముగా తత్త్వచింతకులకు గన్పట్టును లక్ష్మణుడు ఈశ్వరారాధన ప్రవణుడైన జీవుడు. అతని దృష్టిలో రామచంద్రుడు వ్యావహారిక జగత్తులోని సోదరుడుమాత్రమే కాడు, నిరంతరము సమారాధనీయుడైన పరమేశ్వరుడు అటులనే శ్రీ సీతాదేవి కేవలం భ్రాతృపత్ని గాక శుద్ధవిద్యాస్వరూపిణియైన జగన్మాత. ఈశ్వరారాధనాతత్పరుడైన జీవుడు తనకు ఆరాధ్యదైవతములైన జగన్మాతను, పరమేశ్వరుని విడచి యెన్నడు నుండ జాలడు కావుననే లక్ష్మణుడు నిరంతరము శ్రీ సీతారామసహావర్తియై యుండుట రామాయణమున అడుగడుగున గన్పట్టును తత్సూచకముగనే రామ మందిరములలో సీతారాముల విగ్రహములతోపాటు లక్ష్మణస్వామి మూర్తినిగూడ ప్రతిష్ఠించు సంప్రదాయము భారతదేశములో ననూచానముగ నున్నది భద్రాద్రిలోని రామాలయము ఒక ప్రబలతార్కాణము

శ్రీ సీతారామలక్ష్మణత్రయము ఒక విచిత్రమైన, గంభీరతత్త్వార్థస్ఫోరకము, వేదార్థోపబృంహకమునైన సంపుటి. శ్రీమద్వాల్మీకి అవకాశము వచ్చినపుడెల్ల, రామలక్ష్మణులను అశ్వినీదేవతాయుగళముగా పోల్చి చూపెట్టెను "త్రిశీర్షావివపన్నగౌ", "ప్రవిశంతౌ తా వశ్వినావివ మందరమ్" అని రామలక్ష్మణులు అశ్వినీదేవతలవంటివారనుట వలన, వారు లోకప్రసిద్ధులైన సోదరులవంటివారు కారనియు, జీవేశ్వరు లనియు వేదమతులకు విదితమగును. అంతియేకాదు, అశ్వినీదేవతలతోపాటు సరస్వతీదేవియు(వేదమాత పరాభట్టారిక) నిత్యసహచారిణియై, అంతర్వాహినియై, తదుభయాను సంధానకర్త్రియై యుండుట శ్రుతిప్రసిద్ధము. అందుచే

కాకోలు, వేదహృదయాభిజ్ఞుడైన వాల్మీకిమహర్షి విశ్వామిత్రు ననుగమించి పోవుచున్న రామలక్ష్మణులను "త్రిశీర్షావివ పన్నగౌ" అని వర్ణించినాడు. ఒకచోట అశ్వినులని మరియొకపట్టున శీర్షత్రయముతో నొప్పారు పన్నగములని వర్ణించుటలో గల యౌచిత్యము వేదప్రతిపాదితులైన యశ్వినీ దేవతలకు, సరస్వతీదేవికి (పరమేశ్వరికి) గల సంపృక్తత్వము తెలిసినగాని, యవగతముకాదు. వాల్మీకి రామలక్ష్మణుల యందు గల త్రిశీర్షయుక్త పన్నగత్వమును భావ్యర్థస్ఫోరకముగా యోగవిశేష ప్రతిపాదకముగా సీతారామలక్ష్మణనిత్య సహవర్తిత్వద్యోతకముగా ప్రదర్శించెను

భద్రాచలమందలి రామాలయమున వెలుగొందుచున్న శ్రీ రామచంద్రమూర్తి జానకీలక్ష్మణోపేతుడై యుండుట భక్తజనావళికి విదితచరమే ఈ విషయమునుపలక్షించియే శ్రీ ఆదిశంకరులు రామభుజంగ ప్రయాతస్తోత్రములో

"మహారత్నపీఠే శుభే కల్పమూలే

సుఖాసీన మాదిత్యకోటిప్రకాశమ్

సదా జానకీ లక్ష్మణోపేత మేకం

సదా రామచంద్రం భజేఽహం భజేఽహమ్॥"

అనుచు నతులు సమర్పించినారు.

భద్రాద్రిరామాలయమున రామలక్ష్మణుల మధ్య శ్రీ సీతాదేవి మూర్తి ప్రతిష్ఠితమై యుండుటను లోకదృష్టితో నాలోచించిన ఇందలి

యౌచిత్యము బోధపడదు. ఈ రహస్యము తెలియవలె ననిన, తాత్త్విక చింతన మావశ్యకము. జగన్నాథాష్టకమునగూడ

“సుభద్రా మధ్యస్థ స్సకల సురసేవావసరః”

యనుచు, కృష్ణబలరాముల మధ్య సుభద్ర యున్నదని వర్ణితము.

ఇచట “సుభద్రా మధ్యస్థః” అను శబ్దమునకు “మధ్యే తిష్ఠతీతి మధ్యస్థా సుభద్రా మధ్యస్థా యస్యసః” యని విగ్రహవాక్యము చెప్పుకొననగును. దీని ననుసరించి శ్రీ కృష్ణబలరాముల మధ్య సదా సుభద్రయుండునని తెలియనగును. గర్భాలయమున నా మూర్తులటులే యుండును. ఆ రీతిగనే రామాలయమున గూడ రామలక్ష్మణులు సీతా మధ్యస్థులైయుందురు. ఇది యుక్తిగత సంగతమే. లోక దృష్టితో నాలోచించిన సుభద్రావిషయమున స్వసృత్వము, సీతావిషయమున పత్నిత్వము వ్యవహృతము గాని తాత్త్వికముగా పరిశీలించిన ఇందసంగతమేమియులేదు. శ్రీ సీతాదేవి యెట్లు వేదమాతయో, అటులనే “స్వస్రాంబికయా”యను శ్రుతివచనానుసారము స్వసృరూపిణియైన సుభద్ర సాక్షాత్తు పరాదేవియే.

ఏవంవిధముగా సీతామాత పరమేశ్వర నిత్యానపాయిని యగు పరమేశ్వరి యనుట శ్రుతి సంమతము, అటులనే రామచంద్రుడు సాక్షాత్తు ఈశ్వర స్థానీయుడైన, లక్ష్మణుడు జీవస్థానీయుడు. జీవేశ్వరానుసంధానము జరుగవలె ననిన, అవిద్యావరణము తొలగి, శుద్ధ విద్యాస్వరూపిణి యగు పరమేశ్వరి యొక్క యనుగ్రహ మపేక్షిత మగును. కావుననే, లక్ష్మణుడు శుద్ధ విద్యాస్వరూపిణియైన సీతాదేవి సమారాధకుడై, అవిద్యా విముక్తుడై పరమేశ్వర తదాత్మ్యానుభూతినొందిన జీవన్ముక్తుడు. శ్రీ సీతామాత శ్రీరామచంద్ర నిత్యానపాయినిగా నుండి, జీవభావముతో

భాసించు లక్ష్మణునకు పరమేశ్వరానుసంధానకర్త్రిగా (రామానుసంధాన కర్త్రిగా) విరాజిల్లిన వేదమాత ఆ పరాశక్తి రామలక్ష్మణ మధ్యస్థయై యుండు ననెడి తాత్త్వికార్థమును స్ఫురింపజేయుచు, రామాలయములలో శ్రీ సీతారామ లక్ష్మణమూర్తులను ప్రతిష్ఠించు సంప్రదాయము శ్రుతి సంమతమై యనూచానముగా వచ్చినది

ఈ విధముగా శ్రీ శర్మగారు ప్రజ్ఞావైభవముతో మహాగంభీర మైన వేదతత్త్వమును శ్రుతి స్మృతి పురాణాది వివిధ ప్రమాణ పురః సరముగా ప్రదర్శించి కృతకృత్యులైనారనుటకు వాల్మీకి కోకిల పట్ల వారికి గల అమేయ శ్రద్ధాతిశయము నిదర్శనము వేదమాత యొక్క యనుగ్రహము, జగద్గురువుల కృపావిశేషము వారిపై నపారముగ నుండుటచేతనే యింత హృదయాభిరామముగా ఏతద్గ్రంథ ప్రణయనము చేయగలిగిరని నేను సంభావింతును వారు నిరంతరము జపించు "నమామ వేదమాతరమ్" అను మంత్రమే వారికి శ్రీరామరక్షయైనదని నేను తలతును శర్మగారు నిక్కముగా ధన్యజీవి.

ఈ విధముగనే "రామాయణము సంధ్యోపాసన "రామాయణము పాదుకాప్రదానము" "హనుమంతుడు సురసాసింహికలు"మున్నగు సమా లోచనావ్యాసములు వేదోపబృంహకములుగా నుండి లక్ష్మీనరసింహశర్మ గారికి పట్టసంపాదకులుగా వెలుగొందుచున్నవి. గ్రంథస్థ విషయముల నన్నిటిని సమాలోచించుటకు పూనుకొనిన, మరియొక బృహద్ గ్రంథ మగును. అదియునుగాక, పాఠకుల జిజ్ఞాసకు భంగము కలిగించిన దోష మునకు భాజనుడనగుదునను శంకతో నా మాటలు పరాఙ్ముఖము లగు చున్నవి.

శ్రీ పుష్పగిరి శారదా చంద్రమౌళీశ్వరుల యనుగ్రహము నాకు నిరంతరము అభిలషణీయము. జగద్గురు, శ్రీ శ్రీ శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు శ్రీ మదభినవోద్దండ శ్రీ విద్యానృసింహ భారతీ శ్రీ చరణుల యాదేశము నాకు సదా శిరోధార్యము హర్దమిత్రము శ్రీ హరి లక్ష్మీ నృసింహ శర్మ యాకాంక్ష నాకు ఆదరణీయము ఈ మూడును ముప్పిరిగా నా హృదయమున పెనవేసికొని, నా మహర్షి వాల్మీకి గుణగానము, శ్రీ సీతారామలక్ష్మణ గుణసంకీర్తనముచేయించినవి ఈ యవకాశము కల్పించిన పుష్పగిరి శ్రీ చరణులకు సప్రశ్రయ నమోవాకము లర్పించుట నా కర్తవ్యము నా యీ మాటల వలన గ్రంథస్థ విషయము లేశమైనను సమావిష్కృతమైయున్న నా యీ ప్రయత్నము చరితార్థము. శ్రుత్వా బ్రహ్మైవ రామః ప్రకటిత మహిమాపిన తస్మై వసిష్ఠో యః సీతాం బ్రహ్మవిద్యామివ పునఃసత్యశుద్ధాం కిలాదాత్। యద్వాణీ మోహమూలం శమయతి జగదానందసందోగ్ధ్రి తస్మై వాల్మీకయే శ్రీ గురుతమ గురవే భూరి భావైర్నతాస్మః॥ యని బ్రహ్మ విద్వరేణ్యుడైన శ్రీమద్వాల్మీకి కవిపుంగవునికి కృతజ్ఞతాంజలులు సమర్పించుచు నా యీ మాటలు ముగింతును.

తెనాలి,

24 8 86

జగద్గురు విధేయుడు

జనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రి

నమామ వేదమాతరమ్

# 1. వన్దే వాల్మీకి కోకిలమ్

శ్రీ పుష్పగిరిపీఠస్థాం శ్రీ నృసింహాఖ్యభారతీమ్ ।
విద్యా మభినవోద్దండాం ప్రణమామ హి భారతీమ్ ॥

ఓంకార దివ్యకలనాదమహానుభావం
వేదప్రబోధ రమణీయ గుణానుబద్ధమ్ ।
వాల్మీకి కోకిల కుహూకుహూ రమ్యనాదం
సంభావయామి కవికావ్యజగత్ప్రఖ్యాతిమ్॥

శ్రీ సత్యనారాయణ మగ్ర్య మిష్టం
నత్వా గురుం సాంబశివం చ కృష్ణమ్ ।
వల్మీకపుత్రం హరివంశజన్మా
సంస్తౌతి లక్ష్మీనరసింహశర్మా ॥

వసంతకాలము రాగానే రసాల కిసలయాస్వాదము చేసి చొక్కి పరవశమై కోకిల గానము చేయును అప్రయత్నసిద్ధమైన ఆ మధుర గానము సహృదయుల హృదయాలను రంజింపజేయుచు సమాదరణీయ మగుచుండును తన్మయులై కొందరు మరల మరల వినుటకు కుతూహల పడుచుందురు కోకిల కుహూకుహూధ్వనులను విని యానందించని రసికులు గాని, భావావేశపరవశులై వర్ణించని కవులుగాని, సామాన్యముగ నుండరు కోకిలధ్వని ఒక సంమోహనాస్త్రము కావుననే, ఆ ధ్వనికి

'కుహూ' అని సార్థక నామము "కుహాయతి విస్మాపయతీతి కుహూః" "ఆశ్చర్యచకితులను పరవశులను గావించునది'' అని అర్థము కోకిల నోటి నుండి కుహూ శబ్దము తప్ప మరియొక శబ్దమును వినము ఎంత వారించినను, రెట్టించి కూయునే గాని, తన గానమును వీడదు, కూయుటకు విసుగు చెందదు కోకిల యొక్క ఈ సహజ స్వభావమును ఆర్యా సప్తశతి చక్కగా ఇట్లు వివరించుచున్నది

''కేనాశ్రావి పికానాం కుహూం విహాయేతరః శబ్దః"

''కుహూశబ్దమును గాక, మరియొక శబ్దమును కోకిల ఉచ్చరించి నట్లుగా వినినవారెవరైన గలరా ?''

ఈ ప్రశ్న కోకిల యొక్క సహజమైన ప్రకృతిని తెలియ జేయుచున్నది ఇంతియే గాదు

"కోకిలకు, పంచమ రాగమున గానము జేయుట ఎవరు నేర్పిరి ?" అని మరియొక కవి ఇట్లు ప్రశ్నించుచున్నాడు.

''నహి కోఽపి కోకిలానాం పంచమ రాగాన్ సదోపదిశతి"

పుష్పములకు సౌందర్యము వలె, ఫలములకు మాధుర్యము వలె, కోకిలకు హృదయభావోత్తేజక మధుర పంచమ రాగగానము స్వాభావి కము, దైవదత్తమైన ప్రసాదము స్వప్రయోజనము లేకయే, లోక రంజకము గావించుట పరమ ప్రయోజన మని కోకిల యుపదేశము. కనుకనే, కోకిల సార్థక నామధారియై విలసిల్లుచున్నది.

''కోకతి శ్రోతృచిత్తం గృహ్ణాతీతి కోకిలః''

గురుబాల ప్రబోధిక

"శ్రోతల చిత్తముల నాకర్షించునది" అని యర్థము.

ఇట్టి లక్షణములు గలవాడగుటచే లోకము వాల్మీకిని 'కోకిల'యని కీర్తించినది వసంతకోకిలముఖము నుండి కుహూకుహూధ్వనులు తప్ప ఇతర ధ్వనులు వినిపించనట్లు, ఈ వాల్మీకికోకిలముఖము నుండి రామ నామము తప్ప మరియొకటి వినబడదు ఈ వాల్మీకికోకిల లోకవిలక్షణ మైన కోకిల వసంతఋతువులోనే కోకిలమధురగానము శ్రవణగోచర మగును.

నారద గురూపదేశముచే సుసంస్కృతమైన వాల్మీకి హృదయమున ఎన్నో వసంతములు వెల్లివిరిసినట్లైనది అప్రయత్నముగ మధుర రమణీయ కవితాస్రవంతి రామాయణరూపమున ప్రవహించి సహృద యుల చిత్తముల నాకర్షించినది కోకిలమధురాలాపములు విరహిణులకు కామోద్దీపనములు, సహృదయులకు మధుర భావోద్దీపనములు, వాల్మీకి కోకిలాలాపము కామోపహత భావనావినాశకములు, దివ్యభావనాపరంపరా ద్దీపనములు. ఆ కోకిలకు ఋతునియమము కలదు రసాలకిసలయాస్వాద నియమము కలదు. వాల్మీకికోకిల కట్టి నియమములతో పని లేదు. ఈ గానము సార్వజనీనము, సార్వకాలికము. ఈ గానమున కాలంబము నిరంతర రామనామసుధాస్వాదము రసము ఫలము నంతయు వ్యాపించి యుండునట్లు, రామనామసుధారసము వాల్మీకికోకిలగానము నంతయును వ్యాపించి యుండును మరియు, ఈ కోకిల తన మధురాలాపములచే సహృదయుల హృదయములందు వసంతముల చిగురింపజేసి కళ్యాణ సంధాయక మగుచున్నది ఇట్లు కళ్యాణభావనాపరంపరలను లోకమున కనుగ్రహించుటకై తొలుదొలుత కవితాశాఖ నధిరోహించిన వాల్మీకి కోకిలకు నమస్కారము

"కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందె వాల్మీకి కోకిలమ్॥"

వాల్మీకి చరితము  వివిధ నామధేయములు.

భారతీయ సంస్కృతిని తీర్చిదిద్దిన మహాపురుషులు వ్యాస వాల్మీకులు వారు ప్రసాదించిన వాఙ్మయమే భారతీయతకు జీవనము ఆ వాఙ్మయమును దర్శించి ఎందరు తరించిరో! ఎందరను కవులుగ ప్రభావితము జేసినదో! వారు అజరామరులు. నేటికిని, యశఃకాయము లతో కవితాకాశపథమున ధ్రువతారలై వెలుగొందుచున్నారు వారిలో ఒక్కొక్కరి విశిష్టత ఒక్కొక్క విలక్షణతతో కూడికొనియున్నది. వ్యాసుడు అపారమైన ఇతిహాసపురాణాది వాఙ్మయమును సృజించెను. ఆదికవి యగు వాల్మీకిసృష్టి రామాయణ మొక్కటియె ఈ రామాయణము కావ్యములలో కావ్యము, శాస్త్రములలో శాస్త్రము, పురాణములలో పురాణము, ఇతిహాసములలో ఇతిహాసము కనుక, సర్వవిద్యాస్థానము రామాయణము శ్రీరాముని అశ్వమేధయాగ సందర్భమున కుశలవులు జేయు రామాయణగాన శ్రవణమునకై వివిధశాస్త్ర కలాపారంగతులను ఆహ్వానించినట్లు ఉత్తర రామాయణమున కలదు.

''అథ కర్మాంతరే రాజా సమాహూయ మహామునీన్।
పార్థివాంశ్చ నరవ్యాఘ్రః పండితా న్నైగమాం స్తథా॥
పౌరాణికాన్ శబ్దవిదో యే వృద్ధాశ్చ ద్విజాతయః।
స్వరాణాం లక్షణజ్ఞాంశ్చ ఉత్సుకాన్ ద్విజసత్తమాన్॥
లక్షణజ్ఞాంశ్చ గాంధర్వాన్ నైగమాంశ్చ విశేషతః।
పాదాక్షరసమాసజ్ఞాన్ ఛందస్సు పరినిష్ఠితాన్॥
కళామాత్రావిశేషజ్ఞాన్ జ్యోతిషే చ పరంగతాన్।
క్రియాకల్పవిదశ్చైవ యథాకార్యవిశారదాన్॥

భాషాజ్ఞా నింగితజ్ఞాంశ్చ నైగమాం శ్చాప్యశేషతః।
హేతూపచారకుశలాన్ హైతుకాంశ్చ బహుశ్రుతాన్॥
ఛందోవిదః పురాణజ్ఞాన్ వైదికాన్ ద్విజసత్తమాన్।
చిత్రజ్ఞాన్ వృత్తసూత్రజ్ఞాన్ గీతనృత్యవిశారదాన్॥
శాస్త్రజ్ఞాన్ నీతినిపుణాన్ వేదాంతార్థప్రకాశకాన్।
ఏతాన్ సర్వాన్ సమానీయ గాతారౌ సమవేశయత్॥
(ఉత్తర రామా 94 4 నుండి 9.)

ఇచట శ్రీరాముడు కుశలవులు గానము చేయగా రామాయణ మును వినెను విని, ఆశ్చర్యానందములు ముప్పిరిగొన మరల మరల విన సముత్సుకు డాయెను ఇది నా చరితము కావచ్చు కాని, ఇది నా యొక్కరికి సంబంధించినది మాత్రమేగాదు వివిధ రంగములలో ప్రతిభావంతులైన మహాత్ములకు వారి వారి సంస్కారముల ననుసరించి వివిధ రూపములతో రామాయణము సాక్షాత్కరించగలదను భావముతో యజ్ఞకర్మవిరామసమయమున ఆ యా రంగములలో సుప్రసిద్ధులైన మహాత్ముల నందరను రామాయణగానమును వినుట కాహ్వానించెను దీనిని బట్టి రామాయణము సకల విద్యాసారభూతమైన మహాకావ్యము కనుకనే, కావ్య పురాణ ఇతిహాసాది వివిధ సారస్వత ప్రక్రియలకు తొలు దొలుత లోకమునకు మార్గము చూపినవాడు వాల్మీకియే అగుచున్నాడు. సూత్రప్రాయముగ సమాసరూపమున జూపబడిన ఈ సంప్రదాయములను ఆధారము జేసికొని వానిని వ్యాసరూపమున విస్తరింపజేసినవాడు వ్యాసుడు అనగా ఇవి పురాణములు, ఇవి ఇతిహాసములు అని వేరువేరుగ వాఙ్మయ మును ప్రవర్తింపజేసి తన వ్యాసత్వమును సార్థకమొనర్చుకొనినాడు.

"మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః"

అను సూక్తికి తార్కాణముగా నిలచిన మార్గదర్శియైన మహర్షి వాల్మీకి ఆ బాటలను విస్తరింపజేసి రాజబాటలు వేసినవాడు వ్యాసమహర్షి

వ్యాసుడు భారతమున తన జననవృత్తాంతమును స్పష్టముగా నుదాహరించుకొనెను భారత మితిహాసమగుటచే అందు తన ఇతిహాసమును గూడ చేర్చుకొనెను రామాయణము వ్యంగ్యప్రధాన కావ్యమగుటచే కాబోలు! తన జన్మవృత్తాంతప్రస్తావన రామాయణమున జేసికొనలేదు శ్రీమద్రామాయణమునందె గాదు, వాల్మీకిరచన అని చెప్పబడు అధ్యాత్మరామాయణాది గ్రంథములందు ఇదమిత్థ మని గానరాదు. కాని, వాల్మీకిని గూర్చిన కొన్నికథలు ప్రచారములోనున్నవి వాల్మీకి బోయవాడనియు, నారదోపదేశముచే రామనామదీక్ష గైకొని దీర్ఘతప మొనర్చి ముని యాయె నని యొక ఐతిహ్యము ప్రచారములో నున్నది. అందుకు మూలము విచారణీయము వాల్మీకిమహర్షి వ్యాసుని వలె తన చరిత్రను సుస్పష్టముగా చెప్పుకొనకపోయినను తన నామధేయముల ద్వారా కాంతాసంమితముగ తన చరితమును సూచించుకొనుట గమనింపదగినది.

## వాల్మీకి నామధేయములు

శ్రీమద్రామాయణమునను, తదితర పురాణేతిహాసాదుల యందును ఈ మహర్షికి నాలుగు నామధేయములు ప్రసిద్ధములుగా కన్పట్టుచున్నవి. "వాల్మీకిః వాల్మీకః ప్రాచేతసః భార్గవః." ఇవి కేవల సాంకేతిక పదములు కావు. అన్వర్థములు. క్రమముగా వీని సార్థకతను దర్శింతము

వాల్మీకిః

"వల్మీకస్య అపత్యం పుమాన్ వాల్మీకిః" వల్మీకుని యొక్క పురుషాపత్యము అనగా వల్మీక మహర్షి యొక్క ఔరస పుత్రుడు. వాల్మీకి వల్మీకమహర్షిపుత్రు డగుటను వ్యాఖ్యాతలు ఇట్లు వివరించిరి

''వల్మీకస్యాపత్యం వల్మీకప్రభవో యస్మా త్తస్మా ద్వాల్మీకి రిత్యసౌ' ఇతి బ్రహ్మవైవర్తోక్తేః వల్మీకప్రభవత్వే గోణీపుత్రాదివత్ గౌణ మస్య వల్మీకాపత్యత్వం గృహీత్వా ఇఞ సాధు రపత్యార్థః, యద్వా, వల్మీక ఇతి ఋషివిశేషస్య సంజ్ఞేత్యాహుః''

శ్రీరామపండితకృత తిలకవ్యాఖ్య

బ్రహ్మ వైవర్తపురాణము ''వల్మీక ప్రభవః వాల్మీకిః'' అని, వాల్మీకి శబ్దవ్యుత్పత్తిని ప్రదర్శించినది ఇచట వల్మీక శబ్దముచేత వల్మీకమహర్షిని గ్రహించవలయునా? లేక పుట్టను గ్రహించవలయునా? వల్మీక పదముచే వల్మీకమహర్షినే గ్రహించుట యుక్తము అపుడే ముఖ్యాపత్యత్వము (ఔరస పుత్రత్వము) సిద్ధించును. అట్లుగాక, లోకసాధారణమైన వల్మీకము పుట్టను గ్రహించుచో గౌణాపత్యత్వము సిద్ధించును గాని, ఔరస పుత్రత్వము సిద్ధించదు. కనుక ''వల్మీకమహర్షి యొక్క పుత్రుడు'' అను నర్థమునే గ్రహించి ముఖ్యాపత్యత్వమునే గ్రహించుట సమంజస మని తిలకవ్యాఖ్యాన తాత్పర్యము అయితే, లోకప్రసిద్ధమైన వాల్మీకికి గల వల్మీకసంబంధము (పట్టతో గల సంబంధము) దర్శించుట యెట్లు? అను సందియము కలుగవచ్చును.

వాల్మీకః

శ్రీమద్రామాయణమున ''వాల్మీకేన మహర్షిణా" అని ఈ రీతిగా అకారాంత వాల్మీక శబ్దప్రయోగము (రామా 1 2 7) కన్పట్టును.

వల్మీకస్య అయం వాల్మీకః తస్యేదమితి సంబంధ మాత్రే అణ్'' అని వ్యాఖ్యాతలు వివరించిరి వాల్మీక శబ్దము వాల్మీకికి గల వల్మీకసంబంధ మును తెలియజేయుచున్నది. ఇచట ముఖ్యాపత్యత్వమును (ఔరసాపత్య త్వమును) గ్రహింపకపోయినను, ఆలంకారికముగా గౌణాపత్యత్వమును గ్రహింపవచ్చును దీనినిబట్టి వాల్మీకి శబ్దము ముఖ్యాపత్యత్వమును, అనగా వల్మీకమహర్షిపుత్రత్వమును,వల్మీకసంబంధమాత్రమును బోధించు వాల్మీక శబ్దముచే గౌణాపత్యత్వమును,పుట్టసంబంధమును గ్రహింపనగును.

భార్గవః ప్రాచేతసః .

రామాయణమున వాల్మీకికి ''భార్గవేణ తపస్వినా'' (ఉత్తర రామాయణ 96 25) ''భార్గవేణేతి సంస్కృతా'' అను ప్రయోగముల ననుసరించి 'భార్గవః' అను నామ మున్నట్లు తెలియుచున్నది మరియు,

''చక్రే ప్రచేతసః పుత్రః తం బ్రహ్మ ప్యన్వమన్యత।
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షాద్రామాయణాత్మనా॥''

''ప్రాచెతస మకల్మషం" ఇత్యాది ప్రయోగములు వాల్మీకికి ''ప్రాచేతసః'' అను నామ మున్నట్లు తెలియజేయుచున్నవి 'భార్గవః' అను పదము భృగువంశప్రభవత్వమును ''ప్రాచేతసః'' అను పదము వరుణగోత్రాపత్యత్వమును తెలియజేయుచున్నది.

''భృగుర్వై వారుణిః వరుణం పితర ముపససార" అని తైత్తి రీయ భృగువల్లి వరుణుని యొక్క కుమారుడు భృగు వని ఈ శ్రుతి వలన తెలియును. వరుణునకు 'ప్రచేతాః' అని పేరు అట్టి ప్రచేతసుని పుత్రుడు భృగువు అట్టి భృగువంశమున పుట్టినందున వాల్మీకి భార్గవు డగుట

గమనింప వగును "భార్గవేణ తపస్వినా ప్రాచేతసత్వేన అస్యాపి భార్గవత్త్వమ్, భృగో ర్వరుణపుత్రత్వాత్ ।"

తిలకటీక (ఉత్తరకాండ 95 25)

ఇట్లు భార్గవ ప్రాచెతస పదములు వాల్మీకి యొక్క మహర్షికులో త్పన్నత్వమును చాటుచున్నవి గాని, శబరకులమున బుట్టినట్లు చెప్పుట లేదని పురాణాదులవలన తెలియుచున్నది ఇతడు ఇతర మహర్షులతో పాటు దివ్య తెజస్సంపన్నుడై ఇంద్రసభ నలంకరించినట్లు మహా భారతము చెప్పుచున్నది

"సహదేవ స్సునీథశ్చ వల్మీకిశ్చ మహాతపాః,
సమీక స్సత్యవాక్చైవ ప్రచేతా స్సత్యసంగరాః॥

(భారత సభా 7 16)

ఇచట ఇంద్రసభ నలంకరించిన మహర్షులతోపాటు వాల్మీకి నామ ముదాహరించుచు వ్యాసమహర్షి ప్రత్యేకించి"మహాతపాః"అను విశేషణము చే అతని మహాతపస్విత్వమును (వాల్మీకిత్వమును) స్మరింపజేయు చున్నాడు అనగా, వల్మీకము తన శరీరము నావరించినను, పరిగణింపక శరీరాభిమానము లేక, దీర్ఘతపశ్చర్యాభినివిష్టు డగుటను స్మరింపజేయు చున్నాడు.

శ్రీకృష్ణుడు శాంతిదూతగా హస్తినాపురమున కేగు సమయమున వశిష్ఠ వామదేవాది మహర్షులతోపాటు వాల్మీక మహర్షి కూడ శ్రీకృష్ణుని ఆశీర్వదించినట్లుగ భారతమున గలదు.

"వశిష్ఠో వామదేవశ్చ భూరిద్యుమ్నో గయః క్రథః।
శుక్ర నారద వాల్మీకాః మరుతః కుశికా భృగుః॥"

(భారత ఉద్యోగ. 83 27).

వాల్మీకి జనకగురువు

"ఇత్యుక్త్వాఽ శ్రుకలాపూర్ణం బిభ్రతం ముఖపంకజమ్।
వాల్మీకిః సాంత్వయన్ ప్రాహ జానకీం కమలేక్షణామ్॥"

వాల్మీకి రువాచ

"వాల్మీకిం మాం విజానీహి పితు స్తవ గురుం మునిమ్
దుఃఖం మా కురు వైదేహి హ్యాగచ్ఛ మమ చాశ్రమమ్॥"

(పద్మపురాణ పాతాళఖండ 59 61, 62)

శ్రీరాముని ఆదేశము ననుసరించి అరణ్యమున విడిచిపెట్టబడి దుఃఖితురాలైన సీత నోదార్చుచు వాల్మీకి ఇట్లు చెప్పెను అమ్మా। జానకీ। నీ తండ్రి జనకునకు నేను గురువును, మునిని కూడ, సందేహింప పని లేదు దుఃఖింపవలదు ఆశ్రమమునకు రమ్మ

జనకుడు మహాప్రాజ్ఞుడు, బ్రహ్మవిద్వరేణ్యుడు విదేహాధిపతిగా ప్రసిద్ధుడు అట్టి జనకునకు గూడ వాల్మీకి గురువట దీనివలన వాల్మీకి కేవలతపస్వియే గాదు "తపస్స్వాధ్యాయనిరతుడు, వాగ్విదాంవరుడు మునిపుంగవుడు" అనియు తెలియుచున్నది. ఇట్లు మహామహిమాన్వితుడైన వాల్మీకిని ఎనేచరుడగు శబరుడని చెప్పుట యుక్తిసహము కానేరదని పండితుల యభిప్రాయము వాల్మీకి వస్తుతః వేదమూర్తి కావుననే, సీతాదేవియు వాల్మీకిని ఇట్లు స్తుతించినది

"దృష్ట్వాఽసౌ తపసా రాశిం జానకీ పతిదేవతా।
నమోఽస్తు మునయే వేదమూర్తయే వ్రతవార్ధయే॥"
(పద్మ పు పాతాళఖండ 4 69 55)

బ్రహ్మవిద్యాస్వరూపిణి యైన సీతాదేవిదృష్టిలో వాల్మీకి వేద పురుషుడుగా, మహాతపస్విగా పొడగట్టెను

వాల్మీకి మంత్రద్రష్ట [మంత్రకృత్]

"సఖా దశరథస్యాపి జనకస్య చ మంత్రకృత్।
సంచస్కారోభయప్రీత్యా మైథిలేయా యథావిధి॥"
(రఘు. 15 31)

దశరథునకును జనకునకును సఖుడు, మంత్రద్రష్టయు నైన వాల్మీకి వారిరువురితో తనకు గల స్నేహమును పురస్కరించుకొని సీతాదేవిపుత్రుల కిరువురికి యథోచితముగ సంస్కారములను జరిపెను

ఈ శ్లోకమున వాల్మీకిమహర్షి మంత్రద్రష్టగా కవిచే కీర్తింప బడినాడు. (మంత్రకృత్ మంత్రద్రష్టా మల్లినాథః)

ఇంతకు పూర్వము చతుర్దశసర్గలో దుఃఖిత యైన సీతాదేవిని ఓదార్చుచు వాల్మీకి చెప్పిన మాటలు గమనింపదగినవి

"తవోరుకీర్తిః శ్వశురః సఖా మే సతాం భవోచ్ఛేదకరః పితా తే।
ధురి స్థితా త్వం పతిదేవతానాం కింతన్నయేనాసి మమానుకంప్యా॥"
(రఘు. 14 74)

"మహాకీర్తిశాలియైన నీ శ్వశురు (మామగారు) డగు దశరథుడును, సత్పురుషులకు జ్ఞానోపదేశము జేసి సంసారదుఃఖమును నశింపజేసెడి

బ్రహ్మవేత్త యగు నీ తండ్రియు నాకు సఖుడు. నీవు పతివ్రతాశిరో మణివి. ఇట్లు ఉత్తమ కులసంజాతవు, గుణశీలవు నైన నీవు నాకు ఆప్తురాలవు అన్నివిధముల ఆదరణీయురాలవు" అని అర్థము

వాల్మీకికి రఘువంశముతోను, జనకునితోను గల పరిచయ మీనాటిది గాదు రాజర్షులైన ఆ యిరువురి మహారాజులతో తనకు గల అనూచాన మైన స్నేహము, వారిమీద గల ఆదరము సీతాదేవిని ఆదరించుటలో అభి వ్యక్తమైనది మరియు, జనకుడు బ్రహ్మవేత్త, ఉశికుడును వాల్మీకి బ్రహ్మవేత్త, దేశికుడు, మంత్రద్రష్ట కూడ ఇట్టి బ్రహ్మవేత్తను పామరుడుగా భావింపజూచుట యసంగతమేమో !

## వాల్మీకి వ్యాసుడు

ఏ యే మన్వంతరమున ఎవరెవరు వ్యాసులుగా అవతరించిరో, విష్ణుపురాణమున వారి నామములు వరుసగా ఉదాహరింపబడినవి.

> "సోమశుష్మాయణ స్తస్మాత్ తృణబిందు రితి స్మృతః।
> ఋక్షోఽభూ ద్భార్గవ స్తస్మాత్ వాల్మీకిర్యోఽభిధీయతే॥
> తస్మా దస్మత్పితా శక్తిః వ్యాస స్తస్మా దహం మునే।"
> (కూర్మ పురాణ పూర్వార్ధ 53 8 విష్ణుపురాణ 3 । 7, 18

పరాశరమహర్షి ఆ యా ద్వాపరయుగములలో వ్యాసులుగా అవ తరించిన మహాత్ముల పరిగణనము చేయుచు సోమశుష్మాయణుని తరువాత తృణబిందువు, ఆయన తరువాత "ఋక్షః" "భార్గవః" అను నామధేయ ములు గల వాల్మీకి వ్యాసు డాయెను ఆయన తరువాత నా తండ్రి యగు శక్తి, తరువాత నేనును(పరాశరుడు) క్రమముగా వ్యాసుల మైతిమి.

తరువాత జాతుకర్ణుడు, తరువాత కృష్ణద్వైపాయనుడు వ్యాసులైరి. ఇట్లు 28మంది వ్యాసులు కీర్తింపబడిరి

"అష్టావింశతి రిత్యేతే వేదవ్యాసాః పురాతనాః।
ఏకో వేదః చతుర్ధా తు తైః కృతో ద్వాపరాదిషు।
భవిష్యే ద్వాపరే చైవ ద్రౌణి ర్వ్యాసో భవిష్యతి॥''

ఈ వ్యాసులందరు ఆ యా ద్వాపరములందు వేదవిభాగకర్తలే. రాబోవు ద్వాపరమున 'ద్రౌణి' అనగా అశ్వత్థామ వ్యాసుడు కాగలడు

దీనినిబట్టి వాల్మీకి వ్యాసుడుగను, వేదవిభాగకర్తగను తెలియుచున్నాడు.

వాల్మీకి బ్రహ్మహత్యాదోషము (బ్రహ్మఘ్నదోషము).

''వాల్మీకి శ్చాహ భగవాన్ యుధిష్ఠిర మిదం వచః।
వివాదే సాగ్నిమునిభిః బ్రహ్మఘ్నో వై భవానితి॥
ఉక్తః క్షణేన చావిష్టః తేనాధర్మేణ భారత।
సోఽహ మీశాన మనఘ మమోఘం శరణం గతః॥
ముక్త శ్చాస్మి తతః పాపైః తతో దుఃఖవినాశనః।
ఆహ మాం త్రిపురఘ్నో వై యశ స్తేఽగ్ర్యం భవిష్యతి॥"

(భారత అనుశాసనపర్వ. 18 8 నుండి10)

''వివాదే వేదవిపరీతవాదే అగ్నిసహితై ర్మునిభి రుక్త ఇతి సంబంధః।
తేన వేదవిరోధజేన॥'' (నీలకంఠః 8, 9)

కృష్ణద్వైపాయనాది మహర్షులు యుధిష్ఠిరునకు పరమేశ్వరాను గ్రహా సంపాదనవిషయమై తమ తమ అనుభవములను వివరించుచు చెప్పిరి అప్పుడు వాల్మీకి భగవానుడును తన యనుభవమును యుధిష్ఠిరునకు వివరించెను

"ఒకపుడు విద్వత్సభలో నేను వేదవిపరీతవాదమును చేసితిని. అహితాగ్నులైన ఆ మునులు "వేదవిపరీతవాదన చేసినందున నీవు బ్రహ్మఘ్నుడ వైతివి" అని శపించిరి. నేను వేదవిరోధవాదజనితాధర్మావిష్టుడ నైతిని అందుకై సర్వనియామకుడగు పరమేశ్వరుని శరణు జొచ్చి పాపవిముక్తుడ నైతిని భక్తుల దుఃఖముల బారద్రోలు త్రిపురారియైన ఆ మహేశ్వరుడు నాయందు కరుణతో ఇట్లనెను నీవు భయపడవలదు, పాపవిముక్తుడ వైతివి నీ చర్య నీ కమోఘ కీర్తిదాయక మగును."

వాల్మీకిమహర్షికి వేదవిషయక సంప్రదాయము లన్నియు తెలియును వేదవిపరీతవాదము చేసినందున కలుగు అనర్థములు గూడ తెలియును. వేదవిషయమై వాల్మీకికి అప్రకంప్యమైన భక్తియు కలదని పై అఖ్యానము వలన స్పష్ట మగుచున్నది కనుకనే, తన యీ అనుభవమును దృష్టి యందుంచుకొనియే గాబోలు । వేదావతారరూప మగు రామాయణమును అదికావ్యరూపమున లోకమున ప్రవర్తింపజేసినాడు రామాయణమున అక్కడక్కడ ఆ యా పాత్రచిత్రణవ్యాజమున వేద విపరీతవాదములచే వేదముల అప్రకంప్యత్వమును ఉద్ఘోషించినాడు

"న శక్తస్త్వం బలాద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః।
హేతుభి ర్న్యాయసంసిద్ధై ర్ధ్రువాం వేదశ్రుతీ మివ॥"

సీతాపహరణసందర్భమున రావణు నుద్దేశించి జటాయువు పలికిన వాక్యము లివి

రావణా ! న్యాయసంసిద్ధహేతువులతో ధ్రువరూపిణియైన (అప్రకంప్యమైన) వేదవాణి కుతర్కవాదములతో చలింపజేయజాలని యట్లు నేను చూచుచుండగా విదేహపుత్రి యగు సీతను బలాత్కారముగా అపహరింపజాలవు

ఈ సన్నివేశము ద్వారా వాల్మీకి, వేదవిషయమై వేదవ్యతిరేక వాదవిషయమై తనకు గల అనుభూతిని స్మరింపజేయుట గమనింపదగును.

శ్రీరాముని మరల అయోధ్యకు తీసికొనివచ్చుటకై వశిష్ఠాదులతో కూడి భరతుడు చిత్రకూటమున కేగినపుడు అచట శ్రీరాముని యెదుట వేదచోదిత ధర్మానుష్ఠానవిషయమై జాబాలి మహర్షి ధర్మవ్యతిరేక వాదము చేయుట, శ్రీరాముని ధర్మదీక్షచే అతడు మరల ఆస్తికవాదము చేయుట తద్ద్వారా వాల్మీకి తన యొక్క పూర్వానుభూతిని సూచించుట గమనార్హము. వేదవాణి యందు దకుంఠిత శ్రద్ధాసక్తులు గల వాల్మీకి విషయమున వివిధ చిత్రగాథలు ప్రచారమొందుట విచారణీయము.

## వాల్మీకిమహర్షి బ్రహ్మావతారము

వాల్మీకి వేదపురుషు డని పైన వివరింపబడినది. ఆ మహాకవి యొక్క వేదపూరుషత్వమును వివరించు సన్నివేశములు రామాయణమున గాంచగలము

వాల్మీకి సాక్షాత్ బ్రహ్మావతారరూపు డని పురాణములు వర్ణించు చున్నవి. వాల్మీకి యొక్క బ్రహ్మావతారత్వమును, రామాయణవ్యాఖ్యాత శ్రీమహేశ్వరతీర్థులు గ్రంథారంభమున ఇట్లు వివరించిరి—

''బ్రహ్మలోకప్రసిద్ధం శతకోటిప్రవిస్తరం రామచరితం భూలోకవర్తినాం
చతుర్ణాం వర్ణానాం తాపత్రయ విమోచనాయ సంక్షిప్య రచయితు
ముద్యుక్తః పరమ కారుణికో బ్రహ్మ వాల్మీకిరూపేణ భువి స్వాంశేన
సమభవత్॥''

తథాచ స్కాందే పార్వతీం ప్రతి శివవచనమ్

''వాల్మీకి రభవ ద్బ్రహ్మ వాణీ వాక్తస్య రూపిణీ।
చకార రామచరితం పావనం చరితవ్రతః॥'' ఇతి
ఏవంచ బ్రహ్మాంశభూతో భగవాన్ ప్రాచేతసః స్వచికీర్షితం
శ్రీరామచరితం గురుముఖా చ్ఛ్రోతవ్య మితి న్యాయేన
భగవత్కథోపదేశేన స్వగురుం నారదం ప్రతీక్షమాణః ఆస్తే స్మ
అథ బ్రహ్మనియోగేన సమాగతం భగవంతం నారద మభ్యర్చ్య
వాల్మీకిః కోన్వస్మిన్నిత్యాది పప్రచ్ఛ।

''శతకోటివిస్తారము గల రామచరితము బ్రహ్మలోకమున ప్రసిద్ధము. భూలోకమున తాపత్రయాభితప్తులైన జనుల కందరకు విమోచన సాధనమైన రామాయణమును సంగ్రహముగా రచించి భూలోకమున ప్రవర్తింపజేయుటకు పరమ కారుణికుడైన బ్రహ్మ ఉద్యమించెను తానే స్వయముగ స్వాంశతో వాల్మీకిరూపమున భూమి యందవతరించెను ఈ విషయమును స్కాందపురాణమున పార్వతికి శివుడుపదేశించినట్లుగా గలదు అందు ''బ్రహ్మయే వాల్మీకి యయ్యెను. సరస్వతి ఛందోబద్ధ రూపిణియై వాల్మీకివాక్కుగా భాసించెను అట్టి వాల్మీకి పరమ పావనమైన రామచరితమును రామాయణముగా వెలయింపజేసెను.'' అని వర్ణింప బడినది.

బ్రహ్మాంశసంభూతు డగు వాల్మీకికి రాముని మహత్త్వము తెలియదా? తెలియును అయినను, తాను వేదవిహిత సంప్రదాయప్రవర్తకుడు కావలెను తనచే ప్రవర్తింపచేయబడబోవునది వేదావతారరూపమైన రామాయణ మహాకావ్యము గురూపదేశముచే సంప్రదాయానుగుణముగా నేర్చిన విద్యయే వీర్యవత్తరము, క్షేమంకరము గురువు యొక్క మహత్త్వమును గురూపదేశము యొక్క అపూర్వశక్తిమహత్త్వమును లోకమున కుపదేశించుటకై తానే స్వయముగ ఆచరించి ఆదర్శప్రాయుడయ్యెను ఇదియే ఉత్తమ ఆచార్యలక్షణము'' అని వ్యాఖ్యానతాత్పర్యము

క్రౌంచద్వంద్వవియోగమును జూచి కరుణరసావిష్టుడైన వాల్మీకి ముఖము నుండి అప్రయత్నముగ ఛందోబద్ధమైన వాణి ఆవిర్భవింపగా ఆశ్చర్యచకితుడై యున్న వాల్మీకి కడకు బ్రహ్మ ఏతెంచి, ఆయనను రామాయణరచనకు ప్రోత్సహించిన సన్నివేశము పై విషయమును ధ్రువపరచుచున్నది

"తమువాచ తతో బ్రహ్మ ప్రహస న్మునిపుంగవమ్,
శ్లోక ఏవ త్వయా బద్ధో నాత్ర కార్యా విచారణా,
మచ్ఛందాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ॥
(రామా బాల 2 30, 31)

తన వ్యాకులపాటుకు కారణము తెలియక ''మానిషాద'' శ్లోకమును గూర్చియే ఏకాగ్రతతో ధ్యానపరాయణుడైన వాల్మీకితో మందహాసము జేయుచు బ్రహ్మ ఇట్లనెను

"హే బ్రహ్మన్ ! ఈ సంఘటనను గూర్చి విచారింపకుము నా సంకల్పము ననుసరించియే సరస్వతి ఛందోబద్ధవాగ్రూపిణియై నీ జిహ్వ

గ్రమున భాసించినది అందుచే, ఓ ఋషిసత్తమా ! శ్రీరామచరితమును వర్ణింపుము ”

ఇచట వచ్చినవాడు బ్రహ్మ అతడు వాల్మీకిని “బ్రహ్మన్” అని సంబోధించుచున్నాడు. ఈ బ్రహ్మచే చేయబడిన సంబోధనము సాభి ప్రాయము “నేను బ్రహ్మను, నీవును మత్స్వరూపుడవే, నాకంటె భిన్నుడవు కావు యత్ర యత్ర బ్రహ్మ తత్ర తత్ర సరస్వతీ బ్రహ్మను విడచి సరస్వతి యుండదు నీవు బ్రహ్మస్వరూపుడవు. కనుకనే, సరస్వతి నీ ముఖమున భాసించినది ” అను నీ సన్నివేశము వాల్మీకి యొక్క బ్రహ్మనన్యత్వమును స్పష్టీకరించుచున్నది స్కాంద పురాణమున స్పష్టముగా కంఠోక్తిగా చెప్ప బడిన విషయమే ఇట, బ్రహ్మ ముఖమున స్పష్టీకరింపబడినది

ఉత్తరకాండ యందలి సీతారామసమాగమ సన్నివేశ మీ విష యమును దృఢపరచుచున్నది

జనాపవాదభీతిచే అరణ్యమున పరిత్యక్తయైన సీత వాల్మీకాశ్రమ మున పవిత్రజీవితమును గడుపుచు పాపశంకాకళంకరహితయై ఇరువురి పుత్రులతో తాపసీజీవితమును గడుపుచున్నట్లు శ్రీరామునకు తెలిసినది.

“సీత పరిశుద్ధురాలు కావచ్చును అయినను, రేపు ఉదయమున నిండు పేరోలగమున పరిషత్సభామధ్యమమున ఆమె తన పాతి శుద్ధ్యమును నిరూపించుకొనవచ్చును” అని వాల్మీకమహర్షికి దూతల ద్వారా శ్రీరాముడు సందేశము పంపెను ఆ మహర్షియు అట్లే అని ఆమోదించి తన యంగీకారమును సీతకు తెలియజేసెను మరునాడు ఉదయము సభలో సీతాశపథవిషయమైన వార్త నలుదెసల ప్రాకెను

ప్రత్యేకముగ శ్రీరాముడు వశిష్ఠాది మహర్షుల నంవర నాహ్వానించెను ఏమి జరుగునో అను కుతూహలముతో మహర్షులంద రేతెంచిరి ఇంతే గాదు, నానాదిశల నుండి ఎందరెందరో రాక్షసులు, వానరులు, పండితులు, పామరులు, అన్ని వర్ణములవారు వచ్చి అందరు సభ నలంకరించిరి సభ యంతయు నిశ్శబ్దము ఉత్కంఠతో అందరు సీతాగమనమును నిరీక్షించుచుండిరి

ఇట్లు సభాప్రాంగణము నిశ్చేష్టమై తమకొరకు వేచియుండుట విని వాల్మీకి వెంటనే సీతాసమేతుడై సభను ప్రవేశించెను

"తదా సమాగతం సర్వ మశ్మభూత మివాచలమ్
శ్రుత్వా మునివర స్తూర్ణం ససీత స్సముపాగమత్॥"

"తమృషిం పృష్ఠత స్సీతా అన్వగచ్ఛ దవాఙ్ముఖీ।
కృతాంజలి ర్బాష్పకలా కృత్వా రామం మనోగతమ్॥"

"తాం దృష్ట్వా శ్రుతి మాయాంతీం బ్రహ్మాణ మనుగామినీమ్।
వాల్మీకేః పృష్ఠత స్సీతాం సాధువాదో మహా నభూత్॥"

"తతో హలహలాశబ్దః సర్వేషామేవ మాబభౌ।
దుఃఖజన్మవిశాలేన శోకేనాకులితాత్మనామ్॥"

ఆ ఋషి వెనుక అధోముఖియై కృతాంజలియై సీత వచ్చుచుండెను. మూర్తీభవించిన శోకదేవతయో అన్నట్లుగా ఆమె రామధ్యానపరాయణయై కన్పట్టెను బ్రహ్మను రూపు దాల్చిన వేదమాత అనుగమించునట్లు బ్రహ్మణ్యుడైన ఆ మునిని అనుసరించుచున్న సీతను చూచినంతనే ఒకవైపు సభలో సాధువాదములు చెలరేగెను. మరియొకవైపు హలహలా

శబ్దములతో సభ మారుమ్రోగెను అంతవరకు వారి హృదయ మందు నిగూఢమై యున్న శోకము ఆ శోకిమూర్తిని చూచినంతనే గట్టును త్రెంచుకొని ప్రవహించెను

ఈ సన్నివేశము మహాకవి యొక్క ప్రతిభావైదుష్యమును, శిల్ప చాతుర్యమును - వీతోపాటు సీతావాల్మీకుల యొక్క మహామహిమాన్విత త్త్వమును కండ్లకు గట్టినట్లు చేయుచున్నది సభావేదిక నలంక రించిన ప్రభువు ధర్మమూర్తియైన శ్రీరాముడు సభ నలంకరించినవారు సామాన్యులుగారు. వారు వశిష్ఠ, వామదేవ, జాబాలి, కాశ్యప దుర్వాస, మార్కండేయాది మహర్షులు, నారదాది దేవర్షులు, అహితాగ్నులు వేద వేదాంగపారంగతులైన విద్వద్వరేణ్యులు, శిల్పకళాకోవిదులైన ఇతర ప్రముఖులు ఇట్లు ఎందరెందరో మహానుభావులతో విరాజిల్లెడి ఆ మహా పరిషత్తు దృష్టిలో వాల్మీకి బ్రహ్మరూపుడై, సీత వేదవిద్యాస్వరూపిణియై భాసిల్లినవి

''తాం దృష్ట్వా శ్రుతి మాయాంతిం బ్రహ్మాణ మనుగామినీమ్''

ఇచట కవి ''వాల్మీకి బ్రహ్మవలె భాసిల్లె''నని చెప్పక సాక్షాద్బ్రహ్మస్వరూపునిగానే దర్శింపజేయుచున్నాడు కవి యగు వాల్మీకి తనను బ్రహ్మస్వరూపునిగా చెప్పుకొనుట యందు తాత్పర్యము గాదు వశిష్ఠాది మహాత్ముల దృష్టికి వాల్మీకి సాక్షాత్బ్రహ్మగా సాక్షాత్కరించిన వాస్తవ స్థితిని కవి తెలియజేయుచున్నాడు రామాయణ మహాకావ్యమున అంత్య వాక్కుక అయథార్థవర్ణనకు తావు లేదు

''న తే వాగనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి''

అనిగదా: బ్రహ్మ యొక్క అనుగ్రహపూర్వకమైన ఆదశము ఆ ఆదేశము పై వర్ణన యొక్క యాథార్థ్యమును ధృవీకరించుచున్నది ఈ సభావృత్తాంతము నింకను పరిశీలింతము.

''తతో మధ్యే జనౌఘస్య ప్రవిశ్య మునిపుంగవః।
సీతాసహాయో వాల్మీకి రితి హోవాచ రాఘవమ్॥
ఇయం దాశరథే సీతా సువ్రతా ధర్మచారిణీ।
అపవాదా త్పరిత్యక్తా మమాశ్రమసమీపతః॥
లోకాపవాదభీతస్య తవ రామ మహావ్రత।
ప్రత్యయం దాస్యతే సీతా తా మనుజ్ఞాతు మర్హసి॥
ఇమౌ తు జానకీపుత్రా వుభౌ చ యమజాతకౌ।
సుతౌ తవైవ దుర్ధర్షౌ సత్యమేత ద్బ్రవీమి తే॥
ప్రచేతసోఽహం దశమః పుత్రో రాఘవనందన।
న స్మరా మ్యనృతం వాక్య మిమౌ తు తవ పుత్రకౌ॥
బహువర్షసహస్రాణి తపశ్చర్యా మయా కృతా।
నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యది మైథిలీ॥
మనసా కర్మణా వాచా భూతపూర్వం న కిల్బిషం।
తస్యాహం ఫల మశ్నామి అపాపా మైథిలీ యది॥
అహం పంచసు భూతేషు మనష్షష్ఠేషు రాఘవ।
విచింత్య సీతా శుద్ధేతి జగ్రాహ వననిర్ఘరే॥
ఇయం శుద్ధసమాచారా అపాపా పతిదేవతా।
లోకాపవాదభీతస్య ప్రత్యయం తవ దాస్యతి॥

అట్లు సభామధ్యమున సీతాసమేతుడై వాల్మీకి ప్రవేశించి శ్రీరాము నితో నిట్లనెను

శ్రీరామ! లోకాపవాదభీతిచే సీత నా యాశ్రమసమీపమున పరిత్యజింపబడినది ఈమె ధర్మవ్రతపరాయణ। లోకాపవాదభీతుడవైన నీకు తన నిర్దోషత్వమును నిరూపించుకొనుట కీమె కవకాశ మిమ్ము. ఈబాలకు లిరువురు యమళలు (కవలలు) జానకీపుత్రులు అజేయులు వీరు నీ కుమారులే ఇది యథార్థము నేను ప్రచేతసుని (వరుణుని యొక్క) దశమ పుత్రుడను. అనృతవాక్యము స్మరించను గూడ స్మరించను సీత లోక మనుకొనునట్లు దోషి గాదు నీవు శంకించినటులను దోషి గాదు ఆమె అపరాధిని యగుచో వేలకొలది సంవత్సరములపాటు నేనా నర్చిన దీర్ఘతపశ్చర్యాఫలము నాశించను మనోవాక్కాయపూర్వకముగ నేనెన్నడు ఎట్టి పాప మాచరించి యుండలేదు సీత నిర్దోషియైన పక్షమున, నా తపఃఫలము నాకు సిద్ధించును ఆమె ఇంద్రియ వ్యాపారము లందును మనస్సంకల్పాదుల యందును ఎట్టి దోషము లేదు కాన, పరిశుద్ధురాలు అని తెలిసియే ఆమెకు నాయాశ్రమమున ఆశ్రయమిచ్చితిని. ఈమె వర్తనము పరిశుద్ధము, పాపరహితము, పాతివ్రత్యచర్యాభూషితము. అయినను, లోకాపవాదముచే ఆమెను శంకించితివి కాన, తన నిర్దోషత్వమును ఋజావు చేసికొనవలసిన బాధ్యత ఆమె యందున్నది ఇపుడే ఈ మహాజనసమక్షమున తన పాతివ్రత్యమహత్త్వమును నిరూపించుకొనగలదు, అందు కనుజ్ఞ ఇమ్ము

ఈ సన్నివేశము సీత యొక్క పాతివ్రత్యమహత్త్వముతోపాటు వాల్మీకిమహర్షి యొక్క దేవాంశసంభూతత్త్వమును, వరుణ దశమ పుత్రత్త్వమును (ప్రాచేతసత్త్వమును) ఆయన యొక్క మహాతపస్విత్వ

మును, త్రికరణశుద్ధిని సత్శీలత్వమును స్పష్టముగా నిరూపించుచున్నది ఏతాదృశమహిమోపేతుడు, బ్రహ్మనన్యుడు, దెవాంశసంభూతుడునగు వాల్మీకిమహర్షిని గురించిన వెర్రిమొర్రికథలు విశ్వసనీయమములు కావని పెద్దలుచెప్పుదురు.

## ఇతరకవులు వాల్మీకి ప్రశంస.

భవభూతి

ఉత్తరరామచరిత నాటకమున ఆత్రేయీ వనదేవతా సంవాద వ్యాజమున మహర్షి వాల్మీకి యొక్క మహానుభావత్వము మనోహరముగ చిత్రీకరింపబడినది ఆత్రేయి వాల్మీకి ఆశ్రమమున గల పెక్కుమంది శిష్యులలో ఒకరు అట తన విద్యాభ్యాసమునకు విఘ్నములు ఎదురగు టచే వాల్మీకి గురుకులమును విడచి అగస్త్యాదుల యొక్క గురుకులము నకు దోవ పయనమయ్యెను అపుడు వనదేవత ఆత్రేయి నిట్లు ప్రశ్నిం చినది.

"యదా తావ దన్యేఽపి మునయః తమెవ పురాణబ్రహ్మ
వాదినం ప్రాచేతస మృషిం బ్రహ్మపారాయణాయ
ఉపవసంతి, తత్కోఽయ మార్యాయాః ప్రవాసః"

వాల్మీకి పురాణముని, బ్రహ్మవేత్త ప్రాచేతసుడు. అట్టి మహ ర్షినే మునులు సైతము బ్రహ్మపారాయణకొఱకు వేదవేదాంగాది సకల విద్యాధ్యయనము కొఱకు సేవించుచుండ, అట్టి మహాగురుకులమును విడచి నీవు పోవుటకు కారణమేమి : అందుల కాత్రేయి ఇట్లు సమాధా నము చెప్పినది. ఆ మహర్షి కడి దెవతావరప్రసాదలబ్ధమైన బాలక

ద్వయము కలదు. వారు కుశలవులు, పుట్టుకతోనే సరస్వతీ జృంభణ సిద్ధి వారికి కలిగినది. వారిని జూచి మహర్షులకే గాదు, వన్యమృగములకు సైతము అపార వాత్సల్యము. భగవానుడగు వాల్మీకియే బాలకిద్దరికి సంస్కారము నెరపి వారిని ఉపనీతుల కావించి, త్రయీవిద్యతోపాటు ధనుర్వేదాది సకల విద్యలయందును సుశిక్షితుల గావించెను. వారి ప్రతిభ అతిమానుషము. అట్టి ప్రతిభావంతులతో నెగ్గలేక, నేను మరియొకచోటికి పోవుచున్నాను. ఇంతియెగాదు మరియొక కారణము గూడ గలదు.

''అథ స బ్రహ్మర్షి రేకదా మాధ్యందినే సమయే నదీం
తమసా మనుప్రపన్నః తత్ర యుగ్మచారిణోః
క్రౌంచయో రేకం వ్యాధేన విధ్యమాన మదర్శత్।
ఆకస్మిక ప్రత్యవభాసాం దేవీం వాచం ఆనుష్టుభేన
ఛందసా పరిచ్ఛిన్నా మభ్యుదైరయత్ మానిషాద
"తేన ఖలు పున స్సమయేన తం భగవంత మావి
ర్భూతశబ్దప్రకాశం ఋషి ముపగమ్య భగవాన్ భూత
భావనః పద్మయోని రవోచత్, ఋషే। ప్రబుద్ధో
వాగాత్మని తద్బ్రూహి రామచరితమ్, అవ్యాహత
జ్యోతి రార్షం తే చక్షుః ప్రతిభాతి, అద్యః కవి రసి"
ఇత్యుక్త్వా తత్రైవాంతర్హితః, అథ భగవాన్ ప్రాచే
తసః ప్రథమం మనుష్యేషు శబ్దబ్రహ్మణః తాదృశం
వివర్త మితిహాసం రామాయణం ఋషిః ప్రణినాయ
తస్మా దవోచం తత్ర హి మహాన్ ప్రత్యూహ ఇతి''

ఆయన బ్రహ్మర్షి ఒకనాడు మాధ్యందినసవనమునకై తమసా నదీతీరమున కేగి అచట వ్యాధు డొకడు క్రౌంచయుగ్మములో నొక

దానిని చంపుట మాచి ఉద్విగ్నుడయ్యెను అప్రయత్నముగ అనుష్టుప్ ఛందోబద్ధయై సరస్వతి ఆకస్మికముగ ఆయన ముఖమునుండి "మా నిషాద" శ్లోకరూపమున నభివ్యక్తమయ్యెను ఈవిధముగా శబ్దబ్రహ్మ సాక్షాత్కారము గలిగిన మహర్షి యెదుట బ్రహ్మ సాక్షత్కరించి ఓ మహర్షీ! నీకు శబ్దబ్రహ్మసాక్షాత్కారము గలిగినది రామకథను వ్రాయుము నీ అంతరంగమైన ప్రజ్ఞాచక్షుస్సునకు భూత భవిష్యద్వర్తమాన వృత్తాంత మంతయు అప్రతిహతమై అపరోక్షముగ భాసించును నీవాది కవివి" అని చెప్పి అదృశ్యుడయ్యెను భగవానుడగు ఆ ప్రాచేతస మహర్షి వేదావతారరూప మగు (శబ్దబ్రహ్మణః వివర్తం) రామాయణ మును రచించెను ఈ కారణముచె ఇది అధ్యయనము చక్కగా జరుగుటలేదు

ఈ మైత్రేయీ వసిదవరాసంవాదము 'వాల్మీకిమహర్షి ఆశ్రమము ఉన్నత వివిధ విద్యాకేంద్రస్థానము, సాంగవేద వేదాంత విద్యానిలయము, మహాగురుకుల మని" తెలియజేయుచున్నది. ఆయన బ్రహర్షి మునులకు సైతము దేశికుడు, కులపతి శబ్దబ్రహ్మసాక్షా త్కారము నొందిన వాగ్విదాంవరుడు, ఋగ్యజుస్సామాత్మకమైన త్రయీ విద్యకు మారుపేరుగా ఆదికావ్యమును వెలయించిన మహాకవి ఆదికవి. అని తెలియజేయును. భవభూతిమహాకవి దర్శించిన మహాకవి వాల్మీకి మహర్షిస్వరూప మిట్టిది.

జయదేవుడు ప్రసన్నరాఘవము

జయదేవుడు సుప్రసిద్ధ తార్కికుడు, మహాకవి. ఈతడు రామాయణగాథను ప్రసన్నరాఘవనాటకముగా రచించెను అందు ఆయన జేసిన ప్రశంసను చూతము.

మమ ఏవ కవికమలపద్మవి మనో వల్మీకజన్మని
మనఃకౌతుకితం, యస్య ఏకమపి వదనారవింద మాసాద్య
చతుర్ముఖ కమలవనవిహారవినోద మనుభవతి భారతీ
నామ రాజహంసీ''

(ప్రసన్న 1 అంక)

భారతి యనగా సరస్వతి. వేదమాత ఆమె నిరంతరము చతుర్ముఖ కమలవనవిహారవినోదము సలుపునట్టిది వాల్మీకికి నాలుగు మోములు లేవు అయినను, ఆయన ముఖపద్మము నాశ్రయించి అంతటి ఆనందమును వినోదమును పొందినది అట్టి భారతితో విరాజిల్లుటచే ఆయన నిఖిల కవికమలముల కావాసభూతమైన సరోజినీరూపు డైనాడు గావునే, అట్టి కవికులపతి యందె నా చిత్త మెప్పుడును కౌతుకముతో నిలచియుండును'' అని అర్థము

ఇచట జయదేవుడు వాల్మీకి బ్రహ్మవతారరూపు డని నోటితో చెప్పక "అచతుర్వదనో బ్రహ్మ వాల్మీకిః'' అని వ్యంగ్యముగా చెప్పి నాడు. ఆయన జిహ్వాగ్రమున వెలసిన వాక్కు వేదవాక్కే అను విషయము గూడ ధ్వనింపజేసినాడు ఇంతేగాదు, శ్రీరాముని కీర్తితో పాటు ఆ మహాత్ముని కీర్తి ఎట్లు నలుదెసల వ్యాపించినదొ, తరువాతి శ్లోకమున ఇట్లు వివరించుచున్నాడు.

"భాస్వద్వంశవతంస కీర్తిరమణీ రంగప్రసంగస్వన
ద్వాదిత్ర ప్రథమధ్వని ర్విజయతే వల్మీకజన్మా మునిః।
పీత్వా యద్వదనేందుమండలగళ త్కావ్యామృతాబ్ధేః కిమ
ప్యాకల్పం కవినూతనామృతమయీ కాదంబినీ వర్షతి॥''

(ప్రసన్నరాఘవ 1-9)

దినకరవంశమణి యగు శ్రీరామచంద్రుని కీర్తినటి నాట్యరంగ ప్రవేశము చేసినపుడు నృత్యప్రసాధనమైన రమణీయ వాద్యధ్వని తొలుదొలుత మ్రోగను ఆ ధ్వనియే వాల్మీకి ఆ వాల్మీకిముఖ చంద్రుని నుండి జాలువారిన సుధాసాగరమే శ్రీమద్రామాయణము సముద్రము నుండి మేఘము లుద్భవించినట్లు ఆ సుధాసాగరము నుండి ఎన్నో కవి కాదంబినులు (కాదంబినీ మేఘమాలా, అనగా కవి మేఘ మాలలు) అమృతపూర్ణములై ప్రాదుర్భవించుచు దివ్యామృతముతో జగము నంతయు ఆకల్పాంతము అప్లావితము చేయుచుండును

శ్రీరామకీర్తినటి యొక్క రంగప్రసాధక ప్రథమధ్వని వాల్మీకి యని ఇట కీర్తింపబడినాడు వాద్యధ్వని ఎంత మంగళకరమో, క్షేమం కరమో ఈ వాల్మీకి యనెడు ధ్వనియు సకలలోక మంగళకరము, క్షేమం కరము మరియు వాద్యధ్వని యెట్లు వివిధ రమణీయ భావోత్తేజకమో, ఈ వాల్మీకిధ్వనియు సహృదయులగు పండితులకు కవులకు తుదకు పామరులకు సైతము వివిధ రమణీయ భావనాపరంపరాసముద్యోతకము.

ఇక తాత్త్వికముగ శ్రీరామచంద్రకీర్తినటి నాట్యస్వరూపమును దర్శింతము

ఈ నాట్యము అధునికము గాదు, లౌకికము గాదు ప్రప్రథమ మున లోకమున వెలసిన నాట్యము. ఇది నాట్యమహానటుడగు నటరాజు యొక్క లీలాతాండవస్వరూపమును అభివ్యక్తము చేయును కావుననే, ఇట్టి నాట్యమును చాక్షుషయజ్ఞ మని కాళిదాసమహాకవి ఉపదేశించినాడు.

''దేవానా మిద మామనంతి మునయః కాంతం క్రతుం చాక్షుషమ్''

(మాలవికాగ్నిమిత్ర నాటకం)

యజ్ఞములలో ప్రయోగించు వాద్యధ్వనులు పవిత్ర మంత్రధ్వనులే అట్లే ఈ నాట్యయజ్ఞసందర్భమున ప్రయోగించిన ప్రథమ వాద్యధ్వని పవిత్ర మంత్ర ధ్వని యని చెప్పుట సమంజసము ఈ మంత్రధ్వని బ్రహ్మస్వరూపు వాల్మీకిముఖోద్గతము కావున, అట్టి పవిత్ర మంత్రధ్వనిరూపమైనది రామాయణగానము.

సృష్ట్యాది యం దావిర్భవించిన ప్రథమధ్వని వేదధ్వని అట్లే కావ్యజగత్సృష్ట్యాదియందు వినిపించిన ప్రథమధ్వని రామాయణధ్వని కావున, వాల్మీకి అచతుర్వదనబ్రహ్మస్వరూపుడు ఆయన ముఖము నుండి ఉద్గతమైన రామాయణము వేదసంమిత మని జయదేవమహాకవి హృదయము.

భోజుడు చంపూరామాయణము

భోజ మహాకవియు తన చంపూరామాయణ కావ్యమున వాల్మీకిని "భగవాన్ ప్రాచేతసః ప్రవచసాం కవీనాం ప్రథమః, ఛందోమయీనాం వాచాం నిలయః, మధుమయఫణితీనాం మార్గదర్శీ, మహర్షిః" అని కీర్తించినాడు

ఈ విశేషణములు వాల్మీకి యొక్క వరుణాపత్యత్వమును, (ప్రచేతసో వరుణస్యాపత్యం ప్రాచేతసో మునిః వాల్మీకిః రామచంద్ర బుధవ్యాఖ్య) వాగ్విశారదులైన మహాకవులలో ప్రాథమ్యమును వేద నిధిత్వమును మధుమయఫణితీనాం మార్గదర్శిత్వరూప మహర్షిత్వమును తెలియజేయుచున్నవి ఇవి అన్నియు అనూచానముగా వాల్మీకివిషయమై చెప్పబడెడి, భూతార్థవాదములే.

కాళిదాసు వాల్మీకి ప్రశంస.

కాళిదాసమహాకవిదృష్టిలో "వాల్మీకి మంత్రద్రష్ట" యను విషయము పూర్వము వివరింపబడినది. ఇంకను ఆ కవి వాల్మీకి యొక్క మహామహిమాన్వితత్వమును దర్శించినతీరును జూతము

"ఇతి ప్రతిశ్రుతే రాజ్ఞా జానకీ మాశ్రమా న్మని।
శిష్యై రానాయయామాస స్వసిద్ధిం నియమైరివ॥"

(రఘు 1· 74)

శ్రీరాముడు అశ్వమేధయాగమును తలపెట్టెను ఆహూతులైన మహర్షులతోపాటు వాల్మీకియు ఏతెంచెను. తమ గురువుతోపాటు కుశలవులును ఏతెంచిరి వారచటచట తిరుగాడుచు రామాయణగానము చేయుచుండిరి శ్రీరాముడు గూడ ఆ గానమును వినెను వారి ద్వారా వాల్మీకి రామాయణమహాకావ్యకర్త యని తెలిసికొని అనుజసమేతుడై వాల్మీకి కడ కేగెను ఆ మహర్షి సీతా కుశలవుల వృత్తాంతమును దెలిపి నిర్దోషురాలైన ఆమెను పరిగ్రహించుట యుక్త మని శ్రీరాముని కోరెను ప్రజాసమక్షమున, ఆమె తన నిర్దోషిత్వమును నిరూపించుకొనుచో, పరిగ్రహింతు నని ప్రతిజ్ఞ చేసెను ఆ సందర్భమున కవిచె చెప్పబడిన శ్లోక మిది

"శ్రీరాము డట్లు ప్రతిజ్ఞ చేయగా, దీర్ఘతపశ్చర్యలతో స్వార్థసిద్ధిని బడయునట్లు తన శిష్యుల ద్వారా తన యాశ్రమము నుండి సీతను రప్పించెను." అని పై శ్లోకతాత్పర్యము

మానవుడు కోరినంతనే కోరికలు తమయంంట రాము ఒరియవు లౌకిక ఫలావాప్తికే ఎంతో శ్రమించవలసియుండును అతీంద్రియ మహోన్నత ఫలప్రాప్తికి తపస్సులే సాధనములు దీక్షితపశ్చర్యావ్రత నియమాదుల చే గాని, అట్టి ఉత్తమ ప్రయోజనము సిద్ధింపదు అట్టి స్వార్థసిద్ధిని అపేక్షించువాడు ప్రకృతమున వాల్మీకి అయన అభిలషించెడి స్వార్థసిద్ధి ఏది యగును? ఆయన వీతరాగుడు దీక్షితపశ్చర్యాది విధులచే అతడు స్వార్థసిద్ధిని, అనగా పరమార్థసిద్ధిని పొందగలిగినాడు అనగా దీనివలన ఆయన పూర్వము సలిపిన దీక్షితపశ్చర్యావిధి స్మారిత మగుచున్నది. ఇక ప్రకృతమున అయన అభిలషించెడి స్వార్థసిద్ధి ఏది?

శ్రీరాముని సీతతో గూర్చుటయే ఆయన తపఃఫలము ప్రకృత కథాభాగము ననుసరించి ఆయన జేసిన తపస్సు ఎట్టిది? ఆయన కులపతి. తన వలె తపోనిష్ఠాగరిష్ఠులైన శిష్యులే మూర్తీభవించిన తపస్స్వరూపులు అట్టివారిని పంపి తపస్వినకు ధ్యేయభూత యగు సీతాదేవిని తన కడకు రప్పించుకొనెను దీనినిబట్టి సీతాదేవిని ప్రకృత క్లిష్ట పరిస్థితులలో అయోధ్యకు రప్పించుట మహాతపస్సాధ్యకృత్యముగా కవి భావించెను ఏ అయోధ్యాపురవాసులు తన శీలమును శంకించిరో, అట్టివారి యెదుట సీతను సీతనుగా నిలబెట్టవలెను తన పాతివ్రత్యము నిరూపించుకొనుట కామెచే నంగీకరింపజేయవలెను లోకస్వాభావికదృష్టితో పరిశీలించిన, ఇది యామెకు రెండవ యగ్నిపరీక్ష స్త్రీ సహజసిద్ధమైన స్వభావ దృష్టితో చూచిన, ఆ స్త్రీహృదయ మెంత క్షుభితమై ఉద్విగ్న మగునో, పరావరజ్ఞుడు, ఇతరేంగితజ్ఞుడు, మహాకవియు నగు వాల్మీకి కీ విషయము తెలియనిది కాదు అయినను, జానకీహృదయము తా నెరుగును తాను స్వయముగా ఆజ్ఞాపించుట వేరు, శిష్యుల ద్వారా సందేశ మంపుట వేరు ఆ శిష్యు లామెకు విశ్వాసము గూర్చు మహాత్ములు కావలెను.

అందుచే మూర్తీభవించిన తపోమూర్తులో యనునట్లు భాసించెడి మహార్షులనే వాల్మీకి పంపినట్లు కవి వర్ణించుట ఎంతయు సమంజసము

ఈ విషయ మింకను తాత్త్వికదృష్టితో పరిశీలింపవలసియున్నది

"తమర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి"
కుమారసంభవం

"పరమార్థస్వరూపుడైన శివుని పార్వతితో యోజనము చేయుట యుక్తము" అని అంగిరసముఖమున సప్తర్షులు హిమవంతుని కోరిరి, ఒప్పించిరి శివ పార్వతీసమాగమమునకు కారణులై చరితార్థులైరి

విశ్వామిత్రుడు శ్రీరాముని జానకితో యోజన చేసి తన విశ్వామిత్ర నామమును (విశ్వస్య మిత్రం) సార్థకముచేసికొనెను అట్టి సీతారాములను విడదీసి రావణుడు తన లోకకంటకత్వమును సార్థకము చేసికొనెను అపు డగ్నిశుద్ధి సీతాసమాగమమునకు కారణ మయ్యెను. మరల ఇపుడు లోకాపవాద మనెడి దుష్ట రాక్షసశక్తి సీతారాములకు వియోగమును కల్పించెను వాల్మీకి యనెడి దివ్యతపశ్శక్తి సీతారామ సమాగమసంధాయక మయ్యెను శ్రీరాముని సీతతో గూర్చుట యనగా, మహాత్ముల దృష్టిలో పరమార్థమును వేదవాక్కుతో యోజన జెయుటయే పార్వతీపరమేశ్వరసమాగమము సీతారామసమాగమము భారతీపరబ్రహ్మ సమాగమమే

"తమర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి"

అను సూక్తిద్వారా సాధకు లెల్లరు తమ వాక్కును (బుద్ధిని) పరమేశ్వరునితో యోజన చేసికొనవలయు నని కాళిదాసమహాకవి ఉపదేశించినట్లు

సూచిత మగుచున్నది ప్రకృతమున, బ్రహ్మవిద్యారూపిణి యైన సీతను తల్లక్ష్యభూతుడైన శ్రీరామునితో యోజన చేయుట వాల్మీకిమహర్షి తపస్సాధనకు లక్ష్యభూతిమే అగుచున్నది

తరువాత మంత్రద్రష్ట యగు వాల్మీకిమహర్షి మంత్రప్రతిపాద్య దేవతాతత్త్వమును దర్శించిన రీతిని కాళిదాసమహాకవి ఈ క్రింది శ్లోక ముఖమున వివరించుచున్నాడు

"స్వరసంస్కారవత్యాసౌ పుత్రాభ్యా మథ సీతయా ।
ఋచేవోదర్చిషం సూర్యం రామం ముని రుపస్థితః॥
(రఘు 15 76)

ఈ శ్లోకమున పుత్రసహితయైన సీతను శ్రీరాముని సన్నిధికి వాల్మీకి కొనిపోయిన విధము వర్ణింపబడుచున్నది

"స్వరసంస్కారములు గలిగిన సవితృదేవతాకమైన ఋక్కుతో ఉదయించెడి సూర్యుని కభిముఖముగ ధ్యానపరాయణుడై నిలచినట్లు కుశలవసహితయగు సీతతో కూడి వాల్మీకి సూర్యునివలె తేజరిల్లుచున్న శ్రీరాముని యెదుట ధ్యానపరాయణుడై నిలచెను' అని శ్లోక తాత్పర్యము

సవితృదేవతాస్వరూపప్రతిపాదకమైన ఋక్కు గాయత్రి అట్టి గాయత్రిస్వరూపిణి సీత సీతకు ధ్యేయవస్తువు శ్రీరాముడు. సవితృ దేవతాస్వరూపుడు అట్టి సీతతో రాముని వద్దకు వచ్చుట యన, గాయత్రీ మహామంత్రముతో సవితృదేవతాప్రస్థానము చేయుటయే ప్రకృతము వాల్మీకి యొక్క భావనాలక్ష్య మిదియే యని కవి గుర్తింపజెయుచున్నాడు

మేఘసందేశము   వాల్మీకిప్రస్తావన

"రత్నచ్ఛాయా వ్యతికర ఇవ ప్రేక్ష్య మేత త్పురస్తా ।
ద్వల్మీకాగ్రా త్ప్రభవతి ధనుఃఖండ మాఖండలస్య॥''
(మేఘసం దేశ. 1 15)

''వివిధ రత్నకాంతుల కలయిక వలె వల్మీక వివరము నుండి ఎదురుగా, ఆవిర్భవించుచున్న ఇంద్రధనుః ఖండము ప్రేక్షణీయమై యొప్పుచున్నది ''

ఆకాశమున దోచు ఇంద్రధనుఃఖండము వల్మీకాగ్రమునుండి పుట్టుచున్నటుల కవి వర్ణించుటలోని ఔచిత్యమేమి? ఈ విషయమును పరిశీలింతము

''వల్మీకాగ్రా త్ప్రభవతి" అని యనుచు కాళిదాసు వల్మీక సంభవుడుగా ప్రసిద్ధి గాంచిన కవికులపతి యగు వాల్మీకిని ఇంద్రధనుః ఖండము వలె వివిధ దీప్తులతో విరాజిల్లు దివ్యతేజోమయునిగా స్మరింప జేయుచున్నాడా యను భావము సహృదయులకు భాసించుటలో అసామంజస్య మేమియు నుండదు కనుకనే కవులు వల్మీక సంభవుడైన వాల్మీకిని వల్మీకము నుండి ప్రాదుర్భవించెడి ఇంద్రధనుస్సుతో పోల్చుటయు కన్పట్టు చున్నది

''విహిత ఘనాలంకారం విచిత్ర వర్ణావళీమయస్ఫురణమ్ ।
శక్రాయుధ మివ వక్రం వల్మీకిభువం మునిం నౌమి''॥
(సుభాషితరత్నభాండాగారమ్)

వాల్మీకమహర్షి శక్రాయుధము వలె వక్రుడట। ఇంద్రధనుస్సు వక్రముగా నుండుట ప్రసిద్ధము వాల్మీకి ఎక్షమున వక్రోక్తికుశలు డని అర్థము అనగా ఎంత గంభీరార్థము నైనను సహృదయ హృదయ రంజకముగ కాంతాసంమితముగ బోధింపగలవా డని భావము

కాళిదాసు వల్మీకోత్థిత ఇంద్రచాపము వలె తేజరిల్లువా డని వర్ణింపగా ఈ కవి ఇంద్రచాపము యొక్క వక్రస్థితిని పురస్కరించుకొని వాల్మీకిని ఇంద్రధనూరూపమున దర్శించను

కాళిదాసమహకవి ఇంద్రధనుస్సును వల్మీకప్రభవ మని చెప్పుట లోని ఆంతర్యము గమనింపదగినది

ఇంద్రధనుస్సు యొక్క ఉత్పత్తివిషయమై వరాహమిహిరాచార్యు లిట్లు చెప్పుచున్నారు.

"సూర్యస్య వివిధవర్ణాః పవనేన విఘట్టితాః కిరాః సాభ్రే।
వియతి ధనుస్సంస్థానా యే దృశ్యంతే త దింద్రధనుః॥"

"కేచి దనంత కులోరగ నిఃశ్వాసోద్భూత మాహు రాచార్యాః"

"ఇంద్రచాపం కిల వల్మీకాంత ర్వ్యవస్థిత మహానాగ
శిరోమణి కిరణసమూహా త్సముత్పద్యతే॥"

(మేఘసందేశ M R Kale Edition)

సూర్యుని యొక్క వివిధవర్ణములు గల కిరణములు పవనముచే సంఘట్టితములై మేఘావృతమైన ఆకాశమున ధనూరూపమున గన్పట్టును. అదియే ఇంద్రధనుస్సు. అనంతాది మహానాగముల కోవకు చెందిన

మహాసర్పముల యొక్క నిఃశ్వాసముల వలన ఇంద్రధనుస్సు ఏర్పడు నని ఆచార్యులు కొందరు చెప్పుచున్నారు

వల్మీకములో నుండెడి మహానాగ శిరోమణి కిరణసమూహము నుండి ఇంద్రధనుస్సు పుట్టు నని కొందరి అభిప్రాయము

కనుక ఇంద్రధనుస్సు వల్మీకవివరము నుండి పుట్టు నను సంప్రదాయ మున్నట్లు పై వచనముల వలన తెలియును ఈ సంప్రదాయము దృష్టియం దుంచుకొనియే కాళిదాసు వర్ణించినట్లు తెలియ గలము

ఇంద్రధనుస్సు యొక్క ఉత్పత్తిని అఖ్యాయికారూపమున శ్రుతి యిట్లు చెప్పుచున్నది

"దివ్య స్యైకా ధను రార్త్నిః। పృథివ్యా మపరా శ్రితా। తస్యేంద్రో వమ్రిరూపేణ। ధనుర్జ్యా మచ్ఛిన త్స్వయమ్। త దింద్రధను రిత్యజ్యమ్। అభ్రవర్ణేషు చక్షతే। ఏత దేవ శంయో ర్బార్హస్పత్యస్య। ఏత ద్రుద్రస్య ధనుః. (తై ఆ 1 5)

''అస్య విశ్వే(శ్వ) దేవ జిహ్వారూపస్య అరుణకేతుక న్యాగ్నేః ఏకా ధనురార్త్నిః ధనుషః ఊర్ధ్వకోటిః దివి శ్రితా। అపరా తు అధస్తనీ కోటిః పృథివ్యాం శ్రితా। వమ్రయః పిపీలికా సమానా జంతవః। యదీయ వమనా న్మృత్తికా ద్రవీక్రియతే। ఇంద్రో యథోక్త ధనుర్దర్శనేన భీత స్సన్ వమ్రిరూపేణాధః కోటిసమీపే స్థానే స్థిత్వా తస్యాః అరుణకేతుకాగ్నేః ధను ష్యవస్థితాం జ్యాం స్వయ మచ్ఛినత్ ;

యస్య ధనుషః జ్యా ఛిన్నా త త్తదెత దభిజ్ఞాః అభ్రవర్ణేషు మేఘస్థితప్రకాశేషు దృష్ట్వా ఇంద్రేణ ఛిన్నత్వాత్ జ్యారహిత మింద్రధను రిత్యాచక్షతే ।

ఈ వాక్యములు అరుణకేతుక చయన ప్రకరణము లోనివి ఇచట యజ్ఞదేవుడు అరుణకేతుకాగ్ని జ్యాసహిత మైన (అల్లెత్రాడుతో కూడిన) అయన ధనుస్సు పృథివ్యంతరిక్ష ద్యులోకము లందు వ్యాపించి యున్నది ఈ ధనుస్సును జూచి ఇంద్రుడు భయపడెను ఆ ధనుస్సు యొక్క ఉత్తరకోటి (చివరికొన) ద్యులోకమున కలదు అధఃకొటి పృథివియందు కలదు చెదపురుగు లని చెప్పబడెడి సూక్ష్మ కీటకములకు వమ్రము లని పేరు 'వమనశీలత్వా ద్వమ్రిః" అవి నిరంతరము భూరసమైన జలమును గ్రహించి వమనము జేయుచుండును వీనికి ఉపదీకాః అనియు శ్రౌతవ్యవహారము శ్రుతి ఉపదీకల యొక్క స్వభావము నిట్లు వివరించినది

''ఊర్జం వా ఏతం రసం పృథివ్యా ఉపదీకా ఉద్దిహంతి। య ద్వల్మీకమ్। య ద్వల్మీక వపాసంభారో భవతి। ఊర్జ మేవ రసం పృథివ్యా అవరుంధే। అథో శ్రోత మేవ శ్రోత్రం హ్యేష పృథివ్యాః। య ద్వల్మీకః। అబధిరో భవతి। య ఏవం వెద'' (తై బ్రా 1 1 3) "ఉపదీకాః పిపీలికాసమానాః ఆర్ద్రీకృత మృత్తికోపచయ క్షమాః జంతవః। తే హి పృథివ్యాసంబంధినం 'ఊర్క్' శబ్దాభిధేయం రసం పృథివ్యా స్సకాశాత్ ఊర్ధ్వ మానీయ ఉపచిన్వంతి। తత్సంభారేణ భూసారం ప్రాప్నోతి। అపి చ శ్రోత్రేంద్రియ సామర్థ్య మపి ప్రాప్నోతి। వల్మీకస్య పృథివీ శ్రోత్రత్వాత్॥ (సా భా.)

'ఊర్క్' అను పేరు గల భూసారరసమును పైకి తెచ్చి వమ్రములు శుష్కమైన భూప్రదేశమును ఆర్ద్రీకరించి (తడిపి) భూసారమును పెంపొందించుచున్నవి (భూసార ముద్ధిహంతీతి ఉపదీకాః) అట్లు వృద్ధి చెందిన భూభాగమే వల్మీకము శ్రోత్రేంద్రియాకారము కలిగి యుండుటచే వల్మీకము భూమి యొక్క శ్రోత్రము. వల్మీకమృత్తిక ఈ విధముగా భూదేవతా కర్ణస్థానీయ మగుచు కర్ణగత బాధిర్యాది దోషములను పోగొట్టుచున్నది" (అబధిరో భవతి)

ఇంద్రు డిట్టి వమ్రిరూపమును దాల్చెను భూమిని దాటి ధనుస్సు యొక్క అల్నేత్రాటిని కొరికెను. అందుచే ఆ ధనుస్సు జ్యారహిత మైనది. (అజ్య మైనది) వల్మీకగతుడై వమ్రిరూపమున ఇంద్రుడు అల్నేత్రాటిని కొరకగనే ఆకాశమున జలపూర్ణ మేఘము లందు వివిధ కాంతులతో ఆ ధనుస్సు ప్రకాశించును. ఇంద్రునిచే జ్యారహితముగా చేయబడిన ఆ ధనుస్సే ఇంద్రధనుస్సుగా ప్రసిద్ధ మగుచున్నది (తదింద్రధను రిత్యజ్యమ్) ఈ విషయము శతపథబ్రాహ్మణము 14 ' 1 7, తై. అ 5 1 మొదలగు చోట్ల వివరింపబడినది.

ఈ అఖ్యాయిక ననుసరించి ఉపవీకములకు నిలయము లైన వల్మీకములకు ఇంద్రధనుః ప్రాదుర్భావమునకు సంబంధ మున్నట్లు తెలియును, పై శ్రుతియందలి అఖ్యాయిక ఒకనాటిది కాదు సార్వకాలికము ఇంద్రధనుః ప్రాదుర్భావ మెప్పటి కప్పుడు జరుగుచునే యుండును ఇంద్రుడు వమ్రిరూపుడై (చెదపురుగు) జ్యాచ్ఛేదము చేయనిదే ఇంద్రధను వేర్పడ దని పై శ్రుతి వలన తెలియును. కాన ఇంద్రు డెప్పటి కప్పుడు వమ్రిరూపమును దాల్చి జ్యాచ్ఛేదము చేయుచునే యుండును కనుకనే నాటికిని నేటికిని ఇంద్రధను వని వ్యవహారము.

వమ్రుల యొక్క శరీరము భూసార జలమయము (శ బ్రా 14 1 7) సూర్యకిరణములు వల్మీకవివరముల జొచ్చి జలమయములైన వమ్రి శరీరముల దాకి స్వకృతము వాయుసంఘట్టితము లగుచు జలపూర్ణ మేఘము లందు ప్రతిఫలించి ఆకాశమున ఇంద్రధనూరూపమున ప్రకాశించుచున్నవి ఈ శ్రౌతసంప్రదాయమును దృష్టి యందుంచు కొనియే పేదవిదు డగు కాళిదాసు "వల్మీకాగ్రా త్ప్రభవతి ధనుఃఖండ మాండలస్య'' అని వైజ్ఞానికదృష్టితో ప్రయోగించినాడు ఇచట ''వల్మీకాగ్రాత్ వాయులు రు వివరాత'' అను శ్రీ మల్లినాధసూరి వ్యాఖ్యానము ఎంతయు సమంజసముగానున్నది వల్మీకవివరముల నుండి ఇంద్రధనుస్సు పుట్టుట యను నీ విషయము నింకను విజ్ఞులు పరిశీలింతురు గాక.

వమ్రులు (చెదపురుగు) వర్ష సూచక మగు ఇంద్రధనుఃప్రాదుర్భావమునకు కారణ మగుచు లోకమును సుభిక్షముగా జేయు పారమైశ్వర్య సంపద గలిగి యున్నవి కనుకనే వానిని ఇంద్రరూపముగ దర్శింపవలయు నని శ్రుతి యుపదేశము

ఇంద్రుడు దన పారమైశ్వర్యశక్తి సంపన్నుడు ఇంద్రరూపములై పారమైశ్వర్యశక్తిసంపద గల వమ్రులచే రూపొందింప బడునది వల్మీకము అట్టి వల్మీకము భూసారరూపము భూసారరూప మగు వల్మీకము నుండి యావిర్భవించిన వాల్మీకియు పారమైశ్వర్యశక్తి సంపన్నుడు, ఇంద్రధనుస్సు వలె దివ్యతేజోరూపు డని తెలియుచున్నది.

సీతయు మంత్రపూతమై పవిత్రమైన యజ్ఞభూమి యందు ఆవిర్భవించినది వల్మీకము వలె యజ్ఞభూమియు పారమైశ్వర్యశక్తి సంపన్న మైన పవిత్రక్షేత్రము శ్రుతియు యజ్ఞ భూమిని "పృథివీం

జీవదానుమ్'' (వా సం 1 28) అని వర్ణించినది ఈ సదములను మహీధరు డిట్లు వ్యాఖ్యానించినాడు

"దేవాః జీవదాను ః జీవం దదాతీతి జీవదానుః తాం ।
జీవస్య దాత్రీం సారభూతాం పృథివీమ్॥''

ఇచట ప్రకరణము ననుసరించి పృథివీపదము యజ్ఞ భూమి వాచకము యజ్ఞభూమి జీవధానువు ''జీవనదాత్రి యని యర్థము ఇంద్రధనుః ప్రేరకములై సువృష్టికి కారణభూతము లగుచు అన్నహేతువు లగు వమ్రులును జీవదానువులే (జీవనప్రదాత లే). అట్టి వమ్రుల నుండి యేర్పడు వల్మీకము గూడ పరోక్షముగ జీవ దానువే అట్టి వల్మీకము నుండి దివ్యప్రభలతో వెలయు ఇంద్రధనుస్సు వలె ఆవిర్భవించిన వాడు వాల్మీకి అట్లే జీవనప్రద మైన యజ్ఞభూమి నుండి స్వయంప్రభారూపిణియై యావిర్భవించిన దివ్యజాత సీత ఇట్లి ఉభయులును జీవనప్రద క్షేత్రముల నుండి యావిర్భవించిన తేజో మూర్తులు ఈ సాధర్మ్యమే సీతాచరితవర్ణనకై వాల్మీకికి ప్రేరణ కల్పించినది. కనుకనే వాల్మీకి మహార్షి తన రచనకు రామాయణ మనియే గాక "సీతాయా శ్చరితం మహత్'' అనియు ప్రత్యేకముగ నామకరణము జేసెను

మరియు నొక విశేషము రామాయణ రచన జేసి సీతాచరితమును వర్ణించుటయే గాక లోకాపవాదముచే పరిత్యక్తయైన యా తల్లిని తన యాశ్రమాలంకారభూతనుగా జేసికొని శ్రుతిమాతను వోలె యారాధించెను. సహధర్మచారిణియై సీత శ్రీరాము నారాధించుచునే వేదమాతగా బ్రహ్మ స్వరూపు డైన వాల్మీకి ననుగమించినది

"తాం దృష్ట్వా శ్రుతి మాయాంతీం బ్రహ్మాణ మనుగామినీమ్ ।
వాల్మీకేః పృష్ఠతః సీతాం సాధువాదో మహా నభూత్॥ "

(ఉత్తరరామా 96 11)

సీతావాల్మీకుల సాహచర్య మిట్టిది

"వల్మీకాగ్రా త్ప్రభూతం త ద్వైంద్రం ధను రివ జ్వలత్ ।
సీతావక్షన సంసక్తం మహః కిఎపి భావయే॥"

శ్రీరామ పూర్వతాపనీయోపనిషత్తు నందు శ్రీరామమాలామంత్ర ముపదేశింపబడి, పిదప శ్రీరామ మహయంత్రమున యోజన చేయవలసిన నామలేఖనక్రమము నిర్దేశింపబడినది అ క్రమమును వ్యాఖ్యాత లిట్లు వివరించిరి

ఇందు మొదట రామ లక్ష్మణాది నామములను, సుగ్రీవ విభీష ణాదుల నామములను జెప్పి, తరువాత ఋషుల నామక్రమము వివరింప బడినది

'నారదశ్చ వశిష్ఠశ్చ వామదేవ స్తృతీయకః ।
జాబాలో గౌతమశ్చాపి భరద్వాజో௨థ కశ్యపః॥
వాల్మీకి శ్చాష్టమః ప్రోక్తః లక్ష్మీ శ్చాద సరిస్వలు"

రామపూర్వతాపనీయోపనిషత్ 9 ఖండ

నారాయణదీపిక వ్యాఖ్య

శ్రీరామమహయంత్రమున ఉపాస్యపురుషులలో వాల్మీకియు పరిగ ణింపబడినాడు.

తరువాత ఇంకను వాల్మీకి అర్చనీయులగు ద్వాదశ మహర్షులలో ఒకడుగా కీర్తింపబడుచున్నాడు

"వశిష్ఠాద్యై ర్మునిభి ర్నీలముఖ్యై రారాధయే ద్రాఘవం
చందనాద్యైః" (రామ పూర్వతా ఉ 10 ఖం 7)

వశిష్ఠాద్యై రితి। వశిష్ఠ వామదెవ జాబాల గౌతమ భరద్వాజ కౌశిక వాల్మీకి నారద సనక సనందన సనాతన సనత్కుమారాః ద్వాదశ।

"కమండలుధరాన్ సర్వాన్ మంత్ర ముచ్చరతో మునీన్
ద్వాదశాద్యైఒర్చయే త్పూర్వాదిక్రమేణ చ తత్పరాన్"
(నారాయణవిరచిత దీపికావ్యాఖ్య)

ఇంకను ఈ విషయమే 6వ ఖండమున చెప్పబడినది

వాల్మీకి నిగమాంత దేశికాచార్య ప్రశంస

"కవీనా ముశనా కవిః" (భగవద్గీత 10 37)

ఇచట శ్రీ నిగమాంతదేశికు లిట్లు వ్యాఖ్యానించిరి

"కవీనా మితి। న నిబంధృత్వం వివక్షితమ్। తథా సతి వాల్మీకి ప్రభృతే స్సర్వాతిశాయిత్వాత్। అతః క్రాంతదర్శీ కవి రితి వివక్షితః।

ఇచట కవిశబ్దమునకు క్రాంతదర్శిత్వ మనెడి యౌగికార్థము గ్రహింపవలె గాని, కావ్యనిబంధనకర్త యను నర్థము గ్రహింపరాదు. "నిబంధనకర్త" యను రూఢ్యర్థమును గ్రహించిన, అట్టి నిబంధనకర్తలగు వ్యాస వాల్మీకుల మించినవారెవరు? అని అర్థము.

దీనినిబట్టి కావ్యనిబంధనకర్తలలో అగ్రేసరుడు వాల్మీకి యని వ్యాఖ్యాత యభిప్రాయము

అట్లగుచో, ఎశిష్ఠాగస్త్య వ్యాస వాల్మీకాదులకు క్రాంతదర్శిత్వము లేదని గాదు, పై భగవద్గీతావచనము శుక్రప్రశంసారూపము మాత్రమే 'ఏకస్య ప్రశంసా అన్యేషాం నిందాయాం న పర్యవస్యతి'

సూతసంహిత వల్మీకక్షేత్రప్రశంస

సూతసంహిత ముక్తిఖండ మందు వేదారణ్యక్షేత్రవైభవమును వర్ణించుచు అది శివస్థానమైన వల్మీక క్షేత్రమునకు దక్షిణముగా సముద్ర తీరమున మన్నట్లు స్థలనిర్దేశము చేయబడినది.

ఈశ్వర ఉవాచ .

"వదామి తవ విష్ణో శ్రీ వేదారణ్యస్య వైభవమ్ ।
అతీవ శ్రద్ధయా సార్ధం శృణు సర్వజగద్ధితమ్ ॥
శ్రీమద్వల్మీకసంజ్ఞస్య మమ స్థానస్య దక్షిణే ।
సముద్రతీరే మద్భక్తై రఖిలై రావృతం సదా ॥"

(సూతసం ముక్తిఖండ 3 68, 69)

అట్లే ముక్తిఖండమున మరి యొకచోట కూడ వల్మీక క్షేత్రము కాశీ. శ్రీకాళహస్తి శ్రీశైల వృద్ధాచలపుండరీకపురక్షేత్ర వేదారణ్యాదుల వలె పవిత్రక్షేత్ర మని వర్ణింపబడినది

"దేవతానా మహం ముఖ్యః స్థానానాం సురసత్తమాః ।
మమ స్థానాని ముఖ్యాని తేషాం వారాణసీ తథా ॥
శ్రీకాళహస్తి శైలాఖ్యం శ్రీమ ద్వృద్ధాచలాభిధం ।
పుండరీకపురం తద్వ చ్ఛ్రీమద్వల్మీక ముత్తమమ్ ॥"

ఈ సూతపురాణవచనముల ననుసరించి వల్మీకక్షేత్రము సుప్రసిద్ధ మహాక్షేత్రములలో ఒకటి యని లెలియును బహుశః వాల్మీకిమహర్షి గాని, ఆయన తండ్రిగా చెప్పబడెడి వల్మీకమహర్షిగాని, తపస్సు చార బోసిన క్షేత్ర మగుటచే ఈ క్షేత్రము వల్మీకక్షేత్రముగా ప్రసిద్ధి జెందిన దేమో, క్షేత్రపురాణమాహాత్మ్యదులు పరిశీలించినగాని, ఈ విషయము తెలియబడదు

## వాల్మీకి చిత్రకూటాశ్రమము

భరద్వాజుని ఆదేశముపై సీతాలక్ష్మణ సమేతుడై శ్రీరాముడు చిత్ర కూటమున కేతెంచెను బహుపుష్ప ఫలపూర్ణ వృక్షములతో శోభిల్లెడి యా చిత్రకూటము శ్రీరాముని హృదయమును రంజింపజేసెను ఇదియే సుఖ నివాసయోగ్యస్థాన మని నిర్ణయించుకొనిరి అంతట నటగల వాల్మీకా శ్రమమునకు బోయి ఆ మహర్షి యాశీస్సుల నందుకొనిరి

"బహుమూల ఫలో రమ్యో స్వాజీవః ప్రతిభాతి మే।
మునయశ్చ మహాత్మానో వసంత్యస్మిన్ శిలోచ్చయే॥

అయం వాసో భవే త్తావ దత్ర సౌమ్య రమేమహి ।
ఇతి సీతా చ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః॥

అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్ ।
తాన్ మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్॥

అస్యతా మితి చోవచ స్వాగతం తం నివేద్య చ ।
తతోఽబ్రవీ న్మహాబాహు ర్లక్ష్మణం లక్ష్మణాగ్రజః॥

సంనివేద్య యథాన్యాయ మాత్మాన మృషయె ప్రభుః ।
లక్ష్మణానయ దారూణి దృఢాని చ వరాణి చ॥

(అయోధ్య 56 15 to 20)

సీతారామలక్ష్మణులు వాల్మీకిమహర్షి ఆశీస్సులతో అచటనే ఆశ్రమము నిర్మించికొనినట్లు తెలియుచున్నది దీనివలన వాల్మీకియాశ్రమము మొదట చిత్రకూటము నందు గలదనియు, తరువాత కొంతకాలమునకు మహర్షి తమసానదీ తీరమున నున్నట్లును రామాయణము వలన తెలియును.

"తదానీం చిత్రకూటే వాల్మీకేర్వాసః భరతాగమనానంతరం ఋషినిర్గమన కథనాత్ తతః ప్రభృతి తమసాతీర ఇతి జ్ఞేయమ్ అతో న బాలకాండ కథావిరోధః" (గోవిందరాజీయ)

వాల్మీకి ప్రవృత్తి ఉదాత్త గంభీరము

"వాల్మీకివ త్తే నిభృతం స్వవీర్యం" భారత ఆదిప 55 14

"జనమెజయ మహారాజా। వాల్మీకి యొక్క మహానుభావము వలె నీ మహత్త్వమును అత్యంత నిగూఢము ప్రకటము గాదు" అని ఆస్తీకుడు సర్పయాగమున జనమేజయుని ప్రశంసించుచున్నాడు వాల్మీకియు తన మహాత్త్వమును ప్రకటించుకొనినట్లు రామాయణమున నెక్కడనుకానరాదు.

అందుకనియేగాబోలు, తన వృత్తాంతమును సూచనాప్రాయమున సూచించె నేగాని ఇదమిత్థమని ఎచ్చటను చెప్పికొనలేదు కనుకనే చిత్రకూటమున శ్రీరాముని కడకు భరతుడు వశిష్ఠాదులతో గూడి వచ్చినపుడు, అచట సన్నివేశము తన యాశ్రమముననే జరిగినను ఆ మహర్షిప్రసక్తి ఎచటను గానరాదు.

కోశములు వాల్మీకి వివిధ నామములు

"వాల్మీకో వాల్మికః ప్రోక్తో వాల్మీకి రపి వాల్మికిః" ఇతి తారపాలః। అమరకోశవ్యాఖ్య యైన గురుబాలప్రబోధిక యందు పై నిఘంటు వాక్య ముదాహరింప బడినది దీనినిబట్టి మహర్షికి

1) వాల్మీకః 2) వాల్మికః 3, వాల్మీకిః 4) వాల్మికిః అను నామము లున్నట్లు తెలియుచున్నది

అమరకోశవ్యాఖ్య యగు అమరసుధాటిప్పణి యందు వల్మీకశబ్దమే వాల్మీకవాచకముగా చెప్పబడినది

"వాల్మీకౌ ప్రాచేతసే" యథా

"పీయూషమేవ నాళీకం వల్మీకస్య కవేర్గిరి' ఇత్యనేకార్థ కైరవాకర కౌముదీ

"వల్మీకకవి యొక్క వాక్కునందు అమృతమే తప్ప మరి యొందు లేదు ఇది యసత్యము (న అలీకం) గాదు" అని యర్థము

దీనివలన వాల్మీకికి "వల్మీకః' అని ప్రసిద్ధియు ఉన్నట్లు కన్పట్టుచున్నది విశ్వకోశమునందును వల్మీక శబ్దము వాల్మీకినామముగా కన్పట్టుచున్నది.

"వల్మీకో వామలూరౌ స్యా న్మునిరాగవిశేషయోః"

(విశ్వకోశ కాంత త్రివర్ణ. 974)

హేమచంద్రాచార్య విరచితమైన అభిధానచింతామణి యను కోశమునందు వాల్మీకినామము లిట్లు నిర్దేశింపబడినవి

"ప్రాచేతసస్తు వాల్మీకి ర్వల్మీక భుజనా కవిః, మైత్రావరుణ వాల్మికో"

(అభిధానచింతామణి 3 10)

ప్రాచేతసః వాల్మీకిః వల్మీకః కుశీ కవిః మైత్రావరుణ వాల్మిక అను నామములు పై కోశమున గలవు

అగస్త్యునకు వలెనే వాల్మీకికి గూడ 'మైత్రావరుణః, మైత్రావరుణి' అను నామములు కోశములందు కన్పించుచున్నవి

ఇంతవరకు వాల్మీకికి గల నామముల యౌచిత్యము ననుసరించియు, రామాయణ భారత కావ్యాదులందు గల వాల్మీకి యొక్క ప్రశస్తి ననుసరించియు వ్యాఖ్యాతల యొక్క తాత్పర్యము ననుసరించియు కోశముల ననుసరించియు ఈ విషయములు తెలియుచున్నవి.

1 వాల్మీకి ప్రచేతసుని యొక్క (వరుణుని యొక్క) దశమ పుత్రుడు అనగా, పదియవ తరమువాడు వల్మీక మహర్షి యొక్క పుత్రుడు. భృగువంశజుడు గాన, భార్గవుడు బ్రహ్మావతార రూపుడు

2. మంత్రద్రష్ట, కులపతి, దేశికుడు, దీక్షితపశ్చర్యావిభూషితుడు వేదభూషుడు, వివిధశాస్త్రకళాకోవిదుడు, కవికులగురువు, ఆది

కవి, పురాణఋషి, అనగా, వశిష్ఠాదుల వలె పురాణఋషికోటికి చేరినవాడు తొలిసారిగా కవితాశాఖ నధిరోహించిన కవికోకిల.

3. కావ్యపురాణేతిహాసాదుల రచనలకు బాటలు వేసిన మార్గదర్శి రామాయణమహాకావ్యమును రచించి ఆ కావ్యనాయికా నాయకుల సీతారాముల యోజనకై తపస్సు జేసి కృతార్థుడైన ప్రియాశూడుడు తన కావ్యమునందు తాను ప్రధానపాత్రగా నటించి వ్యాసుని కాదంబ్యప్రాయుడై నిలచిన మహాశిల్పి

4 వేదవిహిత గురుశుశ్రూషాసంప్రదాయమును పాటించి, గుర్వాశీర్వాదముతో పితామహుని అనుగ్రహముతో తన రామాయణ మహాకావ్యము నాచంద్రార్కము వెలయింపజేసిన ధన్యజీవి చిరస్మరణీయుడు ప్రాతఃస్మరణీయుడు సదావంద్యుడైన జగద్గురువు

5. వేదావతారరూపమై అమృతలహరియై నిత్యపారాయణగ్రన్థమై భవతారకమైన రామాయణ మహాకావ్యమును లోకమున కనుగ్రహించిన ఆ దివ్యజ్యోతిని లోక మిట్లు గానము చేయుచున్నది.

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వ న్రామకథానాదం కో న యాతి పరాం గతిమ్॥

వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ ।
శ్రీమద్రామాయణీ గంగా పునాతి భువనత్రయమ్॥

కవీన్ద్రం నౌమి వాల్మీకిం యస్య రామాయణీం కథామ్ ।
చన్ద్రికా మివ చిన్వన్తి చకోరా ఇవ సాధవః॥

సదూషణాఽపి నిర్దోషా సఖరాఽపి సుకోమలా ।
నమ స్తస్మై కృతా యేన రమ్యా రామాయణీ కథా॥

యోగీన్ద్ర శ్ఛందసాం స్రష్టా రామాయణ మహాకవిః
వల్మీకజన్మా జయతి ప్రాచ్యః ప్రాచేతసో మునిః॥

ఆదికవీ చతురాస్యౌ కమలజ వల్మీకజౌ వన్దే ।
లోక శ్లోక విధాత్రో ర్యయో ర్భిదా లేశమాత్రేణ॥

త మృషిం మనుష్యలోక ప్రవేశ విశ్రామశాఖినం వాచామ్ ।
సురలోకా దవతార ప్రాంతర షదచ్ఛిదం వన్దే॥

ఇంతవరకు శ్రీమద్రామాయణ భారతములు, పురాణములు, తద్వ్యాఖ్యానముల నాధారముజేసికొని వాల్మీకి యొక్క చరిత్రము వివరింపబడినది ఇపుడు ధర్మఖండమునం దుదాహరింపబడిన వాల్మీకిచరిత్ర మిట పొందుపరచబడుచున్నది.

విజయుడను నిషాదు డొకడు గలడు అతడు క్రూరుడై చౌర్యవృత్తి నవలంబించి దారి కాచియుండెను అతని పూర్వజన్మ సుకృత పరిపాక వశమున నాతనికి వసిష్ఠాది మునిపుంగవులు గోచరించి సదుపదేశము చేయగా నాతనికి తన దుర్వృత్తిమీద హేయభావ ముదయించెను. సంసారమునందు విరక్తి గలిగెను తనకేదైన నొక మంత్ర ముపదేశించి తరింపజేయుడని వారిని నిర్బంధించెను. అంతట వసిష్ఠు డీతనికి మంత్రోపదేశము చేయు విధానమేది యని యాలోచించి తుదకు వ్యత్యస్త రామమంత్ర ముపదేశించెను

మంత్రోపదేశము బొందిన యా నిషాదుడు సంశుద్ధాత్ముడై విరక్తితో సర్వమును త్యజించి నిస్సంగభావముతో ప్రారబ్ధాశుభ కర్మ సంహతి తొలగునట్లుగా తీవ్ర తపశ్చర్యకు బూనుకొనెను. నియమనిష్ఠలతో నాతడు తపముసల్ప శిరమున పక్షులు గూళ్ళిడెను. మృగములు శృంగములతో గ్రుమ్మి మేను నొరసికొనెను మశకములు, చీమలు, మక్షికములు కరచి రక్తమాంసములు గ్రోల జర్జరిత గాత్రుడయ్యెను. అయినను కొండవలె కదలడు, మెదలడు. శ్రీరామ మంత్రార్పితాత్ముడై యాతడట్లు తపము సేయ బెక్కు వత్సరములు యుగములు గడచెను. ఆతని ఘోరతపము జూచి భీతుడైన యింద్రుని జూచి బృహస్పతి యిట్లనెను.

తే గీ. అతని కత నీకు భయమేల యమరరాజ!
అతడు వల్మీకమున బుట్టి యతుల తేజ
మమరి వాల్మీకి యనగ బ్రహ్మర్షి యగుచు
వెలసి రామాయణము సేయగలడు సుమ్మి

వ. అది విని యింద్రుం డిట్లనియె.

ఆ. తనదు మేనితోడ మనుజు డచ్చెరువుగ
నెట్లు పుట్టబుట్టు నదియు గాక
బహుళజన్మ దుర్లభంబగు విప్రత్వ
మెట్లు గలుగు నతని కెఱుగ జెపుమ.

వ. అది విని యా బృహస్పతి యిట్లనియె.

ఉ. చీమలు పాము లీగలును జేరగ జెందగరాని యట్లుగా
నా మహితాత్ము మేనిపయి నావరణంబుగ నొక్కపుట్ట శ్రీ
రాము దొనర్చు భక్తజనరక్షణ దక్షుడు గాన వాత వ
ర్షామితబాధ నొంద కతడందు వసించు ననేక వర్షముల్.

తే. గీ. అతడు కారణదేహపర్యంత మట్ల
దగ్ధకల్మషుడై యందు దపము సల్పి
యంత బ్రహ్మర దివ్యదేహంబు దాల్చి
పుట్టు బ్రహ్మర్షి యగుచు నప్పుట్ట యందు

తే గీ వన్నెలెక్కువ హేమంబు వహ్నియోగ
మహిమ గుందన మగుగతి మహితరామ
మను జపంబున నఘకదంబముల దోలి
యా పుళిందుడు ద్విజుడగు నమరవర్య !"

ఇట్లా నిషాదుడు తపము సేయుచుండ ననేక మన్వంతరములు గడచెను అంత నొకప్పుడు నారదపురస్కృతులై వసిష్ఠాదులా వల్మీక ప్రాంతమున కరిగి చిరకాలావృతమైన యా పుట్టను త్రవ్వి యందు జటాపటలాభిశోభితుడు శ్రీరామ మంత్రార్పితాత్ముడు, బ్రహ్మతేజోవిలాస సంశోభితుడు నగు మునివరు నొకని గాంచిరి. ఎన్నో విధముల ప్రబోధించినను నాతడు వారి పలుకుల వినడయ్యెను. తుదకు వశిష్ఠుని వచనములచే ప్రబోధితుడై లేచి యభివాదనము జేసి యో గురూత్తమా ! మీ

దర్శనముచే పుణ్యాత్ముడ నైతినని పలికెను. తరువాతి కథ ధర్మఖండ మున నిట్లు గలదు.

వ. అని పల్కె నా సమయంబున భగవంతుండైన వసిష్ఠ మునీంద్రుం డతనికిం బ్రచేతసునిచేత వేదోక్త క్రమంబున జాతకర్మా ద్యఖిల సంస్కారంబులు సేయించి శ్రీపూర్వకంబుగా రామనామ మంత్రం బుపదేశించిన నవ్వాల్మీకియుం దపోవినిహత పూర్వదేహుం డును గృతకృత్యుండునై నిర్మలత్వంబున దేజరిల్లె యిట్లనియె"

ధర్మఖండము ఈదరపల్లి భవానీశంకరకవి యాంధ్రీకరణము

ఈ గ్రంథమున నింద్రబృహస్పతి సంవాదమున విజయునకు గల నిషాదశరీరము కారణ దేహపర్యంతము దగ్ధకిల్బిష మగును అంత నాతడు తిరిగి దివ్యదేహము దాల్చి ఆ పుట్టయందు బ్రహ్మర్షియై పుట్టును. ఇట్లాతడు ద్విజుడగును మరియు, "తపోవినిహత పూర్వదేహుడు" అను విశేషణము తపస్సునకు పూర్వము గల నిషాదశరీరము వేరు, తప శ్చర్యానంతరములబ్ధమైన బ్రహ్మర్షి దివ్యదేహము వేఱ. వన్నెతక్కువ బంగారము అగ్నిసంస్కారముచే కుందనమైనట్లు ఆ నిషాదుడు తపోవిశే షముచే బ్రహ్మర్షి యగుట యుక్తమే ననియు పై గ్రంథమున నుపపత్తి చూపబడినది. కావున, బ్రహ్మర్షియైన వాల్మీకి నిషాదుడని చెప్పెడివాదము పరాస్తమైనది

ఇట నీ యాఖ్యాయికలోని యౌచిత్యము నించుక పరిశీలింతము వసిష్ఠుడు నిషాదునిపై జాలిగొని మంత్ర ముపదేశించిన దేశికుడు, నిషాదు డును ఆ వసిష్ఠమహర్షి ని దేశికుడుగా గుర్తించి యభివాదనము చేసి కృత జ్ఞతను వెల్లడించుకొనుటయు పై గ్రంథమున వర్ణింపబడినది. అట్లు



దేశికస్థానమున నున్న వసిష్ఠమహర్షి ఆ నిషాదునకు వేదోక్తక్రమమున జాతకర్మాది సంస్కారముల జరిపించగలడు దేశికుడుగాన, జరిపించు టయు యుక్తము. అట్లు తాను చేయక ప్రచేతసునిచేత జాతకర్మాది సంస్కారములను జరిపించుటకు కారణమేమియో పై గ్రంథమున వివ రింపబడలేదు. సంస్కారము జరిగిన తరువాత తానే శ్రీకారం పూర్వక ముగా నా మహర్షికి రామనామ మంత్రమును ఉపదేశించెనట ఇందలి ఔచిత్యమేమియో తెలియదు. ప్రచేతసునిచేత సంస్కారములు చేయబడు టచే నా బ్రహ్మర్షికి 'ప్రాచేతసు' డని పేరు వచ్చినదని వీరి యభి ప్రాయము ఈ నిర్వచనమే యథార్థమగుచో "అహం ప్రచేతసః దశమః పుత్రః" అని పూర్వ ముదాహరింపబడిన ఉత్తరకాండ యందలి ప్రత్యక్ష వచనముతో విరోధము వచ్చును ఇది వాల్మీకి స్వయముగా తనను గూర్చి చెప్పికొనిన మాట. ప్రత్యక్ష వచనముతో విరోధము వచ్చినపుడు తదితర అప్రత్యక్ష వచనములను అప్రమాణము అని చెప్పుట శాస్త్ర సంప్రదాయము. మరియు, వాల్మీకికి రామాయణమునందు గన్పట్టు "భార్గ వేణ తపస్వినా" ఇత్యాది విశేషణములు వాల్మీకి భృగు వంశ సంజాతుడని స్పష్టముగా తెలియజేయుచుండ, వాల్మీకి మొదట నిషాదకుల సంభూతుడని చెప్పుట ఎట్లు పొసగునో విజ్ఞులు పరిశీలింతురు గాక. కావున, ధర్మఖండమందలి గాథ వాల్మీకిప్రోక్తమైన రామాయణ ముతో నీ విధముగా విరోధించుచున్నందున అగాధ నిర్మూలమని చెప్పుట సాహసము కాదేమో !

మరియు కొందరు విమర్శకులు ఇటీవల ప్రచురితమైన విజ్ఞాన సర్వస్వములో వాల్మీకి చరిత్రను పొందుపరచిరి. అందు వాల్మీకి జన్మతః బ్రాహ్మణుడు, పురాకృత కర్మవశమున కిరాతులతో కలసి కిరాత

వృత్తి నవలంబించి తుదకు సప్తర్షుల యనుగ్రహముచే వివేకము నొందెను అని కలదు. మిగిలిన కథ పై ధర్మఖండములోని కథతో సమానము. ఈ కథ వ్యాసకృత అధ్యాత్మరామాయణమున నున్నట్లు చెప్పబడెను. దీనినిబట్టి వాల్మీకి జన్మతః నిషాదుడు కాదని తెలియు చున్నది. పురాకృత కర్మవశమున నిషాదులతో కలిసి జీవించుట సంభ వమే యగును.

ఇక సంగ్రహ ఆంధ్రవిజ్ఞానకోశమున – నొక బోయ పాంథులను కొట్టి యరణ్యమున జీవించుచు, సప్తర్షుల యుపదేశముచే వివేకమునొంది నట్లు వ్రాయబడెను. మరియు నా విజ్ఞానకోశముననే తరువాత "వాల్మీకి భృగుగోత్ర సంజాతు డనియు, శ్రీమద్రామాయణము 24 ద్వాపర యుగమునాటి చరిత్ర యనియు తేలుచున్నది"యని వివరించబడినది

రామాయణ చరిత్రకాలము నిర్ణయించుటకు ఇది సమయముగాదు. దానిని విద్వాంసులు నిర్ణయింతురుగాక ; మొదట బోయగా చిత్రింపబడిన వ్యక్తియే తరువాత భృగువంశ గోత్ర సంజాతుడుగ కీర్తింపబడినాడు. వాల్మీకి మొదట నిషాదుడను గాధ పద్మపురాణములో నున్నట్లు ఉదాహ రింపబడినది, ఈ గాధ అధ్యాత్మ రామాయణములోని పై గాధతో విరో ధించుచున్నది. మరియు వాల్మీకికి గల భార్గవః, ప్రాచేతసః, వాల్మీకిః యను నామములు అతనికి గల మహర్షిత్వమును ధృవపరచుచున్నవి వీని నన్నిటిబట్టి పద్మపురాణములోని గాధను సమన్వయించ దగును. మొదట మునికుమారుడై పురాకృత కర్మవశమున నిషాదులలో జేరెనను టయే సంగతము, యుక్తిసహము నగుచున్నవి.

o

# 2. రామాయణము - నామౌచిత్యము

భారతీయ సంప్రదాయమున నామౌచిత్య విచారమునకు విశిష్టస్థాన మున్నది గ్రంథనామమే గ్రంథగత విషయమును ఆపాతతః తెలియ జేయుచుండును వ్యర్థ సాంకేతిక పదములతో గ్రంథమునకు నామకర ణము జేయుట సంప్రదాయజ్ఞులు నిరసింతురు ఇందులోను ఋషికర్తృక గ్రంథనామధేయములు సార్థకములు, నిరర్థకములు కావు. వానిని గూర్చి పర్యాలోచన చేయుట సాధకుల కెంతయు అవశ్యకము.

## రామాయణనామము అపౌరుషేయము

రామాయణము ఆదికావ్యమునకు నామముగా కీర్తింపబడినది ఆదికావ్యకర్త వాల్మీకి కాని, తన కావ్యమునకు నామము తాను చేయ లేదు బ్రహ్మచే నిర్దేశింపబడిన నామమునే వాల్మీకి ఆదరించినట్లు రామా యణమున గలదు. బ్రహ్మయు అప్పటి కప్పుడు నామకరణమునకు పూనుకొనలేదు అంతకుపూర్వమే రామాయణము శతకోటి ప్రవిస్తరమై బ్రహ్మలోకమునందును, అట్లే తదితర లోకములందును భిన్నభిన్న ప్రమా ణములతో ప్రసిద్ధమై యున్నట్లు పురాణేతిహాసాదుల యందు కన్పట్టును. కాన, వేదము వలె రామాయణనామము అపౌరుషేయము అందుచే వేద నామధేయము వలె రామాయణనామము కూడ అన్వర్థము, అర్థగాంభీర్య విలసితము, అనాదిసిద్ధము గూడ.

## రామాయణము వివిధ నామములం క్రమము

వేదమునకు వలె రామాయణమునకును అనేక నామములు కలవు ఒకే వస్తువునకు అనేక నామము లుండుటయు ఆ నామము లన్వర్థము లగుటయు సంస్కృతభాషా సంప్రదాయము. ఈ భిన్న భిన్న నామధేయములు ఒకే వస్తువు యొక్క భిన్న భిన్న స్వరూప స్వభావముల నభివ్యక్తము జేయుచుండును ఉదాహరణకు పరభృత కాక శబ్దములను జూతము.

“పరభృతము” అని కోకిలకు పేరు. కోకిలలు తమ బిడ్డలను తాము పెంచవు. వాటిని పెంచునది, పోషించునది కాకులు కావున కోకిలకు 'పరభృతము' అని సార్థకనామము. ఇట్లు యితరు పక్షులను పెంచు స్వభావము కలవి యగుటచే కాకికి “పరభృత్” అను నామము ప్రసిద్ధము. మరియు కాకికి “బలిభుక్ బలిపుష్టః” అను పేరులు కలవు, భారతీయ సంప్రదాయము ననుసరించి “గృహములలో వేయు బలులను తినునవి, వాని ద్వారా వర్ధిల్లునవి” కాన “బలిభుక్, బలిపుష్టః” అను నామములచే ప్రసిద్ధమైనవి. ఈ పదములు అనాది సిద్ధమైన భూతబలి వెయు సంప్రదాయమును స్మరింపజేయుచుండును. భూతబలితో వివిధ భూతములను తృప్తి యొనర్చుట ఈ సంప్రదాయోద్దేశ్యము

ఇక, 'కాక' పదమును చూతము. కాక అను శబ్దము 'కాక' అని అని వేయు ధ్వన్యనుకరణముగా మాత్రమే గ్రహింతురు. అందుచే “కరటః” అను నామము [క ఇతి రటతీతి] వచ్చిన దనియు చెప్పుదురు

కాని, ఇంతమాత్రమే గాదు. "కం" అనగా "బ్రహ్మ"యను నర్థము ఉప నిషత్తులయందు, ప్రసిద్ధము అమరకోశము కూడ 'క' శబ్దము ఆత్మార్థ కము కూడ నగునని వివరించినది

"మారుతే వేధసి బ్రధ్నే పుంసి కః" అని అమరము పుంసి ఆత్మని. 'క' శబ్దము ఆత్మార్థము నందుండు నని యర్థము. అనగా, క క. యనుచు నిరంతరము ఆత్మస్వరూపము నుద్ఘోషించుచుండును కనుకనే దానికి "ఆత్మఘోషః" అను నామము గూడ ప్రసిద్ధమైనది. ఇట్లెన్నియేని ఉదాహరణము లీయవచ్చును. కనుక 'కాక' అను శబ్దము కేవలము ధ్వన్యనుకరణమే గాదు, వాయసమునకు గల స్వరూప స్వభావ ములను తద్గత మహత్త్వమును దర్శింపజేయుచుండును కావుననే పితృ క్రియల యందు వాయసమున కంతటి పవిత్ర స్థాన మీయబడినది. దీని వలన సంస్కృతభాష యందు గల క్షుద్ర జంతువాచక శబ్దములు నయి తము పరిశీలకులకు తాత్త్వికార్థ స్ఫోరకములై పొడగట్టును కావున "రామాయణ"మను మహాసంజ్ఞ కేవలము సాంకేతికముగా గ్రహించుటకు వీలులేదు మహాసంజ్ఞలు అన్వర్థము లని వైయాకరణ దర్శన సంప్ర దాయము

రామాయణమునకు 1. రామాయణమ్ 2 సీతాయాః చరితం మహత్ 3. పౌలస్త్యవధమ్ అని మూడు నామధేయములు శ్రీమద్రా మాయణమున కన్పట్టుచున్నది. ఈ మూడును ఒకే యర్థమును బోధించుచున్నవా? బోధించుచో, పునరుక్తములే యగును. పునరుక్తము లైనచో వ్యర్థములేయగును. మహర్షి ప్రోక్త నామధేయములు నిరర్థకము

అనుట సాహసమే యగును అందుచే వీనియందు గల అర్థవైచిత్ర్యము ఈ నామధేయముల ద్వారా తెలియదగిన సంస్కార క్రమము దర్శింప వలసియున్నది.

## రామాయణమ్

బ్రహ్మ వాల్మీకిని రాముని చరితమును, రామకధను, రచించుమని ఉపదేశించినట్లు రామాయణమున కలదు.

"రామస్య చరితం సర్వం కురు త్వ మృషిసత్తమ "
బాల 2 31

కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమాం."
బాల 2 35

అట్టియెడ తన కావ్యమునకు "రామచరితం" అని గాని, "రామ కథా" యనిగాని, పేరిడక "రామాయణ" మను నామమునే కవి గ్రహించుటకు కారణమేమి ?

ఈ రామచరితమునే "రామాయణ కథా" యని బ్రహ్మ కీర్తించినాడు.

"తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి।
యావద్రామాయణ కథా త్వత్కృతా ప్రచరిష్యతి"
బాల 2_36

బ్రహ్మ కీర్తించుటచేత రామాయణ మను నామమునందే బ్రహ్మ అదరము చూపినట్లు తెలియును. ఇట్లు ముందు రామచరితం తరువాత రామాయణం అని చెప్పబడుటచే రెండింటివి సమానార్థకములుగానే గ్రహించుచున్నారు. తదనుగుణముగ "రామస్య అయనం చరితం రామాయణం" అను వ్యుత్పత్తిని ప్రదర్శించుచున్నారు దాని కుపష్టంభక ముగా "అయ్యతె జ్ఞాయతే Zనేనేతి అయనం చరితం" అని వ్యుత్పత్తిని వ్యాఖ్యాతలు చూపుచున్నారు. చరితము అను నర్థము అయనశబ్దమునకు తాత్పర్యార్థ బోధకమే కావచ్చును. అయన శబ్దము వస్తుతః చరితము అను నర్థము బోధించునది కాదు కోశకారు లెవ్వరును అయనశబ్దము నకు చరితము అను నర్థము జూపలేదు వస్తుతః,చరిత్రార్థ బోధకము గాని అయనశబ్దము రామాయణ మహా సంజ్ఞాకరణమున అనూచానముగా బ్రహ్మ లోకమున సయితము, గ్రహింపబడుటలోని కారణ మేమిః ఈ విషయము సూక్ష్మదృష్టితో పరిశీలింపనగును

రామాయణ మని గాక, రామచరిత మని చెప్పుచో, అది యొక చరిత్ర ప్రధానమగు కావ్యము మాత్రమే యని గోచరించును. అట్లగుచో అది శాస్త్రములలో శాస్త్రము, కావ్యములలో కావ్యము, పురాణములలో పురాణము, నిఖిలశాస్త్రసార సంగ్రహభూతము వేదావతారరూపము అను నీ ప్రశస్తికి తావు లేకపోవచ్చును. రామాయణము ప్రసన్నగంభీరమైన కావ్యము జిజ్ఞాసువుల సంస్కార క్రమము ననుసరించి వివిధ రూపము లతో సాక్షాత్కరించు చున్నదని సంప్రదాయజ్ఞులు చెప్పుచుందురు కాన, ఇది కేవలము రామచరిత్ర వర్ణనాత్మకమే కాదు అని తెలియజేయుటకే రామాయణ మను మహాసంజ్ఞాకరణము చేయబడినదిగా గ్రహింప నగును.

రామాయణ మను మహాసంజ్ఞ వివిధభావ స్ఫోరకము.

1] రామస్య అయనం (చరితం) రామాయణమ్
రామచరిత మని అర్థము.

2] రామః అయ్యతే జ్ఞాయత ఇతి రామాయణమ్
దీనికిని రామచరిత మనియే అర్థము.

3] రామశ్చ రామా చ రామౌ, తయోః అయనం రామాయణమ్
సీతారామచరిత మని యర్థము.

ఈ మూడును గ్రంథప్రతిపాద్య సీతారామచరిత రూప కథాబోధకము లగు వ్యుత్పత్తులు

ఇంతేగాక, తాత్త్వికార్థబోధక మగు మరియొక వ్యుత్పత్తిని గూడ చెప్పుదురు.

రామా [వేదమాతా] అయనం స్థానం యస్య సః రామాయణః
త మధికృత్య కృతం కావ్యం రామాయణమ్ ।

'రమయతీతి రామా' ఇచట 'రామా' యనగా సహృదయుల రంజింపజేయు వేదమాత యని అర్థము. ఆమెయే సదా నివాసస్థానముగా కలవాడు వేదప్రతిపాద్యుడగు పరమేశ్వరుడు. అయన నుద్దేశించి ప్రవర్తిల్లిన కావ్యము రామాయణము. అనగా వేదవాక్కు తత్ప్రతిపాదిత పరమార్థము, ఆ వాక్కుతో ఆ యర్థమునకుగల సంపృక్తత్వము వానిని గూర్చి యుపదేశించునది రామాయణము. ఈ యర్థము ఈ క్రింది శ్లోకముచే స్పష్టము చేయబడుచున్నది.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజె,
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా"

వేద ప్రతిపాద్యుడగు పరమాత్మ దశరథాత్మజుడుగా అవతరింపగా వేదము రామాయణరూపమున ప్రాచేతసుని ముఖము నుండి అవతరించి నది" అని యర్థము.

ఈ సాంప్రదాయిక శ్లోకము వేదవాక్కునకు, పరమాత్మకు గల నిత్యసంపృక్తత్వమును తెలియజేయుచు అట్టివాగర్థమిదునరూపులే సీతా రాము లని ఉపదేశించుచున్నది. కనుక, రామాయణము వాగర్థమిదున రూప సీతారామ తత్త్వోపదేశకము ఇదియే" రామశ్చ రామా చ రామౌ తయోః అయనం" అను వ్యుత్పత్తి ద్వారా రామాయణ మహాసంజ్ఞ ఉపదే శించుచున్నది సీతారాములు కలిసియుందురు గాక, కారణాంతరములచే వీడిపోవుదురుగాక, శరీరములు వియుక్తములైనను వారి భావములు నిత్య సంపృక్తములు. ఈ విషయము శ్రీరాముడు లక్ష్మణున కిట్లు కంఠోక్తిగ చెప్పినాడు.

"మయి భావస్తు సీతాయాః తత్త్వతః వినివేశితః
మమాపి భావః సీతాయాం సర్వధా వినివేశితః"

రామా కిష్కింధాకాండ

లంకలో హనుమంతుడు సీతను జూచినప్పుడు కలిగిన భావ మీ విషయమునే స్పష్టీకరించుచున్నది.

"అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్ ।
తేనేయం స చ ధర్మాత్మా ముహూ ర్త మపి జీవతి"

సుందర 15:52

మరియు రావణ వధానంతరము శ్రీరాముని సమక్షమునకు గొని రాబడిన సీత తనకు గల శ్రీరామైక పరాయణత్వము నిట్లు వివరించినది.

"యద్యహం గాత్రసంస్పర్శం గతాఽస్మి వివశా ప్రభో ।
కామకారో న మే తత్ర దైవం తత్రాపరాధ్యతి,
మదధీనం తు యత్తన్మే హృదయం త్వయి వర్తతే,
పరాధీనేషు గాత్రేషు కిం కరిష్యా మ్యనీశ్వరా"

యుద్ధ 119 8,9

దీనినిబట్టి వేదవాక్ప్రతిపాద్య పరమార్థ తత్త్వబోధనమే సీతారామ చరితవర్ణన రూప రామాయణ మహాకావ్య పరమలక్ష్యము.

ఈ దృష్టితోనే శబ్దకల్పద్రుమకారుడు రామాయణ శబ్దమున కీ క్రింది వ్యుత్పత్తిని ప్రదర్శించినాడు.

"రామస్య చరితాన్వితం అయనం శాస్త్రం రామాయణమ్"

రామచరిత రూపమైన శాస్త్రమే రామాయణ మని అర్థము. శ్రీరామతత్త్వము నుపదేశించు శాస్త్ర మని యర్థము. కావుననే కావ్యములలో కావ్యము, శాస్త్రములలో శాస్త్రముగను దర్శించవలయు నని రామాయణ మహాసంజ్ఞ ఉపదేశించుచున్నది.

కావున, శ్రీరాముని కేవలము దశరథపుత్రునిగను సీతను కేవల మొక రాజపుత్రికగను వారి జీవితములో, జరిగిన కొన్ని సంఘటనలను

వివరించు చరిత్రాత్మక మగు గ్రంథముగ మాత్రము గ్రహింపరాదని రామాయణ మహాసంజ్ఞా తాత్పర్యము.

కనుక, సీతను వేదమాతగను శ్రీరాముని వేదప్రతిపాద్య పరతత్త్వ స్వరూపునిగను దర్శించి రామాయణ కావ్యానుసంధానము చేయువలయు నని సూచించుచున్నది

## సీతాయాశ్చరితం మహత్

"రామాయాః అయనం రామాయణమ్. రమయతీతి రామా" రామా యనగా రంజింపజేయునది" యని అర్థము రామాయణ మనగా సీతా చరిత మని యర్థము "రామాయణ మను మహాసంజ్ఞయే సీతాచరిత మని బోధించుచుండ ఇది కాదని, "సీతాయాశ్చరితం మహత్" అని ప్రత్యేక ముగ నామకరణము చేయబడినది

అట్లు చేయబడుటకు గల కారణమేమో, దర్శింపవలయును

"రామాయాః సీతాయాః అయనం చరితం" అని చెప్పినచో ఇది కేవలము సీతాచరితము అని మాత్రమే అర్థము ఉదిత మగును. ఈ కావ్యము వేదావతారరూప మగుటచే వేద మెట్లు తన స్వరూప స్వభావము లను బోధించుచు, తత్ప్రతిపాద్య తత్త్వమును గూర్చి ఉపదేశించినదో అట్లే ఈ కావ్యము కూడ ఇదస్వరూప స్వభావములను బోధించునది కావలయును. అందుకనియే సితాయా శ్చరితం అని మాత్రమే చెప్పక మహత్ అని విశేషణముగూడ చేర్చబడినది వేదవాక్కు తనను "మహీ అని వర్ణించుకొనినది. వేదవిదు డగుటచే వాల్మీకిమహర్షియు "మహీ"

శబ్దపర్యాయముగా మహత్ అని ప్రయోగించినాడు కనుక "సీతాయాశ్చరితం మహత్" అనగా మహత్త్వసంపన్నమైన వేదచరిత మని అర్థము.

ప్రత్యక్ష ప్రమాణముచే గాని, అనుమాన ప్రమాణముచే గాని, తెలియజాలని అతీంద్రియార్థములను అనగా ధర్మస్వరూపమును, మోక్ష స్వరూపమును, తత్సాధనోపాయములను ఉపదేశించునది వేదము. అట్టి వేదమహత్త్వమును బోధించునది యగుటచే రామాయణము తత్త్వతః మహ కావ్యము. వేదమహత్త్వమును బోధింపజాలని కావ్యములు నిర్గంధ కుసుమములు; బాహ్యసౌందర్యమాత్ర పరాయణములు. అంతర సౌందర్య ముద్దీపింపజేయని బాహ్యసౌందర్యము తత్త్వప్రబోధకము, పురుషార్థప్రదము కాదు రామాయణమున కేవలము శబ్దసౌందర్యమే గాదు, దర్శింపదగిన అంతర సౌందర్యము గూడ కలదు

వాల్మీకి కథావర్ణన చేయుచునే ఏదియేని చిన్న సన్నివేశము నైన పురస్కరించుకొని వేదమహత్త్వమును తెలియజేయుట పరిపాటి

రామాయణ మహాకావ్యరచనా ప్రారంభమునకు దారితీసిన తమసా నదీతీర క్రౌంచద్వంద్వవియోగాత్మక సన్నివేశము చూతము.

క్రౌంచద్వంద్వ వియోగోత్థ శోకప్రభావితమైన ఈ క్రింది శ్లోకము కథాపరమైన అర్థమును బోధించుచునే వేదస్వరూపావబోధక మగుచున్నదని విజ్ఞులు చెప్పుదురు.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచమిధునా దేక మవధీః కామమోహితమ్"

[] క్రౌంచ మిధునములో కామమోహితమైన పురుష క్రౌంచమును చంపుటచె నీవు చిరకాలము ప్రతిష్ఠను పొందవని కథాపరమైన యర్థము.

2] "మాయాం లక్ష్మీం నిషీదతీతి మానిషాదః శ్రీనివాసః "

ఓ శ్రీనివాసా, మండోదరీ రావణు లనెడి మిధునమునందు కామ మోహితుడైన రావణుని జంపి శాశ్వత ప్రతిష్ఠను గాంచితివి" ఇది రామాయణకథాపరమైన సూచితార్ధము.

3] ఇక తాత్త్వికార్థము

"మాయాం వేదవాచి నిషీదతీతి మానిషాదః" మానిషాదు డనగా వేదప్రతిపాద్య తత్త్వస్వరూపుడగు శ్రీరాముడు. "మానిషాద" శబ్దవివ రణ రూపమే "ప్రతిష్ఠాం త్వ మగమః" అను వాక్యము. వైదిక సంప్రదాయము ననుసరించి ప్రతిష్ఠాశబ్దము వేదవాచకము

బ్రహ్మైవ ప్రథమ మసృజత త్రయీ మేవ విద్యాం సైవా స్మై ప్రతిష్ఠాఽభవత్ తస్మాదాహుః బ్రహ్మాఽస్య సర్వస్య ప్రతిష్ఠా ఇతి తస్మా దనూచ్య ప్రతితిష్ఠతి ప్రతిష్ఠా హ్యేషా యద్బ్రహ్మ తస్యాం ప్రతిష్ఠాయాం ప్రతిష్ఠితో z తపత్ శ బ్రా. 6 1 1 3.

"సృష్ట్యాది క్రియలకు ఆలంబన మగుటచే వేదమునకు 'ప్రతిష్ఠా' యని సార్థకనామము వెదమునందు పరమేశ్వరుడు ప్రతిష్ఠితుడై యుండుటచే గూడ వేదవాణి "ప్రతిష్ఠా"యని సార్థక నామమును ధరించు చున్నది " అని పై శ్రుతి తాత్పర్యము 'ప్రతిష్ఠాం త్వ మగమః' అను పై శ్లోకవాక్యము ఉదాహృత శతపథ శ్రుత్యర్థమునే అనువ దించుచున్నది వేదవాణియందు సదా సుప్రతిష్ఠితుడై యుండువాడు గనుకనే, పరమేశ్వరుడు నిషాదుడుగ వేదవిదుడగు మహర్షిచే ఇట కీర్తింపబడుచున్నాడు. "శాశ్వతీ స్సమాః" అను పదములుగూడ శ్రుతి ప్రసిద్ధ

ములు, ఆ పదములు పరమేశ్వరునకు, వేదవాక్కునకు గల నిత్యసం బంధమును నిరంతర సాహచర్యమును గుర్తింపజేయుచున్నవి.

ఇక క్రౌంచమిధున శబ్దార్థమును చూతము

"వాగ్వై క్రౌంచమ్" తాండ్యబ్రాహ్మణ 11 10 19.

వేదవాక్కుకు 'క్రౌంచ'మని శ్రుతిసిద్ధ వ్యవహారము

[క్రుంచ మహర్షిచే దృష్టమైన సామ క్రౌంచసామ" వేదానాం సామవేదోఽస్మి" అన్నట్లు సామ పారమైశ్వర్య విభూతి సంపన్నము అట్టి సామ ఇట శ్రుతిచే వాక్కుగా నిర్దేశింపబడుచున్నది ఇది నిఖిల వేదవాక్కునకు ఉపలక్షణము ]

వేదవాక్కు లౌకికార్థమును జిజ్ఞాసువులకు అలౌకిక తాత్త్వికార్థ మును బోధించుచుండును లౌకికార్థము అసత్యరూపము మిథ్యారూపము. అలౌకికార్థము సత్యము. విషయవాసనాసక్తులై కామోపహతులైన వారికి శబ్దము లౌకికార్థమునే బోధించును. స్తంభ శబ్దము హిరణ్యకశిపునకు స్తంభరూపార్థమునే బోధింపగా, సర్వము పరమేశ్వరాత్మకముగా దర్శించు ప్రహ్లాదునకు సత్యస్వరూప పరమేశ్వరార్థమునే బోధించినది జ్ఞానుల దృష్టిలో లౌకికార్థమే కామమోహితార్థము శాస్త్రాచార్యోపదేశమువలన జ్ఞాన ముదయింపగనే కామమోహితార్థము, అనగా జగద్రూప కామమోహితార్థము నిహత మగుచున్నది

నారదోపదేశానంతరము అంతర్హృదయమున రామసాక్షాత్కారము నొందిన వాల్మీకికి ఇట్టి దివ్యానుభూతియే కలిగినది. అయనకు ప్రతిష్ఠా

రూప వేదవాక్కు నందంతట పరమేశ్వరతత్త్వ సాక్షాత్కారమే జరిగి నది వాక్కుచే బోధింపబడెడి ద్వైతరూప లౌకికార్థము మిథ్యా రూప మున భాసించినది తన యీ యనుభూతియే "యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్" అను శ్లోక రూపమున అభివ్యక్తమైనది, కావున, ఈ యనుభూతి కనుగుణముగ "క్రౌంచే మిథునం, క్రౌంచ మిథునమ్" అని విగ్రహవాక్యమును చెప్పుకొనవలయును

అపుడు, మానిషాదుడవైన ఓ శ్రీరామా! నీవు జ్ఞానస్వరూపుడవు. కావుననే, నీవు మిథ్యాభూతము, కామమోహితము నగు లౌకికార్థమును పరిహరించి సత్యస్వరూపమున సుప్రతిష్ఠుడ వైతివి " అని శ్లోక తాత్పర్యము

నారదోపదేశానంతరము వేదవాక్ప్రతిపాద్యము లైన సత్య అనృ తార్థముల రెండింటిలో [లౌకికా లౌకికార్థముల రెండిటిలో] అనృతార్థము యొక్క మిథ్యాత్వము అలౌకికార్థము యొక్క సత్యత్వము వాల్మీకి హృదయమున సుప్రతిష్ఠితములై విరాజిల్లినవని పై శ్లోకతాత్పర్యము వలన సూచిత మగుచున్నది

వేదమే ఒక మంత్రమున వాక్కునందు లౌకికా లౌకికార్థములు భాసించుట స్పష్టముగా చెప్పినది

చతుష్కపర్దా యువతిః సుపేశా ఘృతప్రతీకా వయునాని వస్తే
తస్యాం సుపర్ణా వృషణా నిషేదతు ర్యత్ర దేవా దధిరే

భాగధేయమ్ ఋ 10 114 3.

"ఔపనిషదీ వాక్ వయునాని జ్ఞానాని వస్తే ఆచ్ఛాదయతి

తస్యాం వాచి సుపర్ణా సుపర్ణౌ జీవపరమాత్మానౌ
నిషణ్ణౌ భవతః" సాయణభాష్య

వేదవాక్కు లౌకికార్థముచే అలౌకికార్థమును ఆచ్ఛాదించుచుండును లౌకికార్థము జీవుడు, అలౌకికార్థము ఈశ్వరుడు అందుచే ఆ వాక్కు నాశ్రయించి జీవపరమాత్మలిద్దరును ఎపుడును వసించుచుందురు

"అహం" పదమునకు వాచ్యార్థము జీవుడు లక్షితార్థము బ్రహ్మ ఇది పరమార్థము ఇట్లు అర్థప్రతీతి ననుసరించి జీవపరమాత్మలిరువురును వాక్కు నాశ్రయించి యుందురని భావము.

ఈ శ్రుతి యొక్క అర్థమునే శ్రీశంకరులు శతశ్లోకి యందొక శ్లోకమున ఇట్లు వివరించిరి.

"చత్వారోఽస్యాః కపర్దా యువతి రథ భవేన్నూతనా నిత్య మేషా
మాయా వా పేశలా స్యా దఘటనఘటనాపాటవం యాతి యస్మాత్
స్యా దారంభే ఘృతాస్యా శ్రుతిభవ వయునా న్యేవ మాచ్ఛాదయంతీ
తస్యా మేతౌ సుపర్ణావివ పరపురుషౌ తిష్ఠతోఽర్థప్రతీత్యా"
శతశ్లోకి 26

దీనినిబట్టి వాక్కునందు సత్యానృతార్థ మిథునప్రతీతి అనగా, జీవేశ్వర రూపార్థప్రతీతి కలుగు ననియు అందు జ్ఞానికి గురూపదేశాదుల వలన జీవభావము తొలగుననియు, జ్ఞాని స్వస్వరూప ప్రతిష్ఠితుడై విరాజిల్లుననియు తెలియనగును. 'మానిషాద'శ్లోకరూపమున వాల్మీకికి గలిగిన దివ్యానుభూతి యిదియే.

వాల్మీకి తనకు గలిగిన ఈ దివ్యానుభూతిని తన శిష్యుడైన భరద్వాజునకు ఇంతకుముందే చెప్పుట ఇందుకు నిదర్శనము.

"అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ,

రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా"

భరద్వాజా ! చూచితివా ! ఈ తమసానదీ తీర్థము పంకరహితమై పాపపుటాలోచనలు లేక దోషరహితమై నిర్మలమై రమణీయమైన సన్మనుష్యుని మనస్సు వలె భాసిల్లుచున్నది." అని యర్థము

వాల్మీకి ప్రతిదినము ఆ తీర్థమును చూచుచునే యున్నాడు. సద్రూపుడైన శ్రీరాముని గూర్చిన గురూపదేశానంతరము సుసంస్కృతమైన వాల్మీకి మనోనేత్రమునకు సత్పురుషుని మనస్సు వలె రమణీయమై ప్రసన్నమై కన్పడెను.

ఉపదేశానంతరము ఆయన హృదయమున మెదలుచున్న సత్పురుషుడు శ్రీరాముడే. అయన మనస్సు వలె తమసాతీర్థము రమణీయమై ప్రసన్నమై కన్పట్టెను ఇట్టి హృదయరామణీయకమే పైన వివరించిన రీతిగా ఆయనకు గల దివ్యానుభూతిని, వాగర్థప్రతిపత్తిని, వేదైకప్రవణత్వమును తెలియజేయుచున్నది

సన్నివేశము వేదవాక్కు యొక్క స్వరూప స్వభావముల నుద్బోధించుచు, మహత్త్వపూర్ణ వేదచరితము నెఱుకపరచు చున్నది. ఇట్టి సన్నివేశము లెన్నియైన జూపవచ్చును ఈ విషయము రామాయణము వేదస్వరూప దర్శనము అను వ్యాసమందు యింకను వివరింపబడును.

# పౌలస్త్య వధమ్

ఇది రామాయణమునకు మూడవ నామము. పైన వివరింపబడిన కామమోహితార్ధవధయే "పౌలస్త్యవధం" అను సంజ్ఞాకరణమునకు ప్రాతిపదికమైనది జ్ఞాన విజ్ఞాన నాశకమైన అవిద్యాకామకర్మాత్మకుడగు పాపిని వధించుమని భగవద్గీత చెప్పుచున్నది

"పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్" భగవద్గీత·
"యథార్థ దర్శనం వస్తు న్యనర్థస్యాపి చింతనమ్
సంకల్పస్యాపి కామస్య తద్వధోపాయ ఇష్యతే"
సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహం.

యథార్థ దర్శనము వలన మిథ్యాపదార్థభ్రాంతి నాశమే కాంతా సంమితముగ పౌలస్త్యవధరూపమున వర్ణింపబడినది

కనుక, పైన జెప్పిన నామముల క్రమము ననుసరించి 1] పరమేశ్వరుని వేదప్రతిపాద్యునిగా దర్శింపవలయు ననియు, 2] తరువాత తత్త్వము నుపదేశించు, మహత్త్వ సంపన్నమైన వేదస్వరూప స్వభావముల దర్శింపవలయు ననియు, [సీతాయాశ్చరితం మహత్] దానివలన అజ్ఞానావరణము తొలగగా ముక్తుడు కాగలడనియు [పౌలస్త్యవధమ్] కావ్యనామము లుపదేశించుచున్నవి.

ఈ రామాయణ నామధేయములు మూడును కథాపరమైన లౌకికార్థమును బోధించుచునే తాత్త్వికమైన సంస్కారక్రమము నుపదేశించుచున్నవి. కనుక, ఈ నామములు సార్థకములు.

# రామాయణము - వేదావతారరూపము

మహాసంజ్ఞలు వేదస్వరూప స్వభావబోధకము లగుచు తాత్త్విక మైన సంస్కారక్రమమును బోధించు నని పూర్వము వివరింపబడినది రామాయణము వేదావతారరూపము అను విషయము సోదాహరణముగ పరిశీలింతము.

రామాయణము వేదావతారరూప మనగా, రామాయణ గత అఖ్యానో పాఖ్యానములు వేదమంత్రవ్యాఖ్యాన రూపములు వేదచోదిత ధర్మస్వరూప ప్రదర్శకములు ఆదర్శ జీవితసాధనకు వలయు నీతివిద్యాస్వరూప ప్రదర్శకములు, పితృ మాతృ భ్రాతృ మిత్ర భక్తసేవకాదిధర్మప్రదర్శకములు, రాజనీతి, శరణాగతిరూపాది విశేష ధర్మబోధకములు అంతేగాక, ఆదర్శ దాంపత్య ధర్మములు, వివిధాశ్రమ ధర్మములు, సాంఘిక ధర్మములు, వివిధ సంప్రదాయములు మున్నగువానికి వ్యాఖ్యాన రూపములు. ఈ విధముగా రామాయణ మొక విశిష్ట ధర్మకోశము.

రామాయణము కథావ్యాజమున నిత్యజీవితమున పాటింపవలసిన ధర్మములను సంప్రదాయములను బోధించుచు పరోక్షమున వేదస్వరూప స్వభావముల బోధించుచుండును.

## రామాయణమ్ - అగ్నిమీళేపురోహితమ్

"అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్,
హోతారం రత్నధాతమమ్

ఋగ్వేద 1 1 1

ఇది ఋగ్వేదమున ముట్టమొదటి మంత్రము అందు "అగ్ని మీళే పురోహితం" అనునది ఋగ్వేదారంభ వాక్యము. "పురోహితుడైన అగ్ని దేవత నుపాసించుడు" అని వేదము యొక్క ప్రథమోపదేశము. ఏ యగ్ని నుపాసింపవలయును? ఒకే మహాగ్ని (పరంజ్యోతి) సృష్టి యజ్ఞమునకు పూర్వము సృష్టికి కారణభూతమై విరాజిల్లుచుండును ఆ జ్యోతియే పృథివీస్థానగతమై అగ్నిరూపమునను, అంతరిక్షగతమై వాయు రూపమునను, ద్యులోకగతమై ఆదిత్య రూపమునను భాసించుచుండును సృష్టికి కారణభూతుడై పూర్వ మున్నవా డగుటచే అగ్ని పురోహితుడు. యజ్ఞముల యందు ఆహవనీయాది రూపమున ముందుండుటచే యజ్ఞము నకు పురోహితుడు శాంతిక, పౌష్టిక, వివాహాదికర్మ లన్నిటియందును సాక్షీభూతుడై ముందుండి తత్తత్కర్మ నిర్వాహకు డగుటచే పురోహి తుడు వైశ్వానరాగ్నిరూపమున నిఖిల ప్రాణిదేహముల యందు సాక్షి స్వరూపుడై వెలుగొందుచు శరీరము లనెడు పురములకు హితుడై వర్తి ల్లుట జేసి అగ్ని పురోహితుడు ఈ విధముగ పరమేశ్వరాత్మక మగు పరంజ్యోతి నిఖిల ప్రాణిపురముల కత్యంత సన్నిహితమై వర్తిల్లుట జేసి ఆ పరంజ్యోతియే వాస్తవముగ పురోహితుడు వశిష్ఠాది పురోహితులు తత్ప్రతినిధిరూపులై లోకహితకరులైరి అట్టి పరంజ్యోతీ రూపుడైన అగ్ని నుపాసించుడని శ్రుతి ఉపదేశించుచున్నది. ఈ అగ్న్యుపాసనయే వేదబోధిత ప్రధాన ధర్మము. ఈ ధర్మమే రామాయణమున మొదట అయోధ్యావర్ణన వ్యాజమున ఉపదేశింపబడినది.

"తా మగ్ని మద్భిః గుణవద్భి రావృతాం

ద్విజోత్తమై ర్వేదషడఙ్గపారగైః

సహస్రదై స్సత్యరతై ర్మహాత్మభిః
మహర్షి కల్పై ఋషిభి శ్చ కేవలైః" బాల 5 23

అయోధ్యానగర మంతయు అగ్ని నుపాసించెడి మహాత్ములతోను మహర్షికల్పులైన ఋషిపుంగవులతోను నిండియుండెను (గుణవద్భి రావృతామ్). ఇచట "ఆవృతాం" అను విశేషణము అయోధ్యావాసులం దరు అగ్న్యుపాసకులె అనగా, ప్రత్యక్షముగనో, పరోక్షముగనో వారి వారి సంస్కారము ననుసరించి అగ్న్యుపాసన జేయువారే యని భావము.

వేద మెట్లు అగ్న్యుపాసనారూప ధర్మోపదేశముతో ఆరంభ మైనదో అగ్న్యుపాసకులైన మహాత్ముల వర్ణనతో రామాయణ కావ్యారం భము జరిగినది.

## అగ్నిః - యజ్ఞదేవః

"అగ్ని యజ్ఞదేవుడు ఆ యజ్ఞదేవు నారాధించిన వారి పాలిట అతడు రత్నధాతముడు. అనగా "రమణీయ ఫలప్రదాత" అని మొదట నుదాహరింపబడిన "అగ్నిమీళే" అను ఋక్కు చెప్పుచున్నది.

అగ్ని యొక్క యజ్ఞదేవత్వమును రత్నధాతమత్వమును దశరధుని అశ్వమేధ, పుత్రకామేష్టి వర్ణన వ్యాజమున వాల్మీకిమహర్షి గుర్తింప జేయుచున్నాడు.

అశ్వమేధయాగము చేయుటచె దశరదుని బ్రహ్మహత్యాది దోషము లన్నియు యజ్ఞదేవుని అనుగ్రహముచే పటాపంచలైనవి. పుత్రకామేష్టి

యొనర్చుటచే లోకోత్తరులైన పుత్రుల బడసెను. ఈ రెండు మహాక్రతువులను అగ్నిదేవుని యొక్క యజ్ఞదేవత్వమును ఎత్నధాతమత్వమును నిరూపించుచున్నవి.

పుత్రకామేష్ఠి అధర్వవేదప్రోక్తముసైన మంత్రములతో ఋష్యశృంగునిచె నిర్వహింపబడినట్లు వర్ణింపబడినది ఈ సన్నివేశము అధర్వవేదముయొక్క ప్రాశస్త్యమును, ప్రత్యేక ప్రతిపత్తిని సూచించుచున్నది.

"ఇష్టిం తేఽహం కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్,
అధర్వశిరసి ప్రోక్తైః మంత్రైః సిద్ధాం విధానతః॥

శాంతిక, పౌష్టిక కర్మనిర్వహణ చేయు పురోహితులు అధర్వవేదవేత్తలై యుండవలె నని సంప్రదాయము

" త్రయ్యాం వ దండనీత్యాం చ కుశలస్స్యాత్పురోహితః,
అధర్వవిహితం కుర్యా న్నిత్యం శాంతిక పౌష్ఠికమ్॥
కామందక నీతిశాస్త్ర

## మంత్రములు అస్త్రగ్రామము

విశ్వామిత్రుడు శ్రీరామునకు విద్యల నుపదేశించెను అవ్యాజముగ వేదమంత్రస్వరూపప్రాశస్యము గుర్తింపచేయబడినది

"ఏతాన్ రామ మహాబాహో కామరూపాన్ మహాబలాన్,
గృహాణ పరమోదారాన్ క్షిప్రమేవ నృపాత్మజ"

స్థితస్తు ప్రాఙ్ముఖో భూత్వాశుచి ర్మునివర స్తదా।
దదౌ రామాయ సుప్రీతో మంత్రగ్రామ మనుత్తమమ్॥
సర్వసంగ్రహణం యేషాం దైవతైరపి దుర్లభమ్।
తాన్యస్త్రాణి తదా విప్రో రాఘవాయ న్యవేదయత్॥
జపతస్తు మునే స్తస్య విశ్వామిత్రస్య ధీమతః।
ఉపతస్థు ర్మహార్హాణి సర్వాణ్యస్త్రాణి రాఘవమ్॥
ఊచుశ్చ ముదితా స్సర్వే రామం ప్రాంజలయ స్తదా।
ఇమే స్మ పరమోదారాః కింకరా స్తవ రాఘవ॥
ప్రతిగృహ్య చ కాకుత్స్థ స్సమాలభ్య చ పాణినా।
మానసా మే భవిష్యధ్వ మితి తా నభ్యచోదయత్॥

బాలకాండ 27 20 to 28

ఇచట శ్రీరామునకు విశ్వామిత్రు డుపదేశించిన విద్యలు మంత్ర రూపములు (మంత్రగ్రామ మనుత్తమమ్) వైదిక సంప్రదాయమున మంత్రములకే 'విద్య'లని పేరు. విశ్వామిత్రుడు నిశ్చలుడై జపింపగా భయభక్తిసంభ్రమోపేతులైన కింకరుల వలె సర్వాస్త్రములు, శ్రీరాముని వచ్చి సేవించినవి "మీరు సర్వదా నా మానసమున వసించుడు" అని శ్రీరాము డా యస్త్రముల నాదేశించెను. ఇవి హస్తములకంటె, ధరింప బడెడి ఆయుధముల కంటె విలక్షణము లైనవి అయితే హస్తముల ధరించు గదాఖడ్గాద్యాయుధములను కూడ మహర్షి శ్రీరాముని కిచ్చినట్లు చెప్పబడుచున్నవి

"గదే ద్వే చైవ కాకుత్థ్స మోదకీ శిఖరీ ఉభే"
ప్రదీప్తే నరశార్దూల ప్రయచ్ఛామి నృపాత్మజ
బాల 27 7

వైద్యాధరం మహాస్త్రం చ నందనం నామ నామతః
అసిరత్నం మహాబాహో దదామి చ నృపాత్మజ" 27 13

పై శ్లోకములలో మహర్షి శ్రీరామునకు గదా ఖడ్గా ద్యాయుధములను గూడ ఇచ్చినట్లు చెప్పబడుచున్నది. శ్రీరామున కీయబడిన ఈ గదా ద్యాయుధములు లోకవిలక్షణము లైనవి. ఈ ఆయుధముల నిచ్చుచు విశ్వామిత్రుడు వీనిని మహాస్త్రము లనినాడు. మహాస్త్రము లనగా మహామహిమోపేతములైన మంత్రగ్రామరూపములు. 'నియమనిష్ఠలతో ఈ మంత్రముల నారాధించువారికి వలసినపుడు ఆ మంత్రములు గదాద్యాయుధరూపము దాల్చి హస్తముల నలంకరించగలవు దేవమంత్రముల సామర్థ్య మట్టిది.

## మంత్రములు విద్యలు

విశ్వామిత్రుడు శ్రీరామున కుపదేశించిన బలాతిబల విద్యలుగూడ మంత్రగ్రామరూపములే. బలాతిబలవిద్య లుపదేశించుచు విశ్వామిత్రుడు శ్రీరామున కిట్లు చెప్పెను.

"రామేతి మధురాం వాణీం విశ్వామిత్రోఽభ్యభాషత।
గృహాణ వత్స సలిలం మాభూ త్కాలస్య పర్యయః॥
మంత్రగ్రామం గృహాణ త్వం బలా మతిబలాం తథా॥

న శ్రమో న జ్వరో వా తే న రూపస్య విపర్యయః,
న చ సుప్తం ప్రమత్తం వా ధర్షయిష్యంతి నైరృతాః
న బాహ్వోః సదృశో వీర్యే పృథివ్యా మస్తి కశ్చన,
త్రిషు లోకేషు వై రామః న భవే త్సదృశ స్తవ॥
న సౌభాగ్యే న దాక్షిణ్యే న జ్ఞానే బుద్ధినిశ్చయే
నోత్తరే ప్రతివక్తవ్యే సమో లోకే తవానఘ॥
ఏతద్విద్యాద్వయే లబ్ధే భవితా నాస్తి తే సమః
బలాత్వతిబలా చైవ సర్వజ్ఞానస్య మాతరౌ॥
క్షుత్పిపాసే న తే రామ భవిష్యేతే వరోత్తమ,
బలా మతిబలాం చైవ పఠతః పథి రాఘవ॥
విద్యాద్వయ మధీయానేయశ శ్చాప్యతులం త్వయి,
పితామహ సుతే హ్యేతే విద్యే తేజస్సమన్వితే॥
ప్రదాతుం తవ కాకుత్స్థ సదృశ స్త్వం హి ధార్మిక"

బాలకాండ 22 10 to18

విశ్వామిత్రు డుపదేశించిన బలాతిబలవిద్యల ప్రభావము అనన్య సామాన్యమని పై శ్లోకముల వలన తెలియుచున్నది. ఈ విద్యల వలన శ్రమ జ్వర వాత రూప విపర్యాదులు సంభవింపవు నిదురించు చున్నను, ఏమరపాటున నున్నను రాక్షసుల వలని భయ ముండదు. బాహుబలము నందుగాని, సౌభాగ్య, దాక్షిణ్య, జ్ఞాన, విజ్ఞానములయందు గాని, వాద ప్రతివాదములం యందుగాని నీకు సాటి యెవరు నుండరు. ఈ

విద్యలు సర్వవిద్యలకు మాతృస్వరూపములు క్షుత్పిపాసలు నీ దరికి రావు. ఈ విద్యలు నీకు యశస్కరములు, శ్రేయస్సంపాదకములును, గురూపదేశానుగ్రహలబ్ధము లైన మంత్రములు విద్యాస్వరూపములై సాక్షాత్కరించి క్షేమంకరము లగునని దీనివలన తెలియుచున్నది.

గురూపదేశ లబ్ధములైన మంత్రములు సాధకుని ఇచ్ఛావశమున తత్తదాయుధరూపము దాల్చి రక్షించునని శ్రుతియే చెప్పుచున్నది.

'మన్యు' శబ్దమునకు సామాన్యముగ క్రోధ మని యర్థము. ఈ శబ్దమునకు "మంత్ర"మని యర్థము కూడ వేదప్రసిద్ధము

"మన్యుః మననసాధనో మంత్రః"

— ఋగ్వేద 2-24 14 సా. భాష్య.

ఈ మంత్రములే సాధకుని ఇచ్ఛ ననుసరించి ఇషురూపములై (ఆయుధరూపములై) శత్రుసంహార మొనర్చుచున్నవి.

"ఇషుః మంత్రః ఇషుసాదృశ్యేన శత్రునాశకః

ఋ. 2 24 8

కావుననే, రుద్రాధ్యాయ ప్రారంభమున మంత్రవిద్యాప్రసాద సిద్ధికై "నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః" అని ప్రార్థన చేయబడుచున్నది.

## సుమంత్రుడు దశరథప్రబోధము

శ్రీరామపట్టాభిషేకసందర్భమున కైకేయీగృహమున మూర్ఛిల్లి యున్న దశరథుని సుమంత్రు డీట్లు ప్రబోధించెను

"వేదా స్సహాంగవిద్యా శ్చ యథా – హ్యాత్మభువం విభుమ్
బ్రహ్మాణం బోధయం త్యద్య తథా త్వాం బోధయా మ్యహమ్."
బాల 14 49

వేదములు అంగవిద్యలతో కూడినవై యోగనిద్రాముద్రితుడై న పరమేశ్వరుని సృష్టికార్య విషయిక కర్తవ్యవిషయమై ఎట్లు ప్రబోధము చేయునో, అట్లే పట్టాభిషేక కర్తవ్యవిషయమై నేడు నిన్ను ప్రబోధము చేయుచున్నాను ఇది కథాభాగపరమైన అర్థము.

అవిద్యావశమున సుప్తుడై యున్న జీవుని సాంగవేదవిద్యలు బ్రహ్మస్వరూపునిగా ప్రబోధించినట్లు [జాగరితుని చేయునట్లు] దారా పుత్ర వ్యామోహమున సుప్తుడవై యున్న నిన్ను ప్రబోధించుచున్నాను.

ఈ సన్నివేశము ద్వారా మహర్షి వేదస్వరూప స్వభావముల నిట్లు తెలియజేయుచున్నాడు

సృష్టికార్య నిర్వహణమున వేదములు సహకారికారణములై పరమేశ్వరునకు తోడ్పడును.

వేదములు దశవిధవిద్యాసహితము లయియే ఆవిర్భవించినవి. పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రములతో గూడిన శిక్షాది షడఙ్గములు దశవిధవిద్యాస్థానములు. ఈ విద్యల సాయముననే వేదమంత్ర స్వరూప స్వభావముల దర్శించుట శక్యమగును అన్యథా శక్యము గాదు అను విషయము లిట సూచితము లగుచున్నవి.

## హనుమంతుడు-సీతాన్వేషణము

హనుమంతుడు సీత నన్వేషించుటకై ఉద్యమించిన విధము సుందరకాండారంభమున ఇట్లు వర్ణింపబడినది.

"తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః,
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి"

సుందర 1 1

"హనుమంతుడు చారణాచరిత మార్గమున నిలచి సీత నన్వేషింప దలచెను" అని అర్థము.

చారణా చరితమార్గ మనగా దేవగాయకులైన చారణులు సంచరించు మార్గము. అది ఆకాశము. అనగా హనుమంతు డాకాశమున నిలచి సీత నన్వేషింపదలచినట్లు కథాపరమైన అర్థము.

కవి 'ఆకాశే' అని సాక్షాత్తు చెప్పక "చారణాచరితేపథి" అని చెప్పుటలో గల విశేషమేమి? ఆకాశమునకు 'సురవర్త్మ' అను పేరు ప్రసిద్ధము. ఇది కేవల చారణవర్త్మ గాదు. ఇచ్చట అప్రసిద్ధమైన "చారణాచరితే" అను విశేషణము వాల్మీకి యంతటి మహాకవి ప్రయోగించునా? కాన, నేదేని విశేషార్థము దృష్టి యందుంచుకొనియే ఈ పద ప్రయోగము చేయబడినట్లు తెలియును

రామాయణము వేదావతారరూప మగుటచే, వేదసంప్రదాయానుసారముగ దర్శించుట యుక్తము. 'చరణ'శబ్దము వేదశాఖావాచక మని వైదికసంప్రదాయ ప్రసిద్ధము "చరణవ్యూహము" అని ఒక గ్రంథమునకు పేరు. చరణముల యొక్క అనగా వేదశాఖల యొక్క వివరములను తెలియజేయు గ్రంథము. కనుక, చరణము లనగా వేదశాఖలు. చరణములే చారణములు. [స్వార్థే అణ్]. చారణాచరితమార్గ మనగా వేదచోదిత మార్గము. హనుమంతుడు వేదనిధి వేదవేదాంగవేత్త.

కిష్కింధయందు శ్రీరామునిచే వేదవిదుడుగా కీర్తింపబడినాడు ఆయన దృష్టిలో శ్రీరాముడు కేవలము దశరథపుత్రుడు కాదు అట్లే సీతయు కేవలము జనకరాజపుత్రి కాదు సీత బ్రహ్మవిద్యాస్వరూపిణి తల్లక్ష్య భూతపరతత్త్వము శ్రీరాముడు సముద్రమును లంఘించి లంక యందు సీత నన్వేషించుట కథాపరమైన అర్థము. జితేంద్రియుడై వీతరాగుడై బ్రహ్మవిద్యాభూషితుడై భవసాగరమును లంఘించుట హనుమంతుని లక్ష్యము. ఇట్లు భవసాగరలంఘనము వేదవిద్యామార్గమున చరించువారికే సాధ్యము. ఈ యర్థమును స్ఫురింపజేయుటకే మహాకవి "చారణా చరితే పథి" అని పదప్రయోగము చేసినాడని పెద్దలు చెప్పుదురు.

## హనుమంతుడు సీతాదర్శనము

హనుమంతుడు లంకలో సీత నన్వేషించిన విధము గమనింప దగినది.

"తస్య సందిదిహే బుద్ధిః ముహు స్సీతాం నిరీక్ష్య తు,
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ"

సుందర 15 38

సీత ఎట్లుండునో, హనుమంతునకు తెలియదు. ఆమెనెన్నడు చూడలేదు కాని, తాను బయలుదేరినది సీతాన్వేషణ కొరకు. అయినను విజ్ఞానకుశలు డగుటచే రామలక్ష్మణులు చెప్పిన లక్షణముల మననము చేసికొనుచు సీతాన్వేషణమునకు పూనినాడు. లంకలో ఎందరు స్త్రీలనో చూచినాడు వారియందు సీతాలక్షణములు కనపట్టలేదు మండోదరిని

చూచి ఈమె సీత యగునేమో యని తలచి తన ప్రయత్నము సఫల మైనట్లుగా ముచ్చటబడినాడు. పతివ్రతాశిరోమణి యగు సీత సర్వాలంకార భూషితయై రావణాంతఃపురమున సుఖనిద్ర చెందుట యసంభవ మని నిశ్చయించి మరల వెదుకుటకు పూనికొనెను, తర్క వితర్కములు చేసికొనుచు లంకయంతయు తిరుగాడుచు అశోకవనమునశోకమూర్తియైన సీతను చూచెను. ఈమె సీత యగునా, కాదా యని మరల సందేహము సీత గాని స్త్రీని సీతగా భావించి ఆమెను సమీపించి తాను వచ్చిన పనిని తెలుపుట ప్రమాదకరము. అయితే, ఆమె విద్యాస్వరూపిణిగా సాక్షాత్కరించినది. జీర్ణ మల వస్త్రధారిణియై అమ్నాయములు లేక ప్రశిధిలమైన విద్య వలె కృశించి కన్పట్టిన ఆమె సీత యగునా ! యని మరల సందేహించెను.

ఇచట హనుమంతుని సందేహవ్యాజమున వేదవిద్యా స్వరూపము తెలియజేయబడుచున్నది.

హనుమంతుడు వేదవేత్త గనుక శ్రవణ మనన నిదిధ్యాసనలతో అమ్నాయములు జేసినపుడే అనగా, నిరంతరాభ్యాసము చేసినపుడే వేద విద్య శోభిల్లును. సత్ఫలితము లిచ్చును అని హనుమంతునకు తెలియును. అమ్నాయయోగము లేనపుడు అది ప్రశిధిల విద్యయై యిది బ్రహ్మవిద్యయేనా ! అని సందేహము కలిగించును.

"అమ్నాయానాం అయోగేన అసంబంధేన ప్రశిధి

లాం అప్రాప్తప్రతిష్ఠాం విద్యాం వేదబాహ్యవిద్యాం

11)

యద్వా అమ్నాయానాం అభ్యాసానాం అభావేన
ప్రశిథిలాం అస్థిరపదాం విద్యా మివ"

గోవిందరాజీయ వ్యాఖ్య

లౌకిక విద్యలకు గూడ విద్యావ్యవహార మున్నది అ విద్యలు లౌకికవ్యవహార వ్యామోహమును కల్పించునట్టివి కనుక పారమైశ్వర్య విజ్ఞానమును దూరము చేయునట్టివి అందువలన అ విద్యలు ప్రశిథిల విద్యలు అట్టి ప్రశిథిలవిద్యాస్వరూపిణి యగుటచే ఈమె విద్యాస్వరూపిణి, శ్రీమాత యగు సీత యగునా ! అని హనుమంతునకు సందేహము కలిగినది

వేదమునకు 'అమ్నాయ'మని పేరు అమ్నాయ మనగా నిరంత రాభ్యాసము జీవితపర్యంతము నిరంతరాభ్యాసము చేయదగిన విద్య వేద విద్య యొక్కటియే. కనుకనే దానికి అమ్నాయ మని సార్థక సంజ్ఞ. ఇచట అ దృష్టితోనే అమ్నాయపదము ప్రయోగింపబడినది. ఈ పద ప్రయోగముచే వేదము యొక్క నిరంతరాభ్యాసావశ్యకతారూపసంప్రదాయ మిట సూచిత మగుచున్నది.

తరువాత హనుమంతుడు అతికష్టము మీద సీతను గుర్తించినట్లు తరువాత శ్లోకమున చెప్పబడుచున్నది.

"దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్
సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్"

సుందర 15 39

స్నానాది సంస్కారములు లేక అలంకారవిహీనయై యున్న సీత సంస్కార రహితయై అర్థాంతరగతయై యున్న వేదవాణి వలె యున్నదట.

ఇచట సీత సంస్కారవిహీన, రావణాధిన యగుటచే అర్థాంతర గతయైనది. సంప్రదాయమును పాటించని అధికారి కానివానిచే అభ్య సింపబడు వేదవాణియు సంస్కారహీన యగును. అట్టి స్థితి యందు వేద వాణి పాఠకునకు యథార్థమును బోధింపక, అపార్థమును బోధించును అనగా, అర్థాంతరగత యగును.

బ్రహ్మవిద్యాస్వరూపిణి యయ్యును, సీత అనధికారియగు రావణు నధీనమున నుండి సంస్కారహీన యైనది. విద్యాస్వరూపిణినిగా రావణు డామెను దర్శింపలేకపోయెను. వేదవిదుడైన హనుమంతున కామె సంస్కారహీన యయ్యును విద్యాస్వరూపిణిగా దర్శన మిచ్చినది.

సంస్కారక్రమసంపన్నునకే వేదవాణి విద్యాస్వరూపిణియై సాక్షా త్కరించును అనధికారిగతమై సంస్కారహీనమైన వేదవాక్కు విపరీ తార్థబోధక మగునే గావి యథార్థతత్త్వబోధకము గాదు

## సంస్కారాత్తే౽భవన్ వేదాః

రావణవధ జరిగినది తన పాతివ్రత్యశుద్ధిని నిరూపించుకొను టకై సీత యగ్నిప్రవేశము చేసినది. ఆ సమయమున దిక్పాలకులు దేవతాగణసహితులై వచ్చి రాముని మహామహిమను కీర్తించిరి అచట

చేయబడిన స్తోత్రము లన్నియు ముఖస్తుతికై చేసెడి ప్రశంసావచనములు కావు భూతార్థవాదములు. పురుషసూక్తాది వేదమంత్రవ్యాఖ్యానరూప ములు. పరమేశ్వరుని యొక్క సర్వవ్యాపకత్వ స్ఫోరకములు. బ్రహ్మయే స్వయముగ

"ఇమ మార్షం స్తవం నిత్య మితిహాసం పురాతనం
యే నరాః కీర్తయిష్యంతి నాస్తి తేషాం పరాభవః"

అనుచు దీనిని అర్ష స్తవ మనినాడు. (ఆర్ష స్తవమనగా వేదమంత్ర స్తవము) ఆ సమయమున బ్రహ్మ చేసిన స్తోత్రము వేదస్వరూపస్వభావ ద్యోతకము.

"నిమేష స్తే భవే ద్రాత్రిః ఉన్మేష స్తే భవేద్దివా,
సంస్కారా స్తేఽభవన్ వేదాః న తదస్తి త్వయా వినా"
యుద్ధ 120 25

"సంస్కారాస్తేఽభవన్ వేదాః సంస్క్రియంతే బోధ్యంతే ఏభి ర్లోకా ఇతి సంస్కారాః బోధకాః ప్రవృత్తి నివృత్తి వ్యవస్థాపకా ఇతి యావత్"

మహేశ్వరతీర్థవ్యాఖ్య

బ్రహ్మ శ్రీరాముని యొక్క విరాట్స్వరూపమును వర్ణించుచు శ్రీరాముని యొక్క వేదపూరుషత్వము నిట్లు వర్ణించుచున్నాడు.

"శ్రీరామా! నీవు విరాట్స్వరూపుడవు. సర్వజగద్రూపుడవు.

నీవు లేని జగము లేదు [న తదస్తి త్వయా వినా] ఆ జగత్తును సంస్కరించెడి వేదములు నీనుండి యావిర్భవించినవి" అని అర్థము.

ప్రవృత్తి నివృత్తి ధర్మ వ్యవస్థాపకములు వేదములు. సర్వలోక సంస్కారకము లగుటచే వేదములకు సంస్కారము అని పేరు. సంస్కారరూపము లైన వేదములచే విహితములైన కర్మలు గూడ సంస్కారము లగుచున్నవి. అట్టి సంస్కారములను బోధించు భాషయు సంస్కృతవాణియై విరాజిల్లుచున్నది." సంస్కారాః వేదాః తే అభవన్" అని చెప్పుటచె సంస్కారాత్మకములైన వేదములు పరమేశ్వరుని నుండి విశ్వాసరూపమున అవిర్భూతములైనవను సంప్రదాయ మిట సూచిత మగుచున్నది.

## సీత అగ్నిశుద్ధి-అగ్నిసాక్షిత్వము.

రావణవధానంతరము సీతను తీసుకొని రమ్మని రాము డాదేశించెను శ్రీరాముని ఆదేశానుసారము స్నానము జేసి శుచియై సర్వాలంకార భూషితయై సీత వచ్చెను. సర్వజన సమక్షమున శ్రీరాము డామె శీలమును శంకించెను శ్రీరాముని వాగ్బాణములచే పీడితయై సీతముఖము నుండి ఆ సమయమున వెడలిన మాటలు గమనార్హములు.

"త్వయా తు నరశార్దూల క్రోధ మేవానువర్తతా
లఘునేవ మనుష్యేణ స్త్రీ త్వమేవ పురస్కృతమ్॥
అపదేశేన జనకాత్ నోత్పత్తి ర్వసుధాతలాత్.

యుద్ధ 119 14,15

స్వామీ!, నీవు పురుషోత్తముడవు పామరులు క్రోధపరవశులై యథార్థమును విస్మరించునట్లు నీవును నామీది కోపముతో నా యథార్థ స్వరూపమును విస్మరించితివి. నా బాహ్యస్త్రీరూపమునుమాత్రమే దర్శించితివి "అస్త్రీత్వమును మాత్రమే పురస్కరించుకొని శంకించితివి నే నయోనిజను. జనకవ్యాజముతో భూతలమున ఆవిర్భవించితిని. ఇట్లు నా అయోనిజత్వమును మరచితివి." అని అర్థము.

సీత ఉపనిషత్స్వరూపిణి, బ్రహ్మవిద్యా స్వరూపిణి, వేదమాత యని పూర్వము వివరింపబడినది వేదములు పురుషకర్తృకములు గావు అపౌరుషేయములు అయోనిజములు సంస్కారహీనులైన క్షుద్రులు చేపట్టినంత మాత్రమున వేదము తన అపౌరుషేయత్వమును కోల్పోవునా? వేదము యొక్క వేదత్వము, పవిత్రత్వము కళంకిత మగునా? "క్షుద్ర రావణగృహీతయైనరక్షమాత్రమున నా అయోనిజత్వముగాని, శ్రీమాతృత్వముగాని, చారిత్రముగాని కళంకిత మగునా?" అను నీ సీతావచనములు పరోక్షముగా వేదసచ్చరితమును చాటునవియే.

ఈ మాటలు వ్యక్తికి నా సచ్చరిత్రమును ప్రదర్శించు నుపాయము హుతాశనప్రవేశమే. కాన చితి పేర్పు మని లక్ష్మణు నాదేశించెను

శ్రీరాముని అనుమతితో లక్ష్మణుడు చితి పేర్చగా చితిప్రవేశము చేయబోవుచు అగ్నిదేవునిట్లు ప్రార్థించెను

"ప్రణమ్య దేవతా భ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ।
బద్ధాంజలిపుటా చేద మువా చాగ్నిసమీపతః॥
యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్ ।

తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః॥
యథా మాం శుద్ధచారిత్రాం దుష్టాం జానాతి రాఘవః।
తథా లోకస్యసాక్షీ మాం సర్వతః పాతు పావకః
కర్మణా మనసా వాచా యథా నాతిచరా మ్యహం॥
రాఘవం సర్వధర్మజ్ఞం తథా మాం పాతుపావకః॥

యుద్ధ 119 23నుండి 26వరకు

“దేవా! మనోవాక్కాయ కర్మములచే నా చరిత్రము పరిశుద్ధము. నా హృదయమున్నదును శ్రీరాముని ప్రీతియుండలేదు. ఆయనయందే నా మనస్సు నిరంతరము లగ్నమై యున్నది. సర్వసాక్షిభూతుడ వగు నీ వీ విషయ మెఱుగుదువు. కాని శ్రీరాముడు నన్ను దుష్చరాలనుగా శంకించుచున్నాడు. నీవు పావకుడవు సర్వమును పరిశుద్ధము జేయువాడవు శ్రీరాముడు నన్ను ఎట్లువిశుద్ధచరితము గలదానినిగా గుర్తించునో ఆ విధముగ నా పారిశుద్ధ్యమును ప్రదర్శించి అన్ని విధముల నన్ను రక్షింపుము.”

అగ్ని సర్వమును భస్మసాత్కరించును కొన్నిటిని మాత్రము భస్మీకరింపక వానియందలి మాలిన్యముల దొలగించి పరిశుద్ధము జేయును అట్టి ద్రవ్యములలో స్వర్ణ మొకటి

“హేమ్న స్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధి శ్శ్యామికాఽపి వా”

రఘు 1 సర్గ

అగ్నియందు స్వర్ణము విశుద్ధ మగును. రూపాంతరము చెందును.

స్వరూపనాశము లేదు కావున దానిని తేజోద్రవ్య మనిరి అగ్నే ఆజ్యము గూడ పరిశుద్ధమై జ్వాలారూప మగును స్వరూపనాశము జెందదు కావుననే

అగ్నేర్వా ఏత ద్రూపం యదాజ్యం తై బ్రా 3 8,14 2
తేజ ఆజ్యం తై సం 2 6 1 2

అని శ్రుతి ఆజ్యమును జ్యోతీరూపద్రవ్యముగా వర్ణించినది. కావున తేజసు వలన తేజస్సుకు రూపనాశము లేదు.

సీత పైవిధముగ అగ్నిని ప్రార్థించి తన శరీరమును అగ్నికి ఆహుతిగా చేసికొనిన సందర్భమును కవి యిట్లు వర్ణించుచున్నాడు

"దదృశు స్తాం మహాభాగాం ప్రవిశంతీం హుతాశనం।
సీతాం కృత్స్నా త్రయో లోకాః పుణ్యా మాజ్యాహుతీ మివ॥
ప్రచుక్రుశుః స్త్రియ స్సర్వా స్తాం దృష్ట్వా హవ్యవాహనే।
పతంతీం సంస్కృతాం మంత్రై ర్వసోర్ధారా మివాధ్వరే"
యుద్ధ 119 31, 32

ఇచట సీత యొక్క ఆత్మాహుతి ఆజ్యాహుతిరూపముగా వర్ణింపబడినది. ఆజ్యాహుతి యనుటచే అగ్ని యందాజ్యమునకు స్వరూపనాశము లేనట్లు సీతకును స్వరూపనాశము లేదను విషయము సూచితము.

ఆజ్యము భౌతికరూపమును విడచి అగ్నియందు తేజోరూపము ధరించునట్లు సీతయు మిథ్యాపవాదరూప మాలిన్యరహితయై దివ్యతేజోరూపిణియై ఆవిర్భవించినట్లు తరువాత కవి యిట్లు వర్ణించుచున్నాడు.

"స విధూయ చితాం తాం తు వైదేహీం హవ్యవాహనః।
ఉత్తస్థౌ మూర్తిమా నాశు గృహీత్వా జనకాత్మజామ్॥
తరుణాదిత్యసంకాశాం తప్తకాంచనభూషణాం।
రక్తాంబరధరాం బాలాం నీలకుంచితమూర్ధజామ్॥
అక్లిష్టమాల్యాభరణాం తథారూపాం మనస్వినీమ్।
దదౌ రామాయ వైదేహీ మంకే కృత్వా విభావసుః॥

యుద్ధ 121 2నుండి 4 వరకు

అగ్నివిశుద్ధయైన సీత తరుణాదిత్యసంకాశయై ప్రకాశించుచు తథారూపయై [స్వరూప నాశము లేక యథాపూర్వరూపమున] ఆవిర్భవించినట్లు పై శ్లోకములలో వర్ణింపబడినది.

ఈ సన్నివేశము ద్వారా "అగ్నిమీళే పురోహిత" మ్మనుచు ఋగ్వేదారంభమున ఉపదేశింపబడిన అగ్నియొక్క మహాగ్నిత్వము; యజ్ఞదేవత్వము, రత్నధతమత్వము, రమణీయ ఫలప్రదాతృత్వము, సర్వసాక్షిత్వము, సర్వవిధమాలిన్యవిశోధకత్వము కవిచే నిపుణముగా దర్శింపజేయబడినది.

ఇట నొక విషయము గమనింపదగినది.

"తామగ్ని మద్భిః గుణవద్భి రావృతా" మంటూ అగ్న్యుపాసకులైన మహాత్ములతో అయోధ్యానగరవర్ణన మారంభమైనది తిరిగి అగ్ని

దెవతామాహాత్మ్యఖ్యాపకమైన సీత యొక్క అగ్నిశుద్ధివర్ణనముతో దాదాపు గ్రంథము పరిసమాప్తమైనది. ఇట్లు ప్రక్రమోపసంహారముల యందు అగ్నిమహత్త్వఖ్యాపనము చేయుట మధ్య మధ్య అగ్నిసాక్షికమైన రామసుగ్రీవసఖ్య వర్ణనాదులు, అడుగడుగునా యజ్ఞప్రశంసలు, సంధ్యోపాసనాది వర్ణనలు, ఆదిత్యహృదయాది స్తోత్రములు, అగ్నిదేవతామాహాత్మ్యఖ్యాపక వేదావతారరూపత్వమును నిరూపించుచున్నవి.

# 4. విశ్వామిత్రుడు - సీతారామకల్యాణము

కామము ధర్మపూతము కానంతవరకు సంసారబంధమునకును పెక్కు అనర్థములకును మూలకారణ మగుచుండును కాని, యా కామమే క్రమముగా విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యగుటకు దోహదము చేసినది. రామాయణమున విశ్వామిత్రునకు ప్రత్యేక స్థానము గలదు "మానవుడు ఎంత అడుగున నున్నను, అచంచల దీక్షతో, పట్టుదలతో ఉన్నత శిఖరముల నధిరోహించ జాలును" అను విషయము విశ్వామిత్రగాథ నిరూపించును.

విశ్వామిత్రుడు గాధితనయుడు, క్షత్రియుడు సుఖముగా రాజ్య పరిపాలన చేసికొనుచున్నాడు. ఒకపుడు సేనాసమేతుడై వశిష్ఠాశ్రమమునకు వచ్చినపుడు వశిష్ఠు డిచ్చిన అతిథ్యము ఆయన దృష్టి నాకర్షించినది అది ఆయన యొద్ద నున్న కామధేను ప్రభావ మని తెలిసికొనుమ విశ్వామిత్రుని దృష్టి కామధేనువుపై బడినది కామధేనువు నిచ్చుటకు వశిష్ఠు డంగీకరించడు దానితో ఆయన కామము క్రోధముగా మారినది. కామధేనువును బలాత్కరించి తీసికొనివెళ్ళుటకు ప్రయత్నించెను. కాని సాధ్యపడదు తపస్సుతో రుద్రుని మెప్పించి వివిధ శస్త్రాస్త్రములను సాధించి వశిష్ఠునితో యుద్ధము చేయును ఋచకు ఆ మహర్షి యొక్క బ్రహ్మబలము ముందు క్షాత్రబలము నిలువజాల దని తెలిసికొనును. "ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలం" అని నిర్ణయించుకొని

దక్షిణదిశకు పోయి, తపస్సు చేయును. ఆ సమయమున త్రిశంకను రాజు సశరీర స్వర్గగమనమును కోరగా వశిష్ఠుడు, తత్పుత్రులు కాదనిరి. వారి మాటలను విననందున శపించిరి రాజు శాపగ్రస్తుడై విశ్వామిత్రు నాశ్రయించెను విశ్వామిత్రు డాతనిని స్వర్గమునకుబంపును. స్వర్గవాసు లాతనిని తిరస్కరింప, వేరే క్రొత్తగా త్రిశంకుస్వర్గమును సృష్టించి, విశ్వామిత్రు డాతనిని రక్షించెను. ఈ రీతిగ తపోభంగము కలిగినందుకు విచారించుచు, పశ్చిమదిశకు పోయి తపస్సు జేసెను. అచట అంబరీష మహరాజు యొక్క యజ్ఞపశువు నశించినది. అందుచే నరపశువు నన్వే షించుచు ఋచీకమహర్షి యొక్క రెండవకుమారు డగు శునశ్శేపుని యజ్ఞపశువుగా సంపాదించిరి శునశ్శేపు డంతట విశ్వామిత్రు నాశ్రయిం చెను విశ్వామిత్రు డాతనిని రక్షించెను మరల ఘోరతపస్సున కుపక్ర మించెను ఇంతలో మేనక యను నప్సరస వచ్చుట, ఆమెను మోహిం చుట, శకుంతల జన్మించుటయు జరిగెను. ఇట్లు పశ్చిమ దిక్కునందు విఘ్నము జరిగినందున పశ్చాత్తాపము చెంది యుత్తర దిశకు పోయి, ఘోరాతిఘోరమైన తపస్సు జేయును. ఎన్ని విఘ్నములు వచ్చినను, క్రోధమును దరికి రానీయడు మౌనవ్రతము దాల్చెను తుద కాహారము తీసికొను సమయమున ఇంద్రుడు మారువేషమున వచ్చి యాచించినపుడు కూడ నోరు మెదపడు ఆహారము నిచ్చివేయును. ఆయన దీక్షకు, తప స్సంపదకు దేవతలు మెచ్చుకొందురు. ఆప్తకాముడైన ఆ మహర్షిని బ్రహ్మాదుల ఎరు బ్రహ్మర్షివైతి వని ప్రశంసింతురు.

ఈ విశ్వామిత్రగాధను పరిశీలించుచో, కామక్రోధాదులను జయిం చుట ఎంత కష్టసాధ్యమో తెలియును "దీక్షతో వీనిని జయించవచ్చు" నని విశ్వామిత్రుడు నిరూపించినాడు.

మొదట విశ్వమునకు అమిత్రుడు వలె కన్పించినను, విశ్వామిత్రుడు తన తీవ్ర తపస్సంపదచే విశ్వమునకు మిత్రుడై విరాజిల్లెను కనుకనే

"విశ్వత్రయేణ యో మైత్రీం కర్తు మిచ్ఛతి తత్త్వతః ।
స విశ్వామిత్రః" అనుచు దేవీభాగవతము [7 26 6] ప్రశంసించినది

"విశ్వామిత్రస్తు ధర్మాత్మా నామ్నా విశ్వరథః స్మృతః"

అనుచు హరివంశము [27 44] విశ్వామిత్రుని విశ్వమందంతటను అప్రతిహత గతి గలిగిన విశ్వరథునిగా వర్ణించుచున్నది

విశ్వామిత్రుడు మొదట కామోపహతునివలె కన్పించినను జన్మాంతర సంస్కారాదుల వలన సంస్కారక్రమ సంపన్నుడై తుదకు బ్రహ్మర్షియైనాడు శ్రుతియు, 'విశ్వామిత్ర'శబ్దము నిట్లు నిర్వచించినది.

"విశ్వస్య హ వై మిత్రం విశ్వామిత్ర ఆస । విశ్వం హాస్మై మిత్రం భవతి య ఏవంవేద"

ఐతరేయారణ్యక 6 20, 21

విశ్వ మనగా జగత్తనియు, పరమేశ్వరు డనియు అర్థము మహర్షి లోకమున కంతయు మిత్రుడు విశ్వరూపుడైన పరమేశ్వ డీతనికి మిత్రుడు. బ్రహ్మర్షుల యొక్క లక్షణ మట్టిది. ఈ శ్రుతి వ్యాఖ్యానరూపమో యన్నట్లు మహాభారతము విశ్వామిత్రుని జన్మగాథను వర్ణించుచు క్రమముగా శ్రుతితాత్పర్యమును వివరించినది. మహాభారతము

అనుశాసనిక పర్వమున విశ్వామిత్ర జన్మవృత్తాంత మిట్లు వర్ణింపఁ బడినది

## విశ్వామిత్రుడు జన్మవృత్తాంతము

భరతవంశమున అజామీఢు డను రాజు జన్మించెను అయన వంశములోనివాడు కుశికుడు కుశికుని పుత్రుడు గాధిమహారాజు. అయనకు చాలాకాలము వరకు సంతానము లెదు సంతానము కొరకై వనమునకు వెళ్ళి తపస్సు జేసెను. తపఃఫలముగ సత్యవతి యను కుమార్తె కలిగెను. కొంతకాలమున కామెను చ్యవన పుత్రుడైన ఋచీకుడు భార్యగా వరించెను. ఋచీకుడు దరిద్రు డను భావముతో గాధి వాని కీయకొనక "తన కుమార్తె కావలె ననుచో వేయి శ్వేతాశ్వముల నీయవలెను, వాని కుడి చెవులు నీలముగా నుండవలెను." అని పణము పెట్టెను అట్టి గుఱ్ఱముల నీయు మని ఋచీకుడు ప్రార్థింప, వరుణు డనుగ్రహించెను. ఆ గుఱ్ఱములు కన్యాకుబ్జమునకు దగ్గరగా నున్న గంగానది నుండి యావిర్భవించెను అందుచే నా ప్రదెశము 'అశ్వతీర్థ'మని ప్రసిద్ధి కెక్కెను. ఋచీకుని తపశ్శక్తిని, సంకల్పసిద్ధిని జూచి, గాధి యాశ్చర్యపడెను. కుమార్తె నీయనిచో శపించ గలడన్న భయముతో ఋచీకునకు సత్యవతి నిచ్చి వివాహము జేసెను ఋచీకుడు సంతోషముతో భార్య నభీష్టవరమును కోరుకొను మనెను. ఆ సంగతి నామె తల్లితో చెప్పెను. చక్కని పుత్రుని కోరుకొను మని తల్లి యుపదేశించెను తనకు పుత్రుడు కలుగునట్లనుగ్రహింపుమని ఋచీకునితో చెప్పుమనెను. తనకు గూడ సోదరుడు కలుగు ననిసంతోషముతో సత్యవతి తన కోరికను, తల్లికోరికనునే భర్తతో చెప్పను ఋచీకు డాలొచించి, ఇట్లు చెప్పెను. అచిరకాలంలోనే నీ

తల్లికి గుణవంతుడైన పుత్రుడు కలుగును. నీవు గూడ వంశోద్ధారకుడైన పుత్రునితో వెలయగలవు. అయితే, ఇం పు నేను చెప్పినట్లు శ్రద్ధగా, దీక్షగా ఆచరించవలెను ఋతుస్నాతలై నీ తల్లి అశ్వత్థవృక్షమును, నీవు ఔదుంబర వృక్షమును ఆలింగనము జేసికొనవలయును. మీ యిరువురకు రెండు ప్రసాదముల [చరువుల] నిచ్చెదను. ఈ చరుద్వయమును శ్రద్ధాభక్తులతో భక్షించినచో నీ యభీష్టము నెరవేరును

భర్త చెప్పిన విషయమును సత్యవతి సంతోషముతో తల్లికి చెప్పగా తల్లి ఇట్లనెను. నీ భర్త నీకు వంశకరుడైన పుత్రుని అనుగ్రహించినాడు. ఆ సంతానమును నేను స్వీకరింతును. నాకై యుద్దేశింపబడిన సంతానమును నీవు స్వీకరించుము అందుకై మన కిచ్చిన ప్రసాదములను, అట్లే వృక్షములను కూడ మార్చుకొందము. ఈవిధముగా నీవు నీ తండ్రివంశమునకు సాయము జేసినదాన వగుదవు. తల్లి మాటలను సత్యవతి యంగీకరించెను తరువాత వారు ఋతుస్నాతలై వృక్షములను మార్చుకొని ఆలింగనము చేసిరి: చరువులనుగూడ మార్చి భక్షించిరి క్రమముగా వారు గర్భవతులైరి: ఋచీకుడు భార్య యొక్క సంవిధానమును జూచి, యనుమానించును. తపోబలముతో జరిగినదంతయు తెలిసికొనును తా ననుకున్న దొక్కటి, జరిగిన దొక్కటి దైవసంకల్పము బలీయము తాను చేయగలిగినది లేదనుకొనెను. జరిగిన దానికి భార్యను మందలించెను విశ్వరూపుడైన బ్రహ్మ యొక్క తేజమును నీ చరువునందును క్షాత్రతేజమును నీ తల్లి చరువు నందును ఉంచితిని. నేను చెప్పినట్లు చేసినచో బ్రహ్మతేజశ్శాలి నీ కుమారుడయ్యెడివాడు. (మయా విశ్వం హి యద్బ్రహ్మ త్వచ్చరౌ వినివేశితమ్) నీ తల్లి క్షాత్రతేజశ్శాలిని ప్రసవించెడిది. ఇపుడు వ్యత్యాసము జరిగినది.

క్షాత్రతేజశ్శాలి నీ కుమారు డగును బ్రహ్మతేజశ్శాలి యగు విశ్వ. రూపుని నీ తల్లి ప్రసవించును జరిగినదానికి సత్యవతి పశ్చాత్తాపడెను ఉగ్ర కర్మలతో వెలయువాడు తనపుత్రుడుగా గాక, పౌత్రుడగా కలుగు నట్లనుగ్రహించు మని ప్రార్థించెను. అట్లే యని ఋచికుడు పశ్చాత్తప్త యైన భార్య ననుగ్రహించెను. సత్యవతికి జమదగ్నియు, జమదగ్నికి ఉగ్రకర్ముడగు పరశురాముడు క్రమముగా జన్మించిరి సత్యవతీ చరు ప్రభావము వలన విశ్వామిత్రుడు జన్మించి తత్త్వతః విశ్వామిత్రు డగును. కనుక విశ్వామిత్రుడు విశ్వరూపాత్మక బ్రహ్మతేజశ్శాలి. కనుకనే, పైన చెప్పిన శ్రుతినిర్వచనమునకు వ్యాఖ్యానరూపముగా భారతము "విశ్వం చ త న్మిత్రం చ విశ్వామిత్రః" అను విగ్ర హవాక్యమును లోకమున కందజేసినది విశ్వామిత్రు డనగా "విశ్వాత్మ కుడు సకలలోకమిత్రుడు" అని యర్థము పాణిని మహర్షి ఈ మహర్షిపై గల గౌరవాతిశయముతో "మిత్రేచర్షౌ" అను సూత్రమును రచించి శ్రుతి స్మృత్యర్థములను వివరించెను. ఋషివాచకమైన మిత్ర శబ్దము పరముగా నున్నపుడు విశ్వశబ్దము దీర్ఘాంత మగు నని సూత్రార్థము. శ్రుతియుమరియొకచోట విశ్వామిత్రశబ్దము నిట్లు నిర్వ చించెను.

"సర్వస్యైవ హి మిత్రో మిత్రం"
శతపథ బ్రాహ్మణము. 5 3 2 7

"బ్రహ్మైవ మిత్రం బ్రహ్మ హి మిత్రం"
శ.బ్రా 4 1 4 10

దీనినిబట్టి విశ్వామిత్రుడు లోక కల్యాణార్థ మవతరించిన పరమేశ్వరాంశావతార మని గ్రహింపవచ్చును కనుకనే యతడు జగత్కల్యాణకారకులైన సీతారాముల కల్యాణమునకు ప్రథానావలంబమైనాడు.

## రామాయణమున విశ్వామిత్ర ప్రవేశము

దశరథుడు శ్రీరామునకు వివాహము జేయ సంకల్పించి బంధుమిత్ర అమాత్యాదులతో సంప్రదించు సమయమున విశ్వామిత్రప్రవేశము జరుగును. ఈ సన్నివేశము విశ్వామిత్రునకు సీతారామ కల్యాణ నిర్వహణముతో సంబంధ మున్నట్లు గుర్తింపచేయును.

"అథ రాజా దశరథః తేషాం దారక్రియాం ప్రతి।
చింతయామాస ధర్మాత్మా సోపాధ్యాయ స్సబాంధవః॥
తస్య చింతయమానస్య మంత్రిమధ్యే మహాత్మనః ।
అభ్యాగచ్ఛ న్మహాతేజాః విశ్వామిత్రో మహామునిః ॥

బాల 18 38 39

విశ్వామిత్రుడు రాముని యాగరక్షణార్థమై పంపుమని కోరినపుడు రాముడు బాలుడు గాన, పంపుటకు సందేహించెనే కాని, దశరథుడు విశ్వామిత్రుని యెదుట రాముని వివాహమును గూర్చిన ప్రస్తావన జేయడు. వశిష్ఠుని సంప్రదించి రామలక్ష్మణులను పంపునపుడైనను విశ్వామిత్రునితో వివాహప్రసక్తి జేయడు యాగసంరక్షణానంతరము వెంటనే తన పుత్రులు తిరిగి రాగలరనెడి యుద్దేశ్యముతో బహుశః వారి వివాహప్రస్తా

వన దశరథుడు చేయకపోవచ్చును తలపెట్టిన యాగము పూర్తిచేసి విశ్వామిత్రుడు మిథిలానగరమునకు బోవ సమకట్టెను మిథిలానగరమున జరిగెడి యజ్ఞమును చూచుటకై మహర్షులందఱు రామలక్ష్మణులను ప్రోత్సహించిరి. అచట గల అపూర్వమైన ధనుస్సును తప్పక చూడ వలయు నని ఉద్బోధించిరి వారి కోరిక మేరకు రామలక్ష్మణులు విశ్వామిత్రునితో గలసి మిథిలానగరమునకు పోయిరి. అట విశ్వామిత్రుని కోరికపై జనకుడు శ్రీరామునకు ధనుస్సును చూపగా శ్రీరామునితో విశ్వామిత్రు డిట్లనెను.

"విశ్వామిత్ర స్స ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్।
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్॥"

బాల 67 12

"వత్స ! రామా ! ధనుస్సును చూడు" అని యర్థము.

విశ్వామిత్రవచనము నందలి గూఢార్థము రామునకు మాత్రమే తెలియును విశ్వామిత్రుడు శ్రీరాముని వత్స ! రామ ! అని సంబోధించి నట్లు సాధారణముగ తెలియవచ్చును. కాని, యా మహర్షి సంబోధన నాభిప్రాయము. సాధారణదృష్టిలో శ్రీరాముడు వేఱు విశ్వామిత్రుని దృష్టిలో శ్రీరాముడు వేఱు అందుచె 'వత్సరామ !' అను పదము ద్వారా శ్రీరామవిషయమై విశ్వామిత్రుని నిగూఢాశయము దర్శింప వచ్చును. వత్స శబ్దమునకు 'వక్ష'మని యర్థము "ఉరో వత్సం చ వక్ష శ్చ అని అమరము ప్రకరణము ననుసరించి రామా యనగా లక్ష్మి యని యర్థము. 'వత్సే రామా యస్య సః వత్సరామః' వక్షః స్థలమున లక్ష్మిని ధరించినవాడా ! అని యర్థము. రామా ! సీత లక్ష్మి

స్వరూపిణి నీకు నిత్యసహచారిణి. ఆమె సదా నీ వక్షఃస్థలమునందే విరా జిల్లుచుండును సీతతో నీకు వివాహము తథ్యము ఈ ధనుస్సు నిమిత్త మాత్రమే. నీవుగాక యీ ధనుస్సు నెవ రెక్కుపెట్టగలరు ? ధనుస్సు నెత్తుట నీకు లీలామాత్రమే. ధనుస్సు నెక్కుపెట్టుట, సీతావివాహము ఈ రెండును అవశ్యంభావ్యములు ఇది విశ్వామిత్రుని హృదయము. అందుకనియే "ధనుః పశ్య" అని యనినాడు వత్సరామా ! ఈ ధనుస్సు సంగతి చూడుము ఇది నీకు లెక్కలోనిది కాదు ఈ విధముగా ధను రారోపణము లీలామాత్రమని సూచించుచున్నాడు. విశ్వామిత్రుని హృది యమును శ్రీరాముడు గ్రహించి ధనుస్సు నెక్కుపెట్టగా ధనుర్భంగము జరుగును

విశ్వామిత్రుడు జనకునితో రామలక్ష్మణులకు ధనుస్సును జూపు మని యనినపుడు విశ్వామిత్రునకు సీతారామకల్యాణ సంకల్ప మున్నట్లు సూచిత మగుచున్నది. తరువాత జనకు డనిన మాటలు ఈ విషయమును దృఢపరచుచున్నవి.

"రామలక్ష్మణయోశ్చాపి దర్శయిష్యామి సువ్రత ।
యద్యస్య ధనుషో రామః కుర్యా దారోపణం మునే ॥
సుతా మయోనిజాం సీతాం దద్యాం దాశరథే రహమ్"

బాల 66 25

"రాముడు ధనురారోపణము జేసినచో సీత నిచ్చెదను" అని జనకు డనుమ. యోధానుయోధు లెందఱో యెత్తలేని ధనుస్సును పదు నారేండ్ల బాలుడెత్తు నని యనుకొనుట యెట్లు ? శ్రీరాముడు చిన్నవాడుగా

కన్పట్టవచ్చు శ్రీరాముని నిజతత్త్వము జనకవిశ్వామిత్రు లిద్దరికిని తెలి యును కావుననే యట్లనుట జరిగినది.

## శివధనుర్భంగము తత్త్వదర్శనము

సీతాకళ్యాణమునకు, శివధనుర్భంగమునకు సంబంధమేమై యుండును. బరువైన ధనుస్సు నెత్తుట దేహదార్ఢ్యమునకు సంబంధించిన విషయము అక్కడ బుద్ధిబలమునకు తావులేదు. జనకుడు గొప్ప తత్త్వవేత్త అట్టివాడు దేహబలమును పరీక్షించెడి ధనురారోపణ పరీ క్షను ఏర్పాటు చేయుటలో నాంతర్య మేమి? బ్రహ్మర్షియైన విశ్వా మిత్రుడు గూడ ఆ పరీక్షకు శ్రీరాముని నిలబెట్టుటలో గల కారణమేమి? అయిదు వేలమంది గూడ ఎత్తుటకు సాధ్యము కాని ధనుస్సును రాము డవలీలగా ఎట్లెత్తగలిగెను? ఇట్టి సందేహములు జిజ్ఞాసువులను వెంటా డుచునే యుండును ఈ విషయమును చూతము

రామాయణమున ప్రతి సన్నివేశము "రామాయణము, వేదావతార రూపము, తత్త్వరహస్యోపదేశకము" అను విషయమును స్ఫూర్తికి తెచ్చు నన్న విషయము మరువరాదు. అందుచే శ్రుతి స్మృతి పురాణేతి హాస పరిచయముతో ఈ సన్నివేశ స్వరూపమును దర్శింపవలసి యున్నది.

శివధనుస్సు లోకకల్యాణకర మని శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"శివం బభూవ తే ధనుః" రుద్రాధ్యాయము

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్"

ముండక 2 2 4, ధ్యానబిందు 19

అని ఈ రీతిగా ఉపనిషత్తులు ప్రణవమును ధనూరూపముగా చెప్పుచున్నవి

"ప్రణవోఽస్య ధనుః ప్రోక్తం శరో జీవ ఉదాహృతః"

అనుచు స్మృతులు ప్రణవమును శివధనుస్సుగా కీర్తించుచున్నవి. [చూ రుద్రాధ్యాయ విష్ణుసూరిభాష్య]

వాల్మీకి మహర్షియు శివధనుస్స్వరూపమును కాంతాసంమితముగా ఇట్లు దర్శింపజేయుచున్నాడు

"అశోభత తదా రామో ధనుర్విస్ఫారయన్ మహత్।
భగవానివ సంక్రుద్ధో భవో వేదమయం ధనుః"

యుద్ధకాండ 95 35

త్రిపురసంహార సమయమున వేదమయధనుస్సును ఎక్కుపెట్టిన ఈశ్వరునివలె రావణసంహారమునకై ధనుష్టంకారము జేయు శ్రీరాముడు ప్రకాశించెను

దీనిని బట్టి వాల్మీకిమహర్షి దృష్టిలో తత్త్వతః శివధనుస్సు వేదాత్మక మగు ప్రణవమే. ప్రణవమునకే శబ్దబ్రహ్మ యని పేరు. "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి" శబ్దబ్రహ్మరూపం



నిష్ఠాతులగువారే పరతత్త్వానుసంధానము జేయగలవారు శబ్దబ్రహ్మ నిష్ఠాతత్వ మనగా వేదమూల మగు ప్రణవస్వరూపానుసంధానము. సమస్తమైన ఓంకారము పరమేశ్వరవాచకము పరమేశ్వరాత్మకము. వ్యస్తమైన, ప్రణవము అకార ఉకార మకారాత్మకము. ఆ వర్ణములు మూడును క్రమముగా విశ్వ తైజస ప్రాజ్ఞులను బోధించుచుండును. విశ్వుని తైజసుని యందును, తైజసుని ప్రాజ్ఞుని యందును ప్రాజ్ఞుని నాదము నందును, లయము జేసి పరతత్త్వానుసంధానము చేయు క్రమము మాండూక్యో పనిషత్తుల యందును, ఉపాసనా సంప్రదాయము నందును చక్కగా వివరింపబడినది.

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్॥

ప్రణవము ధనుస్సు మనస్సు శరము మనస్సు అనెడి శరమును ప్రణవ మనెడి ధనుస్సున లగ్నము జేసి ఎక్కుబెట్టి లక్ష్యభూతుడగు బ్రహ్మను సాధించవలెను. అట్లు ప్రణవధనురారోపణము జేయగలిగిన జీవుడు బ్రహ్మవిద్యాప్రాప్తికి అర్హుడు. ఇట్టి ధనురారోపణము కామక్రోధోపహతులగు జీవు లందరికిని సాధ్యము గాదు ఉత్తమ సంస్కారసంపన్నుడగు సాధకుడు మాత్రమే దీనిని సాధించగలడు. అతడు గుర్వనుగ్రహపూతుడయియే లక్ష్యమును సాధింపగలడు. శ్రీరాముడట్టి ఉత్తమ సంస్కారసంపన్నుడు. గుర్వనుగ్రహప్రాప్త విద్యావివేక సంపన్నుడు. ఇట నొక విషయము గమనింపదగినది

జిజ్ఞాసువు లగు శిష్యులు ఉత్తమ గురువు నన్వేషించుచు,బోవుట లోకమున పరిపాటి. జిజ్ఞాసతో భక్తిశ్రద్ధలతో,తన కడకు వచ్చిన

శిష్యులకే విద్యోపదేశము చేయుట గురుసంప్రదాయము. "నాఽపృష్టః కస్యచిద్బ్రూయాత్" భక్తిప్రపత్తులతో వచ్చి యడుగనిదే విద్యోపదేశము చేయరాదని శాస్త్రాదేశము. కాని, శ్రీరామవిశ్వామిత్రుల విషయమున ఈ కథ ఇందుకు భిన్నముగా నడచినది తానుగా, శ్రీరాముడు విశ్వామిత్రుని యొద్దకు రా బూనుకొనలేదు అయోధ్యకు విశ్వామిత్రుడు వచ్చునను విషయము శ్రీరామునకు తెలియదు అయోధ్యకు వచ్చుటకు పూర్వము విశ్వామిత్రుడు శ్రీరాముని జూచియుండలేదు. కాని, అయోధ్యకువచ్చి, విశ్వామిత్రుడు తనకు శ్రీరాముని విషయము సంపూర్ణముగ, తెలియునట్లు చెప్పుట గమనించదగినది.

"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్।
వశిష్ఠోఽపి మహాతేజాః యే చేమే తపసి స్థితాః॥

"శ్రీరాముని విషయము నాకును, వశిష్ఠునకును ఈ మహాత్ములకు తెలిసినట్లుగా తండ్రి యైనను నీకు తెలియదు" అని విశ్వామిత్రులు డనుచున్నాడు తండ్రియైన దశరథునికి గూడ తెలియని శ్రీరాముని వృత్తాంతము విశ్వామిత్రు డెట్లు తెలిసికొనెను ఇది ఆశ్చర్యకరమైన విషయముకాదు. ఆయన బ్రహ్మర్షి. విశ్వమునకు మిత్రుడు, త్రికాలజ్ఞుడు దుష్టశిక్షణకై ధర్మరక్షణకై శ్రీరాము డవతరించుట విశ్వామిత్రునకు తెలియదా! కనుకనే, విశ్వరూపుడైన శ్రీరాముని వెదకికొనుచు తానే వచ్చెను విశ్వరూపు డయ్యెను, మానుషభావముతో నటించు శ్రీరాముని వెంటనిడుకొని పోయెను, విద్యల గరిపెను.

"కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్"॥

అని యనుచు కర్తవ్యముల ప్రబోధించెను "శిష్యస్తేఽహం"అని యనుచు శిష్యుడు సమీపించినపుడు విద్యోపదేశము చేయుట యనెడు సంప్రదాయమే కాక, లోకసంగ్రహార్థమై ఉత్తమ శిష్యుని వెదకికొనుచు గురువే స్వయముగ వచ్చి యుపదశించు ననెడి సంప్రదాయమును ఆచరణము ద్వారా విశ్వామిత్రుడు వెల్లడిజేసెను

ఈవిధముగా శ్రీరాముడు గుర్వనుగ్రహపాత్రుడై విద్యావివేక సంపన్నుడయ్యెను శ్రీరాము డట్టివాడని గుర్తించినవారు కాబట్టియే, జనక విశ్వామిత్రు లాతనిచే ధనురారోపణము చేయించి కృతకృత్యు లయిరి. ఈ విధముగా విశ్వామిత్రుడు సీతారామకళ్యాణమును జరిపి తన విశ్వామిత్రత్వమును మరియొకమారు నిరూపించుకొనెను. కావున,రామాయణములోని,విశ్వామిత్రపాత్ర నవగతము చేసికొనినచో, లోకకల్యాణార్థము సీతారామకల్యాణము జరిపించి ఆనందించువారు విశ్వామిత్రు లగుదురు. సీతారాములను విడదీయదలచినవారు రావణునివలె లోకకంటకు లగుదు రనియు తెలియును.

దశరథుడు శ్రీరాముని వివాహ విషయము వశిష్ఠాదులతో సంప్రదించు సమయమున విశ్వామిత్రుని తొలి ప్రవేశము రామాయణమున జరిగినది సీతారామకల్యాణానంతరము విశ్వామిత్రపాత్ర నిష్క్రమణము జరిగినది కనుక, రామాయణమున విశ్వామిత్రపాత్ర యొక్క లక్ష్యము సీతారామకల్యాణ నిర్వహణమె ఆయన తలపెట్టి యజ్ఞము కూడ సీతారామకల్యాణరూప కార్యసిద్ధికే.

సీతాకల్యాణము లోకదృష్టిలొ ఆదర్శదంపతుల కల్యాణము. అనాదిదంపతుల కల్యాణము సాధకుల దృష్టిలో బ్రహ్మవిద్యారూపిణి

మైన బుద్ధిని పరతత్త్వముతో అనుసంధానము చేయుటయే వేదవేత్తల దృష్టిలో వేదవాణిని లౌకికార్థములతో గాక, పరమార్థముతో యోజన జేయుటయే. "శ్రీరాముడు విదితాత్ముడు నేను విద్యాస్వరూపిణిని. మా దాంపత్యము విద్యకును, విదితాత్మునకును, [బ్రహ్మవేత్తకును] గల దాంపత్యమే. విదితాత్మునినుండి విద్యను విడదీయరాని యట్లు శ్రీరాముని నుండి నన్ను విడదీయ శక్యము కాదు" ఇవి సీత రావణునితో తన వాస్తవిక స్వరూపమును తెలియజేయుచు చెప్పిన మాటలు

"అహ మౌపయికి భార్యా తస్యైవ వసుధా పతేః।
వ్రతస్నాతస్య ధీరస్య విద్యేవ విదితాత్మనః
— సుందర 21 17

సీతాకల్యాణ మనగా, విద్యాస్వరూపిణియైన సీతతో విదితాత్ముడైన శ్రీరాముని గూర్చుటయే.

మొదట కామోపహతుడై వసిష్ఠునితో యుద్ధమునకు దిగిన విశ్వామిత్రుడే దుస్సాధ్యమైన దీర్ఘతపశ్చర్యాసాధనలతో క్షత్రియాహంకారము లను దిగనాడి తన బుద్ధిని ఏ బ్రహ్మవిద్యాస్వరూపిణినిగ జేసికొనెనో, అట్టి బ్రహ్మవిద్యాస్వరూపిణియైన సీతతో శ్రీరాముని గూర్చి ఆత్మానుభూతిని ప్రదర్శించిన విశ్వామిత్రుడు ధన్యజీవి ఆయన జీవితము సాధకుల కాదర్శప్రాయము.

విశ్వామిత్రుని రాకకు గల విగూఢాభిప్రాయము దశరథునకు తెలియకపోయినను, విశ్వామిత్రుని మొట్టమొదటగా జూచినపుడు దశరథుడనిన మాటలు ఈ శుభోదర్కమును సూచించుచున్నవి

"యథాఽమృతస్య సంప్రాప్తిః యథా వర్ష మనూదకే ।
యథా సదృశదారేషు పుత్రజన్మాఽప్రజస్యచ॥
ప్రణష్టస్య యథా లాభః యథా హర్షో మహోదయే ।
తదైవాగమనం మన్యే స్వాగతం తే మహామునే"

బాల 18 51, 52

విశ్వామిత్రుని రాక అమృతప్రాప్తి వలెను, అనావృష్టి పీడితులకు హర్షప్రాప్తి వలెను, సంతతిలేనివారికి సంతానప్రాప్తి వలెను, ప్రణష్టమైనదాని లాభము వలెను, అప్రయత్నముగ వివాహాది శుభోదయములు కలసివచ్చినపుడు హర్షప్రాప్తి వలె నున్నది.

దశరథునకు గలిగిన పూర్వానుభూతు లొక్క పర్యాయము స్మృతిపథమునకు వచ్చినవి. పూర్వ మంగదేశమున అనావృష్టి యేర్పడగా ఋష్యశృంగుని రాకతో సువృష్టి కలిగినది. అప్పటి కదియే అమృతప్రాప్తి. సంతానము లేక పరితపించు దశరథునకు పుత్రోదయమైనది ఇత్యాదులు పూర్వస్మృతులు శ్రీరాముని కల్యాణవిషయ ప్రస్తావన సమయమున విశ్వామిత్రుని రాక తన పుత్రులకు కలుగబోవు కల్యాణపరంపరలను, హర్షమును సూచించుచున్నది.

అప్రయత్నముగ దశరథుని ముఖము నుండి వెలువడిన ఈ వాక్కు సీతారామకల్యాణరూప మహోదయ స్ఫోరకమైనది. కనుక,

విశ్వామిత్రుడు సీతారామకల్యాణసంధాయకు డనుట యథార్థమే. ఈ విధముగా విశ్వామిత్ర స్వరూపమును భావన జేసినపుడు ఆ మహాత్ముని దివ్యచరిత మందరకును ఆదర్శప్రాయమై విరాజిల్లును లోకమున రామాయణగాధ గానము చేయబడునంతకాలము శ్రీరామునకు గురువుగా, సీతారామకల్యాణ సంధాయకుడుగా ఆ మహాత్ము డారాధింపబడుమనే యుండును.

"విశ్వస్య మిత్రం యోఽయం హి విశ్వం మిత్రం చ యస్యహి।
విశ్వం మిత్రం చ బ్రహ్మర్షిం విశ్వామిత్ర ముపాస్మహే"

# 5. రామాయణము - బంగారులేడి

పంచవటిలో మారీచుడు బంగారు లేడి రూపమును ధరించి సీతారామలక్ష్మణుల ముందు విహరించును. ఆ లేడిని తెచ్చిపెట్టుమని సీత రాముని కోరెను లోకమున బంగారు లేడి యుండుట అసంభవము. ఇది అంతయు మారీచుని మాయ, ఇది మాయాహరిణము దానిని సంపాదించు ప్రయత్నము వలదని, లక్ష్మణు డెంత వాదించినను శ్రీరాముడు హరిణమును వెంబడించి బ్రహ్మనిర్మితాస్త్రముతో సంహరించెను సంగ్రహముగా రామాయణములోని బంగారులేడి వృత్తాంతమిది.

లక్ష్మణు డనినట్లు సర్వధా అసంభవమైన కనకహరిణ వృత్తాంతమును కవి తన గ్రంథమున నిబంధించుటకు కారణ మేమి? ఇది యసంభవ మను విషయము లక్ష్మణునికి వలె సీతారాములకు తెలియదా? లేక ఇది కేవల చమత్కార కల్పనయా? మొత్తము మీద ఈ సన్నివేశము ద్వారా తెలియదగు విశేషాంశ మేదైన నున్నదా? లేదనుచో, మహర్షి వాక్యముల కనర్థకత్వ మాపాదించినట్లగును. కనుక నీ విషయము సూక్ష్మముగా పరిశీలనీయము

కనక హరిణమును గూర్చి లౌకిక వాఙ్మయమున నెచటను ప్రస్తావన లేదు ఉన్నచో, అది రామాయణగాథానువాదరూపమే. కనుక రామాయణము వేదావతారరూప మని చెప్పబడినందున వేదసంప్రదాయా నుగుణముగనే ఈ సన్నివేశము ద్వారా తెలియదగు విశేషాంశముల దర్శింపవలసియున్నది.

పూర్వగాథ ననుసరించి మారీచుని రాక్షసునిగా నెఱుగుదుము. అతడు ప్రస్తుతము హరిణీరూపమును దాల్చుటకు దారితీసిన సంఘటనలను పరిశీలించినచో ఈ కనకహరిణీస్వరూపము క్రొంతవఱకు తేటపడును.

విశ్వామిత్రుని యాగసందర్భమున రామబాణప్రభావము మారీచుని ప్రవృత్తిలో కొంత మార్పు తెచ్చినది కాని, పూర్తిగా రాక్షస ప్రవృత్తి వీడనందున స్వజనులతో కలిసి మృగరూపియై మునిజనమును మరల్క పీడింప ప్రారంభించెను. అందుచే మరల రామబాణహతుడయ్యెను. ఇట్లు రామబాణ మాతనిని రెండు పర్యాయములు సుశిక్షితుని కావించినది. ఈవిధముగా రెండు మారులు శ్రీరాముని దర్శనము వలనను రామబాణస్పర్శవలనను మారీచుని నుండి రాక్షసప్రవృత్తి వైదొలగినది ఇపుడాతడు ఆశ్రమవాసి, తపోయోగనిష్ఠుడు, రామపాదారవిందలగ్నమానసుడు. పరమార్థదర్శనైకరంతుడు రావణుడు మారీచుని దర్శించిన విధము కవి యిట్లు వర్ణించుచున్నాడు.

"తత్ర కృష్ణాజినధరం జటావల్కలధారిణమ్।
దదర్శ నియతాహారం మారీచం నామ రాక్షసమ్"

రామా. అరణ్య 38 38

మారీచుడు జన్మనా రాక్షసుడు. ప్రస్తుతము కృష్ణాజినజటావల్కలధారి నియతాహారుడు రావణుడు దర్శించిన మారీచస్వరూప మిది. మునివృత్తి యవలంబించియున్నట్లు ఈ వర్ణన వలన తెలియును ఇది కేవలము బాహ్యవేషమే, లోకవంచనయే యని అనుకొనుటకును వీలులేదు మనసా వాచా కర్మణా అతడు మునియె. కనుకనే, తనకు

ప్రభువైన రావణునకు గూడ నిర్భయముగా రామతత్త్వము నిట్లు ఉపదేశించెను "

"రామో విగ్రహవాన్ ధర్మః సాధు స్సత్యపరాక్రమః।
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవానివ"॥

రామబాణహతుడయ్యును మారీచుడు శ్రీరాముని దుష్టశత్రువుగా పరిగణింపలేదు. అతని దృష్టిలో శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మము ఒక అయోధ్యనే గాదు, ఇంద్రునివలె మూడు లోకముల నేలజాలిన ప్రభువు. ఇట్లు రామతత్త్వమును వివరించి ఇంకను తన అనుభూతి నిట్లు వివరించెను.

"ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసోఽహం సమాహితః।
వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్॥
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే।
రామ మేవ హి పశ్యామి రహితే రాక్షసాధిప॥
దృష్ట్వా స్వప్నగతం రామ ముద్భ్రమామి విచేతనః।
రకారాదీని నామాని రామత్ర స్తస్య రావణ॥
రత్నాని చ రథాశ్చైవ త్రాసం సంజనయంతి మే,
అహం తస్య ప్రభావజ్ఞః న యుద్ధం తేన మే క్షమమ్॥
రామాయణ అరణ్య 40 18 నుండి 22 వరకు

ప్రహ్లాదున కంతయు పరమేశ్వరలీలామయముగ కన్పించినట్లు మారీచున కంతయు రామమయముగనే కనుపట్టుచున్నది "అహం తస్య ప్రభావజ్ఞః

"నేను శ్రీరాముని పరాక్రమమును జూచి భయపడుచున్నాను" అని చెప్ప లేదు "ఆ మహానుభావుని ప్రభావము నెఱుగుదును అట్టి మహాత్ముల అనుగ్రహమే కోరదగినది గాని యుద్ధము కాదు." ఇది మారీచుని ప్రస్తుత మానసిక ప్రవృత్తి. ఇంతియే గాదు, అంతటి మహనుభావుని చేతిలో మరణము కూడ ధ్యేయమే యనుచున్నాడు.

"అనేన కృతకృత్యోఽస్మి మ్రియే యదరిణా హతః ॥
దర్శనా దేవ రామస్య హతం మా మవధారయ"

అరణ్య 41 17

మారీచుని కృతకృత్యత్వమును వ్యాఖ్యాత లిట్లు వివరించిరి

"విశ్వామిత్ర యాగరక్షణప్రభృతి ఖరాది వధాంతాతి
మానుష చారిత్రాను స్మృతి కృతా సాధారణ మహిమ
స్ఫూర్త్యా రాఘవం పరమపురుషం నిశ్చితవతః మమ
తత్కరప్రాపిత మరణస్య పరమ పురుషార్థత్వాదితి భావః"
— గోవిందరాజీయవ్యాఖ్య

విశ్వామిత్రుని యాగరక్షణము మొదలు ఖరదూషణాది వధపర్యం తము నడచిన శ్రీరాముని యతిమానుష చరిత్రము తలచుకొనిన కొలది, మారీచునకు శ్రీరాముడు పరమ పురుషుడుగా సాక్షాత్కరించు చున్నాడు అట్టి మహాత్ముని చేతిలో మరణము కూడ కృతార్థతకు కారణమే. లోక ములో శత్రువుచేతిలో చచ్చుట కృతకృత్యతకు కారణము గాదు. ప్రకృ తమున, శ్రీరాముని వంటి శత్రువుని చేతిలో మరణము పరమ పురు

షార్థప్రాప్తికి కారణము, కనుకనే రావణుడు తన ప్రేరణచే హరిణరూప మును దాల్చుట కంగీకరించిన మారీచు నిట్లు ప్రశంసించుచున్నాడు.

"ఇదానీ మసి మారీచః పూర్వ మన్యో నిశాచరః"

అరణ్య 42 6.

ఇంతకు పూర్వము నీవు ఎవరో యొక సామాన్య రాక్షసుని వలె ప్రవర్తించితివి నీ శౌర్యపరాక్రమముల మంచితివి ఇప్పుడు నీవు నిజముగ మారీచుడవు. యథాపూర్వము నీ మాయాశక్తి నుపయోగించి, రాముని వంచించుము. కథాపరముగ రావణుని దృష్టిలో నింతియే.

మారీచునకు స్ఫురించిన యర్థము వేరు. యథార్థముగా మారీచుని దృష్టిలో రాక్షసప్రవృత్తి గల మారీచుడు వేరు. పరమ పురుషార్థ దర్శన లాలసుడైన ఇప్పటి మారీచుడు వేరు. అతనికి జన్మతః సిద్ధించిన స్థూల శరీరమున మార్పు లేదు.అతని మనస్సు (సూక్ష్మశరీరము)నిరంతర రామ నామ ధ్యానాంకితమై హితరమణీయమైనది. వైదిక సంప్రదాయము ననుసరించి హితరమణీయత్వమే హిరణ్యత్వము అతని బుద్ధి ఇపుడు హిరణ్మయరూపిణి అతడు మునియై నిరంతర సవితృ దేవతాదివశ భర్గోపాసన చేయుట వలన (గాయత్రీ మహామంత్రోపాసన వలన) అతని బుద్ధియు ఉపాస్య దేవతా తాదాత్మ్యము నొంది దివ్య తేజస్సంపన్నమైనది. (హిరణ్మయరూపిణియైనది) కనుకనే, తత్త్వతః మారీచుడైనాడు 'మరీచీ నా మయం మారీచః" అని మరీచ శబ్దమునకు వ్యుత్పత్తి మరీచుల గో సూర్యరశ్ములు. మరీచుల యొక్క ప్రాభవమును తైత్తిరీయారణ్యక శ్రుతి ఇట్లు వివరించుచున్నది.

"మరీచయ స్స్వాయంభువాః యే శరీరా ణ్యకల్పయన్"

ఈ మంత్రమును శ్రీ సాయణు లిట్లు వ్యాఖ్యానించిరి. "స్వయం భూః సవితృమండలమధ్యవర్తీ పరమాత్మా, తస్యే మే స్వాయంభువాః యే మరీచయః రశ్మయః శరీరాణి ఆత్మోపాసక దేహాన్యకల్పయన్ కృత వంతః తే మరీచయః దేహం కల్పయన్తు॥"

సా భాష్య

కిరణములు సూర్యునినుండి వచ్చుచున్నవని సామాన్యముగ దెలయుదు కాని, ఇవి స్వాయంభువములు. సూర్యమండలాంతర్వర్తియైన హిరణ్మయపురుషుడు స్వయంభువు ఆ దివ్యమూర్తి యొక్క దివ్య తేజో రూపములే ఈ కిరణములు కాన, నివి స్వాయంభువములైనవి

"యోఽసా వాదిత్యమండలే పురుషస్సోఽసావహమ్"

వాజసనేయశ్రుతి

"ఆదిత్యమండలాంతర్గత దివ్యజ్యోతియే నేను (నా యాత్మ)" అని యనుచు సవితృదేవతాభర్గస్స్వరూపము నెవరు ధ్యానముజేయుదురో (దీనినే అహంగ్రహోపాసన యందురు). అట్టి మహాత్ములకు ఆత్మోపాసనాయోగ్య దివ్యదేహములను స్వాయంభువములైన మరీచులు కల్పించుగాక " అని యర్థము

కనుక, స్వాయంభువ మరీచుల వలన పైన చెప్పిన రీతిగ ఆత్మో పాసకులకు హితరమణీయమైన హిరణ్మయ దేహము ప్రాప్తించు నని పై శ్రుతి వలన తెలియును.

15)

"మరీచీనాం పద మిచ్ఛన్తి వేధసః" (ఉత్తర నారాయణీయమ్) ఇత్యాదిశ్రుతులు నీ యర్థమునే ప్రబోధించుచున్నవి. మరీచుల వలన అట్టిదేహమును పొందినవాడు తాత్త్వికముగ మారీచుడె యగుదురు. "మరీచీనా మయం మారీచః" అను నిర్వచనము ననుసరించి నై నిశాచర శరీరముతో కన్పట్టినను సూక్ష్మదేహ (మనస్సు) సంస్కారప్రాబల్యము ననుసరించి ఈ మారీచుడును తత్త్వతః మారీచుడే యగును. అతని బుద్ధి హిరణ్యవర్ణయే యగుచున్నది. కనుక మారీచుడు తన తపస్సాధనచే ఉపదిష్ట మారీచత్వమును సాధించినాడు రావణుడును వేదార్థకోవిదుడు కనుకనే "ఇదానీ మసి మారీచః పూర్వ మన్యో నిశాచరః" అని అప్రయత్నముగ అతని యథార్థస్థితినే వివరించినవాడైనాడు ఇది అతనికి దైవప్రేరితమైనవాక్కుగా గావచ్చును

మారీచుని ఉపాస్యదేవత సవితృభర్గ స్వరూపిణియైన సావిత్రి. అమియే గాయత్రి అమెయే హిరణ్యహారిణి యైన శ్రీమాత శ్రుతి శ్రీసూక్తమున "హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్" అని పరాదేవతను కీర్తించినది ఇది శ్రీసూక్తమున మొదటి మంత్రము

"హే జాతవేదః, జాతప్రజ్ఞ। అగ్నే। త్వం హిరణ్యవర్ణాం హిరణ్యస్య సువర్ణస్యేవ వర్ణః కాంతిః యస్యాః స్తాం హరిణీం హరిత వర్ణాం హరిణీరూపధరాం వా "శ్రీ ర్ధృత్వా హరిణీరూప మరణ్యే సంచచార హ" ఇతి పురాణాత్.

సాయణభాష్య.

"హిరణ్యవర్ణాం హిరణ్యవర్ణరూపాం. జ్ఞాన మాత్మని భా సూర్యే చంద్రే జ్యోత్స్నా చ ఖే ధ్వనిః వర్ణా హిరణ్యే పయసి ఘృతం త్వమసి మాతృకే" హరిణిం హర్యిణీరూపామ్.

"యజ్ఞోఽగ్ని ర్మృగరూపేణ ధావతి స్మ పురాధ్వరే।
రుద్ర స్త్వాకృష్య తచ్ఛక్తిం మృగీం జగ్రాహ వైష్ణవీమ్॥
ఇతి వైవర్త దక్షాధ్వరాధ్యాయో క్తేః
శ్రీకంఠభాష్య

ఈ రెండు భాష్యముల యందును పరాదేవత హిరణ్యహరిణీ (బంగారువన్నె గల లేడి) రూపిణిగా వివరింపబడినది. పరాదేవత హిరణ్య హరిణరూపధారిణియై అరణ్యమున సంచరించుట పురాణప్రసిద్ధ మనియు విద్యారణ్యులు వివరించిరి

అట్లు హిరణ్య హరిణరూపిణియైన పరాదేవత నుపాసించి మారీచుడు హిరణ్యహరిణరూపుడైనాడు అనగా, ఉపాస్యదేవతానన్య రూపుడై ప్రత్యక్షముగ ఉపాస్యదేవతామూర్తియైన సీతయెదుట తదన న్యత్వమును దర్శింపజేయుచు సంచరింపదొడగెను ఆ హరిణము ఆత్మానన్యరూప మని సీతకు తెలియును హరిణరూపాకృష్టయైన సీత రామలక్ష్మణులను బిలిచి హిరణ్య హరిణస్వరూపమును వర్ణించిన విధము పరిశీలింతుదము

"నచాస్య సదృశో రాజన్ దృష్టపూర్వో మృగః పురా।
తేజసా క్షమయా దీప్త్యా యథాఽయం మృగసత్తమః॥
నానావర్ణవిచిత్రాంగో రత్నబిందుసమాచితః।
ద్యోతయన్ వన మవ్యగ్రం శోభతే శశిసన్నిభః॥
అహో రూప మహోలక్ష్మీః స్వరసంపచ్చ శోభనా।

అరణ్య 43 12 నుండి 14 వరకు.

ఈ వనమున ఎన్నియో మృగములు సంచరించుట చూచితిమి. ఆ మృగము లేవియు దీనికి సాటి రావు. ఇది లోకోత్తరమైన మృగము. దీని తెజస్సు సహనశీలత (క్షమ) దీప్తి అనన్య సామాన్యములు. రత్న బిందువ్యాప్తమై హైమరాజత వర్ణశోభితమై దీని శరీరము చంద్ర సంకాశమై అత్యంత ఆశ్చర్యకరమైనా హృదయము నాకర్షించుచున్నది. ఇంతే గాదు దీని రూపము, దివ్యశోభ, స్వరసంపద అన్నియు మంగళకరములే (శోభనా). మృగ మెమి? లొకోత్తర కల్యాణకర లక్షణములతో నొప్పుచేమి? ఇంతకన్న నాశ్చర్య మేది యుండును? కాన, క్రీడార్థమై నాకు కొనితెండు ఇవి సీతావచనములు.

సీతావచనముల ప్రబోధితుడై శ్రీరాముడు ఇది మారీచ మాయా విలాస మని శంకించుచున్న లక్ష్మణునితో ఆ మాయామృగస్వరూపమును వర్ణించిన విధానము చూతము

"తేన కాంచనరోమ్ణా తు మణిప్రవరశృంగిణా।
తరుణాదిత్యవర్ణేన నక్షత్రపథవర్చసా॥
బభూవ రాఘవస్యాపి మనో విస్మయ మాగతమ్।
ఏవం సీతావచ శ్శ్రుత్వా తం దృష్ట్వా మృగ మద్భుతమ్॥
లోభిత స్తేన రూపేణ సీతయా చ ప్రచోదితః।
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః॥
పశ్య లక్ష్మణ వైదేహ్యాః స్పృహాం మృగగతా మిమాం।
రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి॥
న వనే నందనోద్దేశే న చైత్రరథసంశ్రయే।
కుతః పృథివ్యాం సౌమిత్రే యోఽస్య కశ్చి త్సమో మృగః॥

ప్రతిలోమానులోమాశ్చ రుచిరా రోమరాజయః।
శోభంతే మృగ మాశ్రిత్య చిత్రాః కనకబిందుభిః॥
పశ్యాస్య జృంభమాణస్య దీప్తా మగ్నిశిఖోపమామ్।
జిహ్వాం ముఖా న్నిస్సరంతీం మేఘాదివ శతహ్రదామ్ ॥
ఇత్యాది అరణ్య 43 21 నుండి 27 వరకు

"లక్ష్మణా! ఈ మృగమును చూడుము ఈ మృగవిషయమై సీతకే కాదు, నాకును స్పృహ కలుగుచున్నది ఆమె చెప్పినది యధార్థము ఇట్టి మృగము నందనవనముననే కాదు, చైత్రరథముననే కాదు, దీనికి సాటియైన మృగము ఎచటను లేదు. దీని కాంచన రోమములు, మణిఖచితములైన శృంగములు, తరుణాదిత్యవర్ణము, నక్షత్రముల వలె విరాజిల్లెడి కనక బిందువులు, దీని ముఖము నుండి అగ్నిశిఖవలెను, విద్యుల్లతవలెను వెలువడెడి జిహ్వ అంతయు హిరణ్మయరూపమే, ఈ రూపము ఎవరికి ఆశ్చర్యమును కలిగించదు." ఇవి శ్రీరాముని వచనములు

సీతారాముల మృగవర్ణనము దాదాపు ఒకే తీరున నడచినది ఈ వర్ణనలు వేదవాక్యార్థ తత్త్వపరిశీలకులకు పరాదేవత యొక్క వర్ణనలను స్ఫురణకు తీసికొని రాక మానవు "బాలారుణప్రభా, తరుణాదిత్య సంకాశా, చంద్రసంకాశా, హిరణ్య వర్ణా హరిణీ, హిరణ్యరజతస్రజా, చంద్రా, హిరణ్మయీ లక్ష్మీః, తటిల్లతాసమరుచిః" ఇట్టివి పరాదేవత, యొక్క వర్ణనలు రామాయణమునందలి మాయామృగవర్ణనకు పరాదేవతా వర్ణనతో సారూప్యముండుట స్పష్టముగా గాంచనగును

శ్రీ ర్ధృత్వా హరిణీరూప మరణ్యే సంచచార హ" అని పూర్వోదాహృత విద్యారణ్యభాష్యోదాహృత పురాణవచనము పరాదేవత హరిణీ

రూపమును ధరించి వనమున సంచరించునని చెప్పుచున్నది. ఈ హిరణ్మయ హరిణ వనసంచారము గూడ ఆ పుష్ట్ర ప్రసిద్ధిని స్మరింప జేయుచున్నది. ఇట్లు పురాణ ప్రసిద్ధినే గాక వేద ప్రసిద్ధిని గూడ స్మరింప జేయు చున్నది.

"ఇంద్ర తుభ్య మిదద్రివోఽనుత్తం వజ్రిన్ వీర్యమ్.
యద్ధ త్యం మాయినం మృగం తము త్వం మాయయావధీ
రర్చన్నను స్వరాజ్యమ్"
ఋ. 1 80 7

"యద్ధ యస్మాత్ఖలు మాయినం మాయావినం త్యం తం ప్రసిద్ధం వంచయితారం లోకోపద్రవకారిణ మిత్యర్థః మృగం మృగరూప మాపన్నం తం వృత్రం త్వం అపి మాయయా ఏవ అవధీః హతవానసి. (అతః) తవైవ వీర్యం సామర్థ్యం అనుత్తం శత్రుభిరతిరస్కృతమ్"
సా. భాష్య.

ఇంద్రః లోకవంచకుడై లోకోపద్రవకారియై ప్రసిద్ధుడైన హరిణ రూప ధరుడగు (మృగరూపమాపన్నం) ఆరాక్షసుని నీవు మాయచేతనే సంహరించితివి. కావున నీ సామర్థ్యము శత్రుదుర్భేద్యము" అని యర్థము.

ఇచట శ్రుతి మాయా మృగ రూపధరుడై లోకోపద్రవకుడైన రాక్షసుని ఇంద్రుడు తన మాయాశక్తిచే సంహరించినట్లు ఒక ఇతిహాస మును చెప్పినది. ఈ ఇతిహాసరూపమైన శ్రుతికి భాష్యరూపమే రామాయణమునగల హిరణ్య హరిణ వృత్తాంతము.

ఈ మంత్రమున కర్ధము యధాతధముగ చెప్పబూనుచో శ్రుతి యొక ఇతిహాసమును మాత్రమే చెప్పినదని తెలియగలము. ఈ యర్థము మాత్రమె శ్రుతికి ఉద్దిష్టమైనదని గ్రహించుచో పరమేశ్వరుడు రాక్షస సంహారము చేసెనని మాత్రమే తెలియును అంతకంటె తెలియదగిన విశేషాంశమేమియు నుండదు.

కావుననే "ఇతిహసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అను సంప్రదాయమేర్పడినది· "ఇతిహాసపురాణములచే వేదతాత్పర్యావధారణము చేయనగును అని ఈ సూక్త్యర్థము ఇతిహాసమనగా పురావృత్త కధన మని సామాన్యముగ అర్థము అంతియే గాదు అనాదిసిద్ధ బ్రహ్మ విద్యాప్రతిపాదకము

"ఇతిహాసం అనాదిసిద్ధ బ్రహ్మవిద్యాప్రతిపాదకత్వాత్"
మహేశ్వరతీర్థవ్యాఖ్య రామా యుద్ధకాండ 120 32

కథావ్యాజముతో ఉపనిషత్ప్రతిపాదిత వేదాంతార్థోపదేశమే ఇతిహాసముల పరమలక్ష్యము. పురాణములునట్టివే ఇతిహాసములందు ఉపక్రమోపసంహారములుగల ప్రధానకథావర్ణనముండును పురాణములం దట్టిదియుండదు ఇంతియె రెంటికిగల భేదము. ఉపక్రమోపసంహారములుగల శ్రీరామకథా వర్ణనాత్మకముగుటచే రామాయణ మితిహాసముగూడ నగును పై శ్రుతియందు గల మాయామృగ వృత్తాంతమును రామాయణము నందు గల మారీచ మాయామృగ వృత్తాంతముతో సమన్వయము చేసికొనినపుడే వేదవాక్య గత విశేషార్థావ గతి కలుగును ఈ విషయమును భారత వ్యాఖ్యానమున శ్రీ నీలకంఠ పండితు డిట్లు వివరించుచున్నాడు

"ఇతిహాసపురాణాభ్యాం వేదంసముపబృంహయేత్
బిభే త్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రతరిష్యతి"
మహాభారత ఆదిపర్వ 1 87

"ఇతిహాసేతి" యద్ధ త్వం మాయినం మృగం తము త్వం మాయయావధీ" రితి మంత్రావయవో హి రామాయణీయ

మారీచవధక్షేనైవ ఉపబృంహితుం శక్యో న త్వన్యేన. అత స్తస్మాదల్పశ్రుతా ద్వేదస్య భయ ముచిత మేవ। వేదార్థ జిజ్ఞాసునా ఇద మవశ్య మధ్యేయమిత్యర్థః"

నీలకరః—

"పైన ఉదహరింపబడిన మాయామృగ వధ బోధకమైన వేద వాక్యముయొక్క తాత్పర్యము రామాయణమునందలి మారీచ వధ స్వరూపము నెరిగిన వానిచేతనే వివరించుటకు శక్యమగును గాని ఇతరులచేత గాదు కావున ఇతిహాస పురాణ రహస్యానభిజ్ఞుడు అల్పశ్రుతుడు, అట్టి వానిని చూచి వేదము భయపడుట సమంజసమే కావున వేదార్థజిజ్ఞాసువులగు సాధకులు ఇతిహాసములను తప్పక అధ్యయనము చేయవలెను."

పై నీలకంఠవ్యాఖ్యననుసరించి "రామాయణీయ మారీచ మాయామృగవృత్తాంతము వేదార్థోపబృంహకము వేదప్రసిద్ధము" అని తెలియును. కావున వేదవాక్యములను రామాయణవచనముల నన్నింటిని సమన్వయించుకొనుచు పురాణ ప్రసిద్ధిని దర్శించుచు కనక హరిణ వృత్తాంత తాత్పర్యమును దర్శించవలయును కేవల కథాపరముగ మాత్రమే దర్శింపరాదు. ఈ విషయమును జూతము.

కనకహరిణ విషయమై సీతకు గలిగిన కోరిక కేవల స్త్రీ స్వభావ జనిత తాత్కాలిక కుతూహలము వలనగాదు. ఈ విషయము శ్రీరాముడే లక్ష్మణున కిట్లు స్పష్టము జేయుచున్నాడు.

"చత్వారి మఖిలం నృాణాం ధనం నిచయ వర్ధనమ్
మనసా చింతితం స్వ్యం యథా శుక్రస్య లక్ష్మణ॥
అర్థి యేనార్థకృత్యేన సంవ్రజ త్యవిచారయన్
తమర్థ మర్థశాస్త్రజ్ఞాః ప్రాహు రర్థ్యాశ్చ లక్ష్మణ॥

అరణ్య 43 32, 33

"నిచయవర్ధనం కోశవర్ధనం తద్వన్యం ధనం నృణాం సారం అతిప్రశస్తం భవతి శుక్రం బ్రహ్మ "సపర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణం" ఇతి శ్రుతేః ఏవం చ శుక్రం బ్రహ్మలోకం ప్రాప్తస్య తద్రూప మాపన్నస్య మనసా చింతితం తత్సర్వం సంకల్పమాత్రసిద్ధం సర్వం భోగ్యవస్తు యథా సర్వస్మా త్సారతరం తద్వత్ నను తథాఽపి విచార్య కర్తవ్యమ్. తత్రాహ అర్థీతి. అర్థాపేక్షః పుమాన్ యేన అర్థకృత్యేన అర్థనిమిత్తేన కర్తవ్యేన కర్మణా తత్సౌందర్యా దాక్షిప్త హృదయః అవిచారయన్నేవ వ్రజతి తత్సంపాదనార్థం తమేవ అర్థ్యాః అర్థసంపాదన చతురాః అర్థశాస్త్రజ్ఞాః అర్థపదవాచ్య మాహుః"

తిలకవాఖ్య

"లక్ష్మణా! సీత బంగారులేడిని అర్థించుచున్నది కాదనకుము. రాజులు వేటాడి ఎన్నో వన్య వస్తువులతో తమ కోశములను నింపుకొనుచుందురు. సీతచే అర్థింపబడునట్టి ఈ మాయామృగము గూడ వన్యవస్తువే ఇట నొక విశేషము గమనింపవలయును. లోకమున సాంసారిక వ్యామోహ మున చిక్కబడిన వారి కోరికల కంతులేదు. అట్లు కోరువారు పామరులు.

నిజమైన అర్థులు కారు వారిచే కోరబడునది నిజమైన అర్థము గాదు బ్రహ్మభావాపన్నులైన మహాత్ములు అర్థించు అర్థమే పరమార్థము. ఏలయన, వారు నిస్సంగులు, నిష్కాములు లౌకికార్థములు పరమార్థములు కావని వారెరుగుదురు. అందుచే లౌకికార్థముల ప్రాప్తికై వారు నన్నడు ఉత్సాతలూగరు సంకల్పమాత్రముననే భోగ్యవస్తుజాతి మంతయు సిద్ధమగుచుండును అట్టివారు కామధేనువులు అట్లు ఉపస్థితమైనంత మాత్రమున, ఆ భోగ్యవస్తుజాత విషయమై వారి దృష్టియుండదు అవి మిథ్యాభూతము లని వారెఱుగుదురు కాని యొకప్పుడు అట్టి జ్ఞానులు ఒకానొక యాంతర ప్రేరణచె సౌందర్యాక్షిప్త హృదయులై ముందు వెనుకలు విచారింపకయే తత్ప్రాప్తికై యత్నించెదరు దానిని మనసార కాంక్షింతురు. అట్టి మహాత్ములచే అర్థింపబడెడి అర్థమే అర్థము. అదియే సారవత్తరమైనది వారే నిజమైన అర్థులు అని అర్థశాస్త్రజ్ఞుల నిర్ణయము "అని పై శ్లోక తాత్పర్యము

ప్రకృతమున, సీతచే కోరబడిన వన్యమృగరూపమైన యర్థము అట్టిది, అతిప్రశస్తమైనది. (సారాత్సారతరమ్) సారాత్సారతరమైనది పరాదేవత.

> "జ్ఞాన మాత్మని భా సూర్యే చంద్రే జ్యోత్స్నాచ ఖే ధ్వనిః
> వర్ణా హిరణ్యే పయసి ఘృతం త్వ మసి మాతృకే॥
>
> అగస్త్యకృతశ్రీస్తుతి

ఆత్మవిషయకజ్ఞానము, సూర్యతేజము, చంద్రకాంతి, ఆకాశమున ధ్వని (ప్రణవము) హిరణ్యవర్ణము, పయస్సున ఘృతము పరాదేవతా రూపములు. కాన, సర్వభూతపదార్థ మంతయు పరాదేవతాస్వరూపమె

ప్రకృతమైన మారీచుని హిరణ్మయ హరిణరూపము శ్రీసూక్త ప్రతిపాదిత పరాదేవతారూపమే కనుక, హరిణమును జూచి శ్రీరాముఁ డనిన మాటలు ఈ విషయమునే స్పష్టికరించుచున్నవి.

"ఏషచైవ మృగశ్శ్రీమాన్ యశ్చ దివ్యో నభశ్చరః।
ఉభా వేతౌ మృగౌ దివ్యౌ తారామృగమహీమృగౌ॥

అరణ్య 43 38

ఈ కన్పట్టెడి మృగము చంద్రుని యందుండెడి మృగము ఈ రెండును లోకవిలక్షణములైన దివ్యమృగములు ఇచట కనకహరిణమును జూచి శ్రీరాముడు 'శ్రీమాన్' అని అనుచు ఈ కనకహరిణము శ్రీసూక్తప్రతిపాదిత హిరణ్యహరిణానన్యరూప మని గుర్తింపజేయు చున్నాడు ఇచట హిరణ్యహరిణము దివ్యమృగ మని చెప్పబడుచున్నది. వేదమాతను దివ్యహరిణముగా వర్ణించుట సంప్రదాయము వేదమయ మైన మృగమును (హరిణమును) శివుడు ధరించుచున్నట్లు నీలకంఠ విజయ చంపూ గ్రంథమున వర్ణింపబడినది.

'అన్యతో జిగమిషన్త మివ ప్రకృతిచాపలేన వేదమయం మృగం అపరిపాదనియంత్రణేన. నియచ్ఛన్తం పాణిన కరేణ"

నీలకంఠవిజయచంపు 4 ఆశ్వాస

ఈ కన్పట్టుచున్న హిరణ్యహరిణము చంద్రమండలగత హరిణము వేదమాతృస్వరూపములే శ్రీమాతృస్వరూపములే లక్ష్మణుడు శంకించినట్లు ఇది కేవలము రాక్షసమాయా విలాసము గాదు. వాల్మీకి మహర్షిచె కవితా శిల్పమును ప్రదర్శించుటకు కల్పింపబడిన వినోదవస్తువు గాదు కనుకనే.

"రూపశ్రేష్ఠతయా హ్యేషః మృగోఽ ద్య న భవిష్యతి"
అనుచు శ్రీరాముడు చెప్పుట సార్థక మగుచున్నది.
ఈ వాక్యమును వ్యాఖ్యాత లిట్లు వివరించిరి.

"రూపేణ అలౌకిక విచిత్రస్వరూపేణ శ్రేష్ఠతయా సర్వశ్రేష్ఠ రూపేణహేతునా అద్యైష మృగో న భవిష్యతి న జీవిష్యతి జీవిత మస్య న సంభావిత మిత్యర్థః ప్రాయేణ మృగత్వ మత్ర న సంభా విత మితికతకః"

తిలకవ్యాఖ్య

"అలౌకికవిచిత్రరూపము కలిగి సర్వశ్రేష్ఠమైన దివ్యరూపముచే నొప్పుటచే ఈ హిరణ్యహరిణము లౌకిక మృగము కాదు ఇట జీవ కోటికి చెందిన సామాన్యమృగము గాదు. లోకోత్తర దివ్యహరిణము

"మాయినం మృగం మాయయా అవధీః" అని శ్రుతి వర్ణించినది" ఇంద్రుడు, మాయామృగమును మాయతో సంహరించె నని మంత్రార్థము పారమైశ్వర్య సంపద గలిగిన శ్రీరాముడే ఇటు ఇంద్రుడు రావణుని ప్రేరణచె మాయామృగరూపధారియైన మారీచుడే ఇటరాక్షసుడు ఇంద్రుడు మాయచే రాక్షసుని సంహరించెను శ్రీరాముడు మాయాశక్తిరూపిణి యైన సీత ప్రేరణతో మాయామృగమును సంహరించెను. ఇంద్రునిచే హతుడైన రాక్షసుడు లోకోపద్రవకారకుడు. రామునిచే నిహతుడైన మారీచుడు తాపసవృత్తి యవలంబించి ధర్మపథమున ప్రవర్తించుచున్నాడు గదా! అట్టివాడు లోకోపద్రవకారి యగుట యెట్లు? ఈ విషయము పరిశీలింప దగినది.

మారీచుడు సహజసిద్ధ వైరాగ్యసంపదతో తాపసవృత్తి నవలంబించలేదు. రెండు పర్యాయములు రామబాణముల చవి జూచి రాముని తోడ విరోధము ఆత్మవినాశకం మని గుర్తించినాడు. శ్రీరాముని ప్రభావమునకు భయపడి తాపసవృత్తిని దాల్చెను మారీచుని వర్ణనలలో ఆ భయమడుగడుగున ప్రస్ఫుట మగుచున్నది ఈ భయమే అతడు రాక్షసప్రవృత్తిని విడుచుటకును తాపసవృత్తిని చేబట్టుటకును కారణమైనది. రాముని గూర్చిన ఈ భయమే పూర్వజన్మ సుకృత విశేషమున నాతనిలో రాముని గూర్చిన భక్తిని పెంపొందించినది సర్వమును రామమయముగా దర్శింప జేసినది. ప్రహ్లాదునకు వలె మారీచునకు నిశ్చలభక్తి యేర్పడినది. ప్రహ్లాదుడు సర్వము హరిమయముగా దర్శించినట్లు మారీచుడును దర్శించినాడు. పరమేశ్వరుడు తనను చంపు నను భయము ప్రహ్లాదునకు లేదు, మారీచునకు గలదు అనగా, ఒకవైపు తన రాక్షసభావము (జీవభావము) అనుగత మగుచుండగనే, మరియొకవైపు అతనికి దైవీభావసంపత్తితో సీతారాముల కత్యంత సన్నిహితుడగు భాగ్య మబ్బినది. అయినను జీవభావము ననుసరించి అతనికి రావణాధీనత్వము తప్పలేదు, మారీచుడు ప్రస్తుతము వాంఛించినది రావణాధీనత్వము-నుండి (జీవభావము నుండి) విముక్తి రావణాధీనత్వము ప్రస్తుతము మారీచునకుగల సంసార బంధము. ఇది తనకు దుఃఖహేతువే యని గుర్తించినాడు. ఇట్టి స్థితిలో రావణు నెదిరించుట అపమృత్యువునకు, అనర్థమునకు హేతు వగునేగాని ఉత్తమ లోకప్రాప్తికి కాదు అతనికి శాశ్వతముగ రావణబంధ విముక్తి కావలెను. అందు కుపాయము రావణుడే సూచించినాడు. మాయామృగరూపధారణమే అతనికి తరణసాధన మని యెంచినాడు. తన యందనుగమించుచున్న జీవభావముతనకును లోకమునకును ఉపద్రవకారకమే.

ఇట్టి భావముతోనే మాయామృగరూపమున సీతారాముల యెదుట సంచ రించుట జరిగినది. శ్రీరాముడు మారీచ హృదయజ్ఞుడు ప్రత్యక్షముగ కాకపోయినను, మనసా శరణు జొచ్చిన మారీచునకు లోకోపద్రవకారి యైన రావణాధీనత్వ స్థితి నుండి విముక్తిని కల్పించినాడు. కనుకనే రాముడు మాయామృగమునుజూచి "రూపశ్రేష్ఠతయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి" అని అనుట జరిగినది.

ఇట శ్రీరాముడు "ఇది లోకోత్తర హరిణ"మని [ఏషచైవ మృగః శ్రీమాన్] అని చెప్పుచు మరియొకవైపు "మృగోఽద్య న భవిష్యతి" అని అనుచు తుదకు అట్టి మృగమును సంహరించినాడు. ఇది లోక దృష్టిలో రాక్షసవధయే. కాని, మారీచుని దృష్టిలో రాక్షసభావము నుండి, దేహమునుండి విముక్తి. శ్రీరాము డనుగ్రహించినదియు అదియే. రామ బాణముతో హిరణ్య హరిణి నేల కూలినట్లుగా వర్ణింపబడలేదు. భయంక రము లోకోపద్రవకరమైన అతని రాక్షసదేహమే కూలినట్లు వర్ణింపబడి నది. మాయాహిరణ్యహరిణి అదృశ్యమైనది. మారీచునకు తపస్సాధనచే సాధింపబడిన దైవీసంప ద్విభూతిరూప మగు హిరణ్య హరిణీత్వము శాశ్వతముగా ప్రసాదింపబడినది. కనుక, పై శ్రుతిగతమైన మాయా మృగచరితమును రామాయణము మారీచవృత్తాంత రూపమున వ్యాఖ్యా నించినట్లు తెలియగలము.

దీనినిబట్టి వేదగత మాయామృగమును శ్రీసూక్తగత హిరణ్య హరిణమును సమన్వయము చేయుచు రామాయణమున బంగారులేడి వృత్తాంతము ప్రవృత్తమైనట్లు తెలియును. కనుకనే రామాయణమున

బంగారులేడి వర్ణన శ్రీసూక్త హిరణ్యహరిణీ స్వరూపబోధక మంత్రా ర్థాపబృంహకము. ఈ విషయము శ్రీసూక్తహరిణవర్ణనను, రామాయణ గత హరిణవర్ణనను పోల్చిజూచిన, స్పష్టమగును

శ్రీసూక్తమున పరాదేవత "సువర్ణరజతస్రజామ్" అని వర్ణింపబడి నది అనగా పరాదేవత సువర్ణరజతమాలా విభూషితయని అర్థము. సువర్ణ మాలలేకాక రజతమాలలను గూడ ధరించినదని చెప్పుటలోని తాత్పర్య మేమి? సువర్ణమాల ఆమెయొక్క బాలార్కారుణప్రభను తెలియజేయును రజత స్రజము ఆమె యొక్క చంద్ర సంకాశత్వమును తెలియజేయును

"యోనౌ కనకపుంజాభం హృది విద్యుచ్ఛయోజ్జ్వలమ్,
ఆజ్ఞాయాం చంద్రసంకాశం మహః స్తవ మహేశ్వరి॥"

అను సౌభాగ్య విద్యాహృదయము, పరాదేవత కనక పుంజాభ, చంద్ర సంకాశ అని కీర్తించుచున్నది.

ఈ శ్లోకము పై శ్రీ సూక్త మంత్రవ్యాఖ్యానరూపమే రామాయణము నందు కనకహరిణము

"రూప్యైః బిందుశతైః శ్చిత్రం భూత్వా చ ప్రియదర్శనః" అని వర్ణింపబడినది

బాలార్కారుణప్రభతో విరాజిల్లెడి హిరణ్య హరిణ శరీరము రజతబిందుశతములతో విరాజిల్లుచున్నదట.

ఈ వర్ణనయు శ్రీసూక్తమంత్రవ్యాఖ్యానరూపమే "హేమరాజత వర్ణాభ్యాం పార్శ్వాభ్యాముపశోభితమ్" అరణ్య 43 1

ఇత్యాది వర్ణనలన్నియు పై యభిప్రాయమునే ధృవీకరించుచున్నవి.

"రామాయణ మితిహాసము" అని రామాయణమే చెప్పుకొన్నది

"ఇమ మార్షం స్తవం నిత్య మితిహాసం పురాతనమ్
యే నరాః కీర్తయిష్యంతి నాస్తి తేషాం పరాభవః"

అరణ్య 120 32

ఇతిహాస మనగా, అనాదిసిద్ధబ్రహ్మవిద్యాప్రతిపాదక మగుచు పురావృత్తకథనరూపమైన గ్రంథము కనుక రామాయణము పురావృత్త కథనము జేయుచు బ్రహ్మవిద్యాప్రతిపాదక మగుచున్నది. కనక హరిణ వృత్తాంతాదులు బ్రహ్మవిద్యాప్రతిపాదకము లగుచు రామాయణము యొక్క ఇతిహాసత్వమును సార్థకమొనర్చునవిగా దర్శింపవలెను కనుక రామాయణమున బంగారులేడి వృత్తాంతము కథాచమత్కృతి కొఱకు మాత్రము కల్పింపబడినదిగాదు. "కనకహరిణతత్త్వమును దర్శించినవారు కనక హరిణులే యగుదురుగాక!" యని వాల్మీకిమహర్షి యుపదేశముగా గ్రహింపనగును.

o

# 6. రామదూత హనుమంతుడు

భారతీయు లారాధించు దేవతలలో హనుమంతుడు సర్వతోవిలక్షణ మైన మూర్తిగా కనుపట్టును, హయగ్రీవుడు, గజాననుడు మున్నగు వారు విలక్షణముగ కనుపట్టినను వారు స్వతంత్రులు వా రెవ్వరికిని దూతలు గాని, దాసులు గాని హనుమంతు డట్లు గాదు అతడు శ్రీరామునకు దూత, దాసుడు గూడ గనుకనే ఆతడు సర్వతో విలక్షణరూపుడు. దూతయై, దాసుడై ప్రభువువలె అర్చింపబడుట యొక్క హనుమంతుని విషయముననే కనుపట్టును. సుగ్రీవ, విభీషణా దులందరు రాముని భక్తికోటికి చెందినవారే వారు భక్తులుగా కీర్తింపబడుట గాంచుదుము గాని హనుమంతునివలె దేవతగా నారాధింపబడుట గాంచము. హనుమంతుడు దూతలలో దూత. దాసులలో దాసుడు దేవతలలో దేవత ఇట్టి లక్షణము లన్నియు నొకచో నేకీభవించుటయే ఆయన యందు గల సర్వతోవైలక్షణ్యము.

మహాత్ముల యొక్క చరిత్రలు అతివిచిత్రములు హనుమంతుని జన్మవృత్తాంతము గూడ విచిత్ర మైనది రామాయణమున హనుమజ్జన్మ వృత్తాంత మిట్లు గలదు.

"అప్సరాప్సరసాం శ్రేష్ఠా. విఖ్యాతా పుంజికస్థలా
అంజనేతి పరిఖ్యాతా పత్నీ కేసరిణో హరేః ॥"

విఖ్యాతా త్రిషు లోకేషు రూపేణాప్రతిమా భువి ।
అభిశాపా దభూ త్తాత వానరీ కామరూపిణీ ॥
దుహితా వానరేంద్రస్య కుంజరస్య మహాత్మనః ।
కపిత్వే చారుసర్వాంగి కదాచి త్కామరూపిణీ ॥
మానుషం విగ్రహం కృత్వా రూపయౌవన శాలినీ ।
విచిత్ర మాల్యాభరణా మహార్హ క్షౌమవాసినీ ॥
అచర త్పర్వత స్యాగ్రే ప్రావృడంబుదసన్నిభే ।
తస్యా వస్త్రం విశాలాక్ష్యా పీతం ర క్తదశం శుభమ్ ॥
స్థితాయా పర్వత స్యాగ్రే మారుతోఽ పహర చ్ఛనైః ।
స దదర్శ తత స్తస్యా వృత్తా వూరూ సుసంహతౌ ॥
స్తనౌ చ పీనౌ సహితౌ సుజాతం చారు చాననమ్ ॥
తాం విశాలాయతశ్రోణీం తనుమధ్యాం యశస్వినీమ్ ॥
దృష్ట్వైవ శుభసర్వాంగీం పవనః కామమోహితః ।
స తాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పర్యష్వజత మారుతః ॥
మన్మథావిష్టసర్వాంగో గతాత్మా తా మనిందితామ్ ।
సా తు తత్రైవ సంభ్రాన్తా సువృత్తా వాక్య మబ్రవీత్ ॥
ఏకపత్నీవ్రత మిదం కో నాశయితు మిచ్ఛతి ।
అంజనాయా వచ శ్శ్రుత్వా మారుతః ప్రత్యభాషత ॥
న త్వాం హింసామి సుశ్రోణి మా భూ త్తే సుభగే భయమ్॥
మనసాఽస్మి గతో య త్త్వాం పరిష్వజ్య యశస్వినీమ్ ।

వీర్యవాన్ బుద్ధిసంపన్నః తవ పుత్రో భవిష్యతి ॥
మహాసత్త్వో మహాతేజా మహాబలపరాక్రమః ।
లంఘనే ప్లవనే చైవ భవిష్యతి మయా సమః ॥
ఏవ ముక్త్వా తత స్తుష్టా జననీ తే మహాకపే ।
గుహాయాం త్వాం మహాబాహో ప్రజజ్ఞే ప్లవగర్షభమ్ ॥

పుంజికస్థల యను నప్సరస శాపగ్రస్తయై వానరీరూపమున నావిర్భవింపగా, నామెయందు వాయు దేవు నను గ్రహమున హనుమంతుడు జన్మించెను అంజనాపుత్రుడు, వాయుపుత్రుడు అని ప్రసిద్ధి గాంచెను. వీర్యవంతుడు, బుద్ధిశాలి, బలశాలి, తేజస్వి, బలపరాక్రమసంపన్నుడు, లంఘన, ప్లవనాదుల యందు వాయుసముడు ఇవి జన్మతః హనుమంతునకు సిద్ధించిన మహాపురుష లక్షణములు

## హనుమంతుడు - నామౌచిత్యము

హనుమంతునకు, హనుమంతుడు, అంజనేయు డనియు వ్యవహారము గలదు. అంజనాపుత్రు డగుటచే అంజనేయు డని పేరు. రామాయణమున వాల్మీకిమహర్షి హనుమాన్, హనూమాన్ అను నామధేయములనే ప్రసిద్ధములుగ గ్రహించెను

ఈ నామధేయౌచిత్య విచారముచే హనుమంతుని స్వరూపస్వభావములు కొంతవరకు తేటతెల్లమగును.

హన్తి శత్రూ నితి హనుమాన్ అని హనుమ చ్ఛబ్దమునకు నిర్వచన మక్కడక్కడ చెప్పుటను విందుము. కాని హనూ అస్య స్త ఇతి

హనుమాన్ అనునది నిర్వివాదమైన నిర్వచనము. ప్రశస్తములైన హనువులు (దవడలు) కలవా డని యర్థము. ఇంద్రుడు వజ్రాయుధముతొ కొట్టినను అయన హనువులు మొక్కపోలేదట కనుక దృఢతరములైన హనువులు గలవాడని పౌరాణికగాధల వలన దెలియును దృఢతరములైన హనువులు గలవా డనునది దేహదార్ఢ్యమును సూచించును. కాని దృఢతర హనువుల సార్థకత యంతే గాదు. ఈ విషయము శ్రుతిసంప్రదాయముగ తెలియనగును.

"అధరా హనుః పూర్వరూపం। ఉత్తరా హను రుత్తరరూపమ్। వాక్ సంధిః। జిహ్వా సంధానమ్" — శిక్షావల్లి

ఇందు అధిలోకమ్ అధిజ్యోతిషమ్ అధివిద్యమ్ అధిప్రజమ్ అధ్యాత్మమ్ అనుచు అయిదు అధికరణముల యందు మహసంహితా స్వరూపము వివరింపబడినది ముఖమునందు గల హనువులలొనొకటి వాక్కుకు పూర్వరూపము, మరియొకటి యుత్తరరూపము ఈ రెండింటియొక్క సంధి వాక్కు జిహ్వా సంధానకర్త్రి ఇది వాగావిర్భావమును దెలియజేయు మహాసంహిత. వాక్కు వైఖరీరూపముగ అభివ్యక్తమగుటకు హనువుల మధ్యనున్న జిహ్వా సంధాన మావశ్యకము సుస్పష్టముగ శ్రావ్యముగ వాక్కు అభివ్యక్తమగుటకు ప్రశస్తములైన హనువులావశ్యకములు ఈ హనువుల యొక్క సౌష్ఠవ, దార్ఢ్యాదుల మీదనే వాక్కు యొక్క సౌష్ఠవౌదార్య్యవిశేషము లాధారపడి యుండును. హనుమంతుని హనుమత్త్వము ఆ మహాత్ముని యొక్క వాక్కు నందలి సౌష్ఠవౌదార్యాది విశేషగుణములను గుర్తింపజెయుచుండును వాల్మీకిమహర్షియు హనుమంతుని వర్ణ వ్యాజమున ఆయన యొక్క హనుమత్త్వము నిట్లు ధ్వనింప జేయుచున్నాడు

"నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః ।
నాసామవేదవిదుషః శక్య మేవం ప్రభాషితుమ్ ॥
నూనం వ్యాకరణం కృత్స్న మనేవ బహుధా శ్రుతమ్ ।
బహు వ్యాహరతానేన న కించి దపశబ్దితమ్ ॥
న ముఖే నేత్రయో ర్వాపి లలాటే చ భ్రువో స్తథా ।
అన్యే ష్వపి చ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్ ॥
అవి స్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతమ్ ।
ఉరఃస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే ॥
సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితామ్ ।
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్ ॥
అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా ।
కస్య నారాధ్యతే' చిత్త ముద్యతా సేరరేరపి ॥

రామాయణమ్ కిష్కింధ 28 నుండి 33

శ్రీరాముని యెదుట హనుమంతుడు నాలుగు మాటలు మాట్లాడగనే హనుమంతుని వేదాధ్యయనశీలత్వము, కృత్స్న వ్యాకరణాధ్యయన సంపన్నత్వము, సంస్కారక్రమ సంపన్నత్వము, శాస్త్రబద్ధ వాగుచ్చారణ సంప్రదాయజ్ఞత్వము, ఇట్టి లక్షణము లన్నియు అయనయందు యభివ్యక్తము లైవ వట. వేదవాణికి కల్యాణి యని పేరు. వేదవిదుడగు హనుమంతుని నోటి నుండి యభివ్యక్త మైన వాక్కు వేదవాక్కు వలె కల్యాణి రూపిణియై శ్రీరాముని దృష్టిలో భాసించెను. శ్రీరాము డెంద

జినో స్వాధ్యాయపరులను చూచియున్నాడు కాని ఇట్టి లక్షణముల ఆయన వారియందు దర్శించినట్లు రామాయణము నందెచటను వర్ణింపబడ లేదు కాని ఒక్క చూపులోనే శ్రీరామునికి హనుమంతుని యందు గొడగట్టినవి. ఇవి ఆయన ప్రశస్త హనూమత్త్వమునకు తార్కాణము. హనుమాన్ అను నామధేయము హనుమంతుని మహాసత్త్వసంపదను, బుద్ధివైశారద్యమును సూచించు అన్వర్థమై యొప్పును. హనుమంతు డెంతసేపు మాట్లాడినను, ఆయన వాక్కులో నపభాషితము లేదట. వాక్కులో నపభాషితము లేదనుటచే నతడు నిగమ, నిరుక్త, వ్యాకర ణాది సంప్రదాయముల ననుసరించి శబ్దబ్రహ్మ స్వరూపము నవగతము చేసికొన్నాడని తెలియును.

"ఏక శబ్దః సమ్యగ్ జ్ఞాతః శాస్త్రాన్వితః సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే కామధు గ్భవతి" అను శ్రుతికి తత్త్వతః ఉదాహరణ భూతు డని తెలియును. అవిస్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతమ్ ఈ లక్షణములు వేదవాక్యోచ్చారణ సమయమున దర్శింప దగినవి భక్తితో శ్రద్ధతో సదాచారసంప్రత్తితో వేదమంత్రముల నారాధించువారు నేటికిని పై నియమములు పాటించుచునే యున్నారు దీనివలన ఆయన యొక్క వాక్ సౌష్ఠవము, తద్ద్వారా స్వాధ్యాయాధ్యాన వైశిష్ట్యము, తద్ద్వారా వేదవిజ్ఞాన కౌశలము, విజ్ఞానసంపద అన్నియు సూచితము లగుచున్నవి.

## హనుమంతుడు సంస్కారక్రమసంపద

ఇంతవరకును వేదాధ్యయన సంస్కారక్రమసంపన్నత్వమును హనుమంతుని యందు దర్శించితిమి సామాన్యముగ చదువు వేరు. సంస్కారము వేరు. ఎంత చదివినను కొందరి యందు సంస్కారము కన్పట్టదని చెప్పుదురు చదువక పోయినను, కొందరి యందు సంస్కారము యుట్టిపడుచుండును. రెండును కలవారు అరుదు. ఉభయ విధ సంస్కారక్రమసంపన్నత్వము హనుమంతుని యందు మూర్తీభ వించి యున్నది

విభీషణుని శరణాగతి సన్ని వేశమున హనుమంతుని యందు గల యీ లక్షణము కవిచే స్పష్టము చేయబడినది.

రావణుని సోదరు డగు విభీషణున కాశ్రయ మిచ్చుటయా? లేదా? యనువిషయమై శ్రీరాముడు తానుగా నిర్ణయము చేయలేదు. వరుసగాసుగ్రీ వాదుల యభిప్రాయముల దెలిసికొనెను. అందఱును రాక్షసున కాశ్రయ మిచ్చుటకు సంశయించిరి. మైందుడు మాత్రము విభీషణునితో మాట్లాడి యుక్తాయుక్తములు నిర్ణయించ దగు నవిచెప్పెను. చివరికి హనుమంతున వంతు వచ్చినది. హనుమంతుని కవి ఇట్లు వర్ణించుచున్నాడు.

అథ సంస్కారసంపన్నో హనుమాన్ సచివోత్తమః।
ఉవాచ వచనం శ్లక్ష్ణ మర్థవ న్మధురం లఘు ॥

సుగ్రీవాదు లందఱు సచివులు. కాని హనుమంతుడు సంస్కారసంపన్ను

డైన వచివోత్తముడుగా నిట చెప్పబడినాడు. సంస్కారసంపన్నుడనగా సకల శాస్త్రాభ్యాసజనిత సంస్కారయుక్తుడు ఆయన వాక్యము మధురము, స్నిగ్ధము అర్థగాంభీర్య విలసితము. వివక్షితార్థప్రతిపాదన సమర్థము, నాతివిస్తరము. అనివర్ణింపబడినది తన యభిప్రాయమును వివరించుటలో తన యాధిక్యమును, గొప్పతనమును, పాండితీప్రకర్షను చూప హనుమంతుడు యత్నింప లేదు. శ్రీరాముని మీది గౌరవముచే నా యభిప్రాయమును చెప్పుటకు సాహసించుచున్నా నని తన వాదము నుప్రక్రమించెను.

న వాదా న్నాపి సంఘర్షా న్నాధిక్యా న్న చ కామతః।
వక్ష్యామి వచనం రాజన్ యథార్థం రామగౌరవాత్॥

రామాయణమ్ యుద్ధకాండ 17 50

నేను నాకు తోచిన యథార్థమును చెప్పుచున్నాను యథార్థకథనము ఇతరుల వాదమును ఖండించుట గాదు, ప్రభువుల యెదుట యథార్థము చెప్పవలయును గావ చెప్పుచుంటిని. యథార్థకథనము ఇతరుల వాదముల ఖండించు నదిగా నుండవచ్చును కావలెనని ఇతరుల వాదమును పాండితీప్రకర్ష జూపి ఖండింప బూనుకొనుట లేదు యథార్థకథనము ద్వారా నితరుల వాదమును సమన్వయించుట వేరు. నేను చెప్పునది యథార్థకథనము గావ నెవరును నన్ను దోషదృష్టి గల వానినిగ భావించ రాదు. ఇట్లు తన వాదమును ప్రారంభించి, 'ఇతరులు చెప్పిన వాదములలో గల దోషముల నెత్తి చూపెను. విభీషణున కాశ్రయ మిచ్చుట యుక్తమే యనుటకు కారణముల నిట్లు చూపెను.

న త్వస్య బ్రువతో జాతు లక్ష్యతే దుష్టభావతా।
ప్రసన్నం వదనం చాపి తస్మా న్మే నాస్తి సంశయః॥
అశంకితమతిః స్వస్థో న శఠః పరిసర్పతి।
న చాస్య దుష్టా వా క్చాపి తస్మా న్నాస్తీహ సంశయః॥
అకార శ్ఛాద్యమానోఽపి న శక్యో వినిగూహితుమ్ ।
బలాద్ధి వివృణో త్యేవ భావ మంతర్గతం నృణామ్ ॥
దేశకాలోపపన్నం చ కార్యం కార్యవిదాం వర ।
సఫలం కురుతే క్షిప్రం ప్రయోగేణాభిసంహితమ్॥
ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్తం చ రావణమ్ ।
వాలిన శ్చ వధం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్ ॥
రాజ్యం ప్రార్థయమాన శ్చ బుద్ధిపూర్వ మిహాగతః।
ఏతావత్తు పురస్కృత్య యుజ్యతే తత్ర సంగ్రహః॥
యథాశక్తి మయోక్తం తు రాక్షస స్యార్జవం ప్రతి ।
త్వం ప్రమాణం తు శేషస్య శ్రుత్వా బుద్ధిమతాం వర ॥

—యుద్ధకాండ 17 60 నుండి 66 వరకు

అపరిచితు డగు వాని కాశ్రయ మిచ్చు విషయములో నాతని ముఖకవళికలు, నాతని వాక్కు- అధారములు ఈతని వాక్యములలో దుష్ట భావము కనుపడుట లేదు. ముఖము ప్రసన్నము. దుష్టభావము గలవాడు నిర్భయముగ శత్రువున కుపసర్పణము చేయడు. విభీషణుడు చేసినాడు.

18)

శరుదెంతగా తన యాకారమును ఆచ్ఛాదించు కొనుటకు ప్రయత్నించి నను, అతని యందునిగూఢమై యుండెడి శరత్వము పైకి తొంగి చూచుచునే యుండును శతని యం దట్టి లక్షణము గానరాదు ఇట్లు వాక్కును బట్టి, ముఖకవళికలను (ఆకారమును) బట్టి విభీషణుడు అదుష్టుడే యని హనుమంతుడు నిర్ణయించినాడు. తరువాత తన రాజనీతి నిట్లు ప్రదర్శించినాడు. దేశకాలానుగుణముగ పర్యాలోచన జేసి ప్రభువులు కార్యనిర్ణయము చేయుదురు. రావణునిపై సలుపబడెడియుద్ధప్రయత్నము రావణుని యొక్క అధర్మప్రవృత్తిని సమీక్షించి, వాలిని చంపి సుగ్రీవునకు రాజ్య మిచ్చుటయు తెలిసికొని సుగ్రీవుని వలె రాజ్యాభిషేకము కాంక్షించుచు విభీషణుడు వచ్చినాడు ఇదియే విభీషణుని యభిప్రాయముగ నాకు కన్పట్టుచున్నది. విభీషణు డిట్టి ఋజుబుద్ధితో వచ్చినాడే గాని గూఢ విప్రియకార బుద్ధితో రాలేదు ఇది నాకు తొచినయథార్థము. తరువాతనిర్ణయమునకు శ్రీరాముడే ప్రమాణము.

ఇది హనుమంతుని వాదవిధానము. విభీషణుని వాక్యమును బట్టియే యాతని ఋజుస్వభావమును హనుమంతుడు నిర్ణయించుట గమనింప దగిన యంశము, వాక్కు యొక్క లక్షణముల సంపూర్ణముగ నెఱిగినవాడు గాని యిట్టి నిర్ణయము చేయలేడు హనుమంతు డట్టి లక్షణముల నెఱిగిన వాడు ఇది హనుమంతుని వాగ్రహస్య తత్త్వ విజ్ఞానమునకు నిదర్శనము ఇంగితచేష్టితముల ద్వారా పరహృదయ మెఱుగుటలో హనుమంతునకుగల ప్రావీణ్యమును ఆయన వాక్యములు స్పష్టము చెయుచున్నవి దేశకాలోచిత కర్తవ్యమును ప్రబొధించుచు రాజనీతిజ్ఞతను ప్రదర్శించినాడు. సుగ్రీవుని సాదృశ్యమును జూపి

విభీషణుని పరిగ్రహించు మనుటయు, సందర్భోచితముగ నున్నది. వధ్యుడైన వాలియొక్క తమ్ముడు సుగ్రీవుడు. అట్లే వధ్యుడైన రావణుని తమ్ముడు విభీషణుడు. అభ్యంతరము లేక సుగ్రీవుని పరిగ్రహించినట్లే విభీషణుని పరిగ్రహింపవలెను ఇది న్యాయము ఇట్టి వాదమును హనుమంతుడు సుగ్రీవు నెదుట చేయుచున్నాడు యథార్థ కథనమనకే నేను హనుమంతుడని మొదటనే చెప్పియుండుట చేత సుగ్రీవుడు తనను శంకించకుండునట్లుగా జేసికొనెను. ఇతరుల మెప్పు గాక యథార్థము జెప్పువాడే ఉత్తముడు కావుననే వి ఇతనిని " సంస్కారక్రమసంపన్నః, సచివోత్తమః " అనియు వర్ణించినాడు.

భారతమున భీమహనుమత్సంవాదము హనుమంతుని మహానుభావమును స్పష్టము చేయుచున్నది.

భీముడు సౌగంధికాహరణమునకై పోవుమార్గమున భీముడు చేసిన శంఖధ్వనిని విని హనుమంతుడు అమ్మార్గమున కడ్డముగ శరీరమును పెంచి పండెను.

> ప్రావర్ధత మహాకాయో హనుమా న్నామ వానరః ।
> కదళీషండ మధ్యస్థో నిద్రావశగతః తదా ॥

భారత వనపర్వము 146 89

భీము డా దారిన వచ్చినపుడు హనుమంతుడు భీముని ముందుకు సాగవద్దని హెచ్చరించెను. భీముడు ఆయన మాటలను సరుకు గొనలేదు. అతని మాటలను బట్టి భీముని బలోన్మత్తునిగ తెలిసికొని నేను వయసా వృద్ధుడను లేచుటకు శక్తి లేదు. దయతో నీ తోకను అవలకు నెట్టి

పొమ్ము. అని చెప్పగా శక్తి వంతమ వినియోగించి భీము డాతని తోకను గదలింప లేకపోయెను. అంతట పశ్చాత్తప్తుడై పాదములపై బడి భీము డిట్లనను స్వామీ! నీవెవరవు? సిద్ధుడవా? గంధర్వుడవా? యక్షుడవా? వానరరూపము దాల్చియున్న నీవెవరవు? శిష్యుడనై ప్రార్థించుచున్నాను నీ నిజస్వరూపమును తెలియజేయునది. అపుడు హనుమంతుడు తమ్ముని యందలి వాత్సల్యముతో తన రామదూతత్వమును, రామదాసత్వమును వివరించుచు తన పురావృత్తగాథ నంతయు వివరించి ఇట్లు చెప్పెను

వరం మయా యాచితోఽసౌ రామో రాజీవలోచనః
యావ ద్రామకథేయం తే భవే ల్లోకేషు శత్రుహన్॥
తావ జ్జీవేయ మిత్యేవం తథాఽస్త్వితి చ సోఽబ్రవీత్।
భారత వనపర్వ 148 17

నేను శ్రీరాము నొక వర మడిగితిని. ఎంతకాలము రామాయణ గాథ లోకమున గానము చేయబడుచుండునో, యంతకాలము జీవింతును. నా యీ ప్రార్థనను శ్రీరాము డంగీకరించి తథాస్తు అనెను. ఈ కథ ననుసరించియె ఈ క్రింది హనుమ త్ప్రార్థనాశ్లోకము అనూచానముగ ప్రసిద్ధమై వచ్చుచున్నది

యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృత మస్తకాంజలిమ్।
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాన్తకమ్॥

పై సన్నివేశము ద్వారా హనుమంతుడే స్వయముగ తన రామభక్తత్వమును అభివ్యక్తము జేసినాడు భీముని కోరికపై తన విశ్వ

రూపముజూపి తన మహానుభావమును ప్రకటించినాడు. మరియు భీము నితో నిట్లనెను

ఏతావ దిహ శక్తస్త్వం ద్రష్టుం రూపం మమానఘ ।
వర్ధేz హం చాప్యతో భూయో యావ న్మే మనసి స్థితమ్ ॥
భీమ శత్రుషు చాత్యర్థం వర్ధతే మూర్తి రోజసా॥

భారత వనపర్వ 150 9

వత్సా! నే నింతకంటెను నా రూపమును బెంచగలను. నే నెంత గోరిన నంత రూపము పెరుగును ప్రకృతమున నీవు చూడగలిగిన దింతమాత్రమే ఆ పైన చూచుటకు నీ శక్తి చాలదు శత్రువిషయమున వారి వారి బలపరాక్రమముల ననుసరించి నా రూపము వృద్ధిక్షయముల నొందుచుండును

హనుమంతుని యీ లక్షణము సాగరలంఘన సమయమునను, లంకయందు సీతాన్వేషణ సమయము నందును స్పష్టముగా గన్పడును.

మరియు భీముని బలశక్తిపరీక్ష విధానము కేనోపనిషత్తున మహా యక్షము బ్రహ్మ, అగ్ని, వాయు, ఇంద్రులను పరీక్షించిన విధానమును స్ఫురణకు తెచ్చుచున్నది.

హనుమంతుడు వాయుపుత్రుడు. భీముడును వాయుపుత్రుడే. అయినను, అన్న యగు హనుమంతుని యెదుట భీముని దేహబలము నిర్వీర్య మైనది అతడు శిష్యుడై పాదముల నాశ్రయించి నపుడే నిజ

స్వరూపమును అవగా తన యీశ్వరత్వమును, రామభక్తిత్వమును రెంటిని ఉపదేశించెను అట్లే ఇంద్రుడు పశ్చాత్తప్తుడయినప్పుడు అతనికి హైమవతీ రూపమున 'ఉమా' సాక్షాత్కారము కలిగినది.

## జాంబవంతుడు హనుమత్ప్రశంస

అనేక శత సాహస్రీం విషణ్ణాం హరివాహినీమ్ ।
జాంబవాన్ సముదీక్ష్యైవం హనుమంత మథాబ్రవీత్ ॥
వీర వానరలోకస్య సర్వశాస్త్రవిశారద ।
తూష్ణీ మేకాన్త మాశ్రిత్య హనుమన్ కిం న జల్పసి ॥
హనుమన్ ! హరిరాజస్య సుగ్రీవస్య సమో హ్యసి ।
రామలక్ష్మణయో శ్చాపి తేజసా చ బలేన చ॥
అరిష్టనేమినః పుత్రో వైనతేయో మహాబలః ।
గరుత్మా నితి విఖ్యాతః ఉత్తమః సర్వపక్షిణామ్ ॥
పక్షయో ర్య ద్బలం తస్య తావ ద్భుజబలం తవ ।
విక్రమ శ్చాపి వేగశ్చ న తే తేనావహీయతే ॥
బలం బుద్ధి శ్చ తేజ శ్చ సత్త్వం చ హరిపుంగవ ।
విశిష్టం సర్వభూతేషు కి మాత్మానం న బుధ్యసే "

రామాయణ కిష్కింధకాండ 66 1నుండి 6

సీతాన్వేషణమునకై సముద్ర లంఘనము చేయుటకు వానరు లందఱు ముందు వెనుకలు చూచుచుండ, ఏమియు నెఱుగని వాని వలె

ఏమియు మటలాడక యూరకుంటి వేమి ? నీ శక్తి నీకు దెలియదా యేమి ? నీవు సుగ్రీవసముడవు తేజోబలముల యందు రామలక్ష్మణు లతో సరితూగువాడవు భుజబలమునను, వేగమునను, పరాక్రమమునను, గరుడునితో దీటైన వాడవు నీ యొక్క బల, బుద్ధి, తేజ స్సత్త్వాదు లన్నియు, నిఖిలభూతముల కంటెను విలక్షణములయినవి

పై వచనముల వలన హనుమంతుడు వలయునో సుగ్రీవుని వలె రాజరికము నెఱపగలడు వానరుల నందఱను శాసించగలడు. రామలక్ష్మ ణుల వలె దుష్టశిక్షణ చేయగలడు. మహావేగశాలియైన గరుడుని వలె సర్వత్ర అప్రతిహతగతి గలవాడు. గరుడుడు విష్ణువాహనుడు హను మంతుడును రామవాహనమై రామకార్యమును నెరవేర్చ గలవాడు అను విషయములు సూచితము లగుచున్నవి.

మరియు జాంబవంతుడు హనుమంతు నిట్లు ఉత్తేజపరచుచున్నాడు

ఉత్తిష ! హరిశార్దూల ! లంఘయస్వ మహార్ణవమ్ ।
పరా హి సర్వభూతానాం హనుమన్ యా గతి స్తవ ॥
విషణ్ణా హరయ స్సర్వే హనుమన్ కి ముపేక్షసే ।
విక్రమస్వ మహావెగో విష్ణు స్త్రీన్ విక్రమా నివ"

నాయనా లెమ్ము ! వీరందఱు దిగులుపడి యున్నారు నీ గతి యప్రతిహతము లోకోత్తరము త్రివిక్రముని వలె విక్రమించుము జాంబవంతుని యీ వచనములచే హనుమంతుని త్రివిక్రమత్వము (యీశ్వరత్వము), రామలక్ష్మణా నన్యత్వము (ఉపాస్య ఉపాసక ద్వివిధ రూపత్వము) సూచితమైనది. ఇట్లు సముద్ర లంఘనమునకు

ప్రోత్సహించిన జాంబవంతుడే యుద్ధ సమయమున ఇంద్రజిత్తు యొక్క బ్రహ్మాస్త్రముచే సంమోహితులై మృతప్రాయులై యందఱు పడియున్న తరుణమున తనను వెదకికొనుచు వచ్చిన విభీషణునితో హనుమంతుని గూర్చి ఇట్లు చెప్పెను.

నైరృతేంద్ర! మహావీర్య । స్వరేణ త్వాఽభిలక్షయే ।
పీడ్యమాన స్సితై ర్బాణై ర్న త్వాం పశ్యామి చక్షుషా ॥
అంజనాసుప్రజా । యేన మాతరిశ్వా స నైరృత ।
హనుమాన్ వానరశ్రేష్ఠః ప్రాణాన్ ధారయతే క్వచిత్ ॥
శ్రుత్వా జాంబవతో వాక్య మువాచేదం విభీషణః ।
ఆర్యపుత్రా నతిక్రమ్య కస్మాత్ పృచ్ఛసి మారుతిమ్ ॥
నైవ రాజని సుగ్రీవే నాంగదే నాఽపి రాఘవే ।
ఆర్య సందర్శితస్నేహో యథా వాయుసుతే పరః ॥
విభీషణవచ శ్శ్రుత్వా జాంబవాన్ వాక్య మబ్రవీత్ ।
శృణు నైరృతశార్దూల । యస్మాత్ పృచ్ఛామి మారుతిమ్ ॥
తస్మిన్ జీవతి వీరే తు హత మప్యహతం బలమ్ ।
హనుమ త్యుజ్ఝితప్రాణే జీవన్తోఽపి వయం హతాః ॥
ధరతే మారుతి స్తాత । మారుతప్రతిమో యది ।
వైశ్వానరసమో వీర్యే జీవితాశా తతో భవేత్ ॥

జాంబవంతుడు ఆతురతతో హనుమంతుని కుశలమును గూర్చి అడుగును. రామలక్ష్మణులను గూర్చి గాని, సుగ్రీవాంగదాదుల కుశల

మును గూర్చి గాని ప్రశ్నింపక హనుమంతుని కుశలమును గూర్చి మాత్రమే ప్రశ్నించుటకు గల కారణ మేమి? అని విభీషణుడు అడుగును, జాంబవంతు డిట్లు చెప్పును. విభీషణా! నీకు తెలియ దేమో! వానరబల మంతయు హతమగు గాక! హనుమంతుడు జీవించియున్నచో నది అహతమే యగును. అనగా జీవించి యున్నట్లే భావింపుము ఏ కారణముచేనైన హనుమంతుడు గతప్రాణు డగుచో ఈ వానరబలము జీవించియున్నను, హతప్రాయమే యని గుర్తెఱుగుము.

ఈ మాటల వలన హనుమంతుడు నిఖిల ప్రాణిజీవనప్రదుడు, నిరామయకరుడు, (సర్వబాధా నివారకుడు), అను విషయము స్పష్టము. సముద్రలంఘనమునకు హనుమంతుని ప్రోత్సహించినది జాంబవంతుడు తరువాత యుద్ధసమయమున వానరుల నుజ్జీవింప జేయుటకై యొక్కటి రెండుపర్యాయములు సంజీవని దెచ్చుటకై హనుమంతుని ప్రోత్సహించి పంపినదియు జాంబవంతుడే. హనుమంతుని మహాసత్త్వసంపద, దైవీ సంపద, ప్రతిభావిశేషములు, అన్నియు జాంబవంతుడు చక్కగా నెఱుగును. అందుచే హనుమంతుని గూర్చి యాయన జెప్పిన విషయములు యథార్థములే, కల్పితములు గావు.

## జాంబవంతుడు హనుమన్నాటకము

సీతాన్వేషణమునకై లంకకు బోగల సమర్థు లెవరు? అని శ్రీరాముడు సుగ్రీవుని సైనికుల నుద్దేశించి ప్రశ్నించెను అపుడు హనుమంతుడు తన యశక్తత నీ క్రింది విధముగ ప్రకటించును.

అష్టాంగుళమయః కాయః పుచ్ఛో మే ద్వాదశాంగులః ।
బాహూ మే పశ్య భో నాథః కథం రత్నాకరం తరేః ॥

నా శరీరమా అష్టాంగుళప్రమాణము. పుచ్ఛమా ద్వాదశాంగుల పరిమితి గల్గినది నా యీ చేతులు చూడుడు నె నెట్లు సముద్రమును లంఘింతును హనుమంతుని యీ వాక్యములను విని జాంబవంతుడు శ్రీరామునితో నిట్లనును

"దేవః రుద్రావతారోఽ యం మారుతిః రుద్రస్తుతిః క్రియతామ్"
స్వామీ, వాయుపుత్రు డగు ఈ హనుమంతుడు రుద్రావతారము. రుద్రస్తుతిని చేయుడు

జాంబవంతుని మాటలు విని శ్రీరాముడు రుద్రస్తుతిని చేయును శ్రీరాముడు చేసిన రుద్రస్తుతిని వినినంతనే హనుమంతుడు తన అశక్తతను మరచి పోయి తన యసామాన్యమైన శక్తిని గూర్చి యిట్లు చెప్పును

కూర్మో మూలవ దాలవాలవ దపాంనాథో లతావ ద్దిశో
మేఘాః పల్లవత్ ప్రసూనఫలవత్ నక్షత్రసూర్యేందవః ।
స్వామిన్ వ్యోమతరు ర్క్రమ క్రమతలే, క్రుత్వేతి గాం మారుతేః
సీతాన్వేషణ మాదిశ దిశతు వో రామః సహర్షః శ్రియమ్॥

హనుమంతుని అసాధారణశక్తిని గూర్చి ప్రదర్శించెడి శ్లోకములు హనుమన్నాటకమున ఇంకను గలవు.

. హనుమంతుడు మహాబలవంతుడై బాల్యమున ఋషులను పెక్కు విధముల బాధించుచుండ అంగిరస వంశజు లగు ఋషులు కోపించి

శాపమోహితుడవై నీ బలమును ఇతరులు గుర్తు చేయ నంతవరకు నీ వెఱుగకుందువు గాక ; నీ మహిమాతిశయమును గుర్తు చేసినపుడు నీ బలము వృద్ధి జెందగలదు అని శపించి నటుల పౌరాణిక గాథ గలదు. తదను గుణముగనే తన శక్తిని గూర్చి జాంబవంతుడు గుర్తు చేసినపుడు తన యసాధారణశక్తిని గూర్చి తానే వర్ణించుకొనుట ఇట గమనింప గలము

స్వామీ, సముద్రతరణము నాకొక లెక్కయా ? ఆకాశ మనెడి వృక్షమును సైతము నేను పాదన్యాసము చేయగలను ఈ వర్ణనముచే హనుమంతుని త్రివిక్రమత్వము స్పష్టముగా తెలియుచున్నది పై జాంబవంతుని వాక్యములచే హనుమంతుడు రుద్రావతార మని స్పష్ట మగుచున్నది.

జాంబవంతునకు హనుమంతుడు స్వపక్షీయుడు. స్వపక్షీయాభిమానముచే హనుమంతు నిట్లు ప్రశంసించె ననుటయు తగదు. ఆయన వచనములు యధార్థములు. జాంబవంతుని దృష్టిలోనే గాదు. ప్రత్యర్థి యగు రావణుని దృష్టిలో గూడ హనుమంతుడు రుద్రరూపుడై కన్పించెను.

యద్యయం రుద్రో-మారుతిః, తర్హి కిమితి రుద్రభక్తస్య మే నగరీం దహతి ? అహహ ! జ్ఞాతమ్.

తుష్టః పినాకీ దశభి శ్శిరోభిః తుష్టో న చైకాదశకో హి రుద్రః ।

అతో హనూమాన్ దహతీతి కోపా త్పంక్తే ర్హి భేదో న

పున శ్శివాయ ॥" 6 అంక 27 శ్లో.

అతిమానుషశక్తి గలిగిన ఈ హనుమంతు డెవడై యుండును? ఒకవేళ రుద్రుడే యైనచో నేను రుద్రభక్తుడనే గదా ! నా లంకానగరము నేల దహించును? ఆ ! తెలిసినది. పూర్వము నా దశశిరస్సులతో దశ రుద్రులు సంతుష్టులైరి. మిగిలిన రుద్రులతోపాటు తనకు తుష్టి జరుగ లేదను కోపముతో నేకాదశరుద్రుడే హనుమంతుని రూపమున వచ్చి లంకను దహించుచున్నా డని యనుకొందును. పంక్తిలో నున్న యందఱిని ఒకే విధముగ చూచుట యుక్తము గాని పంక్తిభేదము యుక్తము గాదు. మర్యాదకరము గాదు.

రావణుని యీ మాటలు జాంబవంతుని మాటలతో సంవాదము గలిగి హనుమంతుని రుద్రమూర్తిత్వమును ధ్రువపరచుచున్నవి

శివపురాణము తృతీయ శతరుద్రీయ సంహిత యందు రుద్రుడే రామకార్యార్థమై స్వయముగ హనుమద్రూపమున అవతీర్ణు డైనట్లు చెప్పబడుచున్నది.

ఏకస్మిన్ సమయే శంభు రద్భుతోఽతికరః ప్రభుః।
దదర్శ మోహినీరూపం విష్ణో స్స హి వసద్గుణః
చక్రే స్వం క్షుభితం శంభుః కామబాణహతో యథా ।
స్వం వీర్యం పాతయామాస రామకార్యార్థ మీశ్వరః ॥
తద్వీర్యం స్థాపయామాసుః పత్రే సప్తర్షయ శ్చ తే ।
ప్రేరితా మనసా తేన రామకార్యార్థ మాదరాత్ ॥
తై ర్గౌతమసుతాయాం తద్వీర్యం శంభో ర్మహర్షిభిః ।
కర్ణద్వారా తథాంజన్యాం రామకార్యార్థ మాహితమ్ ॥

తత శ్చ సమయే తస్మాత్ హనుమా నితి నామభాక్ ।
శంభు ర్జజ్ఞే కపితనుః మహాబల పరాక్రమః ॥

2 అధ్యాయ. 3 నుండి 7 శ్లో.

రామకార్యం చకారాశు సర్వథా కపిపుంగవః ।
అసురా న్నమయామాస నానాలీలాం చకార చ ॥
స్థాపయామాస భూలోకే రామభక్తిం కపీశ్వరః ।
స్వయం భక్తవరో భూత్వా సీతారామ సుఖప్రదః ॥
లక్ష్మణప్రాణదాతా చ సర్వదేవ మదాపహః ।
రుద్రావతారో భగవాన్ భక్తోద్ధారకర స్సవై ॥
హనుమాన్ స మహావీరో రామకార్యకర స్సదా ।
రామదూతాఽభిధో లోకే దైత్యఘ్నో భక్తవత్సలః ॥

2 అధ్యాయ. 35 నుండి 38 శ్లో.

విష్ణువు యొక్క మోహినీరూపమును జూచి శివుడు సంక్షుబ్ధ హృదయుడై రామకార్యార్థము వీర్యమును విడిచెను ఈశ్వరుని ప్రేరణచే సప్తర్షు లా వీర్యమును గొని శ్రవణేంద్రియము ద్వారా అంజనాదేవి గర్భమున నుంచిరి. తత్ప్రభావముచే నామె హనుమంతుని గనెను. రుద్రాంశసంభూతు డగుటచే అతిమానుషమైన శక్తిసంపద గలవా డయ్యెను

హనుమంతుడు రామకార్యార్థమై అవతరించి రాక్షససంహారము జేసి పెక్కు లీలల ప్రదర్శించెను. తాను అదమ్యప్రాయుడైన భక్తుడై

లోకమున శాశ్వతముగ రామభక్తిని నెలకొల్పెను అంతియేగాక రామ దూతగా విఖ్యాతు డయ్యెను భక్తోద్ధారకు డైన భగవంతుడుగా రుద్రావ తారుడైన హనుమంతుడు ప్రసిద్ధి గాంచెను అని శ్లోకముల తాత్పర్యము.

దీని వలన హనుమంతుడు రుద్రావతారమూర్తి, రామకార్యనిర్వ హణయే యవతార ప్రయోజనము, ఆదర్శప్రాయుడైన భక్తు డగుటయే గాక భక్తోద్ధారకుడైన భగవంతుడు అని స్పష్టమగుచున్నది.

పరాశర సంహితయు రామకార్యార్థసిద్ధి కొఱకై శివుడు హనుమం తుని రూపమున నవతరించినట్లు చెప్పుచున్నది

దుష్టానాం శిక్షణార్థాయ శిష్టానాం రక్షణాయ చ ।
రామకార్యార్థ సిద్ధ్యర్థం జాతః శ్రీ హనుమాన్ శివః ।
ఆంజనేయః పూజిత శ్చేత్ పూజితా స్సర్వదేవతాః ॥

రామకృష్ణాదుల వలెనే ఆంజనేయుడును పరమేశ్వరావతార మని పై పురాణగాథల వలన తెలియుచున్నది. ఆంజనేయుని పూజించుచో దేవతలందఱు పూజింపబడినట్లే అనియు పరాశరసంహిత జెప్పు చున్నది. కావుననే పురాణము లందు కపాలీ, రుద్రాగ్రణీ, శూలపాణి త్యాది విశేషణములు ప్రయుక్తము లగుచు సార్థకము లగుచున్నవి. పారమేశ్వర విభూతులలో హనుమంతుడు గూడ శ్రీమద్భాగవత మం దుల్లేఖింపబడుట గమనార్హము.

"వాసుదేవో భగవతాం త్వం తు భాగవతేశ్వరః ।
కింపూరుషాణాం తు హనుమాన్ విద్యాధ్రాణాం సుదర్శనః ॥

భాగవత. 11 స్కంధ. 16 అధ్యాయ 29 శ్లో

శ్రీమద్రామాయణ ముత్తరకాండమున (35, 36 సర్గలు) శ్రీరామ అగస్త్య సంవాదమున హనుమంతుని జన్మవృత్తాంతము, బాల్యక్రీడలు, ఇంద్రాదిదేవతలు ప్రీతులై వరము లొసంగుట, సూర్యుని వలన సకల శాస్త్రార్థముల నెఱుంగుట, చిరంజీవిత్వము మున్నగు మహానుభావ లక్షణము లన్నియు వివరింపబడినవి

## హనుమంతుడు వాయురుద్రాంశత్వము

హనుమంతుడు వాయుపుత్రు డని వర్ణించుచునే రుద్రాంశసంభూతు డనియు పురాణములు వర్ణించుచున్నవి వాయుపుత్రత్వము, రుద్రాంశ స్సంభూతత్వము, రెండును పరస్పర విరుద్ధములుగ గన్పట్టుచున్నవి ఈ రెండంశములు పురాణములచే ప్రతిపాదితములు గనుక రెండును ప్రామాణికములే యగును అందుచే వీనిలో నొకటి ప్రమాణము, మరియొకటి యప్రమాణ మని చెప్పుట పురాణముల కప్రామాణ్య మాపాదించుట యగును. కనుక వీని విషయమై వ్యవస్థ శాస్త్రసంప్రదాయానుగుణముగ దర్శించుట యుక్తము పురాణములు వేదార్థోపబృంహకము లని చెప్ప బడుచున్నవి. వైదిక దేవతాతత్త్వమును వేదాంగములలో నొకటి యైన నిరుక్తశాస్త్రము చక్కగా వివరించినది ఒకే మహాగ్ని, పృథివి అంతరిక్ష ద్యులోకముల యందు అగ్ని, వాయు, ఆదిత్య రూపములతో వ్యాప్తమై యున్నది వాయువునే రుద్రరూపముగా నిరుక్తశాస్త్రము చెప్పుచున్నది. కనుక, వాయు, రుద్ర స్వరూపములు పరస్పరము భిన్నములు గావని దీనివలన తెలియుచున్నది. కనుక నిరుక్తశాస్త్ర సంప్రదాయము ననుసరించి, వాయుపుత్రు డనినను, రుద్రావతారుడనినను, తాత్పర్య మొక

టియే. ఇవి పరస్పర విరుద్ధ కల్పనలు గావు. (ఈ విషయము భారతీ విముక్తి యందు చక్కగా వివరింపబడినది.

## హనుమంతుడు తామ్రముఖము

దాసదృష్టితో చూచినచో హనుమంతుడు రాముని కంటె భిన్నుని వలె కన్పట్టును. కాని హనుమంతుడు తన ఉపాస్యదైవ మగు శ్రీరాము నితో తాదాత్మ్యము చెందిన మహాభక్తుడు. కనుకనె హనుమంతుని పూజించినచో హనుమంతుని తోపాటు శ్రీరాముని గూడ పూజించి నట్లే యని చెప్పుదుము. ఇట్లు భక్తుడై యుండి అరాధ్యదైవముగ వాద వాదల యందు సాక్షాత్కరించుట రామదూత యైన హనుమంతునిలో కనపట్టు విశిష్టత. హనుమంతుని యారాధించుటలో అనితరసాధారణ మైన ఎరి యొక ప్రయోజనము గూడ గలదు. హనుమంతుని జూచినపు డా దేవుని నాసికా భాగము సిందూరవర్ణ శోభితమై కన్పట్టును. ఇట్టి వర్ణన రామాయణమున గలదు.

ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ ।
సంధ్యయా సమభిస్పృష్టం యథైత త్సూర్యమండలమ్ ॥
సుందరకాండ

తామ్రవర్ణము గల నాసికాకాంతిచే వ్యాప్త మైన హనుమంతుని ముఖము సంధ్యారుణకాంతి సంశోభితమై వెలయు సూర్యమండలము వలె ప్రకాశించుచున్నది. అని భావము.

భారతీయులకు సూర్యుడు ప్రత్యక్షారాధ్యదైవము. అందులో సంధ్యాకాలిక సూర్యమండలము 'అత్యంత ప్రశస్తమై ఉపాసింపబడు చున్నది. సూర్యాభిముఖులై ప్రతిదినము సంధ్యోపాసన జేయుట భారతీయ నిత్యవిధులలో ప్రధానాతిప్రధానము. సాంధ్యాకాలిక సూర్య మండల మెంత ప్రశస్తమో సాంధ్యారుణకాంతి శోభిత మైన హనుమంతుని ముఖము గూడ నట్టిదే. సంధ్యోపాసన వలన భక్తు లెట్టి ఫలము నొందెదరో హనుమన్ముఖసందర్శన మాత్రముచే నట్టి ప్రయో జనము నొందుదురు. హనుమంతుని సూర్యనిమండలముతో పోల్చుటచే నతడుసవితృదేవత వలె నుపాస్యుడు పరేణ్యభర్గ స్వరూపము ఐనె ఆయన ముఖారుణకాంతియు నుపాస్యము అను విషయమును కవి పై యుపమానము ద్వారా ఉపదేశించుచున్నట్లు తెలియును

## హనుమచ్ఛబ్దము మరియొకనిర్వచనము

ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బకు గూడ చెక్కుచెదరని ప్రశస్తము లైన హనువులు గలవా డగుటచే హనుమంతుడని పౌరాణిక నిర్వచనము పైన జూపబడినది. హనుమంతుని హనువుల ప్రాశస్త్య మింతియే గాదు ప్రశస్తమైన కల్యాణకరమైన వాక్కు నుచ్చరించు టకు దోహదము జేసెడి ప్రశస్తము లైన హనువులు గలవా డగుటచే హనుమంతు డను సార్థకనామము వహించినట్లును పూర్వము వివరింప బడినది. హనశబ్దము యొక్క నిర్వచనమును పరిశీలించినను హనుమంతుని యందలి అసాధారణ విశేషమును దర్శింపగలము.

20)

"హను ర్హంతేః" అని యాస్కనిర్వచనము. "హన హింసా గత్యోః" హనధాతువునకు హింస, గతి యని రెండర్థములు ప్రసిద్ధములు. భోజ్యపదార్థమును నములు నపుడు హనువులు (దౌడలు) గమనశీలము లగుచుండును. కావున హనువు లని పేరు. ఇక హింసార్థము "హంతి అమయ మితి హనుః" అమయ మనగా వ్యాధి వ్యాధిని పోగొట్టునది (చూ. గురుబాలప్రబోధిక) వ్యాధి నివారకశక్తి గల్గినది హనువు అని యీ నిర్వచనము వలన తెలియును. హనువులు దుర్బలము లగుచో భోజ్యపదార్థమును చక్కగ నములలేక పోవుట, దానివలన వివిధ వ్యాధులు వచ్చుట లోకసహజమైన విషయము. ప్రశస్తము లయిన హనువులు కలవాడని చెప్పబడెడి హనుమంతుని విషయమున హనుమంతుని ప్రాశస్త్యమును తెలియజేయు అసాధారణ విశేష మొకటి యుండవలెను. సంధ్యాదేవతను దర్శించిన మాత్రముననే ఉపాసించినమాత్రముననే నఖిల ఉపద్రవములు తొలగు నని శాస్త్రములు చెప్పుచుండును. అట్లే హనుమంతుని విషయమున మునువులు ముఖమున కుపలక్షకములు సాంధ్యారుణకాంతి వలె ప్రశస్తము లైన దివ్యము లైన హనుమంతుని హనువులను అనగా ముఖమును సందర్శించి నంత మాత్రముననే వ్యాధ్యాద్యుపద్రవము లన్నియు తొలగును హనుమంతుని ఉపాసించి భూత ప్రేత పిశాచ వ్యాధ్యాద్యుపద్రవముల నుండి విముక్తు లగుట చూచుచునే యున్నాము. ఇట్లు ఈ హను శబ్దనిర్వచనము హనూమ న్ముఖగత దివ్యతేజోవిలాసమును దర్శింపజేయుచున్నది.

# రామాయణమహామాలారత్నమ్

రామాయణ మొక విచిత్రరత్న మణిహారము అందలి పాత్ర లన్నియు విచిత్ర దివ్యకాంతులు వెదజల్లు అనర్ఘరత్నములు మణులు. నారదోపదేశము వలన, బ్రహ్మ యొక్క ఆదేశము వలన మహాకవి తపస్సిద్ధి వలన శ్రీ సీతారామచంద్ర కంఠాభరణ రూపమున ఈ రామాయణమహామాల లోకమున నవతరించినది. ఈ మహామాల యందలి మణులుగా భావించెడి భరతాదుల యందు ఒక్కొక్క విశిష్టత గలదు. త్యాగనిరతితో భ్రాతృసేవాపరాయణత్వముతో భరతాదులు వన్నె కెక్కిరి. సుహృద్ధర్మమున సుగ్రీవుని వంటి వారు లేరని ప్రసిద్ధి గల్గినది. ధర్మదీక్షితు డైన విభీషణుడు అగ్రజుని విడిచి పెట్టుటకు కూడ వెనుకాడలేదు ఇట్లు ఒక్కొక్కరు ఒక్కొక్క విశిష్ట గుణ సంపదచే వాసి కెక్కిరి. అయినను, రామాయణ మహామాలారత్న మనెడి ఖ్యాతి ఆంజనేయునకే దక్కినది ఆంజనేయుడే లేనిచో నే నింతటి కార్యమును నెరవేర్చ గలనా అని శ్రీరాముడే స్వయముగ చెప్పికొనెను.

ఏతస్య బాహువీర్యేణ లంకా సీతా చ లక్ష్మణః।
ప్రాప్తా మయా జయ శ్చైవ రాజ్యం మిత్రాణి బాంధవాః॥
"హనుమాన్ యది మే న స్యాత్ వానరాధిపతేః సఖా।
ప్రవృత్తి మపి కో వేత్తుం జానక్యాః శక్తిమాన్ భవేత్"
రామాయణ. ఉత్తరకాండ. 35సర్గ 9 10 శ్లో.

కర్తుడు లెని భారతమా యన్నట్లు హనుమంతుడు లని రామాయ ణమా ? యను ఖ్యాతియే హనుమంతుని ప్రత్యేకతకు తార్కాణము ఎంతమంది పరివారములో శ్రీరాముని సర్వస్వభూతమైన గాఢపరిష్వంగ మును అందుకొన గల్గిన భాగ్యశాలి హనుమంతు డొక్కడే

"ఏష సర్వస్వ భూతో మే పరిష్వంగో హనూమతః ।
మయా కాల మిమం ప్రాప్య దత్త స్తస్య మహాత్మనః"

రామాయణ యుద్ధకాండ.

ఇంతమందిలోను, వేదవేదాంగవేత్తగా ఉత్తమ సంస్కారసంపన్నుడుగా శ్రీరామునిచె గీర్తింపబడినవాడు హనుమంతు డొక్కడే హనుమంతుని యందలి యుత్తమ సంస్కారమును కాళిదాస మహ కవి ఒక యుపమానము ద్వారా చక్కగా ప్రశంసించినాడు.

ప్రవృత్తా వుపలబ్ధాయాం తస్యాః సంపాతిదర్శనాత్ ।
మారుతి స్సాగరం తీర్ణః సంసార మివ నిర్మమః"

రఘువంశ. 12 60

జటాయువు సోదరు డగు సంపాతి వలన సీతను గూర్చిన వృత్తాంతము తెలియగనే మమతారహితుడు అనగా నిష్కాముడు (నిర్మమః) సంసారసాగరమును సుఖముగా తరించునట్లు హనుమంతుడును సు. యాసముగ సముద్రమును దాటెను అని యర్థము.

హనుమంతుడు సముద్రమును దాటుట యనునది కథాపరమైన యర్థము. హనుమంతునకును శ్రీరామకార్య నిర్వహణము కంటె కోరి

దగిన వస్తు వేదియు ప్రపంచమున లేదు. స్వామి కార్యనిర్వహణయే ఆయన జీవితలక్ష్యము. శ్రీరాముడే ఆయన సర్వస్వము కావున మమతారహితుడు శ్రీరామానుగ్రహముచే భవసాగరమును దాటిన మహాయోగి, మహాభక్తుడు, మహాజ్ఞాని మమతారహితుడై హనుమంతుడు భవసాగరమును దాటె నని కవి ఉపమానవ్యాజమున ధ్వనింప జేసినాడు. ఇది హనుమంతుని ఉత్తమ సంస్కారక్రమ సంపన్నతా సూచకము.

రామాయణమున సీతతో రాముని యోజన చేసిన మహాత్ములు ముప్వురు కన్పట్టుదురు కల్యాణ సంధాయకుడై సీతారాముల మొదట గూర్చిన మహాత్ముడు విశ్వామిత్రుడు శ్రీరాముని నుండి వేరు చేసిన సీతను అన్వేషించి, ఆ సీతతో రామునిగూర్చిన ఘనుడు హనుమంతుడు. లోకాపవాద భీతిచే అరణ్యమున పరిత్యక్తయైన సీతను ఆశ్రమమున నుంచుకొని మహాజన సమక్షమున ఆమెను నిర్దోషిగా ప్రకటించి సీతతో రాముని గూర్చిన ఘనత వాల్మీకికి దక్కినది. ఈ ముప్వురు మహాత్ములే అట్టి మహాత్ముల కోవకు చెందినవాడు హనుమంతుడు.

శ్రీరాముని పట్టాభిషేకానంతరము అందఱకును పారితోషికము లిచ్చెడి సందర్భమున తన కంఠహారమును హనుమంతుని కీయదలచి సీత భర్త వైపు జూచును. అపుడు సీతను జూచి శ్రీరాము డిట్లు చెప్పెను.

"ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామిని।
పౌరుషం విక్రమో బుద్ధిః యస్మి న్నేతాని సర్వశః"

పౌరుష విక్రమములు, వివేకబలము పుష్కలముగ గలిగి ఎవడు

నీ యనుగ్రహమునకు పాత్రుడో అతనికి నీ హం మీయుము. అని యర్థము.

అంతట సీత తన సర్వస్వభూత మైన హారమును హనుమంతునకు బహూకరించును. ఈ విధముగ సీతారాములనుండి ప్రత్యేక బహుమతుల నందుకొనిన మహాభాగ్యశాలి కావుననే "రామాయణ మహామాలా రత్నమ్" అని నేటికీ కీర్తింపబడుచున్నాడు.

## శ్రీరామదూతం శిరసా నమామి

ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్ అని సామాన్యముగ వినబడెడి సూక్తి హృద్రోగం మమసూర్య అను శ్రుతిమంత్రమును జపించుచు హృద్రోగపీడితుడు సూర్యు నారాధించుట కలదు. హనుమద్దర్శన సేవా పూజాదుల వలన నట్టి ఫలము లభించు నని పురాణాదులు కీర్తించు చున్నవి.

"బుద్ధి ర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా ।
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమ త్స్మరణా ద్భవేత"

హనూమత్స్మరణము వలననే బుద్ధి బల యశో ధైర్య నిర్భయత్వ ఆరోగ్య అనాలస్య వాక్పటుత్వాది ఫలము లన్నియు సిద్ధించు నని పై సూక్తి చెప్పుచున్నది. కనుకనే వానరరూపుడుగా, భిక్షువుగా, సుందరుడుగా, అంజనేయుడుగా, హనుమంతుడుగా రామాయణ మహామాలారత్నముగా విరాజిల్లెడి రామదూత మానవుల కుపాస్యదైవ మయ్యెను. ప్రాణదేవతా తాదాత్మ్యము జెంది, అవలీలగా సాగరమును,

భవసాగరమును తరించి సంసారతరణోపాయముగా రామభక్తిని లోకమున నెలకొల్పిన లోకోత్తరసుందరుని మన మిట్లు ఆరాధించుదము.

'శ్రీరామదూతం శిరసా నమామి.'

## ఆంజనేయ ద్వాదశనామస్తోత్రము - ఫలశ్రుతి

"హనుమా నంజనాసూనుః వాయుపుత్రో మహాబలః ।
రామేష్టః ఫల్గుణసఖః పింగాక్షోఽమితవిక్రమః ॥
ఉదధిక్రమణ శ్చైవ సీతాశోక నివారణః।
లక్ష్మణప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా ॥
ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః ।
స్వాపకాలే పఠే న్నిత్యం యాత్రాకాలే విశేషతః ॥
తస్య మృత్యుభయం నాస్తి సర్వత్ర విజయీ భవేత్"

.... o ....

# 7. రామాలయాలలో లక్ష్మణుడు

రాముడు ఆరాధింపబడెడి దివ్యక్షేత్రములలో భద్రాచలక్షేత్రము అగ్రస్థాన మలంకరించుచున్నది. ఇచట సీతారాములతోపాటు లక్ష్మణుడు గూడ ఆరాధింపబడుచున్నాడు. భద్రాదియందే కాదు, రామాలయము లన్నిటియందును సీతారాములతో పాటు లక్ష్మణుడు గూడ ప్రతిష్ఠింపబడి ఆరాధింపబడుచున్నాడు.

సాధారణముగా దేవాలయములలో అనాది దంపతులైన పార్వతీ పరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు ఇట్లు దంపతులే ప్రతిష్ఠింపబడు చుందురు. అట్లే రామాలయములందును సీతారాములు ప్రతిష్ఠింపబడుట సహజము. కాని వారితో కూడ లక్ష్మణు డుండుట విశేషము. లక్ష్మణుడు లేని రామాయణము సామాన్యముగా కన్పించదనవచ్చును. దీనిని బట్టి లక్ష్మణుడు సీతారాములతో గూడ ప్రతిష్ఠింపబడుట సంప్రదాయాను గుణమే యని తెలియును. కాని, యర్ధమునకు ఉంచే, సీతాసహితుడై యుం డుట ధర్మము. లేదా హనుమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న సమేత శ్రీరాముడు ప్రతిష్ఠింపబడుట సహజము. అట్లుగాక, సీతారాములతో లక్ష్మ ణుని మాత్రము ప్రతిష్ఠించుట, పూజించుట చూచుచున్నాము. అట్లు దంపతుల మధ్య ఇతరు లుండుట లోకము విరుద్ధముగా భావించును. కాని లోకము మాత్రము విరుద్ధముగా భావింపక ఆ సంప్రదాయమునం దెంతయో ఉచితము గలిగియున్నది. కనుక, ఈ సంప్రదాయ రహస్య మేదియో తెలియవలసి యున్నది.

శ్రీరాముడు పుట్టినప్పటినుండి లక్ష్మణుని వీడి క్షణ ముండలేదు వారి సాహచర్యమును వాల్మీకి యిట్లు వర్ణించుచున్నాడు

బాల్యా త్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః।
సర్వప్రియకర స్తస్య రామస్యాపి శరీరతః ॥
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిః ప్రాణ ఇవాపరః।
న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః ॥
మృష్ట మన్న ముపానీత మశ్నాతి నహి తం వినా।
యదా హి హయ మారూఢో మృగయాం యాతి రాఘవః ॥
తదైనం పృష్ఠతోఽ న్వేతి సధనుః పరిపాలయన్।

బాలకాండ

లక్ష్మణుడు రామునకు బహిఃప్రాణము లక్ష్మణుడు లే రామునకు నిద్ర లేదు అతడు లేక మృష్టాన్నమునైన భుజింపడుక రాము డశ్వారూఢుడై వేటకు వెడలినపుడు లక్ష్మణుడు గూడ ధనుష్పా ణియై రాముని వెంబడించును

ఇట్లొకరిని విడిచి యొకరుండరు గాన, నా సాహచర్యమును గుర్తింపజేయుటకే ఆలయములందు సీతారాములతోపాటు లక్ష్మణుడు గూడ ప్రతిష్ఠింపబడుచున్నాడని సమాధానము చెప్ప యత్నింపవచ్చు కాని, అన్నదమ్ముల చిన్ననాటి సాహచర్యము వేరు వివాహితులైనవారి సాహచర్యము వేరు చిన్నతనము నందెట్లు సంచరించిన, వయసు

చ్చిన తరువాత మార్పు తప్పదు దంపతుల మధ్య అన్య దుండుట లోకసహజము గాదు కాని, సీతారాములతోపాటు లక్ష్మణుని ప్రతిష్ఠించు సంప్రదాయము శిష్టజనసంమతమై యుగయుగములుగా వచ్చుచున్నట్లు తెలియును. అనూచానముగ వచ్చు ఈ సంప్రదాయము నందలి నిగూఢ భావము పరిశీలింపవలసియున్నది

రామాయణమున రాముని ప్రసక్తి ఎచ్చట ఎపుడు వచ్చినను వాల్మీకిమహర్షి లక్ష్మణుని మరువడు

విశ్వామిత్రుడు యజ్ఞసంరక్షణార్థము రాముని పంపుమని దశరథుని గోరును కాని లక్ష్మణసహితుడై రాముడు విశ్వామిత్రుని వెంట వెళ్ళును రామలక్ష్మణులు విశ్వామిత్రునితో సరయూనదీతీరమునకు చేరి యచట విశ్రమింతురు విశ్వామిత్రుడు ప్రభాతసమయమున శ్రీరాము నిట్లు మేలుకొలుపును

" కౌసల్యాసుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్ ॥ "

ఈ మేలుకొలుపు రాము నుద్దేశించినదే కాని లక్ష్మణునకు గూడ వర్తించును కావుననే, రామునితోపాటు లక్ష్మణుడును లేచి ప్రాతస్సంధ్యోపాసనాది కృత్యములు నిర్వర్తించినట్లు తరువాత వర్ణింపబడినది అట్లే బలా-అతిబలవిద్యలు విశ్వామిత్రుడు శ్రీరామున కుపదేశించినట్లుగా మూలమున గన్పట్టును కాని, లక్ష్మణునకును ఉపదేశించినట్లే కావుననే, ఆ విద్యాప్రభావము వలన రామునితోపాటు లక్ష్మణుడు గూడ క్షుత్పిపాసాదిబాధారహితుడై వెలసిల్లినట్లు తరువాత వర్ణనల వలన దెలియును వ్యాఖ్యాతలును ఈ విషయ మిట్లు వివరించిరి

" గృహాణ త్వ మిత్యుపలక్షణం లక్ష్మణస్యాపి క్షుత్పిపాసో
పశాంతిరూప ఫలస్య ఉభయో రవి దర్శనా దపేక్షణాచ్చ "

బాల 22 12 మహేశ్వర తీర్థవ్యాఖ్య.

కైకేయి రాముని మాత్రమే యడవికి పంపుమని భర్తను కోరును దశరధుడు గూడ రాముడే వనమున కేగు మని చెప్పును కాని, పత్నీ సమేతుడై రాముడు బయలుదేరినంతనే లక్ష్మణుడు గూడ వారల ననుసరించును ఇట్లు లక్ష్మణుడు లేక రాముని విడిగా రామాయణమున దర్శింప లేము వారల సాహచర్యము వారి యవినాభావసంబంధమును గుర్తింప జేయును

రామలక్ష్మణుల కిట్టి యనుబంధ మున్నను, వారిలో ప్రత్యేకతయు గలదు రాముడు స్వతంత్రుడు లక్ష్మణుడు తత్పరాధీనుడు, ఆరాధకుడు సీతా రామునకు వశవర్తిని, సహచారిణి లక్ష్మణున కారాధ్య దేవత లక్ష్మణునిదృష్టిలో శ్రీరాముడు కేవలము సోదరుడు గాదు, ఇన్నిమాట లేల! ఈశ్వరుడే జీవేశ్వరుల కెట్టి స్వస్వామిభావసంబంధమో వారిరువురికి గల సంబంధ మట్టిది రాముడు లక్ష్మణుని సోదరుని వలె దగ్గరకు దీయును మిత్రునివలె సంప్రదించును కొన్నియెడల అతనిని మందలించును, ధర్మమూర్తియై శాసించును ఒజ్జయై యుపదేశించును శ్రీరామునియందు స్వార్థము కన్పట్టదు లక్ష్మణునియందు కన్పట్టును అది అతని జీవభావమున కుపలక్షకము కాని, అందరి జీవుల స్వార్థమువంటి స్వార్థము కాదు తన సోదరుడు, ఆరాధ్యదైవము నగు శ్రీరాముడు బాధపడుట ఏమాత్రమూ సహింపడు. తన కష్టమును

గూర్చి యాలోచింపడు ఇదియే లక్ష్మణునకు గల స్వార్థము ఇది ధర్మావిరుద్ధమైన కామము విశ్వామిత్రుని కామ మాతనియున్నలి ట్లు దారితీసినదో, లక్ష్మణుని ఈ కామము గూడ రామునితోపాటు శాశ్వతముగా కీర్తనీయ శాశ్వతస్థితికి దారితీసినది సీతనుండి రాముని ఎటు చేయలేనట్లు, లక్ష్మణుని నుండియు రాముని వేరు చేయ శక్యము గాదు కాన రామలక్ష్మణులు జీవేశ్వరతత్త్వస్వరూపు లనిగుర్తించుట కవకాశము గలుగుచుండును ఇట్లు రామలక్ష్మణులు జీవపరమాత్మస్వరూపు లని బోధించుటకే వాల్మీకి వారిల నడుగడుగున అశ్వి దేవతలతోపోల్చినట్లు కన్పట్టును

"విశ్వామిత్రం మహాత్మానం త్రిశీర్షా వివ పన్నగౌ ।
అనుజగ్మతు రక్షుద్రౌ పితామహ మివాశ్వినౌ"

బాలకాండ 22 17

విశ్వామిత్రుని వెంబడించు రామలక్ష్మణులు ఎతామహాని వెంబడించు అశ్వి దేవతల వలె విలసిల్లిరట పితామహుని అశ్వి దేవతలు వెంబడించుట యన నేమి? వారికి గల సంబంధ మెట్టిది? ఇట్లే ఎరియొక యుపమానము కలదు

"సిద్ధార్థః ఖలు సూత త్వం యేన దృష్టౌ మమాత్మజౌ ।
వనాంతం ప్రవిశంతౌ తా వశ్వినా విన మందరమ్"

అయోధ్య. 58 10

రామలక్ష్మణులను వనమున దింపి తిరిగివచ్చిన సూతుని జూచి దశరథు డిట్లనుచున్నాడు సూతా! మందరమును ప్రవేశించు అశ్వి దేవతలను వలె వనమున ప్రవేశించిన రామలక్ష్మణుల జూచిన నీవు ధన్యుడవు. [సిద్ధార్థః]

అశ్వి దేవతలు మందరమును ప్రవేశించుట యననేమి? మరి యొక చోట ముక్తకంఠముగ రామ లక్ష్మణులకు అశ్వి సాదృశ్యము చెప్ప బడినది

"అశ్వినో రివ సౌభ్రాత్రం తయో ర్లోకేషు విశ్రుతమ్"

ఇట నొక విశేషము రామలక్ష్మణులకు గల అశ్విసాదృశ్యము లోకప్రసిద్ధమట లోకప్రసిద్ధమైన సాదృశ్యమునే కవి ఇట అనువదించు చున్నట్లు తెలియుచుండుటచే ఇది కేవల కవిప్రతిభా కల్పితము కాదని తెలియును దీనిని బట్టి వాల్మీకి వచనములు భూతార్థవాదరూపము లని తెలియును

రామలక్ష్మణులకు గల అశ్విసాదృశ్యము స్ఫుటముగా తెలియవలె నన్న ముందు అశ్విస్వరూపము స్ఫుటముగా తెలియవలెను అశ్విస్వరూపము స్పష్టముగా తెలియవలె నన్న వేదమే శరణ్యము. వారు శ్రుతి ప్రసిద్ధులు ఒకరిని వీడి ఒకరుండరు వారి సాహచర్యము నిత్యము అయితే, ఈ యిరువురు దేవతలతోపాటు సరస్వతీదేవతయు శ్రుతియందు శ్రూయమాణ యగుచుండును

"సరస్వతీ మనసా పేశలం వసు నాసత్యాభ్యాం వయతి దర్శతం వపుః।
సరస్వతీ యోన్యాం గర్భ మంతః అశ్విభ్యాం పత్నీ సుకృతం బిభర్తి"

తై బ్రా 2 6 4

ఈ విధముగా శ్రుతి అశ్వినులతో సరస్వతి యొక్క సాహచర్య మును ప్రదర్శించుచుండును

మహాభారతమున ఉపమన్యుకృత అశ్విస్తోత్రమున అశ్వులు జీవపరమాత్మలుగా కీర్తింపబడినారు

"యువాం జీవాత్మరూపౌ" అని నీలకంఠవ్యాఖ్యానము (ఆదిపర్వ 1 59), మహాభారతారంభమున గల మంగళశ్లోకమును పరిశీలించిన, జీవపరమాత్మలకు సరస్వతితో సాహచర్య మున్నట్లు తెలియగలదు

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్"

ఇచట నరనారాయణులు జీవపరమాత్మలు నరోత్తముడు పురుషోత్తమశబ్దవాచ్యమగు పరబ్రహ్మయే జీవేశ్వర స్వరూపమును తత్స్వరూపావగతి ద్వారా పరబ్రహ్మ స్వరూపమును తెలియజేయు వేదవాణియే సరస్వతి

"చతుష్కపర్దా యువతి స్సుపేశా ఘృతప్రతీకా వయునాని వస్తే ।
తస్యాం సుపర్ణా వృషణా నిషేదతుః యత్ర దేవా దధిరే
భాగధేయమ్"

ఋ 10 114 3

ఈ మంత్రమున శ్రుతి తనను యువతిగా వర్ణించుకొనుచున్నది ఆమె సుపర్ణులగు జీవేశ్వరులతో విరాజిల్లుచు [తస్యాం సుపర్ణా వృషణా

నిషేదతః] ఆరాధకుల ననుగ్రహించుచుండును ఇచట వేదమాత జీవేశ్వరుల తొ తనకు గల సాహచర్యమును స్పష్టముగా చెప్పుకొనినది ఇదియే జీవేశ్వరులతో సరస్వతికి గల సాహచర్యము

ఇట్లు అశ్విదేవతలను జీవేశ్వరులుగా దర్శించినపుడు అశ్వినుల మందరప్రవేశరూప ఉపమానతాత్పర్య మవగత మగుచున్నది

"సిద్ధార్థః ఖలు సూత త్వం యేన దృష్టౌ మమాత్మజౌ ।
వనాంతం ప్రవిశంతౌ తా వశ్వినా వివ మందరమ్"

మందరమును ప్రవేశించిన అశ్వినులను వలె వనాంతమును ప్రవేశించిన రామలక్ష్మణుల జూచి సూతుడు కృతార్థుడైనట్లు (సిద్ధార్థః) దశరథు డనుచున్నాడు

ఇంతవరకు రామలక్ష్మణులను పుత్రులుగా మాత్రమే జూచినాడు, ప్రేమించినాడు వనాంతమున ప్రవేశించుచున్న రామలక్ష్మణు లిపుడు దశరథునకు అశ్విదేవతల వలె మనోవీధి యందు భాసించిరి

ఇచట మందర మనగా, స్థూలప్రపంచము మందర శబ్దమునకు స్థూలప్రపంచ మను నర్థము హరివంశ వ్యాఖ్యయందు నీలకంఠపండితు నిచే వివరింపబడినది "మందరాగ్రే స్థూలప్రపంచస్య అగ్రే"
హరివంశ 28 63

"తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అని శ్రుతి నామరూపాత్మక స్థూలప్రపంచమును సృజించి అందు జీవస్వరూపమున ఈశ్వరుడు ప్రవేశించెను. ఇదియే జీవేశ్వరుల మందరప్రవేశము [స్థూలప్రపంచ

ప్రవేశము] రామలక్ష్మణుల వసంతప్రవేశము జీవేశ్వరుల స్థూలప్రవేశము వంటిదిగా దశరథుడు దర్శించెను. స్థూలప్రపంచమును అరణ్యముతో పోల్చుట సంప్రదాయము.

సంసారాటవిని ప్రవేశించు జీవేశ్వరులవలె రామలక్ష్మణులు వసంతమును ప్రవేశించుచున్నట్లుగా దశరథుడు భావించెను. అట్టి రామలక్ష్మణులను జూచి ధన్యుడనైతి నని దశరథుడు సుమంత్రునితో పలుకును. దీనిని బట్టి దశరథుని దృష్టిలో రామలక్ష్మణు లిపుడు జీవేశ్వరులే.

ఇక "పితామహ మివాశ్వినౌ" అను ఉపమాన స్వారస్యమును దర్శింతము.

"విశ్వామిత్రం మహాత్మానం త్రిశీర్షావివ పన్నగౌ।
అనుజగ్మతు రక్షుద్రౌ పితామహ మివాశ్వినౌ"

ప్రతిదినము సూర్యోదయమునకు పూర్వము అశ్వికాల మని యాజ్ఞిక సంప్రదాయము. అందును తమః ప్రధానభాగము ప్రథమాశ్వికాల మనియు, జ్యోతిః ప్రధానకాలము ద్వితీయాశ్వికాల మనియు వ్యవహారము. ఈ అశ్వీదేవతలు ఎల్లప్పుడు సర్వలోకపితామహుడు బ్రహ్మరూపయున్నైన ఆదిత్యుని అనువరించుచుందురు. ఇది సార్వకాలిక సత్యము. ఈ సత్యమును గుర్తింపజేయుటకే విశ్వామిత్రుని వెంట పోవుచున్న రామలక్ష్మణులు పితామహుని అనుసరించుచున్న అశ్వీదేవతలుగా వర్ణింపబడినారు. (అశ్విస్వరూపము వేదమాతృస్తవమున విపులముగా దర్శింపవచ్చును.) ఇది యాజ్ఞికపరమైన అర్థము.

ఇక్ష్వతా త్త్వికార్థము చూతము ఇట ఉపమేయము విశ్వామిత్రుడు అయన బ్రహ్మర్షి "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" బ్రహ్మస్వరూపుడు ఉపమేయము ననుసరించి ఉపమానము గూడ బ్రహ్మయే కావలయును లేనిచో, ఔచిత్య ముండదు అయితే, విశ్వామిత్రుడు గమనశీలమైన బ్రహ్మ, ఉపమానముగా గ్రహింపబడెడి బ్రహ్మ నిర్గుణము, నిష్క్రి యము గమనశీలము గాదు కాన ఔపమ్య మెట్లు పొసగును?

బ్రహ్మ గమనశీల మగునా, కాదా? యన్నది ప్రకృతాంశము గాదు ఇచట సాధర్మ్య మనుగమనము సాధర్మ్య మున్నచో చాలును జీవుడును ఈశ్వరుడును ఉపాధికృత భేదము కలవారివలె నొప్పుచున్నను తత్త్వతః బ్రహ్మస్వరూపులు అదియే సాధకుడుదర్శింపదగిన లక్ష్యము లక్ష్యీభూత సాధక భావితజీవేశ్వర బ్రహ్మతత్త్వానుగమనమే ఇట అను గమనముగా అలంకారికముగా చిత్రీకరింపబడినది

జీవేశ్వరులు మూర్తీభవించిన బ్రహ్మతత్త్వము ననుగమించు చున్నారాః యనునట్లుగ మూర్తీభవించిన బ్రహ్మరూపుడైన విశ్వామిత్రుని జీవేశ్వరస్వరూపు లగు రామలక్ష్మణులు అనుగమించుచున్నట్లు కవి తన యనుభూతిని వర్ణించుచున్నాడు ఈ ఉపమానము ద్వారా విశ్వామిత్రుని మహానుభావము [ఎతామహాత్మ్యము] అయన ననుగమించుచున్న రామ లక్ష్మణుల జీవేశ్వరభావము వ్యక్త మగుచున్నవి

పూర్వోదాహృత "నారాయణం నమస్కృత్య నరం చైవ
నరోత్తమమ్ దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్"

22)

అను భారతాది మంగళశ్లోకము జీవేశ్వరలక్ష్మీభూత నరోత్తమ రూప బ్రహ్మతత్త్వమును శ్రుతిమాతయైన సరస్వతి యనుగ్రహముచే దర్శింపదగు నని చెప్పుచు పై విషయమును గుర్తింపజేయుచున్నది

పై గ్రంథ సందర్భము ననుసరించి రామలక్ష్మణులు జీవేశ్వర స్వరూపు లనియు జీవుడు శ్రుతిమాత నారాధించి యామె అనుగ్రహముతో ఈశ్వరానుగ్రహ పాత్రుడగుననియు స్పష్టమైనది ప్రకృతమున జీవ స్థానీయుడైన లక్ష్మణుడు సదా సీతాపాదారవింద సంసక్తహృదయుడు

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే ।
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్"

ఈ శ్లోకము లక్ష్మణుని యొక్క సీతవిషయక భక్తిప్రపత్తిని నిరూపించుచున్నది

లక్ష్మణస్వరూపమును వాల్మీకి యింకను ఇట్లు వివరించుచున్నాడు

స తథేతి మహారాజో రామ ముక్త్వా కృతాంజలిమ్ ।
లక్ష్మణం చ పరిష్వజ్య పున ర్వాక్య మువాచ హ ॥
రామం శుశ్రూషతా భక్త్యా వైదేహ్యా సహ సీతయా ।
కృతా మమ మహాప్రీతిః ప్రాప్తం ధర్మఫలం చ తే ॥

రామా యుద్ధ 122 27, 28

రావణ వధానంతరము సీత అగ్నిపరిశుద్ధ యైనది స్వర్గమునుండి విమానారూఢుడై దశరథుడు వచ్చి కృతాంజలియైన రాముని ప్రశంసించి

లక్ష్మణు నాలింగనము జేసికొని లక్ష్మణునితో నిట్లు చెప్పెను వత్సా! విదేహ రాజపుత్రిక యైన సీతతో సహ నీవు రామునకు భక్తితో శుశ్రూష యొనర్చి కృతార్థుడవై ధర్మఫలమునుపొంది నాకెంతయు ఆనందము గూర్చితివి

సీత అగ్నిశుద్ధురా లగుటవలన ఆమె పాతివ్రత్యమహిమ ఖ్యాపిత మగుటయే గాక, ఆమె అగ్నివర్ణరూపిణి యగు పరాదేవతా స్వరూపిణి [అగ్నివర్ణాం తపసా జ్వలంతీం] యని ప్రస్ఫుట మగుచున్నది అట్టి దేవతను సేవించి శ్రీరామానుగ్రహమునకు పాత్రుడైన లక్ష్మణుడు దశరథున కానందమును గల్పించెను. దీనినిబట్టి లక్ష్మణునకు సీతయందుగల అకల్మషభక్తి శ్రద్ధాతిశయములు ప్రతీతము లగుచున్నవి

పూవు పుట్టగనే పరిమళించును లక్ష్మణుని యొక్క స్వభావము ప్రజలకు ముందే తెలియును లక్ష్మణుని యెడల ప్రజల ఆదరాభిమానము లెట్టివో, ఈ క్రిందిశ్లోకము వలన తెలియును

"ఏక స్సత్పురుషో లోకే లక్ష్మణ స్సహ సీతయా।
యోఽనుగచ్ఛతి కాకుత్స్థం రామం పరిచరన్ వనే"

"శ్రీరాముని సేవించుటకై సీతతోపాటు వనమున రాము ననుసరించు లక్ష్మణు డొక్కడే సత్పురుషుడు

ఇది లక్ష్మణుని గూర్చిన ప్రజల యభిప్రాయము

సీతారామ దంపతులతో లక్ష్మణు డెందుకు? అను నభిప్రాయము ప్రజలకు కలుగలేదు వారు లక్ష్మణుని హృదయ మెరుగుదురు రామునివలె సీతయు లక్ష్మణున కారాధ్య దేవత ఆరాధ్యదేవతను భక్తు డనుగమించుట సహజము కనుకనే లక్ష్మణుడు సీతతో సహ రాము నను

గమించుటను ప్రజలు హర్షించిరి హర్షించుటయే గాదు "ఏక స్సత్పురుషో లోకే అని కీర్తించిరి" లోకమున ఇట్టి సత్పురుషుడు లక్ష్మణుడొక్కడే" అని వారి యభిప్రాయము వారి దృష్టిలో లక్ష్మనుడు సాధారణ రాజపుత్రుడు గాడు నిరంతరము సీతారాముల సేవించు మహాభక్తునిగా దర్శించిరి బాల్యమునుండియు రామలక్ష్మణుల యవినాభావ సంబంధమును వారెఱుగుదురు పామరులకు వారు జీవేశ్వరులను భావన యుండకపోవచ్చును విజ్ఞుల దృష్టిలొ వారు జీవేశ్వరులే ఇది వాల్మీకి యొక్క భావనయే గాదు తరువాతి కవులు వాల్మీకి యభిప్రాయము నిట్లే గ్రహించినట్లు కన్పించును

"ఏతయోః ప్రకృతిరమ్యరూపయోః
ఉల్లస త్సహజ సౌహృదశ్రియోః ।
అంతరః స్ఫురతి కో౽పి సంనిధిః
ప్రత్యగాత్మ పరమాత్మయో రివ"

ప్రసన్నరాఘవ 3 20

రామలక్ష్మణులను జూచి తత్త్వవేత్తయైన జనకుని ముఖమునుండి వెలువడిన మాట లివి ప్రకృతిరామణీయకము, సహజసౌహార్దము గలిగిన రామలక్ష్మణులకు ప్రత్యగాత్మ పరమాత్మలకు వలె అనిర్వచనీయమైన ఆంతరసంబంధ మేదియో యున్నట్లు స్ఫురించుచున్నది

కావున, విజ్ఞుల దృష్టిలొ రామలక్ష్మనులు జీవేశ్వరులే ప్రత్యగాత్మపరమాత్మరూపులే ప్రత్యగాత్మపదము సంప్రదాయము ననుసరించి జీవుని వాస్తవికరూపమ కథాభాగము ననుసరించి రామలక్ష్మణులకు సేవ్యసేవక

భావము ప్రసిద్ధము ఆ దృష్టితో జూచిన, ప్రత్యగాత్మపదము జీవపర ముగా ఇట గ్రహించుట యుక్తము జీవేశ్వరులకు అనిర్వచనీయమైన అంతరసంనిధి శుద్ధచైతన్యరూపమువనే అట్లే జీవేశ్వర స్వరూపులైన రామలక్ష్మణులకును ఇట్టిది యని నిర్వచింపరాని అంతరసంనిధి కలదని జనకుని తాత్పర్యముగా గ్రహింపనగును

పురుషార్థమును దర్శింపగోరు జీవుడు శ్రుతిమాత నారాధించుచు పరమేశ్వర సాన్నిధ్యమును జేరుటకు యత్నించును అట్లే లక్ష్మణుడు మాతృస్వరూపిణినిగా సీత నారాధించి శ్రీరామానుగ్రహమునకు పాత్రు డగుచున్నాడు

కనుక, పై శ్లోకమున "లక్ష్మణః సహ సీతయా రామం పరిచ రన్వనే అనుగచ్ఛతి" అని ప్రజలు భావించుట యుక్తమగుచున్నది

వనవాసమునకు బయలుదేరినపుడు సుమిత్ర లక్ష్మణునకు జేసిన యుపదేశము గమనించదగినది

"రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్ ।
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్ ॥"

"మాం విద్ధి జనకాత్మజాం" నాయనా, లక్ష్మణా! సీతను నన్నుగా భావించుము అనగా సీత నీకు నావంటి మాతృమూర్తి ఇది యొక యర్థము సీత సాధారణస్త్రీ గాదు సాక్షాత్తు లక్ష్మీస్వరూపిణి (మా) వేద మాత ఆ దృష్టితో నీవామెను సేవించునది అని నిగూఢార్థము తల్లి యుపదేశానుసారము లక్ష్మణుడు సీతను మాతృస్వరూపిణినిగను వేద మాతృస్వరూపిణిని గను సేవించి చరితార్థుడైనాడు కావుననే, సీతా

రాములతోడి సాహచర్యభాగ్యము లక్ష్మణున కబ్బినది ఇట్టి సాహచర్యము గలశిల్పము భద్రాద్రియందు కాంచగలము

భద్రాచలమున శ్రీరాముని వామాంకమున సీతయు సీతకు ప్రక్కగా లక్ష్మణుడును దర్శన మిచ్చుచుందురు

సీత రామునకు వశవర్తిని లక్ష్మణునకామె ఆరాధ్య దేవత ఇట్లు సీత రామలక్ష్మణుల మధ్యవర్తిని యగుచు రామున కానందదాత్రి, లక్ష్మణునకు రామాను గహసంపాదయిత్రి యగుచున్నది

శ్రీపరాశరభట్టాచార్యులు న ప్రణవస్వరూపవ్యా ఖ్యాజమున జీవేశ్వరస్వరూపము నిట్లు వివరించిరి

"అకారార్థో విష్ణు ర్జగదుదయరక్షా ప్రళయకృత్
మకారార్థో జీవః తదుపకరణం వైష్ణవ మిదమ్ ॥
ఉకారో౽నన్యార్హం నియమయతి సంబంధ మనయోః ।
త్రయీసారః త్ర్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమశత్ ॥

శ్రీ పరాశరభట్టాచార్య అష్టశ్లోకి

ఓంకారము అకార ఉకార మకారాత్మకము అందకారార్థము విష్ణువు మకారార్థము జీవుడు ఈ నరనారాయణులకు గల అనితరసాధారణమైన సంబంధము గూర్చి, లేక తెలియజేయు శ్రీమాత ఉకారవాచ్య అని ఈ శ్లోకతాత్పర్యము

కనుక, నరనారాయణ స్వరూపులైన రామలక్ష్మణుల అనితర సాధారణ సంబంధమును తెలియుటకు మధ్య అనుసంధానకర్త్రిగా శ్రీమాత దర్శన మిచ్చుచుండును శ్రీమాతయే వేదమాత, రామలక్ష్మణులను జీవేశ్వర స్వరూపులుగను, సీతను తదనన్యత్వ బోధయిత్రి యగు శ్రుతి

మాతగను భావన జేసినపుడు, ఆ మూర్తిత్రయము యొక్క స్థితి అవశ్యక మగుచునే యుండును ఈ సంప్రదాయ రహస్యమును గుర్తింపజేయు టకే సీతారాములతోపాటు సీతకు ప్రక్కగా లక్ష్మణప్రతిష్ఠ జరిగిన దని తెలియనగును.

రామాయణమున వనవాసము జేయు సీతారామలక్ష్మణుల వర్ణనలు ఈ సంప్రదాయమునకే దోహదకారు లగుచున్నవి

“తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా ।
దృష్టా తత్ర మయా నారీ తయో ర్మధ్యే సుమధ్యమా”
అరణ్య 19 17

ఖరునితొ శూర్పణఖ చెప్పు మాట లివి సుందరాకారు లగు దశరథపుత్రులైన రామలక్ష్మణుల మధ్య రూపసంపన్నయైన తరుణీమణి నొకదానిని చూచితిని.

రామాయణగాధ వేదప్రసిద్ధమైనది వేదమునందు సరస్వతితో [సూర్యాఖ్య దేవతతో] నిత్యము సంచరించు అశ్వినులకు సీతతో ప్రవాస మున సంచరించు రామలక్ష్మణు లుపమానముగా వర్ణింపబడినారు.

రామాయణమున రామలక్ష్మణులకు అశ్విను లుపమానముగా వర్ణింపబడినారు

“విభి ర్ద్వా చరత ఏకయా సహ ప్ర ప్రవాసేవ వసతః”
ఋ 8 29 8

“కించ ఇమా వశ్వినౌ ఏకయా సూర్యాఖ్యయా తాభ్యాం స్వయం వృతయా ప్రియా సహ ప్రవసతః ప్రవాసం సర్వత్ర గమనం కురుతః ।

ప్రవాసే దృష్టాంతః। ప్రవాసేవ యథా ప్రవాసినౌ
ద్వౌ పురుషౌ ఏకయా స్త్రియా సహ ప్రవసతః తద్వత్"
సా భాష్య

ఒక స్త్రీతో ఇరువురు పురుషులు ప్రవాసము జేయుచున్నట్లు సూర్యాఖ్య స్త్రీతో సహ అశ్వినులు ప్రవాసము సలుపుచున్నారు

ఇచట ఉపమానోపమేయములకు సాధర్మ్యము ప్రవాసము అది సర్వత్ర గమనరూప మని భాష్యకారులు వివరించిరి ఇచట దృష్టాంత స్థానీయమైన ప్రవాసము సీతారామలక్ష్మణుల ప్రవాసమే యని వెంటనే స్ఫూర్తికి రాకమానదు అట్టి ప్రవాసము రామాయణమనునే ప్రసిద్ధము

కావున, శ్రీరామవనవాసము ఈ మంత్రమున పేర్కొనబడిన అశ్వి ప్రవాసమునకు భాష్యరూపము దీనిని బట్టి రామలక్ష్మణులకు అశ్వినులుపమానస్థానీయు లగుట శ్రుతిప్రసిద్ధ మగుచున్నది ఈ శ్రుతి ప్రసిద్ధినే కవి ఉపమానముల ద్వారా స్మరింపజేయుచున్నాడు.

దీనినిబట్టి అశ్వినుల విడిచి సూర్యాఖ్య దేవత యుండనట్లు ప్రవాసమున సీతారాముల విడిచి లక్ష్మణుడుగాని, లక్ష్మణుని విడిచి సీతారాములుగాని ఉండరని తెలియుచున్నది ఈ శ్రుతిసిద్ధమైన శిల్పమే భద్రాచలమున రామాలయమున దర్శింపబడుచున్నది

పూరి పట్టణములోని జగన్నాథ దేవాలయమున ప్రతిష్ఠింపబడిన శ్రీకృష్ణ, సుభద్ర, బలరాముల విగ్రహ క్రమమున నిట్టి శిల్పమునే దర్శించగలము

౦

# 8. రామాయణము - పాదుకాపట్టాభిషేకము

రామాయణమున గల రమణీయ సన్నివేశములలో పాదుకాపట్టాభిషేక మొకటి ఇది అతి విచిత్రమైన సన్నివేశము అసాధారణము ఇట్టి సన్నివేశము "న భూతో నభవిష్యతి" రాజులు, లేక చేతనుడైన పురుషుడు ప్రజల యోగక్షేమముల నరసి పాలించుట సహజము అచేతనుడు, అందును అనాదరముగ చూడబడెడి పాదుకలకు రాజ్యాధికారము కట్టబెట్టుట, దానిని లోకము హర్షించుట ఎవరును ఊహింపరాని విషయము పాదరక్షలను ఒక మూల బడవేయుదురు గాని, ఎచటను దానికి గౌరవనీయస్థాన మీయరు పవిత్ర స్థలములందు వాని యునికిని గూడ సహించరు అట్టి తరి రామాయణమున పాదుకాపట్టాభిషేక శిల్పము యొక్క తాత్పర్య మేమి? ఇది కేవలము కవితాశిల్పమేనా? ఏదియేని వేదోపదిష్ట ధర్మతత్త్వ ప్రదర్శకమా! ఈ విషయమును లోకమర్యాద ననుసరించి పరిశీలింతము

భగవంతునకు గాని, తద్రూపులగు పెద్దలకు గాని పాదాభివందనము జేయుట అనూచానముగ వచ్చుచున్న యాచారము యాజ్ఞవల్క్య మహర్షి వచ్చినపుడు జనకమహారాజు ఆసనము నుండి లేచి పాదోపసర్పణము జేసినట్లు శ్రుతి వర్ణించుచున్నది

23)

"జనకో హ వైదేహః కూర్చా దుపావసర్ప న్నువాచ"

బృహ ఉ 4-2-1

"కూర్చాత్ ఆసనవిశేషా దుత్థాయ ఉప సమీప మప
సర్పన్ పాదయో ర్నిపత న్నిత్యర్థః" శంకరభాష్య

పాదోపసర్పణ మన్న, సాష్టాంగ నమస్కారము ఆదిశంకరులు గూడ తన పరమ గురువులగు శ్రీ గౌడపాదులకు "పాదపాతైర్నతోఽస్మి" యని సాష్టాంగదండప్రణామములు వర్పించుకొనినారు

"అశనం గరళం ఫణీ కలాపో వసనం చర్మ చ వాహనం మహోక్షః ।
మమ దాస్యసి కిం కిమస్తి శంభో తవ పాదాంబుజభక్తి మేవ దేహి"

అని అనుచు శివానందలహరిలో శ్రీశంకరులు పరమేశ్వరి పాదాంబుజ భక్తిని అర్థించుచున్నారు

కన్యాదానము చేయునపుడు వరుని పాదములనుకడిగి ఆ జలమును శిరస్సునందు జల్లుకొని కన్యాదానము చేయుట అనాదసిద్ధ సంప్రదాయము అట్లే, పితృదేవతల నారాధించు నపుడు, పితృదేవతారూపులగు మహాత్ముల పాదములను భక్తితో కడిగి పాదోదకమును శిరస్సున ధరించుట నేనాటికిని జరుగుచున్న ఆచారము

"సాలగ్రామశిలావారి పాపహారి విశేషతః ।
అజన్మకృత పాపానాం ప్రాయశ్చిత్తం దినే దినే"

"అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణమ్ ।
సర్వపాపక్షయకరం విష్ణుపాదోదకం పావనం శుభమ్"

అని విష్ణుపాదోదకరూప తీర్థసేవ పాదమాహాత్మ్యమును సూచించు చున్నది

కావ్యములందు సార్వభౌముల పాదపద్మములు సామంతరాజ మకుట రత్నకాంతి నీరాజితము లైనట్లు వర్ణించుట కవులకు పరిపాటి ఉత్తర ప్రత్యుత్తరములలో నేడు కూడ "పాదపద్మములకు ప్రణమిల్లి" అని వ్రాయుట ఆచారముగా నున్నది వివాహ సమయములందు నూతన వధూవటులు పెద్దలందరికి పాదవందనము జేయుచున్నారు. మహాత్ముల సన్నిధికి పోయినపుడు భక్తితో పాదవందనము జేయుట భారతదేశము నందు కనిపించు ఆచారము ఉత్తమ సౌశీల్యముతో విరాజిల్లు ధర్మ పత్నులు నిద్రలేచి వెంటనే మొదట పతిపాదములకు వందనముజేసికొని గాని ప్రాతఃకాల కార్యక్రమముల కుపక్రమించరు కిష్కింధ యందు లక్ష్మణుడు తన వదినగారి ఆభరణముల జూచి పలికిన పలుకులు గమ నార్హములు

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్"

"ప్రతి దినము పాదాభివందనము జేయుచుండుట వలన సీతాదేవి యొక్క పాదములను అలంకరించిన నూపురములను మాత్రము గుర్తింప గలను. కేయూర కుండలాదుల నెఱుగను" అని శ్లోకార్థము ఈ శ్లోకము సీత యెడ లక్ష్మణునికి గల దేవతాభావమును సూచించుచున్నది దైనందినము భగవదారాధన సమయమున "పాదయోః సువర్ణ దివ్య

మంత్రపుష్పం సమర్పయామి” అని అనుచు మంత్రపూత పుష్పములను పరమేశ్వర పాదారవిందములందు భక్తులు సమర్పించుచున్నారు "దర్శయ పరిచర్యాం కరోమి తవ మృదుపాదారవిందమ్” అని అనుచు ఒక భక్తుడు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాడు “అవి స్మృతి స్త్వచ్చరణారవిందె భవే భవే మేఽస్తు భవ త్ప్రసాదాత్” అని ఒక భక్తుడు జన్మ జన్మల యందు తనకు పరమేశ్వరు పాదారవింద ధ్యాన ముండునట్లను గ్రహింపుమని దైవమును నుతించుచున్నాడు ఆలయములకు భగవద్దర్శనమునకై పోయినపుడు పరమేశ్వర పాదములను అర్చకుడు భక్తుల శిరస్సునందుంచుచున్నాడు భక్తు లెంతో భక్తితో అ పాదుకలను శిరసా గ్రహించుచున్నారు

ఈ విధముగ సూక్ష్మదృష్టితో జూచిన, భారతీయ సంస్కృతి యందు మహాత్ముల పాదములకు సమున్నత స్థాన మున్నట్లు తెలియు చున్నది పాదములకే గాదు, పాదప్రతిరూపములగు మహాత్ముల పాదుకలకు గూడ మహోన్నత స్థానము మన సంప్రదాయమున కన్పించు చున్నది గురుపాదుకలను భక్తితో సేవించుసంప్రదాయము, పాదపూజలు చేయు సంప్రదాయము, జగద్గురు పాదుకా పూజాసంప్రదాయ రూపములో భారతీయ జీవితమున నేటికిని గన్పట్టుచున్నది

పాదములను గాని, పాదుకలను గాని, సేవించుచున్నా మనిన, వానియందు దేవతాత్మత్వమును దర్శించి పూజించుచున్నా మని యర్థము యథార్థమునకు దేహమునందున్న అవయవములలో శిరస్సు అగ్రస్థానమలంకరించుచున్నది తద్భిన్నముగ పాదములు జూడబడుచున్నవి రామయణమున సుందరకాండయందు రాక్షసీగణముచే పీడింపబడుచు "రావణుం వరింపు” మని వారలచే బలవంతము చేయబడిన సీత ఇట్లు అనుచున్నది

"చరణేనాపి సవ్యేన న స్పృశేయం నిశాచరమ్ ।
రావణం కిం పున రహం కామయేయం నిశాచరమ్"

రావణుని నా యెడమ కాలితో గూడ స్పృశింపను అతనిని వరించు ప్రశ్న ఎట్టిది ?

ఈ శ్లోకమున చరణము పూజ్యస్థానమున గాక, అతి లఘుభావముతో చూడబడినట్లు కన్పించుచున్నది శిశుపాలవధకావ్యమున 2వ సర్గలో భీముడు ధర్మరాజుతో మాట్లాడు సందర్భమున పాదము యొక్క తక్కువదనము సర్వావయవాపేక్షయా హీనత్వము చూపబడినది

"పాదాహతం యదుత్థాయ మూర్ధాన మధిరోహతి ।
స్వస్థాదేవావమానేఽపిదేహిన స్తద్వరం రజః "

"పాదముతో త్రొక్కబడిన ధూళి లేచి వెంటనే ఆ త్రొక్కినవారి యొక్క శిరస్సు నధిరోహించుచున్నది అవమానము చెంది గూడ ఎట్టి మార్పు చెందక స్వస్థుడై యున్నవాని కంటె అ పాదాహతధూళియే గొప్పది "

ఈ శ్లోకార్థము ననుసరించి పాదము యొక్క న్యూనత్వము స్ఫుట మగుచున్నది

లోకమున పాదతాడనాదులు అవమానకరమైన చర్యలుగా భావింపబడుచున్నవి ఈ దృష్టితో పరిశీలించినపుడు పాదమునకు హీనస్థానమే నిత్యవ్యవహారమున కన్పించుచున్నది ఉన్నత స్థానము కన్పించదు నిత్యజీవితమున పాద మొక ప్రక్క మహోన్నతముగ దేవతారూపమున

ఆరాధింపబడుచున్నది మరొకప్రక్క హీనముగా చూడబడుచున్నది ఒకే పాదము సంఘమున ద్వివిధముగా భావన జేయబడుటలోని భావము గమనింపదగినది అసలు పాదములందు భారతీయులు దర్శించు దేవతా భావము బుద్ధికల్పితమా ? లేక సహజసిద్ధమా ? లేక వేదోపదిష్ట రహస్యమా ? విచారింపవలసి యున్నది

పాదారాధనాసంప్రదాయము బుద్ధికల్పితము గాదు వేదవిహితమే శ్రుతి స్వర్గప్రాప్తి సాధనములుగా ద్వాదశేష్టులను విధించినది వీనికి స్వర్గద్వారేష్టు లని పేరు అందు చివరిది చరణేష్టి చరణమే యిచట దేవతగా ఆరాధింపబడుచున్నది ఆ చరణదేవతను శ్రుతి ఇట్లు వర్ణించుచున్నది

"చరణం పవిత్రం వితతం పురాణం
యేన పూత స్తరతి దుష్కృతాని ।
తేన పవిత్రేణ శుద్ధేన పూతాః
అతి పాప్మాన మరాతిం తరేమ"

"చరణదేవత అతి చిరంతనమైనది ఆ దేవత పవిత్రాతి పవిత్రము ఆ దేవత నుపాసించినవారు పాపరూప శత్రువునకు దూరులై పరిశుద్ధు లగుచున్నారు"

"లోకస్య ద్వార మర్చిమ త్పవిత్రం
జ్యోతిష్మత్ భ్రాజమ నం మహస్వత్ ।
అమృతస్య ధారా బహుధా దోహమానం
చరణం నో లోకే సుధితాం దధాతు"

"చరణదేవత జ్యోతిర్మయి మహత్త్వపూర్ణము సర్వపాపవిశోధకమై వెలయుచు పవిత్రరూపిణి యగు ఆ దేవతను భక్తితో ఆరాధించినచో, ఆ దేవత అమృతధారలను వర్షింపగలదు" ఇట్లు శ్రుతి చరణదేవత యొక్క మహత్త్వమును వర్ణించుచు, ఆ దేవత అందఱకు ఎల్లప్పుడు ఆరాధనీయ యని యుపదేశించినది శ్రుతి యింకను చరణప్రజాపతి సంవాదరూపమున చరణ స్వరూపమును వివరించుచున్నది

"తం చరణ మబ్రవీత్ । అహ ము మ్మై చరణ మస్మి ।
మాం ను యజస్వ । అధ తే సత్యం చరణం భవిష్యామి"
తైత్తిరీయబ్రాహ్మణ 3 12 4 20

చరణ మనగా ధర్మ మని శ్రీభట్టభాస్కరులు వివరించిరి ధర్మదేవత ప్రజాపతితో ఇట్లు చెప్పుచున్నది "చరణమును నేనే, నన్ను ఆరాధింపుము నేను తప్పక నీ చరణరూపమును దాల్చగలను" ఈ సంవాదము ననుసరించి పరమేశ్వరుని పాదములు ధర్మదేవతారూపములని గుర్తింపగలము అట్లే ఎవరు ధర్మమును సేవింతురో, ఎవరు సాక్షాత్ ధర్మస్వరూపులుగా విరాజిల్లుదురో అట్టివారి పాదములు ధర్మమూర్తు లగుచున్నవి కనుక పెద్దల పాదములు ధర్మదేవతాప్రతిరూపములను వేదొపదేశమును భక్తితో, శ్రద్ధతో భారతీయు లనాదికాలముగా పాటించుచున్నారని తెలియుచున్నది

మహాత్ముల పాదముల వలె నూతన వరుని పాదములు గూడ ఆరాధింపబడుచున్నవి. నూతన వరుడు సాక్షాత్ నారాయణస్వరూపుడుగా భావన జేయబడుచున్నందున అతని పాదములు పరమేశ్వరపాదరూపము లగుచున్నవి

మహాత్ముల పాదములు ధర్మప్రతిరూపము లగుటయే గాక, వారి పాదగతియు ప్రజలకు సన్మార్గదర్శక మగుచున్నది "గతి రితి పాదయోః" అని శ్రుతి వర్ణించుచున్నది మహాత్ముల పాదములు వారి గతికి సంచారమున కుపలక్షణము మహాత్ములు ఏ మార్గమున సంచరించెదరో ప్రజలుగూడ ఆ మార్గముననే సంచరించి కృతకృత్యు లగుచున్నారు మహాత్ముల పవిత్రగతులు ప్రజల కాదర్శ సుస్థిరమార్గములు "మహాజనో యేన గత స్సపంథాః"

మహాత్ములను "రమణీయచరణాః" అని కీర్తించుట అనాదిసిద్ధ సంప్రదాయము అట్లే పాపాత్ములు "కపూయచరణాః" అని ఎలువబడుటయు ప్రసిద్ధము

"పుణ్యో వై పుణ్యకర్మణా భవతి పాపః పాపేన ।
రమణీయ చరణాః రమణీయాం యోనిం అపద్యంతే"

శ్రుతి

"పుణ్యకర్మలు చేసినవారి పాదములు రమణీయములు, పవిత్రములు అందువలన వారు రమణీయచరణులు" అని అనిపించుకొనుచున్నారు వారు పవిత్ర రమణీయమైన మాతృగర్భముననే జన్మించుచున్నారు అట్లే పాపాత్ముల పాదములు పాపపంకిలములు అట్టివారు పాపకు పరూప మాతృగర్భమున జన్మించి పాపులనిపించుకొనుచున్నారు. ఇట్లే పెద్దలను "శ్రీచరణాః" అని ఎలుచుట సంప్రదాయము దీనిని బట్టియే ఆచార్యపాదాః తాతపాదాః పితృపాదాః" అని పెద్దలను పిలుచు ఆచారమేర్పడినది పెద్దల పాదములు ధర్మరూపములు

గాన, వారు ధర్మరూపులుగా పిలువబడుచున్నారు వేదములు గూడ చరణరూపములు వివిధశాఖా రూపములు వేదవిదులైన మహాత్ముల చరణములు వేదచరణరూపములు. "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అను న్యాయము ననుసరించి బ్రహ్మవిదులు బ్రహ్మ (వేద) రూపులు వారి చరణములు వేదచరణరూపములు కనుకనే వేదస్వరూపులైన వారు "శ్రీచరణాః" అని పిలువబడుచున్నారు దీనిని బట్టి చూచిన, పెద్దలకు పాదవందనము జేయుట యన ధర్మదేవతకు నమస్కరించుటయే లేక వేదమాతృచరణారాధనమే యగుచున్నది మహాత్ముల పాదసేవ "నమామ వేదమాతర"మ్మను మహామంత్రోపాసన రూపమే యగుచున్నది, లేక వేదోపదిష్ట చరణేష్టి ప్రతిరూపమే యగుచున్నది

వేదోపదిష్టమైన యీపరమార్థమే రామాయణమున పాదుకాపట్టాభిషేక సన్నివేశరూపమున వివరింపబడినది శ్రీరాముడు ధర్మస్వరూపుడు "రామో విగ్రహవాన్ ధర్మః" అట్టి ధర్మస్వరూపుని పట్టాభిషిక్తుని చేయదలచి దశరథుడు ప్రజల అంగీకారమును అభ్యర్థించినపుడు ప్రజలు రాముని గూర్చి అనిన మాటలు గమనార్హములు

"రామ స్సత్పురుషో లోకే సత్యధర్మపరాక్రమః।
సాక్షాద్రామా ద్వినిర్వృత్తః ధర్మశ్చాపి శ్రియా సహ"

ఇట్లు ప్రజాహృదయమున ధర్మమూర్తియై సాక్షాత్కరించిన రాముని మంధరాదుశ్చింతనతో కైకేయి వనవాసమునకు పంపెను శ్రీరాముడు అడవులకు పోయినను, ప్రజాహృదయము రామపాదారవిం

దాంకిత మయియే యున్నది ఏ దుశ్చింతన, లేక యేదుష్ప్రవృద్ధియు ప్రజల దృఢభక్తిని శ్రీరామపాదపంకజముల నుండి మరల్పజాలదు

"యధా యథా దాశరథిః ధర్మ ఏవాస్థితోఽభవత్ ।
తథా తదా ప్రకృతయః రామం పతి మ౦ యియన్"

అయోధ్య

"అయోధ్య యందలి ప్రజలు, ప్రభువులు, పండితపామరు లందఱు రాముని అయోధ్యయందే ఉండు మని కోరిరి ఎన్నోవిధముల శ్రీరాముని వనవాసయత్నమును వారింప యత్నించిరి కాని రాముని ధర్మనిరతిని ధర్మనిగ్రహత్వమును జూచి ఆనందించి రాము డెక్కడున్నను అతనినే తమ ప్రభువునుగా భావించిరి

భరతుడు చిత్రకూటమున కేగి శ్రీరాముని అయోధ్యకు మరలి రమ్మని ఎన్నియో విధముల బ్రతిమాలును కాని, ఎంతమంది ఎన్నివిధముల ప్రార్థించినను శ్రీరాము డంగీకరింపడు ప్రజల దృష్టి అడవి యందున్న శ్రీరామపాదపద్మముల యందున్నదని గుర్తించిన వశిష్ఠ మహర్షి శ్రీరామపాదప్రతిరూపములైన పాదుకల నందుకొను మని భరతున కుపదేశించును గురూపదేశమును పాటించి భరతుడన్నగారి నిట్లు ప్రార్థించెను.

"అధిరోహార్య పాదాభ్యాం పాదుకే హేమభూషితే ।
ఏతే హి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః"

అయోధ్య

"రామా ! హేమభూషితములైన ఈ పాదుకలను పాదములతో

అధిరోహింపుము నీ పాదస్పర్శచే పూతములైన ఈ పాదుకలు సకల లోకములకు యోగక్షేమమును కలుగజేయగలవు"

ధర్మస్వరూపుడైన శ్రీరాముని పాదముల వలె తత్పాదోపస్పృష్ట పాదుకలుగూడ ధర్మోజ్జ్వలములు "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" ధర్మమే లోకసుస్థిరతకు, అనగా శాంతిసౌభాగ్యములకు కారణము ధర్మ రూపములైన శ్రీరాముని పాదుకలు జగత్ప్రతిష్ఠాహేతువులై ప్రజా హృదయపీఠములలో అభిషిక్తములైనవి కనుకనే "ఇమే హి సర్వ లోకస్య యోగక్షేమం విధాస్యతః" అని భరతుడు మహాసభయందు ముక్తకంఠముగ చెప్పగలిగినాడు భూతార్థవ్యాహృతి రూపములైన ఈ భరతవాక్యములు శ్రీరామప్రవాస వ్యాకులిత నిఖిల జనసందోహమునకు భరతఐక్యమై కర్ణపేయమైనవి మహాసభయందే యొక్కరికి "పాదుక లేమి ? రాజసింహాసనమున ప్రతిష్ఠితము లగుట యేమి" అనుసందేహము కలుగలేదు ఆ పాదుకల యందందఱు శ్రీరాముని ధర్మవిగ్రహమునే దర్శించినారు శ్రీరాముని ధర్మస్వరూపమే అయోధ్యకు వచ్చి తమను పాలింపబోవుచున్న దను తృప్తిని జెందినారు కనుకనే, పాదుకాపట్టాభి షేకగాథ అజరామరమైనది

సూక్ష్మదృష్టితో పరిశీలించిన "రామాయణ" మను కావ్యనామము కాంతాసంమితముగా పాదుకాపట్టాభిషేకశిల్పమును సూచించుచున్న దని యనుకొనవచ్చును. "రామాయణ" మనిన రామచరిత మని సాధారణ ముగ తెలియవచ్చు అర్థము వాల్మీకిమహర్షి రామచరిత మని యనక, 'రామాయణ' మని యనుట సాభిప్రాయసూచక మనుకొనవచ్చును 'అయన' శబ్దమునకు 'గతి' యని ప్రసిద్ధమైన అర్థము "అయగతౌ" అను ధాతువు నుండి అయనశబ్ద మేర్పడుచున్నది అయన మనగా గమన

మని యర్థము లోకమునకు ధర్మస్వరూపుడైన శ్రీరాముని ఒయన మును గతిని ధర్మాచరణమును ఆదర్శజీవితమార్గము నుపదేశించు మహాకావ్యము రామాయణము పాదుకలు శ్రీరాముని ధర్మమ ర్గప్రవృత్తి లక్షకములు కాంతాసంమితముగ రామ అయన తత్త్వరహస్యో పదేశకములు

## పాదుకా ఉపాసనాసంప్రదాయము

"స్వప్రకాశశివమూర్తి రేకికా
తద్విమర్శతను రేకికా, తయోః ।
సామరస్యవపు రిష్యతే పరా
పాదుకా పరశివాత్మనా గురోః"

స్వప్రకాశాత్మక శివునకును, విమర్శాత్మక శక్తికిని సామరస్య రూప మగు తత్త్వమునకు పాదుక యని పేరు విమర్శాత్మక శక్తికిని, స్వప్రకాశాత్మకశక్తిరూపుడగు శివునకును సహస్రారమున సమాయోగము జరుగగా, ఆనందామృతధారలు కురియును వానిచే నభిషిక్తుడైన వాడే పాదుకాంతదీక్షితుడు, పూర్ణాభిషిక్తుడు

"విమర్శాత్మకశక్తేః స్వప్రకాశాత్మక శివస్య చ సంగతా సహస్రారే జాతాయాం ఆనందామృతేనాభిషిక్త ఏవ పాదుకాంతదీక్షితః స ఏవ పూర్ణాభిషిక్తః".

తంత్రగ్రంధములందు పాదుకాస్వరూపము ఇట్లు వివరింపబడినది

"పాదుకా సా పరాశక్తిః ప్రకాశానన్దరూపిణీ ॥
పాలనా ద్దురితచ్ఛేదా త్కాంక్షితార్థప్రపూరణాత్ ।
పాదుకాపదవాచ్యాం తాం విమృశన్ మూర్ధ్ని పూజయేత్॥
చంద్రాపితంసాం సురేశీం బ్రహ్మవిష్ణుశివార్చితామ్ ।
నివసన్తీం సహస్రారే కదంబవనవాసినీమ్"

పాదుక యన, ప్రకాశానందరూపిణి యగు పరాశక్తియే ఆమె పాలయిత్రి, పాపాపనోదయిత్రి, అభీష్టదాత్రి యగుటచే పాదుకాశబ్ద వాచ్య ఆమెను శిరసున ధరించి పూజింపనగుచు ఆమె షోడశకళాత్మక చంద్రమండలాంతర్గత, సకలదేవతాశాసయిత్రి, బ్రహ్మవిష్ణుశివార్చిత సహస్రారస్థిత, కదంబ వనవాసిని యగు పాదుకాపరమేశ్వరిని ధ్యానింప వలయును

ఈ విషయము శ్రీశంకరులు సౌందర్యలహరియం దిట్లు వివరించిరి,

సుధాధారాసారైః చరణయుగళాన్తర్విగళితైః
ప్రపంచం సించన్తీ పున రసి రసామ్నాయమహసః ।
అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్టవలయం
స్వ మాత్మానం కృత్వా స్వపిషి కులకుండే విహారిణీ"

10 శ్లో

ఈ శ్లోకమును శ్రీలక్ష్మీధరు డిట్లు వ్యాఖ్యానించినాడు

"అత్రేద మనుసంధేయం శిరస్థితం చంద్రమండలం సర్వ

యోగశాస్త్రసిద్ధమ్ తత్తు సమయినాం మతే శ్రీచక్రమేవ చంద్రమండలస్య షోడశకలాత్మకత్వాత్, శ్రీవిద్యాయాః ప్రతిపదాది షోడశ దినేషు కలావృద్ధిక్షయయోః వక్ష్యమాణత్వాత్, చంద్రమండల మేత దేవ బాహ్యస్థిత మపి చంద్రమండలం శ్రీచక్రమేవేతి సుభగోదయ వ్యాఖ్యానే నిదర్శితమ్। తత్తు మహారహస్యమ్। అతశ్చ శిరస్స్థిత సహస్రదళ కమలాన్తర్గత శ్రీచక్రాత్మిక శశిబింబమధ్యస్థితాయా భగవత్యాశ్చరణకమల విగళితజలైః సుధామయైః సాధకస్య సకలశరీరం సంప్లావ్య పునః భుజంగరూపేణ ఆధారకుండం ప్రవిశ్య సుషుమ్నామవష్టభ్య సా భగవతీ స్వపితీ''తి

శిరస్సున సహస్రదళకమలమే శ్రీచక్రము అదియే చంద్రబింబము చంద్రబింబాంతర్గతయై విలసిల్లు పరాదేవత యొక్క పాదముల నుండి అమృతధారలు కురియును ఆ ధారలచే సాధకుని శరీరమంతయు అప్లావితము జేసి తిరిగి భుజంగరూపిణియై ఆధారకుండమును ప్రవేశించి సుషుమ్నా నాధారము జేసికొని పరాదేవత నిదురించుచుండును అని తాత్పర్యము

పైవచనములవలన ఉపాసనాసంప్రదాయము ననుసరించి పాదుకా స్వరూపమును పైన చెప్పబడినరీతిగా దర్శించవలెను మూలాధారస్థిత కుండలినీశక్తి సహస్రారగత స్వప్రకాశాత్మక శివునితో జేరుటయే శివశక్తి సమాయోగము దీనినే శివశక్తి సామరస్య మందురు అదియె అత్త్వతః పాదుక సాధకునకు ఆరాధనీయము ఆ పాదుక నుండి స్రవించెడి అమృతధారలచే నభిషిక్తు డగుట పై శ్లోకవ్యాఖ్యానము నందు వివరింపబడినది

మరియొక విశేషము  బాహ్యస్థిత చంద్రమండలము గూడ శ్రీవిద్యాత్మకము శ్రీచక్రాత్మకము లలితాసహస్రనామమున చంద్రమండలమధ్యస్థ యని పరాదేవత కీర్తింపబడుట ప్రసిద్ధము ఉపాసకులు చంద్రమండలమును శ్రీవిద్యారూపముగ దర్శించి చంద్రమండలాంతర్గత యగు భగవతిని ఉపాసించు సంప్రదాయము నేటికిని కలదు  ఉపాసనా సంప్రదాయజ్ఞుడగు  వాల్మీకియు ఉపాసనకు ప్రసిద్ధమైన సుందరకాండ యందు రమ్యమయముగ చంద్రవర్ణనమును ఏడు శ్లోకములలో నిబంధించి నాడు  ఇట్టివర్ణనము మిగిలిన కాండలయం దెచ్చటను కానరాదు  ప్రత్యేకముగ రామదూతయైన హనుమంతుడు బ్రహ్మవిద్యారూపిణి యైన సీత నన్వేషించు ఘట్టమున శ్రీవిద్యాసంప్రదాయముల నుద్బోధించుటకో యను నట్లు ప్రత్యేకించి ఈ చంద్రవర్ణన నట చేసినట్లు సంప్రదాయాభిజ్ఞులు చెప్పుదురు  హనుమంతుడు సీత నన్వేషించు సమయమున చంద్రోదయ మైనది  ఉపాసనాసంప్రదాయాభిజ్ఞు డగు హనుమంతుడు  చంద్రమండల మధ్యస్థయై  విరాజిల్లు పరాదేవత నుపాసించి తదనుగ్రహముచే విద్యాస్వరూపిణి యైన సీతను గుర్తించగలిగె ననుట సూచిత మగుచున్నదని పెద్దల యభిప్రాయము  సహృదయుల పర్యాలోచనకై  సుందరకాండ యందలి  చంద్రవర్ణన పరములైన శ్లోకముల నిట  ఉదాహరించు చున్నాను

తత స్స మధ్యంగత మంశుమన్తం జ్యోత్స్నావితానం మహ
దుద్వమన్తమ్ ।
దదర్శ ధీమాన్ దివి భానుమంతం గోష్ఠే వృషం మత్త మివ
భ్రమన్తమ్ ॥

లోకస్య పాపాని వినాశయన్తం మహోదధిం చాంసమేధయన్తమ్ ।
భూతాని సర్వాణి విరాజయన్తం దదర్శ శీతాంశు మథాభియాన్తమ్
యా భాతిలక్ష్మీ ర్భువి మందరస్థా తథా ప్రదోషేషు చ సాగరస్థా।
తథైవ తోయేషు చ పుష్కరస్థా రరాజ సా చారు నిశాకరస్థా ॥
హంసో యథా రాజత పంజరస్థః సింహో యథా మందరకందరస్థః ।
వీరో యథా గర్విత కుంజరస్థః చంద్రో విబభ్రాజతథాంబరస్థః॥
స్థితః కకుద్మా నివ తీక్ష్ణశృంగో మహాచల శ్శ్వేతఇవోచ్చశృంగః ।
హస్తీవ జాంబూనద బద్ధశృంగో రరాజ చంద్రః పరిపూర్ణశృంగః ॥
వినష్టశీతాంబుతుషారపంకో మహాగ్రహగ్రాహవినష్టపంకః ।
కాశలక్ష్మ్యాశ్రయనిర్మలాంకో రరాజ చంద్రో భగవాన్శశాంకః ॥

శిలాతలం ప్రాప్య యథా మృగేంద్రో
మహారణం ప్రాప్య యథా గజేంద్రః।
రాజ్యం సమసాద్య యథా నరేంద్రః
తథాప్రకాశో విరరాజ చంద్రః"

ప్రకాశచంద్రోదయ నష్టదోషః
ప్రవృత్తరక్షః పిశితాశదోషః ।
రామాభిరామేరిత చిత్తదోషః
స్వర్గప్రకాశో భగవాన్ ప్రదోషః ॥

పై గ్రంధసందర్భమును బట్టి శివశక్తిసామరస్య మగు తత్త్వమే పరశివపాదుక అదియే ఉత్తమ సాధకుడు యోగవిద్యాసంపత్తిచే బొదల దాల్చెడి గురుపాదుక భరతుడును శ్రీరాముని పాదుకలను శిరసున దాల్చి నట్లు రామాయణమున వర్ణింపబడుచున్నది

"తత శ్శిరసి కృత్వా తు పాదుకే భరత సదా।
ఆరురోహ రథం హృష్టః శత్రుఘ్నేన సమన్వితః"

అయోధ్య 113 1

భరతుడు శిరస్సున పాదుకలను దాల్చుట పైన చెప్పబడినట్లు గురు పాదుకలను శిరస్సున దాల్చుటను సూచించుచున్నది లోకదృష్టిలో అవి పాదుకలు గావచ్చును, అవి శివశక్త్యనన్యరూప సీతారామసామరస్యరూప పరతత్త్వ స్వరూపములు భరతుడు ధర్మసింహాసనమున పాదుకలను ప్రతిష్ఠించుట యన "శ్రీమత్సింహాసనేశ్వరీ" యని కీర్తింపబడు పరాదేవ తను ప్రతిష్ఠించుటయే భరతుడు శిరసునదాల్చిన పాదుకలు హేమభూషిత ములు 'హేమభూషితే' అను విశేషణము ద్వారా పాదుకలు హిరణ్య వర్ణము లని తెలియుచున్నది. ఈ వర్ణన శ్రీసూక్తప్రతిపాదిత పరాదేవతా వర్ణనను తలపింపజేయుచున్నది । కనుక, పాదుకాపట్టాభిషేక మనిన, హిరణ్యవర్ణ యగు పరాదేవతా ప్రతిష్ఠయే లోకమునకు యోగక్షేమముల ప్రసాదింపజాలినది శ్రీమత్సింహాసనాధీశ్వరి యైన శ్రీమాతయే యని పాదుకాపట్టాభిషేక సన్నివేశము గుర్తింపజేయును

నేటికిని గురుపాదుకా పూజాది వ్యాజమున పాదుకాపట్టాభిషేకము జరుగుచునే యున్నది ఇది సార్వకాలికము

# 9. రామాయణము

## కాండ నామౌచిత్యము

### సుందరకాండ ప్రాశస్త్యము

రామాయణమున కాండలు ఆరు ఉత్తరకాండ తరువాతిది రామాయణగత కాండలను ప్రథమకాండ, ద్వితీయకాండ, అని యీ విధముగ సంఖ్యాక్రమములో జూపవచ్చును వాల్మీకిమహర్షి యట్లు చేయలేదు కాండలకు వేరు వేరు నామముల జెప్పినాడు "పరం కవీనామాధారం సమాప్తం చ యథాక్రమమ్" అని తన కావ్య మొక క్రమము ననుసరించి సమాప్తి జేయబడినదనియు, ఈ కావ్యము కవుల కందరికును ప్రధనమైన అధార మనియు చెప్పికొనినాడు

సామాన్యముగ నెవరు గ్రంథరచన జేసినను, ఏదో యొక క్రమము ననుసరించుచునే యుందురు నేనొక క్రమము ననుసరించి గ్రంధసమాప్తి చేసితి నని ప్రతిజ్ఞచేయుట అరుదు కాని, యీ రచయిత "సమాప్తం చ యథాక్రమ"మని చెప్పుకొనుచున్నాడు అట్లు చెప్పికొనుటలో గల విశేష మేమి? ఇందు అనుసరింపబడిన క్రమమేమి? ఆ క్రమము ద్వారా ఉపదేశింపబడిన విశేష మేమి? ఆ క్రమ స్వరూపము, తద్ద్వారా బోధింపబడు ఉపదేశము తెలిసినగాని, సుందరకాండ స్వరూపమవగతము కాదు సుందరకాండ స్వరూపము తెలియవలె ననిన, తత్పూర్వకాండస్వరూప పరిశీలనము చేయవలసియుండును 'కాండలు

కథాసంవిధానము క్రమము ననుసరించి సాగిపోయినను, అంతమాత్రము చేత కాండనామౌచిత్యము స్పష్టము గాదు. అందుచే కాండనామధేయ స్వరూపవిచారణ జేయవలసియున్నది. అప్పుడే సుందరకాండ నామౌచిత్యము, తద్గత సౌందర్యము తెలియగల్గుదుము.

రామాయణములో సుందరకాండకు ప్రత్యేక స్థానము గలదు. రామాయణ మొక యెత్తు, సుందరకాండ మొక యెత్తు. అభీష్టసిద్ధికై సుందరకాండను పారాయణము జేయుట అనూచానమైన సంప్రదాయము. కాని సుందరకాండను జదివినప్పుడు అది రసాభాసస్థానమా ? అని యనిపించును. రసాభాసమనగా, ఏకత్రైవానురాగము. రావణునకు సీతయందమితానురాగము, సీతకు రావణునియందమితద్వేషము. ఇట్టి శృంగారము రసాభాసమే. కాని, భారతీయుల హృదయములలో ఈ కాండ విలక్షణస్థాన మాక్రమించి యున్నది.

ఈ కాండ హనుమంతుని దౌత్యకౌశలములకును, ధైర్యశౌర్యపరాక్రమములకును, రాజనీతికౌశలమునకును, సమయోచిత ప్రతిభాసమున్మేషమునకును, కార్యదీక్షకును, ప్రభుభక్తిపరాయణత్వమునకును, జితేంద్రియత్వమునకును, యోగవిద్యా వైశారద్యమునకును, విషయ విమర్శనా పాటవమునకును, సరసవచోవిలాస నైపుణ్యమునకును, సీతారామానుగ్రహపాత్రత్వము మొదలగు వివిధ మహోదాత్త గుణములకును అభివ్యక్తిస్థానము. హనుమంతునియందు నిగూఢమైయున్న అపారమైన పారమైశ్వర్య శక్తిసంపద యంతయు ఈ కాండయందు బహుముఖముల ప్రస్ఫుటమైనది. ఇన్నిటికంటె నెక్కుడుగా సీతారాముల యందు ఆయనకు గల అపారమైన నిశ్చలభక్తి ఆయన పాలిట శ్రీరామరక్షయై కన్పట్టును. అట్టి భక్తితత్త్వముతో విరాజిల్లు హనుమంతుడు సుందరుడై

సుందరకాండమున సాక్షాత్కరించును హనుమంతునకు "సుందరః" అను నామము సంప్రదాయప్రసిద్ధము అట్టి సుందరుని ప్రతిభాప్రాగల్భ్యములతో విరాజిల్లుట జేసి ఈ కాండకు "సుందరకాండ'' యను ప్రసిద్ధి వచ్చినట్లు చెప్పుదురు

హనుమంతునకు "సుందరః" అను నామ ముండుటకు కారణ మేమి ? వానర రూపుడగు నతడు సుందరరూపు డగుట యేమి ? హనుమంతుని వలన సుందరకాండ యని పేరు వచ్చిన దని మాత్రము చెప్పి యూరకొనినచో ఇతర కాండలకు నామౌచిత్యవిచారము చేయునపుడు సుందరకాండతో సంబంధము లేకపోవలసి వచ్చును ఏ కాండ నామధేయ మా కాండకే యవినచో "సమాప్తం చ యథాక్రమమ్" అను మహర్షి వచనము సార్థకము కాకుండపోవును కనుక, అన్ని కాండల నామధేయములకు ఒక క్రమగతి ననుసరించి సార్థకతను దర్శించినపుడే, సుందరకాండ నామధేయమునకు, తదితరకాండల నామధేయములతో సంబంధము చెప్పవీలగును అట్లు ఒక క్రమగతి నాశ్రయించినపుడు తప్పనిసరిగ అయిదవ కాండకు 'సుందరకాండ' యను నామకరణము చేయవలసిన యావశ్యకత కన్పించును అపుడు ఇతర కాండనామధేయములు గూడ సార్థకములై సుందరకాండ సౌందర్యమును ఎంపొందించును కనుక, అన్నికాండల యందు క్రమానుగతమైన కాండనామధేయ సార్థకతను మొదట దర్శింతము

## కాండలు సంవిధానక్రమము

బాలకాండ యని వినుటతోడనే కావ్యనాయకుని వయస్సును బట్టి కాండనామకరణము చేయబడినదా యని అనిపించును వయస్సును బట్టి

కాండనామకరణము చేయుచొ, తరువాతి కాండ 'తరుణకాండ' కావలెను "ఆ షోడశా ద్భవే ద్బాల స్తత స్తరుణ ఉచ్యతే" అని మనువు అట్లు గాక, దానితరువాత కాండ అయోధ్యాకాండ పోనీ, మొదటి కాండ ఎట్లున్నను దేశమును బట్టి తరువాత కాండ నామధేయము లేర్పడినవని యందుమా ? అదియు కుదరదు శ్రీరాముడు అయోధ్యావాసియైనప్పు డయోధ్యాకాండ అరణ్యవాసియైనపు డరణ్యకాండ కిష్కింధావాసియైనపుడు కిష్కింధాకాండ అని యీ మూడు కాండల పేర్లు సార్థకమైనను, తరువాత కాండముల నామము లట్లు కుదురవు ఆ రీతిగ యథార్థమునకు తరువాతి కాండల రెండిటినీకలిపి లంకాకాండ యనియే నామము పెట్టవలసియుండును అట్లు జరుగలేదు కనుక, వాల్మీకి కాండనామముల గూర్చుటలో దేశక్రమమును గూడ స్వీకరించలేదని తెలియును అందు వలన కాండనామధేయ విషయమై వాల్మీకి యాదరించిన క్రమము తెలియవలసియుండును.

రామాయణకావ్యము "సర్వశ్రుతిమనోహర" మని రామాయణమున కవి చెప్పుకొనినాడు

"సర్వశ్రుతిమనోహర" మనగా, "అందరకు వినసొంపైనది" అని సామాన్యముగా స్ఫురించెడి యర్థము మహర్షి వచనములు ప్రసన్నగంభీరములు మననము చేసినకొలది యపూర్వార్థబోధకములు ఈ పదము యొక్క అర్థమును వ్యాఖ్యాత లిట్లు వివరించిరి

"సర్వశ్రుతీనాం మనాంసి ఉపనిషదః తదర్థహర మిత్యనేన మోక్షదం గీత మిత్యాది"

మహేశ్వరతీర్థ బాల 4 22

సర్వశ్రుతి మనస్సు లన, ఉపనిషత్తులు సర్వశ్రుతిమనోహర మనగా, ఉపనిషదర్థప్రతిపాదక మగుచు మోక్షప్రదమని యర్థము

వేదము వలెనే వేదావతారరూప రామాయణకావ్యము గూడ కర్మ జ్ఞాన యోగప్రబోధకము రామాయణగత కాండనామధేయములు ఒక వైపు కాండగత సంవిధానక్రమమును బోధించుచునే మరియొకవైపు సాధకుల చిత్తసంస్కారక్రమమును ధ్వనింపజేయును చతుర్వింశత్యక్షరాత్మక గాయత్రి రామాయణమున నిగూఢముగ నిక్షిప్తమై జిజ్ఞాసువులగు సాధకులచే గుర్తింపబడినట్లు, కాండనామధేయములు ఒక సాధకచిత్త సంస్కారక్రమము గూడ సహృదయులచే గ్రహింపబడుచున్నది కనుక, కాండనామధేయ సూచితమైన చిత్తసంస్కారక్రమమును చూతము

## బాలకాండ

ఇచట 'బాల'పదము కర్మల యందు ప్రవర్తించు సాధకునియొక్క చిత్తమునందలి బాల్యావస్థను సూచించుచున్నది శాస్త్రసంప్రదాయము ననుసరించి "బాలత్వ"మనగా గ్రహణధారణ పటుత్వము గురుశుశ్రూష జేసి అధ్యయనము జేసి విద్యను గ్రహించుట, గ్రహించినదానిని ఆమ్నాయముల చేతను తత్ప్రతిపాదిత కర్మాచరణము చేతను ధారణ జేసి సుస్థిరము గావించుట గ్రహణధారణపటుత్వము కాన, అకుంఠితప్రమాణ బుద్ధి గలిగి వేదచోదిత కర్మానుష్ఠానశీలత్వము బాలత్వము ఈ విధముగా "బాలకాండ" యను నామము సాధకుల యొక్క చిత్తసంస్కార ప్రారంభదశను సూచించుచున్నది

## అయోధ్యాకాండ

కర్మదీక్షితుడైన సాధకుని చిత్తము క్రమముగ దేవతానిలయ మగును యజ్ఞేశ్వరాధీనమై యజ్ఞదేవు నను గ్రహముచే పరిప్లుతమగును ఆతడు సంసారమున ప్రవర్తించుచునే యుండును కాని యథాపూర్వము సాంసారిక విషయములందు ప్రవృత్తుడు కాడు విషయవాసన లాతని చిత్తము నాకర్షించుటకు సమర్థములు కావు దేవతానిలయమై భక్తిప్రవణమై స్థిరప్రజ్ఞతో విరాజిల్లు చిత్తమే అయోధ్య "యోద్ధుం శక్యాయోధ్యా. న యోధ్యా అయోధ్యా" "జయింప శక్యము కానిది" అని యర్థము

"ఎవరి హృదయము దేవతానిలయమో అది అయోధ్య" అని అయోధ్యా స్వరూపమును శ్రుతి వర్ణించుచున్నది "దేవానాం పూరయోధ్యా"అని తైత్తిరీయారణ్యకశ్రుతి "యత్ర రామ స్తత్రాయోధ్యా" ఇది రామాయణమున గల అయోధ్యాలక్షణము. "రాముడెచట యుండునో అది అయోధ్య" అని సామాన్యార్థము ఇందుచే రాముడు (పరమేశ్వరుడు) ఏ భక్తుని చిత్తమునందు స్థిరముగా నిలచునో ఆ భక్తుని చిత్తము అయోధ్యయే యగుచున్నది ఇట్టి స్థితి భక్తుని యొక్క పరమేశ్వరాయత్త చిత్తత్వమును సూచించుచున్నది

## అరణ్యకాండ

పరమేశ్వరాయత్తమైన భక్తుని హృదయము క్రమముగ జగత్తు యొక్క నశ్వరిత్వమును గ్రహించి వైరాగ్య సంపద్విభూషిత మగుచుండును అట్టి మానసస్థితికే "అరణ్యస్థితి" యని పేరు

"అరణ్యం అపార్ణం గ్రామాత్ అరమణం భవతీతి వా." అని యాస్కాచార్యుడు అరణ్యశబ్దమును నిర్వచించెను

ఇచట గ్రామశబ్దము ప్రాపంచిక విషయవాసనల కుపలక్షణము. గ్రామ నగరాదులు విషయవాసనోద్దీపకములు తద్భిన్నములు అరణ్యములు సామాన్యముగా వన్యమృగసంచారభూయిష్ఠమైన దరణ్య మని చెప్పుదురు అవి ప్రాపంచిక విషయవాసనలను దూరము చేయుచు మునుల కావాసము లగుట ప్రసిద్ధమే అటవిలో నున్నను ప్రాపంచిక విషయవాసనా వ్యామోహితుల కది అరణ్యమే కాదు (అరమణస్థానము కాదు) దీనినిబట్టి అడవిలో నున్నను గ్రామములో నున్నను, ఎచట మనస్సు విషయవ్యామోహితము కాదో అదియే అరణ్యము ఎవరి మనస్సు వ్యామోహితము కాదో ఆ చిత్తమే అరణ్యము ఇదియే సాధకుని అరణ్యస్థితి కర్మయోగమున పరిణతి చెందిన సాధకుని చిత్తపరిపాకము క్రమముగా ప్రాపంచిక విషయవాసనా వ్యామోహములకు దూరమగుచు అరణ్యస్థితిని గాంచును అప్పుడే తత్త్వజిజ్ఞాస అంకురించును

## కిష్కింధాకాండ

కాండనామధేయములలో ఈ నామము చాలా విచిత్రమైనది కిష్కింధా శబ్దమును వాచస్పత్య మిట్లు నిర్వచించినది "కిం కిం దధాతీతి కిష్కింధా" "దేనిని దేనిని ధరించుచున్నాడు అని యర్థము. ఇచట కర్త నిర్దేశింపబడుట లేదు ఈ ప్రశ్న సాధారణజనుల నుద్దేశించినది గాదు సాధారణజన విషయమున నట్టి జిజ్ఞాస కలుగుట కవకాశము లేదు గాన, నిట కర్త సాధకుని దృష్టిలో ఈశ్వరుడే కావలయును.

తత్త్వం విభింకత్వ పోషకత్వ విషయమై సాధకునకు కలిగెడు జిజ్ఞాసయే కిష్కింధాశబ్దవాచ్యార్థము ఇదియే బ్రహ్మజిజ్ఞాస ఇక కిష్కింధా వాసులగు వానర స్వరూపమును జూతము ఇచటి వానరులు సామాన్య వానరులు గారు వీరి విషయమై గ్రహింపవలసిన వానరశబ్దార్థము వేరుగా గన్పట్టును "వనే భవం ఫలాది వానం, వానం రాతీతి వానరః" "వన్యము లైన ఫలాదులను గ్రహించునది" అని సామాన్యముగా వానర శబ్దార్థము ఇక తాత్త్వికముగా చెప్పబడు నర్థము చూతము "వనం ఈశ్వరః, వనస్యేదం వానం పరమాత్మతత్త్వం రాతీతి వానరః" వన శబ్దమునకు పరమేశ్వరు డని యర్థము 'వాన మనగా పరమార్థ తత్త్వము "పరమార్థతత్త్వమును భావన చేయువాడు" అని యర్థము కిష్కింధయందలి వానరులు ధర్మపరులు శ్రీరామపాదాంకితమానసులు, జిజ్ఞాసాపరులు

కిష్కింధాపదమున కుదాహరణభూతుడో యన్నట్లు ఈ కాండారంభమున హనుమంతుని దర్శనభాగ్యము లభించుచున్నది హనుమంతుడు భిక్షురూపమున రాముని సన్నిధికి జేరుకొనును సుగ్రీవుని దృష్టిలో హనుమంతుని భిక్షురూపము తాత్కాలికము, కల్పితము కాని శ్రీరాముని దృష్టిలో హనుమంతుడు తత్త్వతః భిక్షువే సుగ్రీవుని యాదేశమునవనే గాక, భిక్షువై తత్త్వతః రామసాన్నిధ్యమును పొంద గలిగెను కనుకనే శ్రీరాముడు హనుమంతుని విశేషముగా ప్రశంసించును

హనుమంతుడును రామలక్ష్మణులను "నమదా గోవృషౌ" అని స్తుతించెను "నమదా గోవృషౌ" అనగా మదించిన వృషభము లని





సామాన్యముగ నర్థము కాని హనుమంతుని హృదయము వేఱు అది శ్రీరామునికే తెలియును "సమదం" అనగా బ్రహ్మ "సమదా" అనగా "బ్రహ్మతత్త్వము నను గ్రహించువారు" అని అర్థము 'గో' శబ్దము నకు "వేదవాక్కు" అని యర్థము "గవి వృషౌ గోవృషౌ" వేద ప్రతిపాద్యులైన జీవేశ్వరు లని యర్థము రామలక్ష్మణులు బ్రహ్మ తత్త్వము నను గ్రహించు జీవేశ్వరులుగా సాక్షాత్కరించిరి ఉత్తమ సంస్కారసంపన్నుడైన మహాభక్తుడు జిజ్ఞాసువు కనుకనే, హనుమంతున కట్టి సాక్షాత్కారము కలిగినది

"అన్యోన్యసదృశౌ వీరౌ దేవలోకా దివాగతౌ ।
యదృచ్ఛయేవ సంప్రాప్తౌ చంద్రసూర్యౌ వసుంధరామ్॥
విశాలవక్షసౌ వీరౌ మానుషౌ దేవరూపిణౌ ।
సింహస్కంధౌ విశాలాక్షౌ సమదా విప గోవృషౌ"

రామా కిష్కింధ 3 11, 12

రామలక్ష్మణులను వర్ణించుచు, హనుమంతుడు చెప్పిన పై శ్లోకము లను పరిశీలించిన, కిష్కింధాశబ్దవాచ్య మగు పారమైశ్వర్యజిజ్ఞాస హను మంతుని యందు స్ఫుటముగ నభివ్యక్తమగుచున్నది

దీనినిబట్టి కిష్కింధాపదముచే సాధకుని యొక్క జిజ్ఞాసారూప చిత్తసంస్కారము సూచిత మగుచున్నది

## సుందరకాండ

సుందరకాండారంభమున హనుమంతుడు దర్శన మిచ్చుచున్నాడు సుందరకాండ యందు హనుమంతుని విద్యాతత్త్వాన్వేషణపరుడైన ఉత్తమ సాధకునిగ దర్శించగలము ముందు మొదటి శ్లోకమును జూతము

"తతో రావణనీతాయాః సీతాయాః శత్రుకర్శనః ।
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి"

శత్రుకర్శనుడగు హనుమంతుడు రావణునిచే నపహరింపబడిన సీతావృత్తాంతమును, అనగా సీత యున్న ప్రదేశమును తెలిసికొనుటకై చారణాచరిత మార్గమున పయనింపగోరెను (ఈ శ్లోకి తాత్పర్యము రామాయణము వేదావతారం మను వ్యాసమున వివరింపబడినది) చరణము లనగా వేదశాఖలు చరణ చారణ శబ్దములు సమానార్థకములు చారణా చరితపథ మనగా వేదచోదిత సంప్రదాయమార్గ మని యర్థము వేద చోదిత సంప్రదాయమార్గమున బ్రహ్మవిద్యారూపిణి యగు సీత యొక్క పదమును అన్వేషింప బూనుకొనె నని తాత్త్వికమైన యర్థము "పద్మావతీ చరణచారణచక్రవర్తీ" అని అనుచు జయదేవుడు గీతగోవింద కావ్యమున ఈ విషయమునే ధ్వనింపజేయుచున్నాడు హనుమంతు డెంతయో శ్రమించి సీతాన్వేషణ జేసినట్లు సుందరకాండయందు వర్ణింప బడినది.

"ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ ।
దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్ ॥

సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్"

సుందర

అనలంకృతమై యున్న సీత సంస్కారహీనయై అర్థాంతరగతమైన వేదమాత వలె హనుమంతునకు దర్శన మిచ్చినది

ఇచట వేదమాత ఆలంకారికముగా ఉపమానస్థానమున జప బడినను, వాస్తవముగ నిది అనన్వయాలంకారము హనుమంతుడు దర్శించినది, అన్వేషించినదియు వేదమాతనే కదా।

ఇచట ప్రధానముగా దెలియవలసి, విషయము గలదు దిలీపుడు నందినీధేనువును ఎన్నిమారులో చూచెను

ఆ నందిననే సేవించి కృతార్థుడవు కమ్మని గురువు ఉందేశించును ఆ సమయముననే అరణ్యము నుండి తిరిగి వచ్చిన నందినీధేనువు దిలీపునకు సాక్షాత్కరించిన విధము చూతము

"ఇతి వాదిన ఏవాస్య హోతు రాహుతిసాధనమ్ ।
అనింద్యా నందినీ నామ ధేను రావవృతే వనాత్ ॥
లలాటోదయ మాభుగ్నం పల్లవస్నిగ్ధపాటలా ।
బిభ్రతీ శ్వేతరోమాంకం సంధ్యేవ శశినం నవమ్ ॥
రజఃకణైః ఖురోద్ధూతైః స్పృశద్భిః గాత్ర మంతికాత్ ।
తీర్థాభిషేకజాం శుద్ధి మాదధానా మహీక్షితః॥

రఘు 1 82, 83, 85

నందిని మొదట తన ననుగ్రహింపవచ్చిన సంధ్యాదేవత వ

దర్శన మిచ్చినది నందిని ఖురాగ్రోద్ధూత రజఃకణములు యజ్ఞీయావభృథ జలకణముల కంటెను పవిత్రాతిపవిత్రములై తీర్థాభిషేక జన్యశుద్ధిని కలిగించుచున్నట్లు దిలీపుడు భావించెను సాధకుని భావనాపరంపర ఇట్లుండును నందినియు దిలీపుని చిత్తపరిణతిని పరీక్షించి అనుగ్రహించెను వేదమాతయు చిత్తపరిణతి చెంది సేవించువారిని అనుగ్రహించును

"ఉతోత్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః"

ఋగ్వేద 10 71 4

తత్త్వోపదేశమునకు పూర్వము వేదవాక్కు సంస్కారవిహీనయై అర్థాంతరగతమైనది వలె భాసించును గురూపదేశ సంస్కృతచిత్తునకు ఆ వాక్కే బ్రహ్మవిద్యారూపిణియై భాసించును సంస్కారహీనయైన సీతను జూచినపుడు హనుమంతునికి గలిగిన యనుభూతి యిట్టిదియే తత్త్వాన్వేషకులగు మహాత్ములు కాంక్షించునది పొందునది ఈ దివ్యానుభూతినే. ఈ దివ్యానుభూతియే యథార్థసౌందర్యము మహాత్ముల యందభివ్యక్త మగు సౌందర్య మిట్టిదే "కురూపోఽపి విద్వాన్ విద్యయా బహు శోభతే" (కేనోపనిషద్భాష్య) అని శ్రీశంకరు లనినారు. అతడు కురూపియే యగుగాక విద్యాసౌందర్యముచే నెక్కుడుగా శోభిల్లును విద్యాసౌందర్యమే సౌందర్యము "శుచి భూషయతి శ్రుతం వపుః" అనుచు మహాకవి భారవియు విద్యాసౌందర్యమునే ప్రశంసించుచున్నాడు సుందరశబ్ద నిర్వచనముచే గూడ నీయర్థము ద్యోతిత మగుచున్నది,

"సు ఉనత్తి ఆర్ద్రీయతి మనః ఇతి సుందరమ్ సుతరాం ఆద్రియతే ఇతి సుందరం" అని అమరసుధ సుందరశబ్దమును నిర్వచిం

చినది ఏది చిత్తమును ద్రవీభావము నొందించి ప్రసన్నత నొందిం చునో అదియే సౌందర్యము

బాహ్యసౌందర్యము వలన గలుగు ద్రవీభావము క్షణికము భావోద్వేగజనకము భావోద్వేగముల నడచి చిత్తము నందు శాంతిసౌభా గ్యముల పెంపొందించునది ఆత్మసౌందర్యము ఇదియే తత్త్వతః సుందరశబ్దవాచ్యము కురూపుని వలె దోచు హనుమంతుని సుందరరూపు నిగ భాసింపజేసినది ఈ సౌందర్యమే సుందరకాండము నందంటట ఈ మహాత్ముని సౌందర్యమే విరాజిల్లుచుండును

ఇట్లు హనుమంతుని సౌందర్యమే సుందరకాండ యందు సర్వత్ర భాసించు నని చెప్పుచో కావ్యనాయకునకు ప్రాధాన్యము తగ్గుటలేదా! తగ్గక పోగా సుందరకాండ యందు నాయికానాయకుల దివ్యసౌందర్యము హనుమత్సౌందర్యముచే మర్దింతమై సహస్రముఖముల విరాజిల్లినది ప్రతి క్షణము ఆ దివ్యమూర్తుల సౌందర్యమును భావన జేయుచునే, ఆరాధించుచునే హనుమంతుడు ముందడుగు వేయుట జరిగినది

హనుమంతుడు లంకానగర సౌందర్యముచే గాని, అచటి సుందరు లగు స్త్రీల సౌందర్యముచే గాని ముగ్ధుడు కాలేదు, కాని అతనిని ముగ్ధుని జేసినది సంస్కారహీనయైనను సీత యొక్క పాతివ్రత్య దివ్యసౌంద ర్యమే అట్టి సౌందర్యముతో విరాజిల్లెడి కావ్యనాయికచే నిరంతర మారా ధింపబడెడి శ్రీరాముని దివ్యసౌందర్యప్రభలు హనుమంతుని బుద్ధిగుహాం ధకా పటలమును పటపంచలు జేసినవి హనుమంతుని హృదయమున సీతారామమూర్తుల శాశ్వత ప్రతిష్ఠ జరిగినది సుందరులగు ఆ నాయికా నాయకుల సౌందర్యముచే సుందరుడగు, హనుమంతుని సౌందర్య మతిశ యించినది ఇట్లు సుందరకాండ యందు కావ్యనాయిక యగు సీత

యొక్క హృదయమందదైన శ్రీరామచంద్రుని ఆత్మస్వరూపునిగా దర్శించిన సుందరహనుమసౌందర్యమే విరాజిల్లుచున్నది

దీనినిబట్టి సుందరకాండ యను నామము జిజ్ఞాసువగు సాధకుని చిత్తము గుర్వనుగ్రహము వలన ఆత్మసౌందర్య విరాజిత మగు నను సంస్కారక్రమమును సూచించుచున్న దనుకొనవచ్చును కనుకనే, సుందరకాండ కిష్కింధాకాండానంతరము చాటు చేసికొనినది

## యుద్ధకాండ ఉత్తరకాండ

ఆరవ కాండ నామధేయ మగు యుద్ధ పదము దైవీసంపత్తికిని అసురసంపత్తికిని సాధకుని చిత్తములో గలుగు ఘోరసంగ్రామమును సూచించుచున్నది ఇట్టి సంగ్రామమునే శ్రుతి "దేవాసురా స్సయంత్తా ఆసన్" అని అనుచు పెక్కు చోట్ల వర్ణించినది ఈ యుద్ధమునందు అసురీప్రవృత్తి యొక్క పరాజయము సాధకుని జయము సాధకుని చిత్తము నందలి అవిద్యానాశమును సూచించుచున్నది అట్లు విద్యానాశానంతరము సాధకుడు సర్వోత్తముడై వెలుగొందు నని ఉత్తరకాండ యను నామము సూచించుచున్నది

ఇట్లు కాండనామధేయములు సార్థకములై సాధకునిచిత్తసంస్కార పరిపాకక్రమమును సూచించుచు అన్వర్థములై యొప్పుచున్నవి

## రామలక్ష్మణభరతశత్రుఘ్న నామములు సంస్కార క్రమము

రామ లక్ష్మణ భరత శత్రుఘ్ను లను నామధేయములు గూడ సాధకుని చిత్తసంస్కార క్రమమును తెలియజేయునని పెద్దలు చెప్పుదురు

రామాయణమున శత్రుఘ్నుడు తరచుగా "శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నః" అని వర్ణింపబడుచున్నాడు నిత్యశత్రువులు షట్క్రోధాదులే కామక్రోధాదులు జయించుట శత్రుఘ్నత్వ మని శత్రుఘ్న పదము సూచించుచున్నది కనుక, శత్రుఘ్నత్వమనగా జితేంద్రియత్వము జితేంద్రియుడైన సాధకుడు యోగశాస్త్రప్రసిద్ధ ధారణాకుశలు డగును ఈ ధారణమే భరణము ధీరిత్వోపలక్షకము అట్టి ధీరుడు భరతుడు "భరణా ద్భరతః।" అట్లు భరతుడైన సాధకుడు క్రమముగ ఈశ్వరాను గ్రహముచే లక్ష్మీవర్ధను డగును లక్ష్మీవర్ధనత్వమే లక్ష్మణత్వము "లక్ష్మీవాన్ లక్ష్మీవర్ధనః లక్ష్మణో లక్ష్మీవర్ధనః" అని యనుచు రామాయణమున లక్ష్మణుడు లక్ష్మీవర్ధనుడుగా వర్ణింపబడుటలోని అంతర్య మిదియే పరమాత్మను దర్శింపజేయు విద్యయే లక్ష్మీ అట్టి లక్ష్మీసంపన్నత్వమే లక్ష్మణత్వము అట్టి లక్ష్మిచే లక్షిత మయ్యెడి తత్త్వమే శ్రీరాముడు రామనామము సర్వప్రాప్యపరతత్త్వబోధకము

ఇట్లు ఈ నాల్గు నామధేయములు కాండనామధేయముల వలె పరతత్త్వమును దర్శింపజేయు సాధకుని చిత్తసంస్కార క్రమమును సూచించుచున్నవని యభిజ్ఞులు చెప్పుదురు

౦

# 10. రామాయణము - యజ్ఞదేవాలయ ప్రశంస

రామాయణము యజ్ఞప్రాశస్త్యమును, దేవాలయ ప్రాశప మాహాత్మ్యములను సందర్భోచితముగా గుర్తింపచేయుచు నుండును యథార్థము నకు, దేవాలయములు యజ్ఞములకు ప్రతికృతులే యజ్ఞశిల్పము దేవాలయ శిల్పమున ప్రతిబింబించుచుండును కాని, హవిర్దానపూర్వకముగ చేయబడు అగ్న్యుపాసన యజ్ఞ మనియు, ఆగమోక్తప్రకారముగ ప్రతిష్ఠింపబడెడి దేవతామూర్తులతో విరాజిల్లునవి దేవాలయము లనియు వ్యవహరింపబడుచు నుండును

యజ్ఞములు వివిధములు దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, వీనికి పంచయజ్ఞము లని పేరు ఇవి ప్రతిదినము చేయవలసినవి వీనివలన దేవ పితృ భూత మనుష్య వేదపురుషులు సంతసించి, అనుగ్రహించుచుందురు అట్లే "అష్టకా పార్వణ శ్రాద్ధ శ్రావణీ ఆగ్రహాయణీ చైత్రీ ఆశ్వయుజీ" అనునవి సప్త పాకయజ్ఞములు వీనివలన అంతశ్శుద్ధి కలుగును ఇట్లే "అగ్నిష్టోమ అత్యగ్నిష్టోమ ఉక్థ్య షోడశీ వాజపేయ అతిరాత్ర అప్తోర్యామము" లనునవి సప్త సోమయజ్ఞములు

వీనివలన దేవతానుగ్రహము, అభీష్టసిద్ధియు కలుగును ఇవిగాక, ఆ యా యభీష్టములు సద్ధించుటకై ఎన్నెన్నియో యజ్ఞము లుపదేశింపబడినవి ఇంకను, మహారాజులు చేయదగిన "అశ్వమేధ రాజసూయ విశ్వజిదాది యాగములు ప్రసిద్ధములు రామాయణము కథావర్ణనవ్యాజముతో యజ్ఞప్రశంస చేయుచు, యజ్ఞమాహాత్మ్యమును వర్ణించుచు బోవును

## రామాయణము యజ్ఞప్రశంస

రామాయణము "తా మగ్నిమద్భిః గుణవద్భి రావృతామ్" అని అయోధ్యానగరవర్ణనజేయుచు యజ్ఞదీక్షితులైన మ~ త్ములతో, ఋషులతో అయోధ్యానగరము నిండియున్నదని వర్ణించుచున్నది ~గా, యజ్ఞ ప్రశంసతోనే రామాయణారంభమైనట్లు తెలియును తరువాత, వాఖ వీరిననేల ? అయోధ్యావాసు లందరు అగ్న్యుపాసకులే

"నానాహితాగ్ని ర్నాయజ్వా న క్షుద్రో వా న తస్కరః ।
కశ్చి దాసీ దయోధ్యాయాం న చ నిర్వృత్తసంగరః"

రావణ బాల 6 12 (1 6 12)

ప్రజలే కాదు, ప్రభువగు దశరథుడు గూడ యజ్వయే
"ఇక్ష్వాకూణా మతిరథో యజ్వా ధర్మరతో వశీ"

యజ్ఞము చెసినవానికి యజ్వా' అని పేరు "యజ్వా తు విధినేష్టవాన్'' అని అమరము "యథా రాజా తథా ప్రజా" ప్రభువు యజనశీలుడు, ధర్మపరుడు నగుచో, ప్రజలును నట్లే ధర్మపరు లగుదు రని దీనివలన తెలియును

దశరథుడు యజ్ఞప్రభావము నెరుగును కనుకనే, అశ్వమేధయాగమును చేయుటకు పూనుకొనెను

"మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్।
తదర్థం హయమేధేన యక్ష్యామీతి మతి ర్మమ"
బాల (1 8 8)

సంతతికై అశ్వమేధము చేయదలచినట్లు దశరథుడు ఋత్విజులతో చెప్పి, వారి యంగీకారముతో యథాశాస్త్రము యజ్ఞమును పూర్తిచేయును దాని ప్రభావము వలన, శ్రావ్యము మునికుమారుని హత్యా దోషము నుండి తాను విముక్తుడగును

"తరతి సర్వం పాప్మానం తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే"
తాండ్యబ్రాహ్మణ, 21 4 2

అశ్వమేధయాగము చేసినవారు పాపవిముక్తు లగుదురు బ్రహ్మహత్యాదోషము నుండి విముక్తులగుదురు

శ్రుతి అశ్వమేధోపాసన గూడ విధించినది ఈ ఉపాసన వలన అశ్వమేధయాగఫలము పొందగలడు

"అథ యోఽసౌ తపతి ఏషోఽశ్వః" ఐ బ్రాహ్మణ 6 35
ఏష వా అశ్వమేధః య ఏష తపతి మా శ బ్రా 10 6 5 8
ఉషా వా మేధ్యస్య అశ్వస్య శిరః బృహ ఉ

పై శ్రుతి వాక్యములు ఆదిత్యుని అశ్వమేధరూపునిగా దర్శింపజేయుచున్నవి

అశ్వమేధముచే పాపవిముక్తుడైన దశరథుడు ఋష్యశృంగుని జేరి తనకు వంశవృద్ధి కలుగునటుల నాశీర్వదించుమని ప్రార్థించును

"ఇష్టిం తేzహం కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్ ।
అథర్వశిరసి ప్రోక్తైః మంత్రై స్సిద్ధాం విధానతః"

అని యనుచు ఋష్యశృంగుడు పుత్రకామేష్టిని నిర్వహించి దశరధుని యజ్ఞపురుషానుగ్రహమునకు పాత్రుడగునట్లు జేయును దశరథునకు నలుగురు కుమారులు కలిగిరి దీనివలన యజ్ఞములు మానవులను పాపవిముక్తుల జేసి అభీష్టఫలముల నొసగు కామధేనువు లని తెలియును

విశ్వామిత్రచరిత్రయు యజ్ఞప్రశస్తికి తార్కాణము దశరథుడు శ్రీరామునకు వివాహము జెయసంకల్పించి వశిష్ఠాదులతో సంప్రదించు సమయమున విశ్వామిత్రుడు వచ్చి ఇట్లు చెప్పును

"అహం నియమ మాతిష్ఠే సిద్ధ్యర్థం పురుషర్షభ ।
తస్య విఘ్నకరౌ ద్వౌ తు రాక్షసౌ కామరూపిణౌ"

బాల 19 4

విశ్వామిత్రుడు సిద్ధుడగుటకై యజ్ఞము సంకల్పించినట్లు చెప్పును విశ్వామిత్రుడు బ్రహ్మర్షి ఆప్తకాముడు అయన కోరిన సిద్ధి యేది? లోకసంగ్రహమే ఆ మహాత్ముడు కోరెడి సిద్ధి తరువాత జరిగిన సంఘటనలను బట్టి ప్రకృతిపురుషు లనదగిన సీతారాముల యోజనమే అయన అభిలషించెడు సిద్ధియా! ఏమో! అయినను కావచ్చును సిద్ధుడైన తరువాత అయన యొనర్చిన లోకకల్యాణకరమైన కృత్య మిదిగాక మరి యొకటి గనపట్టదు ఆ ప్రకృతిపురుష యోజనమే యజ్ఞఫలసిద్ధియా!

వాస్తవముగా బ్రహ్మర్షియైన విశ్వామిత్రుని దృష్టిలో శ్రీరాముడు ప్రాకృతపురుషుడు గాదు అప్రాకృతి దివ్యపురుషుడే వశిష్ఠాదుల సమక్షమున దశరధునితో శ్రీరాముడు అప్రాకృత దివ్యపురుషరూపుడని వర్ణించుట గమనింపదగినది

"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్ ।
వశిష్ఠోఽపి మహాతేజాః యే చేమే తపసి స్థితాః"

బాల 19 14

కావున, లోకకల్యాణకరమైన సీతారామకల్యాణరూప సిద్ధికయియే విశ్వామిత్రుడు యజ్ఞము తలపెట్టినట్లు తెలియనగును ఉత్తమ ఫలసిద్ధి నిచ్చునవి యజ్ఞములే

శ్రీరాముని సహాయముతో యజ్ఞము నిర్విఘ్నముగ పరిసమాప్తమైనది తాను కృతకృత్యుడైనట్లు నిండు మనస్సుతో శ్రీరామునితో విశ్వామిత్రుడిట్లు చెప్పుచున్నాడు

"కృతార్థోఽస్మి మహాబాహో కృతం గురువచ స్త్వయా ।
సిద్ధాశ్రమ మిదం సత్యం కృతం రామ మహాయశః"

తాను సిద్ధుడైనందున ఆశ్రమము కూడ వాస్తవముగ సిద్ధాశ్రమమైన దని మహర్షి చెప్పుచున్నాడు దీనివలన మహాత్ములు సయితము యజ్ఞముచె అభీష్టసిద్ధిని పొంది సిద్ధులు కాగలరని తెలియుచున్నది

కనుకనే, బాల్యమున సిద్ధోపాసనతో అక్షరాభ్యాసము ప్రారంభము చేయవలయు నను ఆచారము అనూచానముగా వచ్చుచున్నది

"ఓం నమః శివాయ సిద్ధం నమః"

ఇది మహామంత్రము ఓ న మా ల వ్యాజముతో పెద్దలు ఎల్ల లకు ఉపదేశించెదరు

నమః శివాయ — సర్వమంగళకరుడగు పరమేశ్వరునకు నమస్కారము

(తాత్త్వికముగ ఈ మంత్రమునకు ఉపాసనాసంప్రదాయము ననుసరించి ఎన్నియో అర్థములు చెప్పుదురు )

సిద్ధం (ప్రతి) నమః — సిద్ధరూపుడైన ఆ పరమేశ్వరుని గూర్చి నమస్కరించుచున్నాను

లేక

నమః సిద్ధం భవతి — మా ఉపాసన సిద్ధరూపమును తాల్చుగాక,

పరమేశ్వరుడు సిద్ధరూపుడు సిద్ధోపాసన చేసి సిద్ధరూపులు కావలయు నని ఉపాసన యొక్క లక్ష్యము ఈనాటికి ఆ యా పుణ్యక్షేత్రములందు భక్తులు ఈ మంత్రోపాసన నిత్యము చేయుచున్నట్లు వినికిడి

మహాత్ములు యజ్ఞపురుష అగ్ని సమతేజులు దశరథుని సభ యందు కోపోద్రిక్తుడైన విశ్వామిత్రవర్ణన వ్యాజమున కవి యీ విషయమును స్పష్టము చేయుచున్నాడు

"ఇతి నరపతిజల్పనా ద్ద్విజేంద్రం
కుశికసుతం సుమహాన్ వివేశ మన్యుః ;

సుహూత ఇవ మఖేఽగ్ని రాజ్యసిక్తః
సమభవ దుజ్జ్వలితో మహర్షి వహ్నిః"

బాల 20 28

విశ్వామిత్రుడు శ్రీరాముని తనతో రాక్షస సంహారమునకై పంపుమని దశరథుని కోరెను శ్రీరాముని పంపుటకు దశరథుడు ముందు వెనుకలు చూచెను వెంటనే విశ్వామిత్రుని క్రోధ మాపేశించి, మహాగ్ని వలె ప్రజ్వరిల్లెను ఆ క్రోధాగ్ని మంత్రపూతములైన అజ్యధారలతో యజ్ఞకుండమందు ప్రజ్వరిల్లెడి అగ్నివలె భాసిల్లెనట

ఇచట క్రోధాగ్ని యజ్ఞకుండము నందలి అగ్నితో పోల్చబడుట గమనార్హము సాధారణ జనుల క్రోధము ఇతరుల కుపద్రవకారణమైనట్లు లౌకికాగ్ని గూడ శ్రుతి మించినచో ఉపద్రవకారకమే అగును. "యజ్ఞాః కళ్యాణహేతవః" యజ్ఞకుండము నందలి అగ్ని లోకక్షేమంకర మైనట్లు ఆ బ్రహ్మర్షి యొక్క క్రోధగ్ని గూడ లోకక్షేమంకరమని సూచించుటయే ఈ ఉపమాన తాత్పర్యము

యాగసంరక్షణానంతరము విశ్వామిత్రుడు రామలక్ష్మణులను జనకుని యజ్ఞసందర్శనమునకై తీసుకొనిపోయెను ఇది మరియొక యజ్ఞ ప్రస్తావన

## జనకుని యజ్ఞము

"అథ మె కృషతః క్షేత్రం లాంగలా దుత్థితా మయా।
క్షేత్రం శోధయతా లబ్ధా నామ్నా సీతేతి విశ్రుతా"

రామా 1 66 13

యజ్ఞమును చేయుటకై భూమిని దున్నుచున్నప్పుడు నాగటిచాలు నందు సీత యను బాలిక లభించిన దని జనకుడు చెప్పుచున్నాడు ఇట్లు చెప్పుటచే ఒక విషయము స్పష్టమగుచున్నది కథానాయకుడైన శ్రీరాముడు యజ్ఞపురుష వర ప్రసాదలబ్ధుడు కథానాయిక యగు సీతయు అట్టిదే పుత్ర సంతతి కొఱకై దశరథుడు పుత్రకామేష్టి జేసెను జనకుడు చేయలేదు అప్రయత్నలబ్ధ శిశురత్నము సీత జనకుని గర్భమున పుట్టిన పుత్రిక యున్నను, జానకి యని ప్రసిద్ధి జనకపుత్రిక యగు ఊర్మిళకు లేదు ఆ ప్రసిద్ధి సీతకే దక్కినది జనకుని చే లాలించి పోషింపబడుటచే 'జానకి' యని కథాపరమైన అర్థము

(జనకస్యాపత్యం స్త్రీ జానకీ) ఇంతియే కాదు, సర్వలోకజనకుడైన పరమేశ్వరునకు సంబంధించినది గాన, జానకి యని తాత్త్వికమైన యర్థము (జనకస్య సర్వలోకజనకస్య పరమేశ్వరస్యేయం జానకీ) ఈ తాత్త్వికమైన యర్థమును స్ఫురింపజేయుటకే సతకు జానకీవ్యవహారము ప్రసిద్ధమైనట్లుగ అభిజ్ఞులు చెప్పుదురు ఇట్లు రామాయణకావ్య నాయికానాయకులు యజ్ఞపురుష వరప్రసాదలబ్ధు లగుటను వర్ణించి రామాయణము యజ్ఞప్రాశస్త్యమును దర్శింపజేయుచున్నది

## సీతారామకళ్యాణము ధనుర్వృత్తాంతము

సీతా వివాహమునకు పణముగా నిర్దేశింపబడిన శివధనుర్వృత్తాంతము గూడ పరోక్షముగ యజ్ఞప్రాభవమును సూచించుచున్నది

"అయాగభూతం నృపతేః తస్య వేశ్మని రాఘవ ।
అర్చితం వివిధై ర్గంధైః ధూపై శ్చాగరుగంధిభిః"

రామా 1 31 13

జనకుని గృహమున శివధనుస్సు అయాగభూతముగ నున్నదని చెప్పబడినది

"ఉత్సవే ప్రాధాన్యే నార్చితం ధను రయాగ ఉచ్యతే"

గోవిందరాజీయవ్యాఖ్య

"మఖేషు ప్రాధాన్యే నార్చితం ధను రాయాగః తద్భూతం"

మహేశ్వరతీర్థవ్యాఖ్య

ధనుస్సు యొక్క ప్రాభవమును గూర్చి విశ్వామిత్రుడు శ్రీరాము నకు చెప్పెడు వాక్య మిది

యజ్ఞోత్సవముల యందు దేవతారూపమున ప్రధానముగా అర్చింప బడెడి ధనుస్సు గాన, శివధనుస్సు 'అయాగభూతధను'వని విశ్వామిత్రుడు చెప్పుచున్నాడు దీనినిబట్టి శివధనువు యొక్క అర్చన గూడ జనకుని దృష్టిలో యజ్ఞరూపమే

## సగరచక్రవర్తి యజ్ఞము

శ్రీరామునకు పూర్వీకుడైన సగరచక్రవర్తి యొక్క యజ్ఞవృత్తాంతము ఎన్ని విఘ్నములు సంభవించినను, దీక్షతో యజ్ఞసమాప్తి జేసిన, నా యజ్ఞము అమృతవర్షము కురియునని తెలియజేయుచున్నది స్వర్లోక గతమైన గంగ భూలోకములో అవతరించుటకు కారణము సాక్షాత్తుగ గాని, పరంపరగా గాని, సగరయజ్ఞమే యగుచున్నది.

యజ్ఞములు విఘ్నముల నేమాత్రము సహింపవు ఇట్టి విఘ్నముల విషయమై మహాత్ములు ఏమరపాటుతో నేమాత్రముండిన విఘ్నముల సహించరను విషయము జహ్నుమహర్షి యొక్క యజ్ఞవృత్తాంతము తెలియజేయుచున్నది

"తతో హి యజమానస్య జహ్నో రద్భుత కర్మణః ।
గంగా సంప్లావయామాస యజ్ఞవాటం మహాత్మనః॥
తస్యావలేపనం జ్ఞాత్వా క్రుద్ధో యజ్వా తు రాఘవ ।
అపిబచ్చ జలం సర్వం గంగాయాః పరమాద్భుతమ్"

రామా 1 43 35

ఆకాశము నుండి అవిర్భవించిన గంగ జహ్నుమహర్షి యజ్ఞవాటమును ముంచెత్తెను యజ్ఞమునకు కలిగిన విఘ్నమునకు మహర్షి క్రుద్ధుడై గంగాజలమును మ్రింగెను దేవతల ప్రార్థనలచే ప్రసన్నుడై గంగను పుత్రికగా స్వీకరించి తన శ్రవణేంద్రియముల ద్వారా విడిచిపెట్టెను కనుక, గంగ జాహ్నవి యైనది

యజ్ఞములు కామధేనువులు కావచ్చును కాని, వానిని విపరీత ఫలసాధనములుగా జేసికొనరాదని త్రిశంకు యజ్ఞవృత్తాంతము తెలియజేయుచున్నది అయోధ్యాధిపతి యజ్ఞములకై సంకల్పించుట శునశ్శేపవృత్తాంతము కూడ నీ విషయమునే గుర్తింపజేయుచున్నది అడుగడుగున రామాయణమున నిట్టి వృత్తాంతము లన్నియేని గలవు

యజ్ఞము యొక్క ప్రభావము ఇంతింత యనరాదు అవి సాధకుల కోర్కెల దీర్చుచునే వివిధ లోకోపద్రవనివారకములు, కల్యాణ

సంధాయకములు నగునను విషయము రామాయణము ప్రతి సన్నివేశము లోను సూచించుచున్నది

## రామాయణము దేవాలయము

ప్రాణికోటి సుఖజీవనమునకు, సౌభాగ్యమునకు యజ్ఞము లెంత ప్రధానములో, దేవాలయములు గూడ నంత ప్రధానము లని రామాయణ కావ్య ముద్బోధించుచున్నది కథానాయకుడైన శ్రీరాముడు స్వయముగ దేవమందిరములను సేవించినట్లు పలుచోట్ల వర్ణింపబడినది

పట్టాభిషేకవార్తను శ్రీరామునకు దెలిపి, ఆ రాత్రి యంతయు నియమవంతుడై దీక్షితుడై యుండవలె నని వశిష్ఠాదులు శ్రీరాము నాదేశించుచురు తదాదేశానుగుణముగ, శ్రీరాముడు విష్ణుమందిరములో దీక్షితుడై శయనించును

"ధ్యాయ న్నారాయణం దేవం స్వాస్తీర్ణే కుశసంస్తరే
వాగ్యత స్సహ వైదేహ్యా భూత్వా నియత మానసః ॥
శ్రీమ త్యాయతనే విష్ణోః శిశ్యే నరవరాత్మజః"

రామా 2 6 4

తన పట్టాభిషేకవార్తను శ్రీరాముడు తల్లికి చెప్పుటకై వెళ్ళినపుడు కౌసల్య దేవాలయములో భగవద్ధ్యాన నిమగ్నయై యుండుటను దర్శించెను

"తత్ర తాం ప్రవణా మేవ మాతరం క్షౌమవాసినీమ్ ।

వాగ్యతాం దేవతాగారే దదర్శాఽఽయాచతీం శ్రియమ్"

రామా 2 4 30

శ్రీరామునిపట్టాభిషేకసందర్భమున దేవాలయములన్నియు పతాకాలంకృతములై యున్నట్లు మంధర కైకేయితో నిట్లు చెప్పుచున్నది

"ఎతాభ్రశిఖరాభేషు దేవతాయతనేషు చ।
చతుష్పదేషు రథ్యాసు చైత్యే ష్వట్టాలకేషుచ ॥
ధ్వజా స్సముచ్ఛ్రితా శ్చిత్రాః పతాకా శ్చాభవం స్తదా"

శ్రీరామచంద్రు డెట నుండిన నట, దేవాలయ నిర్మాణము చేయించినట్లు తెలియును చిత్రకూటమున శ్రీరాముడు పర్ణశాలాప్రవేశము చేసి, యచట ఆశ్రమవాతావరణమున కనుగుణముగా యజ్ఞశాలతోపాటు ఆలయ నిర్మాణము గూడ చేసెను

"వేదీస్థలవిధానాని చైత్యా న్యాయతనాని చ।
ఆశ్రమ స్యానురూపాణి స్థాపయామాస రాఘవః"

రామా 2 56 34

శ్రీరాముడు అగస్త్యాశ్రమమున వివిధ దేవాలయములను దర్శించినట్లు వర్ణన గలదు

"విష్ణోస్స్థానం మహేంద్రస్య స్థానం చైవ వివస్వతః।
సోమస్థానం భగస్థానం స్థానం కౌబేర మేవ చ।
"ధాతు ర్విధాతుః స్థానే చ వాయోస్స్థానం తథైవ చః
నాగరాజస్య చ స్థానం అనంతస్య మహాత్మనః।

స్థానం తథైవ గాయత్ర్యాః వసూనాం స్థాన మేవ చ ।
స్థానం చ పాశహస్తస్య వరుణస్య మహాత్మనః ॥
కార్తికేయస్య చ స్థానం ధర్మస్థానం చ పశ్యతి ”

రామా 3 12 21

అగస్త్య మహర్షి ఆశ్రమమున త్రిమూర్తులు, దిక్పాలకులు, వసురుద్రాదిత్యులు, గాయత్రీవేదమత, ధర్మదేవత, కార్తికేయుడు, మున్నగువారి ఆలయములను దర్శించినట్లు ఈ శ్లోకముల వలన తెలియును దీనింబట్టి మహాత్ముల పుణ్యాశ్రమములు అగ్నిదేవతావిభూషితములైన యజ్ఞవాటికలు మాత్రమే కాదు, పవిత్ర దేవతామందిర శోభితములు గూడనై యున్నట్లు రామాయణము వలన దెలియుచున్నది

మాతుల గృహము నుండి భరతు డయోధ్యకు తిరిగి వచ్చినపుడు అయోధ్యానగర వర్ణన వ్యాజమున దేవాలయముల యొక్క ప్రాశస్త్యమును కవి యిట్లు వర్ణించుచున్నాడు

“అపేతమాల్యశోభా న్యసంమృష్టాజిరాణి చ ।
దేవాగారాణి శూన్యాని నచాభాంతి యధాపురమ్ ॥
దేవతార్చాః ప్రవిద్ధాశ్చ యజ్ఞగోష్ఠ్య స్తథావిధాః ।
దైవాయతనచైత్యేషు దీనాః పక్షిగణా స్తథా”

రామా 2 71 40 నుండి 43 వరకు

దేవాలయములు పూజావిహీనములై శోభనుగోల్పోయి యున్నవి యజ్ఞశాలలందు జరుగు విద్వత్సభల కోలాహలములు లేవు అయోధ్య యంతయు కళావిహీనమై యున్నది

ఈ వర్ణన వలన యజ్ఞాయతనముల తోపాటు అయోధ్యానగర మంతయు దేవతాయతనములతో గూడ నిండియున్నట్లు తెలియును

సీతారాములు వనవాసమునకు బయలుదేరి గంగాతీరమునకు జేరిరి గుహుని సహాయముతో గంగను దాటుచుండుట రామలక్ష్మణులు మంత్ర పురస్సరముగ గంగను ధ్యానించి ప్రణమిల్లిరి నావ నదీమధ్యమునకు జేరగనే చేతులు జోడించి సీత గంగ నిట్లు ప్రార్థించినది

"యక్ష్యే త్వాం ప్రయతా దేవీ పురీం పునరుపాగతా ।
యాని త్వత్తీరవాసీని దైవతాని వసంతి చ ।
తాని సర్వాణి యక్ష్యామి తీర్థాన్యాయతనాని చ"

తల్లీ జగన్మాతా! నేను వనవాసమున కేగుచుంటిని ప్రస్తుత మనభర్తలను క్షేమముగా తిరిగి వచ్చినంతనే, వివిధోపచారములతో నిన్ను చక్కగా అర్చింతును నీ యాగము చేతును నీ తీరమున నున్న వివిధ దైవతములను దేవతాయతనములను సేవింతును దీనివలన గంగాతీర మంతయు వివిధ దేవతాయతనములతో విరాజిల్లుచున్నట్లు తెలియును

పై వర్ణనల వలన యజ్ఞములతోపాటు దేవాలయములకును సమ ప్రాధాన్య మున్నట్లు తెలియును "యజ్ఞో వై విష్ణుః" యజ్ఞరూపమున ఏ పరమాత్మ ఆరాధింపబడుచుండునో, ఆ దేవుడే ఆ పరతత్త్వమే ఆలయములందు సాకారరూపమున ఆరాధింపబడుచున్నాడు అందుకనియే యజ్ఞములతోపాటు దేవాలయములు గూడ పూజామందిరములై భవసాగర తరణసాధనములై అనూచానముగ యజ్ఞములతోపాటు విలసిల్లుచు వచ్చి

నవి కౌసల్య పుత్రక్షేమమునకై విష్ణుమందిరమున నియమవ్రతపరాయ ణయై యున్నట్లు చెప్పబడినది ఆమెయే పుత్రదీక్షకై అగ్న్యుపాసనా పరురాలై యున్నట్లు తరువాత వర్ణింపబడినది

"కౌసల్యాఽపి తదా దేవీ రాత్రిం స్థిత్వా సమాహితా ।
ప్రభాతే త్వకరోత్పూజాం విష్ణోః పుత్రహితైషిణీ ॥
సా క్షౌమవసనా హృష్టా నిత్యవ్రతపరాయణా ।
అగ్నిం జుహోతి స్మ తథా మంత్రవత్కృతమంగళా"
రామా 2 20 15

దీనినిబట్టి భగవదారాధన ఉభయవిధములుగను చేయవలయు నని స్పష్ట మగుచున్నది ఒక్కొక్క మార్గమున నొక్కొక్క విలక్షణ ప్రయోజనములు దర్శించి మహర్షు లుభయమార్గముల నుపదేశించిరి

## యజ్ఞములు విలక్షణప్రయోజనములు

"యజ్ఞధూమజో హి మేఘ ఏవ దివ్యదృష్టిదో
దేవగోప మన్న మాదధాతి వృష్టి రేవ సా ॥
లోకశాంతిసంవిధాన యజ్ఞతత్త్వబోధికాం
యజుర్వేద సంనుతాం నమామ వేదమాతరమ్"
వేదమాతృస్తవః

ధూమము నాలుగువిధములు యజ్ఞధూమము, దావాగ్నిధూమము,

శవధూమము, అభిచారిక ధూమము ఈ చతుర్విధ ధూమములలో యజ్ఞ ధూమము సర్వోత్కృష్టము ఈ ధూమముతో నేర్పడు మేఘములు పవిత్రములు సకాలవృష్టిప్రదములు అనావృష్టి నిరోధకములు ఆ వృష్టి వలన ఫలించు ఓషధులు వీర్యవత్తరములై సద్బుద్ధిని, సుఖశాంతులను వర్ధిల్ల జేయును

"యజ్ఞా ద్భవతి పర్జన్యః పర్జన్యా దన్నసంభవః"
అనుచు భగవద్గీత యజ్ఞమేఘమును ప్రశంసించెను
"భూమిం పర్జన్యాజిన్వం దిపం జిన్వం త్యగ్నయః"
అను శ్రుతితాత్పర్యమును నిదియే

## వ న ధూ మ ము

వనధూమమనగా, దావాగ్నిధూమము ఇదియు ప్రశస్తమైనదే కాని, ప్రేతధూమము, అంతకంటెను, అభిచారికధూమము (రాసాయనికాది ద్రవ్యజనిత ధూమము) ప్రమాదకరములు యంత్రాగారంపు గొట్టముల నుండియు మారణాయుధ ప్రయోగముల నుండి నేర్పడు ధూమము అతిభయంకరము అవి ప్రాణికోటివినాశహేతువులు వాతావరణకాలుష్య హేతువులు వాతావరణపరిశుద్ధి హేతువులైన యజ్ఞధూమములు లోక కల్యాణప్రదములు అందువలననే, ఆర్షవాఙ్మయమందు మహర్షుల ఆశ్రమములు యజ్ఞధూమములతో పవిత్రములై విరాజిల్లుచున్నట్లు వర్ణింపబడుచున్నవి ఆప్తకాములయియు మహర్షులు లోకానుగ్రహబుద్ధితో లోకకల్యాణము కొరకై యజ్ఞముల నాచరించుచున్నట్లు మహాకవుల వర్ణన వలన తెలియును

"అభ్యుత్థితాగ్నిపిశునై రతిథీ నాశ్రమోన్ముఖాన్ ।
పునానం పవనోద్ధూతైః ధూమై రాహూతిగంధిభిః ॥
హవి రావర్జితం హోతః త్వయా విధివ దగ్నిషు ।
వృష్టి ర్భవతి సస్యానా మవగ్రహవిశోషిణామ్"

రఘువంశ సర్గ

## యజ్ఞములంది అన్నదానము

యజ్ఞమున అన్నదానమునకు ప్రధానస్థాన మీయబడినది అన్న దానము జేసి జీవకోటి నారాధించుటయే ప్రధానమైన దేవతారాధన దశ రథుడు అశ్వమేధ మొనర్చుచు అన్నదాన విషయమున ప్రత్యేక శ్రద్ధ వహించినట్లు వర్ణింపబడినది అన్నదాన మందరకు విరివిగా జరిగినట్లును అందరును ఆ యన్నదానముచే ఎంతో తృప్తి జెందినట్లును ఆ మాటలను విని దశరథుడు సంతసించినట్లును కవి చక్కగా వర్ణించెను

"అహో తృప్తాః స్మ భద్రం తే ఇతి శుశ్రావ రాఘవః"

రామా 1 14 15

ఈ వర్ణన వలన అభీష్టిత ఫలప్రాప్తి పవిత్రమేఘోత్పత్తి ద్వారా సకాలవృష్టి, వాతావరణకాలుష్య నివారణము, అన్నోదక సమృద్ధి, నిఖిల భూతతృప్తి, విద్వత్సమాగమము, సత్సాంగత్యము, సద్గోష్ఠులు, కళా కోవిదుల కాదరణ ఇత్యాది ప్రయోజనములు సిద్ధించు నని తెలియు చున్నది

29)

# ఆలయములు ప్రయోజనములు

యజ్ఞములలో నాలుగు వేదములకు స్థానము కలదు ఆలయము లలో నాలుగు గోపురములు నాలుగు వేదములుగ సాక్షాత్కరించుచు ప్రేక్షకులకు వేదాధ్యయనఫలము ననుగ్రహించుచుండును గవాం పురం గోపురమ్ గవాం వేదవచసాం పురమ్" వేదవాఙ్మలయములు అత్యున్నతమైన ఈ గోపురములు అత్యున్నత వేదాద్రిశిఖర స్వరూపము లుగా భావన చేయవలయు నని శాస్త్రజ్ఞుల తాత్పర్యము పామరులకును, అశక్తులకును సయితము ఈ గోపురదర్శనము తరణసాధకము కాగల దని గోపురశిల్పతాత్పర్యము అట్లే ఆలయఘంటానినాదములు దేవాలయ ములకు రాజాలనివారిని గూడ తరింపజేయును ఇంతేగాదు, ఆలయముల లోని పవిత్ర ఘంటానాదములు, శంఖారావములు, మంగళవాద్యధ్వనులు రమణీయ భగవత్సంకీర్తనాదులు, వేదమంత్రపారాయణములు, మృదంగ ధ్వనులు, వీణానినాదములు ఇవి యన్నియు మంగళకరములు, వాతా వరణ కాలుష్యనివారకములు, మనఃప్రసాదకారకము లని ఆగమశాస్త్ర తాత్పర్యము

ఆలయ మండపాదులు యాత్రికులకును, బీద జనులకును ఆశ్రయస్థానములు సాధకుల ఏకాగ్రనిష్ఠకు దోహదస్థానములు భిన్న భిన్న వృత్తిప్రవృత్తులు ఆచారములు గల పౌరజానపదులందరకు ఏకైక లక్ష్యస్థానములు విశ్రాంతిస్థానములు దేవాలయములు అనగా అందరిని ఏకత్ర సంఘటిలఁజేచి సౌహార్దభావమును ఎంపొందించు సాంస్కృతిక కేంద్రములు దేవాలయములు సకల కళానిలయములై వివిధ శిల్పములకు, కళలకు, ప్రోత్సాహ మిచ్చు మహాసంస్థలు పండిత

పామర పోషకములు సర్వజనహృదయరంజకములు, వేదచోదితధర్మము లను వివిధశిల్పకళావ్యాజమున ఉపదేశించు నోజ్జలు. అందఱు నియమ నిష్ఠలు పాటించి కష్టించి యాగములు జేయలేరు అట్టివారికి ఆలయమున భగవద్దర్శనమే శరణ్యము యజ్ఞములం దారాధింపబడు దివ్యజ్యోతియే ఆలయములందు దేవతామూర్తిరూపమున దర్శన మిచ్చును భగవత్సన్ని ధానమున జేరుటకు విగ్రహారాధన సులభమైన మార్గము అందుకనియే మహర్షులు యజ్ఞములను ఆలయములను రెంటిని సమానముగా ఆదరించు దని ఉపదేశించిరి తామాచరించిరి, ఇతరులచే నాచరింపజేసిరి, ఆ యుపదేశమునే వేదాక్షరార్థరూపమైన రామాయణ మహాకావ్యము కాంతా సంమితముగా నుపదేశించినది ఇట్టి యుపదేశమున కనుగుణముగనే వేద వారు సయితము, యజ్ఞములకు ప్రతిరూపముగా దీపారాధనజేసి యజ్ఞ దేవుడైన అగ్నిదేవత నుపాసింతురు మరియు, వివిధ దేవతామూర్తుల విగ్రహములతో, పటములతో, తమ గృహాములనే దేవాలయములుగా జేసికొని, దేవాలయములందు వలె భగవదారాధన యథాశక్తి సలుపుకొను చుందురు.

ప్రజలు ఒకవేళ ఏమరుపాటుతో నున్నను, ప్రభువులు జాగ రూకులై ఉభయవిధారాధనములు తాము సలుపుచు ప్రజల కాదర్శ ప్రాయులై నిలువవలె నని రామాయణ ముపదేశించినది, కనుకనే, భరతుడు చిత్రకూటమునకు వచ్చినపుడు కుశలప్రశ్నానంతరము భరతుడు రాజ్యము నడుపుతున్న విధము గురించి ప్రశ్నించుచు రామచంద్రుడు నీవు చేయవలసిన అగ్న్యుపాసనాది కార్యములు, దేవాలయారాధనలు సక్రమముగా యథావిధిగా జరుగుచున్నవా? అని యడుగును

"కచ్చి దగ్నిషు తే యుక్తో విధిజ్ఞో మతిమా నృజుః ।
హుతం చ హోష్యమాణం చ కాలే వేదయతే సదా"

రామా 2 100 12

"కచ్చి చ్చిత్యశతై ర్వ్యక్తైః సునివిష్టజనాకులః ।
దేవస్థానైః ప్రపాభిశ్చ తటాకై రుపశోభితః"

2 100 43

"చిత్యశతైః చైత్యశతై రితి చపాఠః ఉభయత్రాపి అశ్వమేధ ంతమహాయజ్ఞచయన ప్రదేశసమూహై రిత్యర్థః సునివిష్టజనాకులః సుప్రతిష్ఠిత జనవ్యాప్తః సుప్రతిష్ఠితత్వం చ రాజన్యత్వ సువృష్ట్యారోగ్యాది దేశగుణాకృష్ట చిత్తతయా దేశాంతర జిగమిషారాహిత్యేన తత్రైవాసక్తత్వం"

"దేవస్థానైః దేవాలయైః ప్రపాభిః పానీయశాలాభిః ఇత్యాది"

గోవిందరాజీయవ్యాఖ్య

అయోధ్యయందు గల అశ్వమేధచయనాది మహాక్రతువుల నొనర్చిన యజ్ఞవాటములు పవిత్రములై సజ్జనసేవ్యములై సురక్షితములుగా నున్నవా ? యజ్ఞాది క్రతువుల వలన దేశము సుభిక్షమై యుండుటచేత ఇది సుఖవాసయోగ్య మగుచు అన్యత్ర గమనాకాంక్ష లేక, ప్రజలచటనే ఉండదలచుచున్నారా ? దేవాలయములు భద్రములుగా సురక్షితముగా నున్నవా ?

శ్రీరాముని ఈ ప్రశ్నల వలన ఆదర్శప్రాయుడై నెరవేర్చవలసిన ప్రధాన కృత్యములలో యజ్ఞవాటసంరక్షణము ఆలయ పరిరక్షణము ముఖ్యము లని గుర్తింపజేయబడుచున్నవి

"మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః"

"దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతనః"

# 11. రామాయణము - అశ్వమేధము

అయోధ్యాధిపతి యగు దశరథమహారాజునకు చాలాకాలం వరకు సంతతి కలుగలేదు

"తస్యత్వేవం ప్రభావస్య ధర్మజ్ఞస్య మహాత్మనః ।
సుతార్థం తప్యమానస్య నాసీద్వంశ కరస్సుతః॥
చింత యానస్య త స్యైవం బుద్ధిరాసీ న్మహాత్మనః ।
సుతార్థం హయ మేధేన కి మర్థం న యజామ్యహమ్"

రామా బాల 8 2

వంశకరుడైన పుత్రుడు లేనందున అశ్వమేధయాగము చేయ వలయు నని మహారాజునకు సంకల్పము కలుగును వెంటనే వశిష్ఠాదులతో ధర్మార్థసహితమైన తనకోరిక నిట్లు వెల్లడించును

"మమలాలప్య మానస్య సుతార్థం నాస్తివై సుఖమ్ ।
తదర్థం హయమేధే న యక్ష్యామీతి మతిర్మమ॥
తదహం యష్టు మిచ్ఛామి శాస్త్రదృష్టే న కర్మణా ।
కథం ప్రాప్స్యామ్య హం కామం బుద్ధిరత్ర విధీయతామ్"

దశరథుడు యథాక్రమము (శాస్త్రదృష్టేన కర్మణా) సత్సంతానాప్తికి అశ్వమేధయాగమును చేయదలచితి నని చెప్పును వేదవిహిత

ధర్మానుష్ఠానమునకు శాస్త్రసమ్మతి, గురువనుగ్రహము, అమాత్యాదుల సహకార సంపద అవశ్యకము శాస్త్రసమ్మతి లేక చేయు ధర్మానుష్ఠాన మధర్మరూపమై, అవైదికమై అనర్థదాయకమగుచున్నది కనుకనే, ధర్మ విషయకముగ వారలతో దశరథుడు సంప్రదించెను దశరథు డింతకు పూర్వము వంశపారంపర్యము ననుసరించి ఎన్నో యజ్ఞములు చేసి యున్నాడు

తస్యాం పుర్యా మయో ధ్యాయాం వేదవిత్సర్వ సంగ్రహః,
దీర్ఘదర్శీ మహాతేజాః పౌర జానపద ప్రియః ॥
ఇక్ష్వాకూణా మతి రథో యజ్వా ధర్మరతో వశీ ।
మహర్షి కల్పో రాజర్షిః త్రిషు లోకేషు విశ్రుతః"
బాలకాండ 6 2

దశరధుడు వేదవిదుడు దీర్ఘదర్శి ధర్మరతుడు మహర్షికల్పుడు పౌరజానపద ప్రియుడు యజ్వ ఈ వర్ణనను బట్టి దశరధుడు ఇంతకు పూర్వమే యజ్వ యైనట్లు తెలియుచున్నది

దశరధుడు దీర్ఘదర్శి యగుట వలన ఏ పని చేయవలసివచ్చినను యుక్తాయుక్తి విచారణ జేయును ధర్మనిరతుడు గాన కర్మానుష్ఠాన విషయమున స్వతంత్రించడు తానెంత చక్రవర్తియైనను గురువినీతుడు, కనుకనే పౌరజానపద ప్రియుడై రాజర్షి కల్పుడని పేరుగాంచినాడు ప్రకృతమున గూడ అశ్వమేధమును "శాస్త్రదృష్టేన కర్మణా" చేయదలిచెను కావ శాస్త్ర నిష్ణాతులైన పెద్దల ఆశీస్సులను కోరెను

అశ్వమేధ యాగమును చేయుటకు కొన్ని ప్రత్యేకార్హతలను శాస్త్రము నిర్దేశించినది

అశ్వమేధమును చేయదలచినవాడు క్షత్రియుడై రాష్ట్రపతియై యుండవలెను అతడును తన కడ్డమువచ్చిన వారిని జయించి అశ్వమును రక్షింప సమర్థుడై యుండవలెను

"క్షత్రియ యజ్ఞ ఉవా ఏష య దశ్వమేధః"

శ, బ్రాహ్మణ 13 4 1 2

అశ్వమేధము క్షత్రియ యజ్ఞమని ఈ శ్రుతి యుపదేశించుచున్నది

"రాజ యజ్ఞోఽశ్వమేధః సర్వకామః"

కాత్యాయన శ్రౌత సూత్రము

అశ్వమేధము రాజ యజ్ఞమని సర్వకామప్రద మని పై సూత్రార్థము పై శతపథ శ్రుతి ననుసరించి రాజయజ్ఞపదము నకు "రాజ్ఞః యజ్ఞః" "రాజ యజ్ఞః" అని షష్ఠితత్పురుష సమాసమునే చెప్పవలయు నని "రాజాచాసౌ పురుషశ్చ రాజపురుషః" అనునట్లు కర్మధారయ సమాసము నాశ్రయించ గూడదని తెలియుచున్నది అనద ఇచట రాజపదము శ్రేష్ఠవాచకము కాదనియు రాజపదము క్షత్రియార్థక మనియు కనుక రాజయజ్ఞ మన రాజుయొక్క యజ్ఞ మని తెలియుచున్నది

"రాజశబ్దః అభిషేకవతి క్షత్రియే వర్తతే ఇత్యుక్తం ప్రదేశాంతరే। తథా చ క్షత్రియ ఉవా ఏష య దశ్వమేధః తస్మాద్రాష్ట్రే అశ్వమేధేన యజేత ఇతి రాజ్ఞో యజ్ఞః రాజయజ్ఞః న బ్రాహ్మణ వైశ్యయోః" ఇతశ్యత్రకర్కః

"రాజా సార్వభౌమః అశ్వమేధేన యజేత నాప్యసార్వభౌమః" అను ఆపస్తంబవచనము ఆ రాజు సార్వభౌముడై యుండవలె నని సార్వభౌముడు కాని క్షత్రియుడు కూడ ఆ యజ్ఞము చేయగూడ దని తెలియజేయుచున్నది

ఈ అశ్వమేధ మనేకనామములతో నున్నట్లు తైత్తిరీయబ్రాహ్మణ శ్రుతి వర్ణించుచున్నది

"ఏషః వై విభూ ర్నామ యజ్ఞః
ఏషః వై ప్రభూ ర్నామ యజ్ఞః
ఏషః వా ఊర్జస్వా న్నామ యజ్ఞః
ఏషః వై పయస్వా న్నామ యజ్ఞః
ఏషః వై విధృతో నామ యజ్ఞః
ఏషః వై వ్యావృతో నామ యజ్ఞః
ఏషః వై ప్రతిష్ఠితో నామ యజ్ఞః
ఏషః వై తేజస్వీ నామ యజ్ఞః
ఏషః వై బ్రహ్మవర్చస్వీ నామ యజ్ఞః
ఏషః వా అతివ్యాధీ నామ యజ్ఞః
ఏషః వై దీర్ఘో నామ యజ్ఞః
ఏషః వై కౢప్తో నామ యజ్ఞః"

తై బ్రా. 3 9 19

30)

ఆ విధముగా అశ్వమేధము 12 విధములుగా 12 నామములతో వెలయుచున్నది ఒక్కొక్క ఫలమును గోరి ఒక్కొక్క అశ్వమేధమును కొన్ని మార్పులతో ఆరాధకు లాచరించుచున్నారు ఈ 12 యజ్ఞములు శతపథబ్రాహ్మణమున (13 3 8 1 నుండి 12) ప్రభూః విభూః వ్యష్టిః విధృతిః వ్యావృతిః ఊర్జస్వాన్ పయస్వాన్ బ్రహ్మవర్చసీ అతివ్యాధీ దీర్ఘ కౢప్తి ప్రతిష్ఠా " అను నామములతొ వెలయుచున్నవి

అశ్వః మేధ్యతే హింస్యతే యత్ర అశ్వమేధః

అశ్వమేథము నందు అశ్వము యజ్ఞపశు వగుచున్నది కనుక ఆ యజ్ఞము అశ్వమేధ మగుచున్నది

క్షత్రియులు జేయు యజ్ఞము నందె అశ్వము పశువుగా గ్రహింపబడుచున్నది ఆ అశ్వము గూడ శాస్త్రోక్త లక్షణలక్షితమై యుండవలెను

"కాలాంభోధర సంకాశః సర్వవర్ణముఖో బలీ।
యస్య పార్శ్వే పుభా వర్ధచంద్రాకారౌ సుశోభనౌ ॥
పుచ్ఛం విద్యుత్ప్రతీకాశ ముదరం కుందసన్నిభమ్ ।
పాదా శ్చైవ హరిద్వర్ణాః కర్ణా సిందూరసన్నిభౌ ॥
జ్వలదగ్నినిభా జిహ్వా చక్షుషీ భాస్కరోపమే ।
విరాజితో రోమరాజ్యా సానులోమవిలోమయా ॥
విచిత్రై ర్వివిధై ర్వర్ణైః చిత్రో రాజతబిందుభిః ।
యో వేగే వాయుతుల్య స్స్యా దుచ్చై రుచ్చైశ్శ్రవా యథా ॥

యస్య గాత్రోద్భవో గంధో గంధర్వ మం మోహయేత్।
ఏవం లక్షణసంపన్నో యజ్ఞీయః పశు రుచ్యతే”

వాశిష్ఠరామాయణమ్

ఇట్టి సర్వమంగళ లక్షణాంచితమైన అశ్వమును మంత్రములతో ప్రోక్షించి ఫాలమున జయపట్టికను కట్టి స్వేచ్ఛగా సంవత్సరకాలము తిరిగి వచ్చుటకు వదలెదరు తద్రక్షణకై వెంట సేన పంపబడును మార్గమధ్యమున ప్రాయశ్చిత్తాదులు సలుపుటకు ఋత్విగ్గణము వెంటనంటి యుండును ఇట్లు తిరిగి వచ్చు అశ్వమును సంవత్సరాంతమున వినియోగించుచున్నారు ఇట్లు అశ్వము వినియోగింపబడుచున్నది గాన ఈ యజ్ఞము అశ్వమేధము ఈ యజ్ఞము నందు అశ్వరక్షణ చాల ప్రధానమై అనితరసాధ్యమై వెలయుచున్నది

ఆ అశ్వము పరాధీనమైనపుడు సార్వభౌము డైనను అశ్వమేధాధికారమును కోల్పోవుచున్నాడు ఈ విషయము నీ క్రింది శతపథశ్రుతి తెలియజేయుచున్నది

“గోవినతేన శతానీకః సాత్రాజిత ఈజే కాశ్యపస్యాశ్వ మాదాయ

శ బ్రా 13 5 4 19

“గోవినతో నామ వక్ష్యమ ణ స్తోమవిశేషః అశ్వమేధః తేన శతానీకో నామ సత్రాజితః అపత్యం ఈజే, కాశే ంపత్యం కాశ్యః ంశ్యస్య స్వభూతం తేనాశ్వమేధార్థం కల్పిత మశ్వ మాదాయ యుద్ధే విజిత్య తత ః ప్రభృ త తద్యాపి కాశయః కాశీవాసా రాజానః అగ్ని న్నాదధతే

కిమ్ అత్తః అపహృతః సోమపీథః యేషాం తే అత్తసోమపీథాః అత్త సోమాః స్మః భవామః కి మస్మాక మగ్నిభిః యే అశ్వమేధ ఏవ పంతః సోమపీథాధ్యాః తస్మి న్నపహృతే సర్వ ఏవ సోమపీథో పహృతః ఇత్యభిప్రాయః"

హరిస్వామిభాష్య

సత్రాజి న్మహారాజపుత్రుడు శతానీకమహారాజు "గోవినత మ"ను పేరు గల అశ్వమేధయాగము చేసెను (అశ్వమేధము ఇంకను వివిధ నామములతో వెలయుచున్నట్లు ఈ శ్రుతివలననే తెలియుచున్నది ఇంకను అశ్వమేధ మిట్లెన్ని రూపముల నున్నదో తెలియవలెను) కాశీ మహారాజు అశ్వమేధయాగమును జేయ సంకల్పించి అశ్వమును వద లును శతానీకుడు కాశీమహారాజును జయించి అతని అశ్వమును స్వాధీ నము జేసికొని ఆ అశ్వముతోనే అశ్వమేధమును జేయును యజ్ఞీయాశ్వ మపహరింపబడినది గానకాశీరాజులు ఆనాటినుండి ఈనాటివరకు అగ్న్యాధానము గావింపరు (తత శ్చాంభ్య త తద్యాపి కాశ్యః కాశీరాజానః అగ్నీ న్నాదధతే)

అశ్వమేధము వివిధ నామములతో వెలయుచు వివిధఫలముల నొసగుచున్నది అందులో నుతార్ధ మాచరింపబడు అశ్వమేధ మొకటి నుతార్థము దశరథమహారాజు చేయదలచిన దీ యశ్వమేధమునే

దశరథుడు యౌవనములో నున్నపుడు వేటకై అడవికి పోయి అచట తెలియక బ్రహ్మవాదియైన ఋషికుమారుని సంహరించెను అప్పటి నుండి తాను బ్రహ్మహత్యా సదృశ పాతకదూషితుడ నని దశరథునకు దృఢభావ మేర్పడినది ఋషికుమారుడు, అతని తండ్రియు నీకు బ్రహ్మ

హత్యాదోషము లేదని ఎంత చెప్పినను తన కింతవరకు సంతానము కలుగ కుండుటకు బ్రహ్మహత్యాదోషమే ప్రతిబంధక మని అతని దృఢ విశ్వాసము అశ్వమేధము సకలవిధ దోషములకు ప్రాయశ్చిత్తరూపము

"అశ్వమేధేన శుధ్యంతి మహాపాతకిన స్త్విమే ।
అనుపాతకిన స్త్వేతే మహాపాతకినో యథా ॥
అశ్వమేధేన శుధ్యంతి తీర్థానుసరణేన వా"

ఇత్యాది సూక్తులు (శబ్దకల్పద్రుమ) అశ్వమేధము మహాపాతక నివారక మని తెలియజేయుచున్నవి

అశ్వమేధము బ్రహ్మహత్యా మహాదోష నివారక మని శ్రుతియే జెప్పుచున్నది

"ఏతాం హ వై ముండిభ ఔదన్యః బ్రహ్మహత్యాయై ప్రాయశ్చిత్తిం విదాంచకార య ద్బ్రహ్మహత్యాయాః ఆహుతిం జుహోతి మృత్యు మేవాహుత్యా తర్పయిత్వా"

"ముండిభో నామ ఉదయన స్యాపత్యం ఔదన్యః స ఏతా
మేవాహుతిం అశ్వమేధాంతర్గతాం బ్రహ్మహత్యాయాః
ఆహుతిం జుహోతి తత్ మృత్యుమేవ తర్పయిత్వా పరిశిష్టం
పానం తం మృత్యవే కృత్వా బ్రాహ్మణం హుతవతే భేషజం
చికిత్సాం కరోతి తస్మా ద్యస్య రాజ్ఞః అశ్వమేధ ఏషా
ఆహుతిః హూయతే తస్య ప్రజాయాం రాష్ట్రేఽయోపి అపరీషు

అపక్రాంతాసు అతీతాసు సమాసు బ్రాహ్మణం హంతి
అస్మై అం చిరకృతపాపస్య భేషజం చికిత్సాం కరోతి"
శ బ్రా 13 5 4

ఉదయనమ రాజు కుమారుడు ఔదన్యుడు ముండిభు డని అతని నామము అతడు అశ్వమేథాంతర్గత మైన అహుతిని బ్రహ్మహత్యానివారకి మైన దానినిగా దర్శించెను ఆ అహుతిని జేసి ముండిభుడు తన బ్రహ్మహత్యా దోషమునకు చికిత్స జేసికొనెను కనుక అశ్వమేథ మొనర్చి ఎవ రా అహుతిని జెయుచున్నారో వారు పాపవిముక్తు లగుచున్నారు

శ్రుతి యందలి ముండిభ వృత్తాంతము వలన అశ్వమేథము బ్రహ్మహత్యా నివారకమనియు, అశ్వమేథము నందు జేయబడెడు ప్రధానాహుతికి బ్రహ్మహత్యానివారక సామర్థ్య మున్నదనియు తెలియుచున్నది మఱియు "తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే" ఇత్యాది శ్రుతుల అశ్వమేథము బ్రహ్మహత్యా నివారక మని కంఠోక్తిగ చెప్పుచున్నందున అశ్వమేథము చేయువలె ననెడు దృఢసంకల్పము దశరథున కేర్పడెను కనుకనే అతడు వశిష్ఠాదులతో సంప్రదించెను అశ్వమేధము చేయుటకు దశరథున కన్ని విధము లైన అర్హత లున్నందున దశరథుని కోరికను వశిష్ఠాదు లంగీకరించిరి గురువుల ఆజ్ఞ ననుసరించి యథాక్రమముగ శాస్త్రీయముగ యజ్ఞమును జరిపించుమని దశరథుడు వశిష్ఠాదులను ప్రార్థించెను సరయూనది ఉత్తరతీరములో యజ్ఞశాల నిర్మింపబడినది యజ్ఞకార్యముల యందు ప్రవర్తిల్లిన శిల్పులకు కార్మికులకు యథోచితముగ సన్మానము జరుగవలె నని వశిష్ఠు డిట్లు ఆదేశించెను

"తతః శ్రేష్ఠః మునిశ్రేష్ఠః తాన్ సర్వాన్ మునిరబ్రవీత్ ।
అవజ్ఞయా న దాతవ్యం కస్యచి ల్లీలయాపి వా ॥
అవజ్ఞయా కృతం హన్యాత్ దాతారం నాత్ర సంశయః"

"యజ్ఞకర్మ యందు ప్రవర్తించిన వారందరకు శ్రద్ధాసక్తులతో, ఆదరముతో సన్మానము జరుగవలెను అనాదరముతోను ధన అధికార గర్వముతోను సన్మానము చేయరాదు

వశిష్ఠాదేశానుసారము యజ్ఞము జరుగును యథాశాస్త్రముగ మంత్రపురస్సరముగ జేయబడు ఆ యజ్ఞము లోకకల్యాణకారకమై పిరా జిల్లెను యజ్ఞమున అన్నదాన మత్యంత ప్రధానమై పీరు వారను భేదము లేక అందరిని తృప్తి జెందించెను శామిత్రదినమున (హయము నర్పించు దినమున) కౌసల్య హయమును సేవించెను ధర్మకామనతో కౌసల్య కైకేయీ సుమిత్రల తోపాటు అశ్వసన్నిధానమునం దుండెను తరువాత వపాహోమము జరిగినది యజ్ఞమునం దీ హోమము చాలా ప్రధానమైనది బ్రహ్మహత్యాది మహాపాతక నివారణ సమర్థమైన దీ హోమము ఉదయనమహారాజు కుమారుడైన ముండిభుడు దర్శించిన దీ హోమమునే అన్ని సోమయాగము లందును వపాహోమ ముండును. కాని అశ్వమేధము నందలి ఈ వపాహోమము వలన కలుగు ప్రయోజన మనన్యసాధ్యము

"ధూమగంధం వపాయా స్తు జిఘ్రతి స్మ నరాధిపః ।
యథాకాలం యథాన్యాయం నిర్ణుద న్పాప మాత్మనః"

వపను హోమము జేసినపుడు బయలుదేరిన ధూమము యొక్క గంధమును దశరథుడు శాస్త్రోక్తమార్గమున యథాకాలమున శ్రద్ధతో

ఆఘ్రాణించె నట ఈ గంధము యజమానిని సంస్కరించుచు నాత్మ దేహము నంటియున్న మహాపాతకముల పారద్రోలుచున్నది (నిర్ణుదన్ పాప మాత్మనః)

కల్పసూత్రము ననుసరించి అశ్వమేధము మూడు దినములు చేయబడును ప్రథమ దినమునం దగ్నిష్టోమము, రెండవరోజున ఉక్థ్యము, మూడవరోజున అతిరాత్రము అను సవనత్రయ మాచరింపబడును అగ్నిష్టోమాయుష్టోమములు అతిరాత్రద్వయము అభిజిద్విశ్వజిద్యాగములు అప్తోర్యామద్వయము ఆచరించవలెను ఇంతేగాక ఇంకను ఎన్నో క్రతువు లాచరించబడును ఇట్లనేక క్రతువు లాచరింప బడును గాన అశ్వమేథము మహాక్రతు వగుచున్నది కనుకనే

"వృషభ ఏష యజ్ఞానాం య దశ్వమేథః తై బ్రా 3 8 3 3

"రాజా వా ఏష యజ్ఞానాం య దశ్వమేథః"

శ బ్రా 13 2 2 1

అని శ్రుతి వర్ణించినది

"త్ర్యహోఽశ్వమేథః సంఖ్యాతః కల్పసూత్రేణ బ్రాహ్మణైః।

చతుష్టోమ మహ స్తస్య ప్రథమం పరికీర్తితమ్"

ఉక్థ్యం ద్వితీయం సంఖ్యాతం అతిరాత్రం తథోత్తరమ్ ।

కారితా స్తత్ర బహవో విహితాః శాస్త్రదర్శనాత్ ॥

అతిష్టోమాయుషీ చైవ మతిరాత్రౌ చ నిర్మితౌ ।

అభిజి ద్విశ్వజి చ్చైవ మాప్తో ర్యామో మహాక్రతుః ॥

దశరథు డిట్లు అశ్వమేధమును పూర్తి జేసి మహాపాతక రూప ప్రతిబంధమును తొలగించుకొని పుత్రకామేష్టి జేసి కృతార్థుడైనాడు

రామాయణారంభమున అశ్వమేధ వృత్తాంతము విపులముగా వర్ణింపబడినది అశ్వమేధ స్వరూపము రామాయణమున అంత వివరముగ వర్ణింపబడకపోయినను కథాగమనమునకు భంగములేదు అశ్వమేధము ఒకానొక మహాబల పరాక్రమ సంపన్నుడైన సార్వభౌమునకు మాత్రమే సంబంధించిన క్రతువని శ్రుతి వర్ణించుచున్నప్పుడు సామాన్యుల కా క్రతువుతో సంబంధ ముండదు గదా ! అట్టి సందర్భమున మహాకవి రామాయణమున అంత విపులముగ అశ్వమేధమును వర్ణించుట లోని యుద్దేశ్య మేమై యుండునో తెలియనగును

వేదోపదిష్టమైన యజ్ఞమహత్వమునుపదేశించుటకై మహర్షి అశ్వమేధమును కన్నుల గట్టి చూపించుచున్నట్లు వర్ణించెను అనేక మహా క్రతువుల సమూహమే ఈ యశ్వమేధము విశ్వజిదాది యాగములు దీని యందంతర్భూతము లగుచున్నవి

యజ్ఞము ఇహ లోకమున భూతగణమును పరలోకమున దేవతలను తృప్తి నొందించు మహామహామాత్మక దేవశిల్పము కవి గాయక పండిత వాస్తుశిల్పి గణకాదులు తమ తమ విద్యావైభవమును ప్రదర్శించుటకు పెంపొందించుటకు యజ్ఞము ప్రధానావలంబనము అవగా సకలకళా విద్యావినోదములకు పవిత్ర యజ్ఞభూమి ప్రధానకేంద్రము "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అను శ్రుతి ననుసరించి సకలజీవకోటికి జీవనాధారమైన అన్నమునకు దేశమున దారిద్ర్యము రానీయకుండ చేయ

గల్గిన దివ్యశక్తి యజ్ఞము సాధారణ యజ్ఞమునకే యింత సామర్థ్య మున్నప్పుడు బహుయాగ కూటమైన అశ్వమేధమున కెంత శక్తి యుండునో దానియం దెంతమంది ఎన్ని విధముల తృప్తి జెందగలరో యూహింపవచ్చును ఇన్ని యాగములు వరుసగా నార్వభౌముని అధి పత్యమున అవిచ్ఛిన్నముగ జరుగుచున్నప్పుడు, అహోరాత్రములు జాజ్వల్యమానదీప్తితో వివిధ విస్ఫులతో యజ్ఞపురుషుడు వెలుగొందు చున్నప్పుడు ఆ దివ్యజ్యోతిఃప్రభావము దేశమంతట వ్యాపించుచున్న ప్పుడు యజ్ఞహవిర్ధూమ మాకాశము నాచ్ఛాదించుచు ద్యులోకమున కెగ ప్రాకి సూర్యమండలమును ప్రాకుచున్నపుడు కలుగు కళ్యాణసంపద ఊహించుటకు శక్యము కానిదై యుండును ఆ అశ్వమేధము ఒక్క దశరథుని పాతకములనే గాక అ యజ్ఞమును దర్శించు వారి యొక్కయు, తద్రాజ్యమున వసించు ప్రజలయొక్కయు పాపపంకిలమును కడిగి వేయును

యజ్ఞము ఎన్ని దినములు జరిగినను అందు ప్రధానదిన ముండును దానికి సుత్యాదిన మని వ్యవహారము "సున్వంత్యస్యాం సోమలతా మితి" సుత్యా ॥ సోమలతను దంచుదిన" మని అర్థము "సుత్యాభిషవ సవహవం చ సా" అని అమరము సోమయాగములందు సోమమునకు ప్రాధాన్యము సోమరసమును దంచి హోమము చేయు దినము ప్రధా నము అట్లే అశ్వమేధమున మూడురోజులు ప్రధానమైనవి (త్ర్యహోఽ శ్వమేధః) అందును వపాహోమ మత్యంత ప్రధానమైనది "మేద స్తు వపా వసా'' అని అమరము 'మేదః వపా వసా" అని ఈ మూడును సమానార్థకములని అమరము కాని అవాంతర భేదము లున్నవి

"మేదో వా సర్వభూతానాం హృదయేఽస్థిషు చ స్థితమ్ ।
నాభిః సమీపదేశే తు శరీరాంతరవర్తినీ ॥
వాస్తమాత్రా సటీరూపా వసాం తాం పరిచక్షతే ।
శుద్ధమాంసస్య యః స్నేహః సా వసా పరికీర్తితా ॥

అస్థుల యందుండు మెదడు మేదస్సు వస యనగా నాభిక్రింద గుడ్డవలె నుండు మాంసపు పొర వస యనగా. అన్ని మాంసములలో శ్రేష్ఠమైన క్రొవ్వు నాభిక్రింద గుడ్డ వలె నుండు మాంసపుపొరను (వపను) మంత్రపూతముగ హోమము జేయు నపుడు వచ్చు అగ్నిదీప్త నేత్రేంద్రియమును, ధూమము ఘ్రాణేంద్రియమును శుద్ధి జేయును యజ్ఞము నందు పూర్ణాహుతివలె వపాహోమ మత్యంత ప్రధానము ఆ వపాగంధమనంతశక్తి సంభరితము సామాన్యపశువులవపాగంధముకన్న అశ్వము యొక్క వపాగంధము సకలదోషహరము మహాపాతక నాశకము. కనుకనే, దశరథుడు ప్రత్యేకశ్రద్ధతో భక్తితో లక్ష్యముతో వపాగంధము నాఘ్రాణించెను

"ధూమగంధం వపాయాస్తు జిఘ్రతి స్మ నరాధిపః"

ఈ విధముగ అశ్వమేధము ద్వారా యజ్ఞవైభవమును తత్రాపి అశ్వమేధము నందలి అశ్వప్రాధాన్యమును గుర్తింపజేయుటకే రామాయణమున అశ్వమేధ మంత విస్తారముగ వర్ణింపబడినది రాజ్యమును పాలించు సార్వభౌము లెంత ధార్మికులైనను వైదికధర్మానుష్ఠానతత్పరులైనను తెలిసియో తెలియకయో ఎ కొన్ని తప్పిదములు చేయుదు రనుటకు దశరథశాప వృత్తాంతము నిదర్శనము అట్టి మహాపాపములను పోగొట్టు శక్తి ఒక్క అశ్వమేధమునకే కలదను వేదతాత్పర్యమును రామాయణ ముపదేశించుచున్నది

అయితే అందరు సార్వభౌములు కానేరరు రాజ్యపాలనలో బ్రహ్మహత్యాది మహాపాతకములు చేయవచ్చును రాజ్యాకాంక్షులు కాని వారును పాపపంక దూషితు లగుచుందురు వారి కశ్వమేధాధికారము లేదు ఉన్నను అంతటి మహాయాగము చెయలేరు

"దీర్ఘకాలం బ్రహ్మచర్యం నరమేధాశ్వమేధకౌ ।
మహాప్రస్థానగమనం గోమేధం చ తథా మఖమ్ ॥
ఇమాన్ ధర్మాన్ కలియుగే పర్జ్యా నాహు ర్మనీషిణః"

అను యుక్తి ననుసరించి అశ్వమేధము కలియుగమునందు నిషిదము కనుక మహాపాతక నివర్తికొపాయ మెట్లను సందేహము కలుగుట ధర్మము

అశ్వమేధక్రతువు నాచరించుట కవకాశము లేని వారి విషయమున శ్రుతి అనుగ్రహబుద్ధిగా చెప్పిన మార్గమును శ్రీ శంకరులు "ఉషా వా అశ్వస్య మెధ్యస్య శిరః" అను బృహదారణ్యక శ్రుతిని వ్యాఖ్యానించుచు తెలియ జేసిరి

"అస్య తు అశ్వమెధసంబంధినః విజ్ఞానస్య
ప్రయోజనం యేషా మశ్వమేధే నాధికారః తేషా
మస్మా దెవ విజ్ఞానాత్ తత్ఫలప్రాప్తిః విద్యయా
కర్మణా వా తద్ధైత ల్లోకజి దేవ"

ఇత్యేవ మాదిభ్యః శ్రుతిభ్యః కర్మవిషయత్వ మేవ విజ్ఞానస్యేతి చేన్న "యోఽశ్వమేధేన యజతే య ఉ చైన మేవం వేద" ఇతి వికల్పి

శ్రుతేః విద్యాప్రకరణే చామ్నానాత కిర్మాంతరే చ సంపాదన దర్శనాత్
విజ్ఞానా త్తత్ఫలప్రాప్తి ర స్తీతి గమ్యతే

శంకరభాష్య శ బ్రా 10 6 4 1

"అశ్వమేధయాగాధికారము లేనివారికి యాగస్వరూప తత్త్వవిజ్ఞానము ఎలన ఫలప్రాప్తి కలుగును సాక్షాత్తు యజ్ఞము చేయు క్షత్రియ సార్వభౌములకే అశ్వమేధఫలప్రాప్తియన వీలులేదు "య ఏవం వేద" అని అనుచు యాగస్వరూపమును తత్త్వతః భావన జేయువారు అశ్వమేధఫలమును బొందుచున్నారు అశ్వమేధస్వరూప భావన ప్రధానము"

"జ్ఞాత్వా కర్మాణి కుర్వీత" అను సంప్రదాయాదేశానుసారము కర్మస్వరూపమును భావన జేసి తత్త్వమును దర్శించి నపుడే కృతార్థత సార్వభౌములు అశ్వమేధమును జేసినను అశ్వస్వరూపభావన జేసినపుడే చారితార్థ్య ముండును కనుక వీరు వారను భేదము లేక అందఱు అశ్వమేధమునందలి అశ్వస్వరూపమును తత్త్వతః దర్శించుట యావశ్యకము "య ఏవం వేద" అని అడుగడుగున చెప్పుటలో తాత్పర్య మిదియే

## అశ్వమేధము నామసార్థకత

"అశ్వః మేధ్యతేయత్ర అశ్వమేధః" అని స్థూలముగ అశ్వమేధ శబ్దవ్యుత్పత్తి యాగము నందు అశ్వము పశువుగ బంధింపబడుచున్నది గాన "అశ్వమేధ" మను వ్యవహార మేర్పడినట్లు సాధారణముగ చెప్పబడును, కాని "అశ్వ శ్చాసౌ మేధశ్చ" అను వ్యుత్పత్తి ననుసరించి యజ్ఞసాధన భూతమైన అశ్వమే అశ్వమేధముగా వర్ణింపబడుచున్నది

"రాదా ఎ ఎష యజ్ఞా ం యదశ్వమేధః" అను శ్రుతి ననుసరించి పశువు లలో రాజస్థ న మలంకరించు అశ్వముతో చేయబడు యాగము అశ్వమేధ మని ఒర్థము

"రాజా వా ఎషః రాజె⁻రాజా అనుచరింభూతానాం తూ ఎరాదీనా మగ్రే ఏష యజ్ఞా ం య్ఞ సాధ౽౽ం పశూ ం యదశ్వమేధః ఒశ్వ శ్చా సౌ మేధశ్చ యజ్ఞ సాధన మశ్వమేధః ఒశ్వః పశూనాం రాజేవ రాటత ఇత్యర్థ"

సా భా శ బ్రా 13 2 2 1

మరియు మేధశబ్దమునకు "పవిత్రము సారము అను నర్థములు గూడ గలవు పవిత్రమైన అశ్వత త్వమును తెలియజేయు యజ్ఞ మని గూడ అశ్వమేథశబ్దార్థము "అశ్వస్య మేధః యస్మాత్" అశ్వమేథః "ఉషా వా అశ్వస్య మెధ్యస్య శిరః" అను బృహదారణ్యకశ్రుతి యీ తత్త్వమునే ఉపదేశించుచున్నది

అశ్వమే⁻శబ్దమునకు శ్రుతి యుపదేశించు మరియొక యర్థమును గూడ గమనింపవలను

"సోऽకామయత భూయసా యజ్ఞేన భూయో యజేయేతి సోఽ శ్రమ్యత్ స తపోऽతప్యత తస్య శ్రాంతస్య త పస్య యశో వీర్య ముదక్రామత్ ప్రాణా వై యశః వీర్యం తత్ ప్రాణేషూత్క్రాంతేషు శరీరం శ్వయితు మధ్రియత తస్య శరీర ఏవ మన ఆసీత్"

సోऽకామయత మేధ్యం మ ఇదం స్యాత్. ఆత్మన్వీ అనేన స్యా మితి తతోऽశ్వః సమభవత్ య దశ్వ త్త న్మేధ్య మభూదితి తదేవాశ్వ

మేధ స్యాశ్వమేధత్వమ్ ఏష హ వా అశ్వమేధం వేద య ఏవ మేవం వేద"

శ బ్రా 10 6 5 6, 7

ప్రజాపతి తన పూర్వజన్మము నందు అశ్వమేధము జేసి సమర్థుడాయెను ఈ జన్మయందు గూడ మహాయజ్ఞమును జేసి సామర్థ్యమును సంపాదింప తలచెను ఇట్టి ఆలోచనలతో అతడు పామరుడు వలె శ్రమ జెందెను (మహత్ కార్యం కామయిత్వాలోకవత్ అశ్రామ్యత్) అప్పుడతడు దీర్ఘ తపస్సు జేసెను శ్రమ జెంది గూడ తపము జేయు నాతని నుండి యశోవీర్యములు తొలగి పోయినవి [యశోవీర్య ముదక్రామత్] ప్రాణములే శరీరమున యశోవీర్యములు [[ప్రాణా ఏవ యశోవీర్యం చాస్మిన్ శరీరే భాష్య] ప్రాణశక్తి లేని శరీరము అమేధ్యరూప మగుచున్నది ప్రజాపతి కా శరీరము నందే మనస్సు నిలచెను దానిని మేధ్యము చేయ దలచెను అనగా యజ్ఞార్హ ము చేయ దలచెను

తానే యశోవీర్యములతో శరీరమున ప్రవేశించెను. అపు డా ప్రజాపతి రూపమైన శరీర మశ్వరూపము దాల్చెను అశ్వరూప మగుచు మేధ్య మగుచున్నది గాన క్రతువు అశ్వమేథ మగుచున్నది "యస్మాచ్చ పునః తత్ప్రవేశాత్ గతయశోవీర్యత్వా దమేధ్యం సత్ మేధ్య మభూత్ తదేవ తస్మాదేవ అశ్వమేధస్య అశ్వమేధనామ్నః క్రతోః అశ్వమేథ నామలాభః" సా భాష్య

ఈ శ్రుతి ననుసరించి మానవుని దేహము మహాపాతకాదుల వలన తేజోహీనమై అమేధ్య మగుచున్న దనియు అశ్వస్వరూప దర్శనమున మరల మేధ్యరూపము దాల్చు ననియు తెలియును.

# అశ్వమేధము ఆదిత్యుడు

అశ్వమేధము యొక్క తత్త్వస్వరూపమును దర్శింపబోయినపుడు సూర్యుడే అశ్వమేధరూపుడుగా సాక్షాత్కరించుచున్నాడు

"ఏష వా అశ్వమేధః య ఏష తపతి।
అయ మగ్ని రర్కః"

శ బ్రా 10 6 5 8

తన దివ్యజ్యోతితో జగమంతయు వ్యాపించువాడు గాన ఆదిత్య దశ్వరూపుడు ఆ ఆదిత్యుడే అగ్నిరూపమున పృథివియందు ఆరాధింపబడు చున్నాడు అనుదినము మన మాచరించు అగ్న్యారాధన తత్త్వదృష్టితో అశ్వమేధమే యగుచున్నది అగ్ని నారాధించి తనువును శుద్ధి జేసికొనుట అశ్వమేధరూపమే "మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః" అను సూక్తి తాత్పర్యమిదియే ఈ అగ్న్యారాధన యొక్క విశేషరూపమే అశ్వమేధనామక యజ్ఞము అశ్వమును ఆదిత్యుని భావించి నపుడు అశ్వముయొక్క "వప"ను సూర్యమండలాంతర్గత దివ్య జ్యోతీరూపముగ భావన జేయవలెను, అపుడు వపాహోమము దివ్య జ్యోతి యొక్క ఉపాసనారూప మని గుర్తింపవచ్చు సూర్యుని వలె చంద్రుని గూడ అశ్వమేధరూపమున దర్శించు మని శ్రుతి యుపదేశించు చున్నది

"ఎష ఏవాశ్వమేధః య చ్చంద్రమాః"

శ. బ్రా 11 2 5 1

దర్శపూర్ణమాసయాగము లన్ని యిష్టులకు ప్రకృతి రూపములు ఆహితాగ్నులు అమావాస్యయందు దర్శేష్టిని పూర్ణిమయందు పూర్ణమాసేష్టిని జేయుచుందురు. ఈ దర్శపూర్ణమాసేష్టులను అశ్వమేధరూపముగ భావనజేయవలె నని శ్రుతి యాదేశము. "దర్శపూర్ణమాసయాగం అశ్వమేధాత్మనా ప్రస్తౌతి" అని భాష్యకారులు పై శ్రుతి వాక్యమునకు అవతారికారచన చేయుచు ఈ విషయమును స్పష్టీకరించుచున్నారు.

శ్రీసూక్తమున పరాదేవతారూపిణియైన లక్ష్మి చంద్రారూపిణిగాను, సూర్యారూపిణిగాను రెండువిధముల వర్ణింపబడినది. ఆ ద్వివిధశక్తులను లక్ష్ములను అనుగ్రహించువాడు అగ్ని యని శ్రుతి తెలియజేయుచున్నది.

సూర్యచంద్రులు భిన్నులుగా కల్పించినను తత్త్వతః ఉభయులు అభిన్నులే. సూర్యకాంతియే అవస్థాభేదము ననుసరించి చంద్రకాంతిగా సాక్షాత్కరించుచుండును. కర్మయోగమున వర్తించు సాధకుని చిత్తమున గల మాలిన్యమును సూర్యాశక్తి దహింపజేయుచున్నది. తరువాత నిర్మలహృదయుడైన సాధకునకు చంద్రాలక్ష్మి లోకోత్తరాహ్లాదమును కలుగజేయుచు మనస్సును రమణీయముగాను ప్రసన్నముగాను జేయుచున్నది. కనుకనే ఈ ఉభయవిధలక్ష్ములను అనుగ్రహించుమని సాధకు డగ్నిని ప్రతిదినము ప్రార్థించుచున్నాడు.

"సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ"

శ్రీసూక్తము

సూర్యచంద్రుల నశ్వమేధముగా దర్శించి ఉపాసించుమని శ్రుతి

యుపదెశించుటలోని భావము సాధకుడు ఉభయవిధలక్ష్మలను సాక్షాత్క-రించుకొను మార్గ ముపదేశించుటయే

## వే ద ము అ శ్వ ము

"మహాశ్మశాన నిలయం ప్రచ్ఛన్నస్ఫటిక ప్రభమ్,
వేదాశ్వం వెదరూపం చ ఏకబిల్వం శివార్పణమ్"

అని ప్రతిదినము పరమేశ్వరుని వేదాశ్వునిగా పూజించుచున్నాము ఇచట అశ్వము వేదము వేద౦నగా ఋగ్యజురాది మంత్రరాశి, మఱియు పరమేశ్వ^డు

ఈ దృష్టితో అశ్వమేధ మనగా అశ్వరూపముగా విలసిల్లు ఎద తత్త్వావగతియే అశ్వమెథమున వపాగంధాఘ్రాణము తాత్త్విక దృష్టిలొ అశ్వరూప వేదసార మహావాక్యార్థదర్శనమె యగుచున్నది ఏ విధముగా సాధకుని చిత్తసంస్కారవైభవము ననుసరించి అశ్వమేధ స్వరూప మెవగతమగుచున్నది

మహాజ్ఞానిదృష్టిలొ అశ్వమేధ స్వరూపము వేఱు సామాన్య దృష్టిలో అశ్వమెధస్వయాపము వేఱు

"ఏష వై తేజస్వీ నామ యజ్ఞః ॥
ఏష వై బ్రహ్మవర్చస్వీ నామ యజ్ఞః"

అను అశ్వమేథనామములు జ్ఞానిదృష్టిలో అశ్వథస్వమేరూపమున తెలియజేయుచున్నవి మహాపాతక నివృత్తికై చేయు అశ్వమేథముల

ప్రవృత్తిధర్మమున లోకకళ్యాణమునకై చేయు యజ్ఞములు కనుకనే ప్రాచీన మహారాజులు లోకక్షేమమునకై శతాధికాశ్వమేధములు చేసినట్లు శ్రుతి వర్ణించుచున్నది

"ఉష్ణా స ప్తతిం భరతో దౌష్యంతి ర్యమునా మను ।
గంగాయాం వృత్రఘేఽబధ్నాత్ పించ పంచాశతం హయాన్ ॥
"త్రయస్త్రింశం శతం రాజాశ్వాన్ బధ్వాయ మేధ్యాన్ ।
సౌద్యుమ్ని రత్యష్ఠాదన్యానమ యా న్మాయావత్తర ః"
"శకుంతలా నాడపి త్యప్సరా భరతం దధే ।
పరస్సహస్రా నింద్రాయా శ్వాన్మేధ్యానయ అహరత్ విజత్య
పృథివీం సర్వాన్"

శ బ్రా 13 5 4 11 నుండి 19 వరకు

ఇత్యాది శ్రుతిగాధలు అశ్వమేధయాగ విషయములో మహత్త్వమును గుర్తింపజేయుచున్నవి

అశ్వమేధ మిట్లు మహత్తమము గంభీరమగుట చేతనే తత్ప్రాధాన్యమును తత్ప్రయోజనమును గుర్తింపజేయుటకె రామాయణమున అశ్వమేధము విస్తృతముగా వర్ణింపబడినది ప్రభువు లాచరించు అశ్వమేధ రాజసూయాది యాగములు దేశమున అన్ని సమస్యలను పరిష్కరించు ప్రధానసూత్రము లగుచున్నవి పూర్వకాలమున మహారాజుల వివిధయాగదీక్షలు ప్రజల కనోన్నిదకములను తృప్తిదీరు నీయగల్గిన కల్పతరలు అట్టి యజ్ఞాచరణము లోని సూక్ష్మలియూక్ష్మ ప్రయోజనములను గుర్తింపజేయుటకే అశ్వమేధమున అన్నదానవర్ణనలు

"అహో తృప్తా స్స్మ భద్రం తే ఇతి శుశ్రావ రాఘవః" అను వర్ణనలు యాగఫలభూతమైన ప్రజల క్షుత్పిపాసా నివృత్తిని తృప్తిని వివరించుచున్నవి

రామాయణము వేదావతారము గాన వేదము యొక్క ప్రధానోపదేశమైన యజ్ఞాచరణమును రామాయణ ముపదేశించుచున్న దనుట యథార్థము అగుచున్నది

మరియు తత్త్వదృష్టితో అశ్వమేధలక్ష్యము సవితృదేవతయొక్క వరేణ్యభర్గోపాసనమై ఆ వరేణ్యభర్గస్వరూపుడు పరంజ్యోతిస్వరూపుడైన శ్రీరాముడని రామాయణమున అశ్వమేధప్రస్తుతి వివరించుచున్నది

రామాయణపు కావ్య మశ్వమేధముతో ప్రారంభమగుచున్నది మరల ఉత్తరకాండమున శ్రీ రామకృతాశ్వమేధముతో సమాప్త మగుచున్నది దీనిని బట్టి శ్రీరామునకు అశ్వమేధమునకు గల నియతసంబంధ మవగత మగుచున్నది అశ్వమేధరూపుడైన శ్రీరాము నుపాసించి కృతకృత్యుడై వెలసిన వాల్మీకిమహర్షి శ్రీరాము నశ్వమేధరూపునిగా దర్శింపజేయుచున్నాడని భావించి అశ్వమేధతత్త్వమును దర్శించి కృతకృత్యుల మగుదుము గాక

# శ్రీరాముడు సార్థకనామధేయుడా !

రామనామము మధురాతిమధురమైనది మధురాక్షర సంమితమైన రామనామమును వాల్మీకికోకిల సదా గానము చేయును "రమయతీతి రామః" అని రామ శబ్దవ్యుత్పత్తి "అందరిని రంజిల్లజేయువాడు రాముడ"ని యర్థము "రామో రమయతాం వరః" అని వాల్మీకిమహర్షి సదా రామ శబ్దార్థమును పదపదే గుర్తింప యుచుండును లోకమున రంజింపజేయు పదార్థము లెన్నియో యున్నవి ధనము, అధికారవైభవము, దారాపుత్రాదులు సహజసిద్ధ ప్రకృతిసౌందర్యము ఇట్లెన్నో మనలను రంజింపజేయుట అనుభవ సిద్ధము అట్లు రంజింపజేయు వారిలో శ్రీరాముడు శ్రేష్ఠుడు కనుకనే వాల్మీకిమహర్షి రామశబ్దమునకు రమయతాం వరః" అని అర్థనిర్వచనము జేసెను

అయితే శ్రీరాము డందఱ నట్లు రంజింపజేసెనా యనునది సూక్ష్మ దృష్టితో పరిశీలింపవలయును అట్లు పరిశీలించి నపుడే రామశబ్దసార్థకతను దర్శింపనగును

ఆత్మీయులను రంజింపజేయుట శత్రువుల ద్వేషించుట లోక స్వభావము

'శత్రుం మిత్రం విపత్తిం చ జయ రంజయ భంజయ" అని ఆప్తోపదేశము మిత్రులను ఆత్మీయులనురంజింపజేయుమనియు శత్రువు

లను సంహరించుమనియు ఏ సూక్తి తాత్పర్యము లోకమున అంచటి వలెనే శ్రీరాముడు గూడ శత్రువులను సంహరించెను మిత్రులను ఆశ్రి యులను ఆదరించెను కనుక రాముని యందు గల ప్రత్యేకత ఎట్టిదను సందేహము కలుగవచ్చును అ పద్ధతిలో "రామో రమయతాం వరః" అను వాల్మీకి నిర్వచనము కేవలము ప్రశంసారూప మని అని ంచ వచ్చును

మరియు పరిశీలనావృష్టితో చి చిన శ్రీరాముడు లందఱకు దుఃఖ కారకుడుగానే కన్పించుచు న్నడు పితృవాక్యపరిపాలనకై వనవాసమున కేగి తల్లిదండ్రులను దుఃఖసముద్రమున ముంచెను తరువాత పితృ మరణమునకు కారణభూతుడై తల్లిని భర్తృవియోగాగ్నిల దహించెను తనతో అడవికి బయలుదెరి వచ్చిన ప్రజలు నిద్రించుచుండ నర్థరాత్రి సమయమున వారలకు తెలియకుండ అడవికి పయనమై పోయి వారలను దుఃఖితుల జేసెను ఉదయము మేల్కాంచి రాముని గానక కలతజెందిన ప్రజల హృదయావేదన ఇంతింత గాదుగదా !

శ్రీరాముడు జనకిమహ రాజు తనయను కారడవులలో త్రిప్పెను పుట్టిన నాటినుండి తోడునీడగా సంచరించిన సోదరుడు లక్ష్మణునకు వన వాసము తప్పలేదు చిత్రకూటమున శ్రీరామునిచే తిరస్కృతుడై భ రతుడు నందిగ్రామమున భోగములకు దూరుడై జటాధారియై ముని వృత్తితో కాలము గడపెను మరియు లిని జంప తార నేడ్పించెను రాక్షసులను జంపి లంకానగరమును శోకమున ముంచెత్తెను రావణుని వధించి మండోదరీ మాంగల్యమును హరించెను ఇట్లు పరిశీలించి శ్రీరాముడు వనవాసము జేసి కైకేయీమంథరలను సంతసింప జే

నేమె ? సోదరుల జంపించుకొని పట్టాభిషిక్తులైన సుగ్రీవ విభీషణులు సంతసించి రేమో ? లోకమున ప్రతివాడు ఆత్మీయుల సంతోషపెట్టుదురు. శత్రువుల దుఃఖింపజేయుదురు శ్రీరాము డట్లుగాక ఆత్మీయులనే ఎక్కువ దుఃఖింపజేసెను కనుక రాముడు సర్వరంజకు డనుట యథార్థమా ! శ్రీరాముడు సార్థకనామధేయుడా ? రామో రమయతాం వరః అని మున్నగు వర్ణనలలోని తాత్పర్య మేమియో విచారించవలసియున్నది

స్థూలముగ జూచిన అట్లే తోచవచ్చు కాని తత్త్వతః విచారించిన శ్రీరాముడు లోకాభిరాముడే కనుకనే

"ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్య హమ్"

అని శ్రీరాముని లోకాభిరామునిగా లోకము నమస్కరించు చున్నది

"శత్రుం మిత్రం విపత్తిం చ జయ రంజయ భంజయ"

అను సూక్తి లోకసాధారణ విషయము అసాధారణ పురుషుల విషయము వేఱు మహాత్ములకు శత్రువు లుండరు వారు ప్రేమించినను శిక్షించినను అనుగ్రహబుద్ధితోనే చేయుదురు శ్రీరాము డవతారమూర్తి ఆతనికి శత్రువులు మిత్రులు అందఱు ఒక్కటే ఆత డాదరించుట ఎట్లు మనోరంజకమో అతడు శిక్షించుటయు అట్లు రంజకము

లోకమున పుత్ర మిత్ర కాంతా కనకాదులు మనోరంజకములే ఆ రంజన మనిత్యము దుఃఖసంమిశ్రము శ్రీరాముని రంజకత్వ మట్లు

గాక నిత్యమై పవిత్రాతిపవిత్రమై తద్గుణసాధన మగుచున్నది. కనుకనే అతడు ఠిషయతాం వ౦ దగుచున్నాడు. శ్రీరాముని రామత్వమును క్రమముగ విచారించుదము.

## శ్రీరాముడు కౌసల్యాదశరథులు

వాల్మీకిమహర్షి శ్రీరాముని "రామో రతికరః పితుః" "కౌసల్యా నందవర్ధనః" అని ఆరుచుగ వర్ణించియుండును. యథార్థముగ రాముడు తండ్రికి దుఃఖకారకుడైన యట్టి వర్తన పొసగదు. సింహాసనమును అధిష్ఠించ బోవుచున్న పుత్రుడు హఠాత్తుగ వనవాసమునకు బయలుదేరినపుడు ఎవరికైనను సహజముగ దుఃఖము రాక తప్పదు. కాని రామ వనవాసము తాత్కాలికముగ దుఃఖహేతు వయ్యెను. అంతరాంతరమున పితృహృదయమును రంజింపజేసె ననియే తెలియవచ్చెను.

లోకమున యథార్థముగ అందరిని రంజింపజేయునది ధర్మము. ధర్మము జగత్ప్రతిష్ఠాహేతువు "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా" అని శ్రుతి వచనము. ధర్మస్వరూపమును చక్కగ గుర్తెరిగి సుఖదుఃఖాతీతులై ధర్మమూర్తులై విలసిల్లు మహాత్ములు లోకరంజకులై విరాజిల్లుట అనుభవసిద్ధవిషయము. రాముడు ధర్మస్వరూపుడు "రామో విగ్రహవాన్ ధర్మః" అతని ధర్మనిరతియే సర్వహృదయరంజక మగుచున్నది.

రామునకు పట్టాభిషేకము జేయదలచి దశరథుడు పౌరసభ జేయించి రామపట్టాభిషేకవార్తను వారలకు తెలియజేసెను. ప్రజలందరు హర్షించిరి. రాముడు తమకు ప్రభువుగ నుండవలయు నని ఏకకంఠముతో కోరిరి. ప్రజాహృదయ మెఱుగగోరి రాముని యందలి ప్రత్యేకత యేమని దశరథుడు వారల ప్రశ్నించెను. అపుడు ప్రజ లిట్లనిరి

"రామ స్సత్పురుషో లోకే సత్యధర్మపరాయణః ।
సాక్షా ద్రామా ద్వినిర్వృత్తో ధర్మశ్చాపి శ్రియా సహ"
అయోధ్య 2 29

రాముడు సత్పురుషుడు సత్యధర్మపరాయణుడు సకలసౌభాగ్య సంపద నిచ్చు ధర్మమును రాముడే రాజ్యమున ప్రతిష్ఠించువాడు

సాక్షా ద్రామా ద్వినిర్వృత్తః రామేణైవ ప్రతిష్ఠాపిత ఇత్యర్థః
శ్రియార్ధేన తిలకవ్యాఖ్య

"ధర్మశ్రియా తత్ఫలభూతయా సంపదా సహ రామాత్ ।
సాక్షా దవ్యవధానేన నిర్వృత్తః నిష్పన్నః ధర్మార్థయో
రితరనిరపేక్షతయా నిర్వాహకః ఇత్యర్థః"
గోవిందరాజీయవ్యాఖ్య

ప్రజలు రాముని ఇంకను ఇట్లు ప్రస్తుతించిరి

"ప్రజాసుఖత్వే చంద్రస్య వసుధాయాః క్షమాగుణైః ।
బుద్ధ్యా బృహస్పతే స్తుల్యో వీర్యే సాక్షా చ్ఛచీపతేః"
"ధర్మజ్ఞ స్సత్యసంధ శ్చ శీలవా ననసూయకః ।
శాంత స్సాంత్వయితా శ్లక్ష్ణో కృతజ్ఞో విజితేంద్రియః"
"మృదు శ్చ స్థిరచిత్త శ్చ సదా భవ్యోఽనసూయకః ।
ప్రియవాదీ చ భూతానాం సత్యవాదీ చ రాఘవః"

33)

"బహుశ్రుతానాం వృద్ధానాం బ్రాహ్మణానా ముపాసితా ।
తేనా స్యేహాతులా కీర్తి ర్యశ స్తేజ శ్చ వర్ధతే"
"దేవాసురమనుష్యాణాం సర్వాస్త్రేషు విశారదః ।
సమ్యగ్విద్యావ్రతస్నాతో యథావ త్సాంగవేదవిత్"
"గాంధర్వే చ భువి శ్రేష్ఠః బభూవ భరతాగ్రజః ।
కల్యాణాభిజన స్సాధు రదీనాత్మా మహామతిః"
ద్విజై రభివినీత శ్చ శ్రేష్ఠై ర్ధర్మార్థనైపుణైః ।
యదా వ్రజతి సంగ్రామం గ్రామార్థే నగరస్య వా"
"గత్వా సౌమిత్రిసహితో నావిజిత్య నివర్తతే ।
సంగ్రామా త్పున రాగత్య కుంజరేణ రథేన వా"
"పౌరాన్ స్వజనవ న్నిత్యం కుశలం పరిపృచ్ఛతి ।
పుత్రే ష్వగ్నిషు దారేషు ప్రేష్య శిష్యగణేషు చ"
"నిఖిలే నానుపూర్వ్యా చ పితా పుత్రా నివౌరసాన్ ।
శుశ్రూషంతే చ వ శ్శిష్యా క్వచి ద్వర్మ సు దంశితాః"
"ఇతి నః పురుషవ్యాఘ్రః సదా రామోఽభిభాషతే ।
వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"
"ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి ।
స్మితపూర్వాభిభాషీ చ ధర్మం సర్వాత్మనా శ్రితః"
"ఉత్తరోత్తరయుక్తౌ చ వక్తా వాచస్పతి ర్యథా ।
సుభ్రు రాయతతామ్రాక్షః సాక్షా ద్విష్ణు రివ స్వయమ్"

"రామో లోకాభిరామోఽయం శౌర్యవీర్యపరాక్రమైః ।
ప్రజాపాలనసంయుక్తో న రాగోపహతేంద్రియః"
"శక్త స్త్రైలోక్య మప్యేష భోక్తుం కిం ను మహీ మి మామ్ ।
నాస్య క్రోధః ప్రసాద శ్చ నిరర్థోఽస్తి కదాచన"
"హ న్త్యేష నియమా ద్వధ్యా నవధ్యేషు న కుప్యతి ।
యున క్త్యర్థైః ప్రహృష్ట శ్చ త మసౌ యత్ర తుష్యతి"
"దాంతై స్సర్వప్రజాకాంతైః ప్రీతిసంజననై ర్నృణామ్ ।
గుణై ర్విరొచతే రామో దీ ప్త స్సూర్య ఇవాంశుభిః"
"త మేవంగుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్ ।
లోకపాలోపమం నాథ మకామయత మేదినీ"
"వత్సః శ్రేయసి జాత స్తే దిష్ట్యాసౌ తవ రాఘవః ।
దిష్ట్యా పుత్రగుణై ర్యుక్తో మారీచ ఇవ కశ్యపః"
"బల మారోగ్య మాయు శ్చ రామస్య విదితాత్మనః ।
దేవాసురమనుష్యేషు సగంధర్వోరగేషు చ"
"ఆశంసతే జన స్సర్వో రాష్ట్రే పురవరే తథా ।
అభ్యంతర శ్చ బాహ్య శ్చ పౌరజానపదా జనః"
"స్త్రియో వృద్ధా స్తరుణ్య శ్చ సాయం ప్రాత స్సమాహితాః ।
సర్వా దేవా న్నమస్యంతి రామస్యార్థే మనస్వినః"
"తేషాం త ద్యాచితం దేవ త్వత్ప్రసాదా త్సమృధ్యతామ్ ।

"రామ మిందీవరశ్యామం సర్వశత్రునిబర్హణమ్ ।
పశ్యామో యౌవరాజ్యస్థం తవ రాజోత్తమాత్మజమ్"

"తం దేవదేవోపమ మాత్మజం తే
సర్వస్య లోకస్య హితే నివిష్టమ్"
హితాయ నః క్షిప్ర ముదారజుష్టం
ముదాభిషేక్తుం వరద త్వ మర్హసి"

అయోధ్యా 2 29 నుండి 54 వరకు

ఇచట ప్రజలు రాముని ప్రస్తుతించిన విధానము రాముని రామత్వ దర్శనమునకు ప్రధానవలంబము. శ్రీరాముడు పట్టాభిషిక్తుడు కాకపోయి నను ప్రజాపాలకుడై ప్రజారంజకుడై ప్రజలకు ధర్మవిగ్రహుడు. సాక్షాత్కరించెను వారల సాక్షాత్కారమును వాల్మీకి మహర్షి సమాస రూపమున (సంగ్రహముగా) మొదటి శ్లోకమున వివరించెను

"రామ స్సత్పురుషో లోకే సత్యధర్మపరాయణః ।
సాక్షాద్రామా ద్వినిర్వృత్తో ధర్మ శ్చాపి శ్రియాసహ"

ఇచట రాముని సత్యధర్మపరాయణత్వము ధర్మప్రతిష్ఠాపనశీలత్వము అతని సత్పురుషత్వమునకు సూచకములు అతనిసత్పురుషత్వ వ్యాఖ్యాన రూపములే (వ్యాసరూపములే) తరువాతి ఇరువది నాలుగు శ్లోకములును

ఇరువది నాల్గువేల శ్లోకములతో విలసిల్లుచు రామాయణము ప్రబో ధించు రామతత్త్వమును సంగ్రహముగా ఈ ఇరువదినాలుగు శ్లోకములు బోధించుచున్నవి రామాయణ కావ్యరచనారంభమునకు ముందు నారద

మహర్షిచే తపస్స్వయగు వాల్మీకిః షోడశగుణసంపన్నుడైనయే సత్పురుష స్వరూప ముపదేశింపబడెనో ఆ సత్పురుషస్వరూపమే ఇచట ప్రజా హృదయము నుండి బహిర్గత మయ్యెన. చతుర్వింశత్యక్షరాత్మక గాయత్రీతత్త్వమే ఇచట శ్రీరామవర్ణన పరముగా చతుర్వింశతి శ్లోక రూపమున ప్రజాహృదయముల నుండి స్వయముగా నభివ్యక్తమైనది

కౌసల్యాదశరథులు రాముని పుత్రునిగా మాత్రమే దర్శించిరి అతని విజతత్త్వ మెఱుగరు రాజధర్మము ననుసరించి దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేకము చేయసంకల్పించెను కాని రాము డెప్పుడో ప్రజాహృదయములందు పట్టాభిషిక్తుడాయెను దశరథుడు మహారాజైనను ప్రజలు రాముడే తమను పాలించుచున్నట్లు భావించిరి అడుగడుగున తమ కష్టసుఖముల విచారించి రక్షించు తండ్రిగా భావించిరి

"పౌరాన్ స్వజనవ న్నిత్యం కుశలం పరిపృచ్ఛతి"

"ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి"

ధర్మజ్ఞః సత్యసంధః శీలవాన్ అనసూయకః

శాంతః సాంత్వయితా శ్లక్ష్ణః కృతజ్ఞః విజితేం

ద్రియః మృదుః స్థిరచిత్తః భవ్యః ప్రియవాదీ

సత్యవాదీ కల్యాణాభిజనః సాధుః

అదీనాత్మా మహామతిః సుభ్రూః ఆయతతామ్రాక్షః

నరాగోపహతేంద్రియః ఇత్యాదిగుణములు రాముని సత్పురుషత్వ ద్యోతకములు.

వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః,
ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి"

అను వర్ణన ప్రజాపాలన దక్షత్వ సూచకములు ప్రజల దుఃఖ మును తన దుఃఖముగాను ప్రజల సుఖము తన సుఖముగాను భావించిన వాడే తత్త్వతః ప్రజాపాలన సమర్థుడు శ్రీరాము డట్టివాడు కనుకనే ప్రజలు

"రామో లోకాభిరామోఽయం శౌర్యవీర్యపరాక్రమైః ।
"ఆశంసతే జనస్సర్వో రాష్ట్రే పురవరే తథా"
"అభ్యంతర శ్చ బాహ్య శ్చ పౌరజానపదో జనః"

అని వర్ణించిరి శ్రీరాముడు లోకాభిరాము గాన అభ్యంతరజనము బాహ్యజనము గూడ అతనిని రాజుగా, పరిపాలకుడుగా, రక్షకుడుగా కోరిరి 'ఒక్క భూలోక మేమిటి ? శ్రీరాముడు ముల్లోకములను పాలింపదగిన సమర్థుడు కనుకనే ఎట్టి ఆలోచన చేయకయే అతనిని పట్టాభిషిక్తుని జేయుము'' అని ప్రజలు అభ్యర్థించిరి

ఇట్లు సభాముఖమున ప్రజలు శ్రీరాముని ప్రభువుగా కోరుచున్న పుడు దశరథహృదయ మెంత ఉప్పొంగిపోయినదో ఊహింపవచ్చును

పట్టాభిషేకవార్త దేశ మంతట ప్రాకెను దేశ దేశముల నుండి వచ్చిన ప్రజావాహిని కంతు లేకుండ పోయెను ఈ కోలాహలమునకు కారణ మేమి యని జ్ఞాతదాసి యైన మంథర ప్రాసాదాగ్రభాగము నుండి పరికించెను. పట్టణము శిరస్స్నాత జనావృతముగా కన్పించెను శిరస్స్నాత

జన మన అందఱు పండుగదినము నందు వలె అభ్యంగనస్నాన మాచరించుట శ్రీరాముని పట్టాభిషేకము ప్రజలకు పండుగ కన్న మిన్నయైనందున అంద ఱభ్యంగన మాచరించి నూతనవస్త్రాలంకృతులై మంథరకు కన్పించిరి రామపట్టాభిషేకవార్త ప్రజల నందఱను ప్రత్యేకముగ నెట్లానందపఱచినదొ రఘువంశమహాకావ్యమున కాళిదాసమహాకవి సోపమానంగా చెప్పిన విషయము స్మరింపదగినది

"సా పౌరాన్ పౌరకాంతస్య రామ స్యాభ్యుదయశ్రుతిః
ప్రత్యేకం హ్లాదయాంచక్రే కుల్యే వోద్యానపాదపాన్"
రఘు 12 3

ఉద్యానవనమున కుల్య (కాలువ) భేదభావము లేక ప్రతి వృక్షమును లతను సమీపించి యన్నిటిని ప్రత్యేకముగ రంజింపజేయునట్లు రామపట్టాభిషేకవార్త దేశమున ప్రతివారిని ప్రత్యేకముగ రంజింపజేసినదట రాము డట్లు ప్రత్యేక ప్రత్యేకముగ అందఱను రంజింపజేసె నను విషయము ఆనందముతో వారందఱభ్యంగన మాచరించుటద్వారా తెలియుచున్నది

తరువాత మంథర దుర్బోధనతో కైకేయి వరములు గోరుట శ్రీరాముడు వనవాసమునకు బయలుదేరుట జరిగెను తండ్రి అజ్ఞతో సింహాసన మధిష్ఠించుట కెట్లు బయలుదేరెనో వనవాసమునకు గూడ అట్లే బయలుదేరెను శ్రీరాముడు ఎత్యవాక్య పరిపాలనము జేయుచు తన ధర్మనిర ని ప్రకటించిన కొలది ప్రజ లా ధర్మవిగ్రహుని జూచి సంమోహితులై రాయినే తమకు పతిగా కోరిరి

"యథా యథా దాశరథిః ధర్మ ఏవాస్థితోఽభవ త్ ।
తథా తథా ప్రకృతయః రామం పతి మకామయన్"

పట్టాభిషేక మహోత్సవోద్యుక్తుడైన పుత్రుని ప్రజలు ప్రశంసించి నపుడు పితృహృదయ మెంత యుప్పొంగెనో అట్లే వనవాసమునకు బయలుదేరిన ధర్మమూర్తిని జూచి ప్రజలు కొనియాడుచున్నప్పుడు గూడ పితృహృదయ మంతకన్న ఎక్కువగా పులకరించెను పుత్రవియోగము తాత్కాలికముగ దుఃఖహేతు వయ్యెను దుస్సహ మయ్యెను పుత్రుని దృఢధర్మదీక్ష పితృహృదయాంతరాళములలో ఆనందమునే కలిగించెను సంతోషసమయ మందును, దుఃఖసమయ మందు గూడ రాముడు తండ్రికి రతికరుడే అయ్యెను

సింహాసన మధిష్ఠింప బోవు శ్రీరాముడు వనవాసమునకు బయలుదేరి నపుడు కౌసల్య దుఃఖముతో క్రుంగిపోయినది పుత్రునితో అడవికి, తాను గూడ బయలుదేర సన్నద్ధ ై ర్తనువీడి రాగూడదను శ్రీరాముని ధర్మోపదేశ మామెయత్నమును మాన్పించినది దుఃఖావేశము పట్టజాలక తన జీవిత స్వరూప విధానమును వర్ణించుకొనినది ఆమె దశరథునకు పట్టమహిషి పట్టమహిషి కదళీవంధ్య కదళీవృక్షము ఒక్కమారే ఫలించును తరువాత దాని జీవిత మూహించుకొనవలసినదే అట్లే రామజననానంతరము కౌసల్య భోగముల నుండి మరలి యోగినీ జీవితము గడపవలసియున్నది కనుకనే రామాయణమున కౌసల్య ప్రాణాయామపరాయణ యగుచు వ్రతాచారితత్పరాలై నారాయణమందిరమున పూజాపరాయణగా దర్శనమిచ్చును కైకేయి భోగకాంత పతి యామెకు సత్యవశుడు అట్టి కైకేయీకారణముగా పతిసౌఖ్యమునకు దూరమైన

తాను పుత్రవియోగము గూడ భరించుట ధర్మమని కౌసల్య యెంత చెప్పినను. శ్రీరాముడు పితృవాక్య పరిపాలనావశ్యకత నామె కుపదేశించెను ధర్మస్వరూపమును ధర్మచరణావశ్యకతను శ్రీరాముడు బోధించినపుడు కౌసల్య వాదనలేకపోయినది పుత్రుని ధర్మదీక్షకు సంతోషించినది

"యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ ।
స తే రాఘవశార్దూల ధర్మ స్త్వా మభిరక్షతు"

అని శ్రీరాముని ఆశీర్వదించినది దీనినిబట్టి దశరథునకు వలె కౌసల్యకు గూడ పుత్రవియోగము తాత్కాలికముగ దుస్సహమైనను పుత్రుని ధర్మదీక్ష ఆమె కానందవర్ధకమే అయ్యెను పుట్టినప్పటి నుండి శ్రీరాము డెల్లప్పుడును కౌసల్యానందవర్ధనుడే రాముడు పుట్టినప్పుడు తల్లిదండ్రులను రంజింపజేయు రీతి వేఱు పెద్దవాడైనపుడు రంజింపజేయు రీతి వేఱు రాముని బాల్యరంజనము సర్వసామాన్యము కాని రాముని ధర్మరంజన మనన్యసాధ్యమైనది రాము డట్లు ధర్మవిగ్రహుడై తల్లిదండ్రుల రంజింపజేసెను కనుకనే "రామో రతికరః పితుః, కౌసల్యానందవర్ధనః" అను వర్ణన భూతార్థవాదరూపమై విలసిల్లెను

రాముని రామత్వము సార్థక మాయెను

## శ్రీరాముడు సోదరుడు లక్ష్మణుడు

సోదరుల దృష్టిలో రాముడు మూర్తీభవించిన సత్యస్వరూపుడు

రామునితో నిరంతరసాహచర్యము గలవాడు లక్ష్మణుడు రామాయణమున వారు ఒకరి నొకరు వీడక సంచరించిరి వారి సాహచర్య మట్టిది

రాముడు వనవాసమునకు బయలుదేరినపుడు దుఃఖముతో కౌసల్య విసంజ్ఞకల్పయై నది లక్ష్మణుడు గూడ శోకాభిప్రతప్తుడై నాడు అట్టి స్థితిలో రాముడు లక్ష్మణునకు ధర్మము నుపదేశించెను అర్హత యున్నవారు ధర్మ ముపదేశించినపుడు వారి వాక్యములను లోకము గౌరవించును

"ధర్మే స్థితో ధర్మ్య మువాచ వాక్యం యథా స ఏవార్హతి తత్ర వక్తుమ్"

అని వాల్మీకి మహర్షి ధర్మోపదేశమునకు రామునకే అర్హత యున్న దని నిర్ణయించెను దానికి కారణము రాముని స్థిరప్రజ్ఞయే

"న వనం గంతుకామస్య త్యజతశ్చ వసుంధరామ్ ।
సర్వలోకాతిగస్యేవ లక్ష్యతే చిత్త విక్రియా"

2-19 33

సమస్త భూమండల సార్వభౌమాధికారమును వదలి అడవికిబోవు రాముని యందట్టి వికారము లేదట

ఇట్లు నిర్వికారచిత్తుడై నందున రాముడు తల్లికిగూడ ధర్మతత్త్వము నుపదేశింపగలిగెను శోకాభితప్తుడైన లక్ష్మణునకు చేసిన ధర్మోపదేశము ధర్మవిషయమున రామునకు గల ప్రావీణ్యమును తెలియ జేయుచున్నది

"ధర్మార్థకామాః ఖలు తాత లోకే సమీక్షితా ధర్మఫలోదయేషు ।
తే తత్ర సర్వేస్యు రసంశయం మే భార్యేవ వశ్యాభిమతాసుపుత్రా"
2 21 57

పూర్వజన్మమున ధర్మము నాచరించిన వారికి యీ జన్మమందు ధర్మఫలోదయము జరుగును ధర్మఫలోదయ రూపమున ఈ జన్మమున ధర్మ అర్థ కామ ములు అనగా త్రివర్గము సిద్ధించుచున్నది అనగా ధర్మాచరణము ధర్మార్థకామముల మూడింటిని లభింపజేయుచున్నది ధర్మపత్ని అనుకూలవతియై ధర్మకార్యముల సహకరించుచు ధర్మసాధన యగుచున్నది అభిమతయై కామసాధని యగుచున్నది సుపుత్రయై అర్థసాధన యగుచున్నది ఇట్లు ధర్మపత్ని ధర్మార్థ కామసాధన యైనట్లు ధర్మాచరణ ధర్మార్థకామముల ననుగ్రహించుచున్నది కనుక పురుషార్థ సాధనమునకు ధర్మాచరణము ముఖ్యము

శ్రీరాముడు వనవాసదీక్షకై ముదట పట్టాభిషేకమునకై ఏర్పరిచ బడిన ఉదకములతో స్నానముచేయ దలచను మరిల రాజద్రవ్యము తనకెందుకని తానే స్వయముగ తోడికొనిన జలముతో వ్రతాదేశము నిర్వహింప దలచెను

"ఏభి రేవ వ్రణైస్సర్వై రభిషేచన సంభృతైః ।
మమ లక్ష్మణ తాపస్యే వ్రతాదేశం భవిష్యతి"
"అథవా కిం మమైతేన రాజద్రవ్య మయేన తు ।
ఉద్ధృతం మే స్వయం తోయం వ్రతాదేశం కరిష్యతి"
( 2 22 2(+28)

రాముని యొక్క ఈ మాటలు లక్ష్మణునకు శ్రీరాముని ధర్మవిగ్రహత్వమును సాక్షాత్కరింపజేసినది

రాముడిట్లు ధర్మవిగ్రహుడై ధర్మబోధన జేసినను లక్ష్మణుడు వైరభావముతో శ్రీరామునితో అనేకవిధముల వాదించును తుదకు ధర్మవిగ్రహుని యెదుట తలవంచి యాతనితో తాను గూడ వనవాసమున కేగును

లక్ష్మణుడు శ్రీరామునితో వనవాసమున కేగి నపుడు అతడు రాముని మహోదాత్తప్రవృత్తిచే అడుగడుగున రంజితుడయ్యెను భరతుడు చిత్రకూటమునకు వచ్చు నపుడు లక్ష్మణుడు భరతుని శంకించి రామునితో ఇట్లు అనును

"భరతుడు పట్టాభిషిక్తుడై మనలను చంపుటకు వచ్చుచున్నాడు, ఇతనిని వధించుట దోషము లేదు"

"సంపన్నం రాజ్య మిచ్ఛం స్తు వ్యక్తం ప్రాప్యా భిషేచనమ్ ।
అవాం హన్తుం సమభ్యేతి కైకేయ్యా భరతస్సుత॥
సంప్రాప్తో ఽయ మరి ర్వీర భరతో వధ్య ఏవ మే ।
భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ"

2 76 17 + 23

క్రోధమూర్ఛితుడైన లక్ష్మణునకు రాముడిట్లు ధర్మము నుపదేశించెను.

"కి మత్ర ధనుషా కార్యం అసినా వా సచర్మణా।
మహేష్వాసే మహాప్రాజ్ఞే భరతే స్వయ మాగతే"

“ఎతు వ్సత్యం ప్రతిశ్రుత్య హత్వా భరత మాగతమ్ ః
కిం కరిష్యామి రాజ్యేన సాపవాదేన లక్ష్మణ”
యద్ద్రవ్యం బాంధవానాం వా మిత్రాణాం వా క్షయే భవేత్ ః
నాహం తత్ప్రతిగృహ్ణీయాం భక్ష్యా న్విషకృతా నివ”
“ధర్మ మర్థం చ కామం చ పృథివీం చాప లక్ష్మణ ః
ఇచ్ఛామి భవతా మర్థే హ్యేత త్ప్రతిశృణోమి తే”
“భ్రాతౄణాం సంగ్రహార్థం చ సుఖార్థం చాపి లక్ష్మణ ః
రాజ్య మ ప్యహ మిచ్ఛామి సత్యేనాయుధ మాలభే”
“నేయం మమ మహీ సౌమ్య దుర్లభా సాగరాంబరా ।
నహీచ్ఛేయ మధర్మేణ శక్రత్వ మపి లక్ష్మణ”
“య ద్వినా భరతం త్వాం చ శత్రుఘ్నం చాపి మానద
భవే న్మమ సుఖం కించి ద్భస్మ త త్కురుతాం శిఖీ”
“మన్యే హ్యమాగతోఽయోధ్యాం భరతో భ్రాతృవత్సలః
మమ ప్రాణా త్ప్రియతరః కులధర్మ మనుస్మరన్”
శ్రుత్వా ప్రవ్రాజితం మాం వా జటావల్కలధారిణమ్ః
జానక్యా సహితం వీర త్వయా చ పురుషర్షభ”
“స్నేహేనాక్రాంతహృదయ శ్శోకే నాకులితేంద్రియః ।
ద్రష్టు మభ్యాగతో హ్యేషః భరతో నాన్యథాగతః”
“అంబాం చ కైకయీం రుష్యం పరుషం చాప్రియం వదన్ ః

ప్రసాద్య శిరసా శ్రీమాన్ రాజ్యం మే దాతు మ గతః"
"ప్రాప్తకాలం యదేషోఽస్మా న్భరతో ద్రష్టు మిచ్ఛతి ।
అస్మాసు మనసాప్యేష నాప్రియం కించి దాచరేత్"
"విప్రియం కృతపూర్వం తే భరతేన కదా ను కిమ్ ।
ఈదృశం వా భయం తేఽద్య భరతం యోఽత్ర శంకసే"
"న హి తే నిష్ఠురం వాచ్యో భరతో నాప్రియం వచః ।
అహం హ్యప్రియ ముక్తం స్యాం భరతస్యాప్రియే కృతే"
"కథం ను పుత్రాః పితరం హన్యుః కస్యాంచి దాపది ।
భ్రాతా వా భ్రాతరం హన్యా త్సౌమిత్రే ప్రాణ మాత్మనః"
"యది రాజ్యస్య హేతో స్త్వం ఇమాం వాచం ప్రభాషసే ।
వక్ష్యామి భరతం దృష్ట్వా రాజ్య మస్మై ప్రదీయతామ్"
"ఉచ్యమానోఽపి భరతో మయా లక్ష్మణ తత్త్వతః ।
రాజ్య మస్మై ప్రయచ్ఛేతి బాఢ మిత్యేవ వక్ష్యతి"
"తథోక్తో ధర్మశీలేన భ్రాత్రా తస్య హితే రతః ।
లక్ష్మణః ప్రవివేశేవ స్వాని గాత్రాణి లజ్జయా"

2-97 2 నుండి 19 వరకు

లక్ష్మణా! భరతుడు స్వయముగ వచ్చెను భరతుడు ఉదాత్త పురుషుడు అతని విషయమున ఆయుధములతో పని యేమి? తండ్రి ఆజ్ఞను పాలించద నని ప్రతిజ్ఞ చేసి భరతుని జంపి మరల రాజ్యమును స్వీకరించు టెట్లు? బంధుమిత్రాదుల నాశమున నాకు లభించు ద్రవ్య

యును విషమిశ్రిత భక్ష్యముల వలె స్పృశించను ధర్మార్థకామములను సమస్త భూమి తలమును సోదరుల కొఱకు త్యజింపగలను" అని ప్రతిజ్ఞ చేయుచున్నాను సోదరక్షేమమునకు రాజ్యమును స్వీకరించెదను ఆయుధమును గ్రహింతును సాగరాంబరమైన ఈ భూమి నాకు దుర్లభము కాదు అధర్మమార్గమున ఇంద్రపదవిని గూడ కోరను భరతునకు నీకు, శత్రుఘ్ననకు గాక నాకు గలుగు సుఖమును అగ్నిహోత్రుడు దహించుగాక భరతుడు భ్రాతృవత్సలుడు, నాకు ప్రాణముకన్న ప్రియతముడు అట్టివాడు కులధర్మమును గుర్తించి అయోధ్య నుండి వచ్చుచున్నాడని తలచెదను నేను రాజ్యపరిత్యాగము జేసి ప్రవ్రాజితుడనై జటావల్కలధారి నగుచు సీతతో నీతో కలసి అడవికి వచ్చుట విని శోకాకులితేంద్రియుడై స్నేహాక్రాంత హృదయు డగుచు నన్ను చూడ వచ్చుచున్నాడు కైకేయిని దూషించి తండ్రి ఆజ్ఞతో మరల నాకు రాజ్యము నిచ్చుటకై వచ్చుచున్నాడు భరతుడు మనలను చూచుటకే వచ్చుచున్నాడు మనల కెట్టి అపకారము చేయడు భరతుడు నీకెన్నడును అపకారము చేయలేదు అట్టి వానిని నీ విప్పు డెందుకు శంకించుచున్నావు భరతుని నీవు దూషించిన నన్ను దూషించినట్లే లోకమున పుత్రులు తండ్రులను హింసింతురా ! సోదరుడు సోదరుని సంహరించునా ? ఒకవేళ రాజ్యకాంక్షతో నీ విట్లు పలికిన "రాజ్యమును నీకీయ మని భరతునితో చెప్పెదను నా మాటగా భరతుడు వెంటనే రాజ్యమును నీకీయ గలడు"

ఇట్లు రాముడు మాట్లాడినపుడు లక్ష్మణుడు తనలో తాను క్రుంగి పోయినాడు

"లక్ష్మణః ప్రవివేశేవ స్వాని గాత్రాణి లజ్జయా"

ఇట్లు శ్రీరాముని ధర్మోపదేశము లక్ష్మణుని రంజింపజేసెను ఈ విధముగా లక్ష్మణున కెన్నియో సన్నివేశము లందు శ్రీరాముడు ధర్మ ముపదేశించెను లక్ష్మణుని దృష్టిలో శ్రీరాముడు సాక్షాద్ధర్మావతారుడు.

కనుక లక్ష్మణుని ధర్మోపదేశము ద్వారా శ్రీరాముడు రంజింప జేసెను శ్రీరాముడు లక్ష్మణుని దృష్టిలో రమయతాం వరుడే

## శ్రీరాముడు భరతశత్రుఘ్నులు

రామలక్ష్మణుల సాహచర్య మెట్టిదో భరతశత్రుఘ్నుల సాహ చర్య మట్టిది-శత్రుఘ్నుడు భరతుని చాటువాడు ధర్మోపదేశము ద్వారా రాముడు లక్ష్మణుని మహోద్ధృతిని సంస్కరించినట్లు భరతుడు గూడ శత్రుఘ్నునకు ధర్మోపదేష్ట యగుచు అతనిని సంస్కరించెను. భరతు నకు ఆదినుండి శ్రీరాముడు పూజ్యుడు రామునియందు సోదరభావము కంటె గురుభావము దైవభావము ఎక్కువ కైకేయిని భరతుని కౌసల్య కఠినముగా మాట్లాడినపుడు భరతుడు జేసిన ఘోరప్రమాణమ్ము లిందుకు సాక్షిరూపములు శ్రీరాముడు వనవాసమున కేగుట ఎన్నడు తన కభి మతము గాదని భరతు డిట్లు ప్రతిజ్ఞ జేయుచున్నాడు

"కృతశాస్త్రానుగా బుద్ధిః మాభూ త్తస్య కదాచన ।
సత్యసంధః సతాం శ్రేష్ఠః యస్యార్యోzనుమతే గతః"
"ప్రైష్యం పాపీయసాం యాతు సూర్యం చ ప్రతి మేహతు।
హంతు పాదేన గాం సుప్తాం యస్యార్యోzనుమతే గతః"

"కారయిత్వా మహత్కర్మ భర్తా భృత్య మనర్థకమ్ ।
అధర్మా యోఽస్య సోఽస్యాస్తు యస్యార్యోఽనుమతేగతః"
"పరిపాలయమానస్య రాజ్ఞో భూతాని పుత్రవత్ ।
తత స్తం ద్రుహ్యతాం పాపం యస్యార్యోఽనుమతేగతః"
"బలిషడ్భాగ ముద్ధృత్య నృపస్యారక్షతః ప్రజాః ।
అధర్మా యోఽస్య సోఽస్యాస్తు యస్యార్యోఽనుమతేగతః"
"సంశ్రుత్య చ తపస్విభ్య స్సత్రే వై యజ్ఞదక్షిణామ్ ।
తాం విప్రలపతాం పాపం యస్యార్యోఽనుమతేగతః"
"హ స్త్యశ్వరథసంబాధే యుద్ధే-శస్త్రసమాకులే ।
మా స్మ కార్షీ త్సతాం ధర్మం యస్యార్యోఽనుమతేగతః"
"ఉపదిష్టసుసూక్ష్మార్థం శాస్త్రం యత్నేన ధీమతా ।
స నాశయతు దుష్టాత్మా యస్యార్యోఽనుమతేగతః"
"మా చ తం వ్యూఢబాహ్వంసం చంద్రార్కసమతేజసమ్ ।
ద్రాక్షీ ద్రాజ్యస్థ మాసీనం యస్యార్యోఽనుమతేగతః"
"పాయసం కృసరం ఛాగం వృథా సోఽశ్నాతు నిర్ఘృణః ।
గురూం శ్చాప్యవజానాతు యస్యార్యోఽనుమతేగతః"
"గాశ్చ స్పృశతు పాదేన గురూ న్పరివదేతే త్స్వయమ్ ।
మిత్రే ద్రుహ్యేత సోఽత్యన్తం యస్యార్యోఽనుమతేగతః"

35)

"విశ్వాసా త్కథితం కించి త్పరివాదం మిథం క్వచిత్ ।
వివృణోతు స దుష్టాత్మా యస్యార్యోఽనుమతేగతః"
"అకర్తా హ్యకృతజ్ఞ శ్చ త్యక్తాత్మా నిరపత్రపః ।
లోకే భవతు విద్వేష్యః యస్యార్యోఽనుమతేగతః"
"పుత్రదారై శ్చ భృత్యై శ్చ స్వగృహే పరివారితః ।
స ఏకో మృష్ట మశ్నాతు యస్యార్యోఽనుమతే గతః"
"అప్రాప్య సదృశా న్దారాన్ అనపత్యః ప్రమీయతామ్ ।
అనవాప్య క్రియాం ధర్మ్యాం యస్యార్యోఽనుమతే గతః"
"మా త్మన స్సంతతిం ద్రాక్షీత్ స్వేషు దారేషు దుఃఖితః ।
ఆయుస్సమగ్ర మప్రాప్య యస్యార్యోఽనుమతే గతః"
"రాజ స్త్రీ బాల వృద్ధానాం వధే య త్పాప ముచ్యతే ।
భృత్యత్యాగే చ య త్పాపం త త్పాపం ప్రతిపద్యతామ్"
"లాక్షయా మధుమాంసేన లోహేన చ విషేణ చ ।
సదైవ బిభృయా ద్భృత్యా న్యస్యార్యో నుమతే గతః"
"సంగ్రామే సముపోఢె స్మ శత్రుపక్షభయంకరే ।
పలాయమానో వధ్యేత యస్యార్యోఽనుమతే గతః"
"కపాలపాణిః పృథివీ మటతాం చీరసంవృతః ।
భిక్షమాణో యథోన్మత్తో యస్యార్యో నుమతే గతః"
"పానే ప్రసక్తో భవతు స్త్రీష్వక్షేషు చ నిత్యశః ।
కామక్రోధాభిభూత స్తు యస్యార్యోఽనుమతే గతః"

"మా స్మ ధర్మే మనో భూయా దధర్మం స నిషేవతామ్ ।
అపాత్రవర్షీ భవతు యస్యార్యోzనుమతే గతః"
"సంచితా న్యస్య విత్తాని వివిధాని సహస్రశః ।
దస్యుభి ర్విప్రలుప్యన్తాం యస్యార్యోzనుమతే గతః"
"ఉభే సంధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే ।
తచ్చ పాపం భవే త్తస్య యస్యార్యోzనుమతే గతః"
"య దగ్నిదాయకే పాపం యత్పాపం గురుతల్పగే ।
మిత్రద్రోహే చ య త్పాపం త త్పాపం ప్రతిపద్యతామ్"
"దేవతానాం పితౄణాం చ మాతాపిత్రో స్తథై వ చ ।
మా స్మ కార్షీ త్స శుశ్రూషాం యస్యార్యోzనుమతే గతః"
"సతాం లోకాన్ సతాం కీర్త్యాః సజ్జుష్టా త్కర్మణ స్తథా ।
భ్రశ్యతు క్షిప్ర మద్యైవ యస్యార్యోzనుమతే గతః"
"అపాస్య మాతృశుశ్రూషా మనర్థే సోఽవతిష్ఠతామ్ ।
దీర్ఘబాహు ర్మహావక్షా యస్యార్యోzనుమతే గతః"
"బహుపుత్రో దరిద్ర శ్చ జ్వరరోగ సమన్వితః ।
స భూయా త్సతత క్లేశీ యస్యార్యోzనుమతే గతః"
"ఆశా మాశంసమానానాం దీనానా మూర్ధ్వచక్షుషామ్ ।
అర్థినాం వితథాం కుర్యా ద్యస్యార్యో zనుమతే గతః"
"మాయయా రమతాం నిత్యం పరుషః పిశునోఽశుచిః ।

రాజ్ఞో భీత స్త్వధర్మాత్మా యస్యార్యోఽనుమతే గతః"
"ఋతుస్నాతాం సతీం భార్యాం ఋతుకాలానురోధినీమ్ ।
అతివర్తేత దుష్టాత్మా యస్యార్యోఽనుమతే గతః"
"ధర్మదారా న్పరిత్యజ్య పరదారా న్నిషేవతామ్ ।
త్యక్తధర్మరతి ర్మూఢో యస్యార్యోఽనుమతే గతః"
"విప్రలుప్త ప్రజాతస్య దుష్కృతం బ్రాహ్మణస్య యత్ ।
తదేవ ప్రతిపద్యేత యస్యార్యోఽనుమతే గతః"
"పానీయదూషకే పాపం తథైవ విషదాయకే ।
య త్తదేక స్స లభతాం యస్యార్యోఽనుమతే గతః"
"బ్రాహ్మణాయో ద్యతాం పూజాం విహన్తు కలుషేంద్రియః ।
బాలవత్సాం చ గాం దోగ్ధుం యస్యార్యోఽనుమతే గతః"
"తృష్ణార్తం సతి పానీయే విప్రలంభేన యోజయేత్ ।
లభేత తస్య య త్పాపం యస్యార్యోఽనుమతే గతః"
"భక్త్యా వివదమానేషు మార్గ మాశ్రిత్య పశ్యతః"
తస్యపాపేన యుజ్యేత యస్యార్యోఽనుమతే గతః"

**2 75 21 నుండి 58**

భరతు డిట్లు భీషణ ప్రతిజ్ఞలు చేసి శ్రీరామ విషయమున తన ప్రగాఢభక్తిని వెళ్ళడించుకొనెను

శ్రీరాముని భక్తితో 'ఆర్య' అనుపదముతో వ్యవహరించి శ్రీరామ

విషయమున తనకు గల పూజ్యభావమును ప్రకటించుకొనెను వరుస వరుసగా తీవ్రాతితీవ్రమైన శపథములు భరతుడు చేసినపుడు కౌసల్య హృదయము కరిగినది భరతునియందామెకు ప్రేమ వాత్సల్యము గౌరవాతిశయములు పెల్లుబికినవి

"మమ దుఃఖ మిదం పుత్ర భూయ స్సముపజాయతే ।
శపథై శ్శపమానో హి ప్రాణా నుపరుణత్సి మే"

అను ఆమె మాట భరతుని ఊరడింపజేసెను

నీ శపథములు నా ప్రాణముల తల్లడిల్ల జేయుచున్నవనెడి ఆమె పలుకులు ఆమె హృదయార్ద్రతను శపథముల ద్వారా శ్రీరామునియందు భరతుడు ప్రకటించిన పౌరవాతిశయమును విశదీకరించుచున్నది.

భరతుడు చిత్రకూటమునకు పోవుచు గంగాతీరమున విశ్రమించి ఉదయమున శత్రుఘ్నునితో అనిన మాటలు భరతుని హృదయమున రామునికిగల స్థానమును తెలియజేయుచున్నవి.

"జాగర్మి నాహం స్వపిమి త మేవార్యం విచింతయన్ ।
ఇత్యేవ మబ్రవీ ద్భ్రాతా శత్రుఘ్నా పి ప్రవొదితః"

2 89 3

"రాత్రి యంతయు శ్రీరామునే స్మరించుచు నేను రాత్రియంతయు మేల్కొనియే యుంటిని నిదుర పోలేదు భరతుడు యథార్థమునకు కైకేయీ కోరిక ప్రకారము పట్టాభిషిక్తుడై ధర్మమార్గమున రాజ్యపాలన జేసిన ఎవరు కాదనరు ద్వేషించు వారును లేరు కాని ఆ రాజ్యము

భరతుని రంజింపజేయదు రామానుగ్రహమే అతనిని రంజింపజేయునది కనుకనే భరతుడు సింహాసనమున కాళబడక రామదర్శనమునకు తల్లితో సహా శ్రీరామునకు కుటుంబమునకు తన తల్లివల్ల కలిగిన యపకృతికి ప్రతిక్రియగా మాత్రమే భరతుడు రాముని దర్శింపబోవుట లేదు తత్త్వతః రామునియందలి గౌరవము భక్తివిశ్వాసములు అతనిని రాముని సన్నిధికి పొమ్మని ప్రేరేపించినవి. రాము నెప్పుడు చూతునా యను ఔత్సుక్య మాతనిని కలవరబెట్టినది అట్టి భక్తితత్పరతతో పోయినాడు గనుకనే శ్రీరాముడు చిత్రకూటమున నా భక్తునకు పరబ్రహ్మ స్వరూప డుగా సాక్షాత్కరించెను

"నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్ ।
ఉటజే రామ మాసీనం జటామండలధారిణమ్ ॥
తం తు కృష్ణాజినధరం చీరవల్కలవాససమ్ ।
దదర్శ రాను మాసీన మభితః పావకోపమమ్ ॥
సింహస్కంథం మహాబాహుం పుండరీకనిభేక్షణమ్ ।
పృథివ్యాః స్సాగరాంతాయాః భర్తారం ధర్మచారిణమ్ ॥
ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణ మివ శాశ్వతమ్ ।
స్థండిలే దర్భసం స్తీరే సీతయా లక్ష్మణేన చ"

2 99 25 నుండి 28

భరతుడు రామాశ్రమమును సమీపించుచు మొదట ఆశ్రమము నుండి పైకెగయు యజ్ఞధూమమును చూచెను. (రామాశ్రమగతస్యాగ్నే ర్దదర్శ ధ్వజ ముచ్ఛ్రితమ్) దానినిబట్టి శ్రీరాముడు చిత్రకూటమున

నున్నను యథాపూర్వము విధిపూర్వకముగ అగ్న్యుపాసన జేయు చున్నట్లూహించెను

"య మేవాధాతు మిచ్ఛన్తి తాపసా స్సతతం వనే ।
తస్యాసౌ దృశ్యతే ధూమః సంకులః కృష్ణవర్త్మనః ॥
అత్రాహంపురుషవ్యాఘ్రం గురుసంస్కారకారిణమ్ః
ఆర్యం ద్రక్ష్యామి సంహృష్టో మహర్షి మివ రాఘవమ్"

2 99 12

వనములందు మహర్షులు ఎల్లప్పుడు అగ్నుపాసనా నిరతులై యుందురు వనవాసియైన రాముడు గూడ అగ్న్యుపాసనా తత్పరుడై యుండును అ యగ్నికుండము నుండి ధూమసంతతి పైకెగయుచున్నది గురుసంస్కారకారియైన రాముని మహర్షి విగా దర్శించబోవుచున్నాను భరతు డిట్లూహించుచు రాముని ఆశ్రమమును సమీపించెను.

"ప్రాగుదక్ప్రవణాం వేదిం విశాలాం దీప్తపావకామ్ ః
దదర్శ భరత స్తత్ర పుణ్యాం రామనివేశనే"

2 99 24

భరతుడు రామనివేశనమున అగ్నితో ప్రజ్వరిల్లు విశాలమైనవేదిని చూచెను తరువాత ఆ ఉటజమందు తా నూహించినట్లు జటామండల ధారియై చీరవల్కలవాసస్సును కృష్ణాజినమును ధరించి అగ్నివలె దివ్య కాంతులతో విలసిల్లు రాముని జూచెను దర్భసంస్తీర్ణ స్థండిలమున సీతా లక్ష్మణులతో ఉపవిష్టుడై యున్న రాముడు భరతునకు శాశ్వతబ్రహ్మవలె అనగా నిర్గుణ నిష్క్రియ శాంతస్వరూపుడైన పరమాత్మ వలె

సాక్షాత్కరించెను. అపుడు భరతునకు కలిగిన హృదయస్పందన మూహ కందరానిదే రాముని నిర్వికారస్వరూపము భరతుని రంజింపజేసినది అయోధ్యయం దున్నను రాముడు రాముడే ఆశ్రమమునం దున్నను రాముడు రాముడే రత్న మెచట ఏ తీరున నున్నను రత్నము యొక్క రత్నత్వ మవగతము గాదు అట్లే రాము డెచట ఏ రూపమున నున్నను లోకాభిరాముడే రమయతాం వరుడే.

లోకమున సాధారణముగ సింహాసనమును వదలి వనవాసమునకు వచ్చిన వారు దుఃఖాక్రాంతులై ప్రక్కనున్న వారితో తనకు కలిగిన కష్ట పరంపరల వర్ణించుకొనుచు కాలము గడపెదరు మహోదాత్తుడయిన రాము డట్లుగాక వనమున నున్నను మహర్షియై లోకక్షేమమునే భావన జేయుచు తత్సాధనకు ప్రధాన సాధనమైన అగ్న్యుపాసనాపరుడై యుం డెను. ఆ సన్నివేశము భరతుని హృదయమును స్పందింపజేసినది మోహింప జేసినది

శ్రీరాముడు భరతుని జూచినపుడు గతచరిత్రను ప్రస్తావించలేదు. రాజ్య విశేషముల నడిగెను. రాజధర్మముల నుపదేశించెను దానినిబట్టి శ్రీరామునకు రాజ్యకాంక్ష లేదని భరతున కవగతమైనది రామునకు తాను వచ్చిన కారణమును తెలియజేసెను వశిష్ఠాదు లెన్నో విధముల శ్రీరాముని అయోధ్యకు మరలి రమ్మని ప్రబోధించిరి రాము డంగీకరిం పడు భరతుడు సత్యాగ్రహము జేయుదునని ప్రతిన బూనెను మూర్ధాభి షిక్తులైన ప్రభువులకు సత్యాగ్రహము నిషిద్ధమని రాముడు వారించెను తుదకు రామపాదుకలను శిరసాగ్రహించెను ఎవ్వరును ఊహించని రీతిగా పాదుకాపట్టాభిషేకము గావించి రామపాదుకలను సేవించెను.

దీనిని బట్టి శ్రీరాముని ధర్మవీరము భరతుని రంజింపజేసినదే గాని బాధపెట్టలేదు లోకోత్తర పాదుకాపట్టాభిషేకము జేసి పదునాల్గు వత్సరములు రామపాదుకల నర్చించి శ్రీరాముని హృదయమున నిత్యారాధ్య దేవతగా ప్రతిష్ఠించుకొనిన భరతుడు రాముని దాస్యముచే రంజితుడే యయ్యెను మంధర కైకేయీల సంకల్పములు గాని అఖండసామ్రాజ్య వైభవముగాని భరతుని ఆనందింపజేయలేదు శ్రీరాముని దివ్యానుగ్రహ సంపదె శ్రీరామపాదుకా సంపాదనమే భరతుని ఆనందతుందిలుని గావించినది "రామో రమయతాం వరః" అను నిర్వచనము భరతుని యందు సార్థకమైనది

శ్రీరాముడు శత్రుఘ్నుడు

శత్రుఘ్నుడు భరతానుయాయి గాన భరతునివలె శత్రుఘ్నుడు గూడ శ్రీరామరంజితుడే శత్రుఘ్నుడు దుష్టచారిణియైన మంధరను హింసించి, పరుషవాక్యములతో కైకేయిని నిందించ బోయినపుడు భరతు డిట్లనును

"హన్యా మహ మిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీమ్।
యది మాం ధార్మికో రామో నాసూయే న్మాతృఘాతకమ్॥
ఇమా మపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః
త్వాం చ మాం చ హి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్॥"

శ్రీరాముడు నన్ను మాతృఘాతకునిగా వర్జించి ద్వేషింపకుండిన దుష్టచారిణి పాపాత్మురాలైన కైకేయిని నేను సంహరించెడి ఒడనే కాని కైకేయిని గాని మంధరను గాని బాధించినట్లు రామునకు తెలిసిన అతడు మనలతో మాటలాడడు రాముడు ధార్మికుడు ధర్మాత్ముడు అత నికి కైకేయి యందు గల మాతృభక్తి అపూర్వము మంధర గూడ రామానుగ్రహ పాత్రమే రాముని దృష్టిలో వారు దోషులు గారు రాముడే వారిల నేమి యన లేదు అనడు కనుక ఓశత్రుఘ్నా! నీవు మంధర జోలికి పోవద్దు

ఈ భరతుని మాటలతో శత్రుఘ్నుడు శాంతించి మంధరను వద లెను. రాముని ధార్మికత్వ మాతని హృదయమున మెరసినది రాముడాగ్ర హించు నను భావ మాతనిని శాంతింపజేసినది ఇట్లు రాముని ధర్మ వైభ వము శత్రుఘ్నుని గూడ ధర్మరంజితుని జేసినది రాముని మహోదాత్త ప్రకృతి భరతుని ముగ్ధుని కావించినది చిత్రకూటమున రామదర్శన మాతనిని సంమోహితుని గావించినది

రాముడు సీత

సీతారాములు లోకమున కాదర్శదంపతులు రాముడు తండ్రి యాజ్ఞతో సీతను వివాహమాడెను ధర్మబద్ధమైన భర్తృత్వ ము సంపా దించు కొనెను అట్లు సీత గూడ పితృదత్త యగుచు శ్రీరామ సహధర్మ చారిణి యైనది. రాముడు పట్టాభిషిక్తు డగుటకై వ్రతదీక్షితుడై నపుడు

సీతగూడ దీక్షితురాలైనది. తండ్రి యాజ్ఞతో రాముడు వనవాసమున కేగి నపుడు సీత భర్త ననుసరించినది పట్టాభిషేకము జరుగు నని దశరథు డనినపుడు ఆమె ఉప్పొంగలేదు భర్తతో వనమునకు పోవుటకు వెనుదీయ లేదు రాజసింహాసన మామెను రంజింపజేయలేదు వనవాస మామెను దుఃఖింపజేయలేదు ఆమెకు కావలసినది రామసాహచర్యమే। సింహాసన మధిష్టించినను ఉటజమున తాపసియై రామునితో వేది నలంకరించినను రాముడెల్లప్పుడు ఆమెకు రాముడే అయోధ్యయందు గాని అడవియందు గాని సీతను రంజింపజేసినది రాముని ధర్మవిగ్రహమే

"నగరస్థో వనస్థో వా శుభో వా యదివాz శుభః
యాసాం స్త్రీణాం ప్రియో భర్తా తాసాం లోకా మహోదయాః"
2 117 23

అని అత్రిమహర్షి ఆశ్రమమున సీతకు అనసూయాదేవి ఉప దేశించెను। "నగరమునం దున్నను వనమునం దున్నను స్త్రీలకు భర్తయే ప్రియుడు సేవ్యుడు అట్టి భర్త నారాధించిన వారికి ఉత్తమ లోకములు సంభవింపగలవు"

అపుడు సీత రాముని గూర్చి ఇట్లనును
"యాం వృత్తిం వర్తతే రామః కౌసల్యాయాం మహాబలః
తామేవ నృపనారీణా మన్యాస్వా మపి వర్తతే॥
సకృ ద్దృష్టా స్వపి స్త్రీషు నృపేణ నృపవత్సలః,

మాతృవ ద్వర్తతే వీరః మాన ముత్సృజ్య ధర్మవిత్"
అనురక్తాస్మి ధర్మేణ పతిం వీర్యవతాం వరమ్ ।
2 118 5, 6

శ్రీరాముని ధర్మనిరతియే తన నెల్లప్పుడు రంజింపజేయుచున్నట్లు సీత చెప్పినది సీతావచనము సీతకు రామునియందు గల ఆత్మీయత, తృప్తి, గౌరవములను తెలియజేయుచున్నది, దీనినిబట్టి నగరమునం దున్నను, వనమునం దున్నను, రాముడు సీతను రంజింపజేసినట్లు తెలియు చున్నది

రావణసంహారానంతరము సీతను రాముడు పరుషవచనములతో బాధ పెట్టినట్లు, సీతదుఃఖించి అగ్నిప్రవేశము చేసినట్లును, కన్పించను కాని తరువాతి శ్రీరాముని వాక్యములు పరిశీలించిన ఆ సంశయమునకు తావుండదు

"అవశ్యం త్రిషు లోకేషు న సీతా పాప మర్హతి
దీర్ఘకాలోషితాహీయం రావణాంతఃపురేశుభా"
"బాలిశః ఖలు కామాత్మా రామో దశరథాత్మజః ।
ఇతి వక్ష్యంతి మాం సంతః జానకీ మవిశోధ్య హి ।
"అనన్య హృదయాం భక్తాం మచ్చిత్తపరివర్తినీమ్ ।
అహ మప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్
"ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః

ఉపేక్షే చాం వైదేహీం ప్రవిశన్తీం హుతాశనమ్"
"అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా"
విశుద్ధా త్రిషు లోకేషు మైథిలీ జనకాత్మజా
న హి హాతు మియం శక్యా కీర్తి రాత్మవతా యథా

యుద్ధ   121 13 to 20

లోకమునకు "సీతవిశుద్ధ" యని తెలుపుటకే

సీత అగ్నిప్రవేశము సీతయం దెట్టి దోషము లేదు సీత నాకంటె భిన్నురాలు కాదు

రాము డిట్లు మాట్లాడు నపుడు సీతాహృదయ మెంత యుప్పొంగెనో। రాముడు సీతను సదా రంజింపజేసెనే గాని బాధపెట్ట లేదు సీతా విషయమున గూడ రాముడు రాముడే ।

మయిభావ స్తు సీతాయాః సర్వదా వినివేశితః
మమా ఎ భావ స్సీతాయాం సర్వదా వినివేశితః

కిష్కింధ 1 51

ఎల్లప్పుడు సీతాహృదయము నాయందు లగ్నమై యుండును నా హృదయము సీతయందే లగ్నమై యుండును. అని రాముడు సీతావిషయక భావమును లక్ష్మణునితో చెప్పుకొనెను ఇట్టిది రామ హృదయమని అర్ధాంగి యైన సితకు తెలియును కాని సీత సదా శ్రీరామ సౌందర్య సం

శ్లేషిత హృదయ కాన ఆమె హృదయమున నెప్పుడును దుఃఖము ప్రవేశింపజాలదు.

"అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్।
తేనేయం సచ ధర్మాత్మా ముహూ ర్త మపి జీవతి "

సుందర 15 52

అని లంకయందు హనుమంతుని హృదయాంతర్గత మనన మీ విషయమునే వివరించుచున్నది

శ్రీరాముడు వాలి

రామబాణహతుడైన వాలి దుఃఖించినట్లు కన్పించును. వాలి మున్ముందు రాము నెన్నో విధముల నిష్ఠురము లాడెను. రాముడు ధర్మ రహస్యముల నుపదేశింప తుదకు రాముని ధర్మవిగ్రహునిగా దర్శించి దుర్భాషలాడినందులకు క్షమించు మని వేడును

"శరాభిత ప్తేన విచేతసా మయా ప్రభాషిత స్త్వం య దజానతా విభో
ఇదం మహేంద్రోపమ భీమవిక్రమ ప్రభాషిత స్త్వం క్షమ మేహరీశ్వర"

కిష్కింధ 13 6

దీనిని బట్టి తనను సంహరించిన రాముని వాలి శత్రువుగా జూడక దైవముగానే దర్శించెను కనుక శత్రువై వాలి విషయమున గూడ

రాముడు రాముడే! వాలి శత్రువుగా గాక రామభక్తుడుగా రామానుగ్రహ పూతుడుగా మరణించెను

రాముడు రావణుడు

శ్రీరాము డెంత లోకరంజకుడో రావణు డంత లోకభయంకరుడు రావయతీతి రావణః రావణుడు శ్రీరామునకు చెప్పరాని అపచారము చేసెను పరదారాపహరణము దోష మని ఎందఱు చెప్పినను, కామ మోహితుడైన రావణుడు వినడు సీతను స్వాధీనపరచుకొనవలె నని కలలు గనును యుద్ధ మారంభమైన నపుడు క్రమముగ మంత్రులు సుతులు, సోదరులు, సేనాధిపతులు మరణింతురు అందఱు మరణించు చున్నను రావణుడు యుద్ధవిముఖుడు కాలేదు రాముని గూర్చి రావణుడు పూర్వము వినియుండెను రాము నిపుడు కన్నులార గాంచుచుండెను నిరంతరము హృదయమున నవ్యక్తరూపముతో వెలయు రామచంద్రు డిపుడు సాక్షాత్కరించెను పూర్వపు రావణుడు వేఱు ప్రకృతము రావణుడు వేఱు రావణున కిప్పుడు మరణభీతి లేదు రాముని చేతిలో మరణించుటయే అతని కిప్పుడు లక్ష్యము "జేతవ్య మితి కాకుత్స్థః మర్తవ్య మితి రావణః" అన్నట్లుగా ఇరువురిమధ్య యుద్ధము జరిగెను రాముని జూచిన కొలది, భావన జేసిన కొలది, తన నుద్ధరించుట కవత రించిన కల్పవృక్షముగా రాముడు గోచరించుచున్నాడు. సీత ఆ కల్ప వృక్షమున వికసించిన ఫలప్రదమైన పుష్పముగా గోచరించుచున్నది.

యుద్ధమునకు బయలుదేరు రావణుడు తన యనుభూతి నిట్లు వర్ణించు కొనెను

"రామవృక్షం రణే హన్మి సీతాపుష్పఫలప్రదమ్ ।
ప్రశాఖా యస్య సుగ్రీవో జాంబవా న్కుముదో నలః ।
మైందశ్చ ద్వివిద శ్చైవ హ్యంగదో గంధమాదనః ।
హనుమాం శ్చ సుషేణ శ్చ సర్వే చ హరియూథపాః"
"సుగ్రీవాది శాఖాప్రశాఖలతో నొప్పుచు సీతాపుష్పఫల ప్రదమైన రామవృక్షమును యుద్ధమున (వధింతును)ఛేదింతును"

యుద్ధ 99 4

కథాగమనము ననుసరించి స్థూలదృష్టితో చూచినపుడు పై మాటలు రావణుని వీరప్రసంగముగా కన్పించును. హతశేషులైన పరివారము ముందు రావణుడు "రామవృక్షమును ఛేదింతు నని బింకముగ పలికినట్లు తోచును ఎవరైనను ఈ శ్లోకము నట్లే యర్థము చేసికొనెదరు. కాని సూక్ష్మదృష్టితో పరిశీలించినపుడు రావణుని అంతరాంతరాళములోని భావ మవగత మగును ఇచట రావణుడు రామవృక్షమును 'ఛేదింతును' అని సాక్షాత్తుగ అనకుండ "సీతాపుష్పఫలప్రదం రామవృక్షం హన్మి" యని అనుచున్నాడు హన్మి అనగా" "చంపుదును" అని అర్థము "హన్మి" అను పదము సాధారణముగ జంగమములైన ప్రాణివిషయమున ప్రయోగింపబడును వృక్షలతాదుల విషయమున ప్రయోగము లరుదు

మరియు "సీతాపుష్ప ఫలప్రదం" అను విశేషణము గూడ నిచట గంభీ రార్థద్యోతకి మగుచున్నది లోకమున పుష్పఫ ప్రదమైన వృక్షము నాశ్ర యించి సేవించి తద్వారా తత్ఫలితములను పొందుదురేగాని ఛేదింపరు "సీతాపుష్పఫలప్రదం" అను విశేషణము వృక్షము యొక్క ఛేదనావశ్య కతను సూచించక పోగా వృక్షము యొక్క పరిరక్షణావశ్యకతను ప్రేమతో ఆదరముతో సేవించ వలసిన ఆవశ్యకతను సూచించు చున్నది.

వృక్షము అందరకు ఆశ్రయ మిచ్చుచున్నది తనను పోషించిన వారికి, ఛేదించుచున్న వారి కిద్దరకు సమానముగనే ఆశ్రయ మిచ్చును. వృక్షము ఛేదించువాడు నగము ఛేదించి మధ్యాహ్న సమయమున ఆ వృక్షచ్ఛాయయందే శ్రమ దీర్చుకొనును. ద్వేష భావము లేక ఆశ్రయ మిచ్చి ఆ వృక్ష మాతనిని రంజింపజేయును లోకమున సామాన్య వృక్ష ములే అట్లుండ ఇక రామవృక్ష విషయమున వేఱుగ చెప్పబనిలేదు రావణు డెంత అపకారమొనర్చినను రాము డనుగ్రహబుద్ధితో రావణున కాశ్రయ మిచ్చును రాముని రామత్వము నెరిగిన వాడు కనుకనే రావణుడు యుద్ధ రంగమున తాను కృతకృత్యు డగుటకు రామవృక్షము నాశ్రయింప దల చెను కనుకనే తన యుదాత్తతకు భంగము లేకుండ గంభీరముగ "రామ వృక్షం రణే హన్మి" యని యనుచున్నాడు హన్మి' యను పదము "హన హింసాగత్యోః" అను ధాతునిష్పన్నము హన ధాతువునకు "హింసించుట"

యను అర్థము గాక గత్యర్థము కూడ కలదు దానిని పట్టి "పోవుట ఆశ్ర యించుట" అని గూడ అర్థమును గ్రహింపవచ్చును గతులు విభిన్నములు ఇచట రాముని ఆశ్రయించుటయే గతి కనుక రావణుడు కల్పవృక్షరూపు డగు శ్రీరాము నాశ్రయించె నని భంగ్యంతరముగా సూచించుచున్నా డని గ్రహింపనగును

సీత నపహరించవలె నని సంకల్పము కలిగి నప్పటినుండి బహు ముఖముల రామమహత్త్వమును రావణుడు వినుచున్నాడు సముద్రమును దాటి లంకను జేరి నప్పటినుండి శ్రీరాముని శౌర్యవీర్య పరాక్రమాదులను తెలిసికొనుచునేయున్నాడు స్వయముగ రామునితో యుద్ధము చేయ మొదలుపెట్టి నప్పటినుండి రావణుని హృదయమున భావము పరివర్తన జెందుచున్నది అట్లే సీతావిషయమున గూడ భావము పరిణతిజెందినది పూర్వము రామునితో పని లేకుండగనే సీతను రావణుడు పొందదలచి అపహరించెను కాని ఇపు డామె రామవృక్షమున వికసించిన పుష్పముగా దర్శనమిచ్చుచున్నది తా నిప్పుడు రామవృక్షము నాశ్రయించి ఆ పుష్ప మును సేవించినపుడు పుష్పము తనకు ఫలప్రదము కాగలదు రామవృక్ష మున వికసించిన పుష్పము సామాన్యపుష్పము గాదు అది బ్రహ్మ విద్యారూపము

"అహ మౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః

వ్రతస్నాతస్య శుద్ధస్య విద్యేవ విదితాత్మనః

సుందరం 21 17

అని సీత తాను బ్రహ్మవిద్యాస్వరూపిణి నని పూర్వము ఉపదేశించి యున్నది అంతేగాక

"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"

సుందరం 21 16

అని తాను రాఘవుని దివ్యతేజోరూప మని తెలిపియున్నది, కాని అపుడామె చెప్పినది అనుభూతికి రాలేదు ప్పుడు అనుభూతికి వచ్చినది కనుకనే సీతను రామరూప వేదకల్పవృక్షమున వికసించిన బ్రహ్మవిద్యా రూపిణి యైన పుష్పముగ దర్శింపగలిగినాడు పరమపురుషుడైన శ్రీరాముని సేవించిన గాని ఆ పుష్పము లభ్యము గాదు

"ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైతవాసన "

అను సూక్తి ననుసరించి పరమేశ్వరస్వరూపుడైన శ్రీరామునితో యుద్ధ మాచరించితదనుగ్రహమును సంపాదింపదలచెను కనుకనే రావణుడు "రామవృక్షం రణే హన్మి సీతాపుష్పఫలప్రదం" అని అనుచు యుద్ధభూమి యందు రామవృక్షము నాశ్రయించెను ఆనందంతో రాముని చేతియందు రామసన్నిధిలో తనువును చాలించెను రాముని చేతిలో తనువు చాలించుటయే రామవృక్షాశ్రయణము

దీనిని బట్టి శ్రీరాముడు ప్రత్యక్షప్రపన్న శత్రుహృదయమును

గూడ రంజింపజేసె నని తెలియును కనుక రావణవధలో గూడ రాముడు రాముడే లోకాభిరాముడు

రాముడు విభీషణుడు

రావణుని సంహరించి లంకారాజ్యమునకు పట్టాభిషిక్తుని జేసినందు వలన విభీషణునకు రామునియం దాదరాతిశయ మని కథాభాగము ననుసరించి భావింపవచ్చును కాని రాముని రామత్వమును పూర్వము గుర్తెరిగిన వాడు కాబట్టియే సోదరులను లంకను విడిచి ఆత్మవిశ్వాసముతో రాముని శరణు జొచ్చెను శత్రుసోదరుడు శరణాగతు డగుటను సుగ్రీవాదు లందఱు సందేహించిరి, విభీషణున కాశ్రయ మీయవల దనిరామున కెన్నో విధముల బోధించిరి సంస్కారక్రమసంపన్నుడైన హనుమంతుడు మాత్రము విభీషణున కాశ్రయ మీయ దగునని చెప్పెను విభీషణునకెంత విశ్వాసమున్నను,రాముడురమ్మని చెప్పువరకతడాకసమునందే యుండెను

"సకృ దేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ"
"అనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా
విభీషణో వా సుగ్రీవ యది వా రావణ స్స్వయమ్"
"నన్ను శరణు జొచ్చిన వారికందరకు అభయ మిచ్చుచున్నాను,
విభీషణుడు వచ్చినా రావణుడు వచ్చినా అభయ మీయగలను"

యుద్ధ 18 33 34

అని పైవిధముగ రాము డన్నప్పుడు విభీషణుడు రావణుని సమీ పించెను విభీషణునకే గాదు రావణునకు గూడ అభయ మీయగల నను మాట ఎంతటివారి నై నను రంజింపజేయును

"యాచ్ఞా మె ఘా వర మధిగుణే నా ధమే లబ్ధకామా" అని కాళి దాసమహాకవి అన్నట్లు (మేఘసందేశమున) విభీషణుడు ఉత్తమపురుషునే ఆశ్రయించెను (కర్తవ్యో మహదాశ్రయః) కనుకనే విభీషణుని రామ శరణాగతి ఫలోన్ముఖమై శ్రీరామ విజయమునకు కారణమైనది విభీషణుని పట్టాభిషేకమునకు దారితీసినది విభీషణుడు రామదర్శనమునకు రాకపూర్వమే రామరంజితుడు కనుకనే రావణునకు రామమాహాత్మ్యమును బోధించెను దీనినిబట్టి విభీషణుని దృష్టిలో కూడ రాముడు సదారాముదే సుజనాభిరాముదే

రాముడు శూర్పణఖ.

శూర్పణఖ రాముని వృత్తాంత మడిగి నపుడు ఋజుబుద్ధితో రాముడు తన వృత్తాంతము నంతయుచెప్పెను.

"అనృతం న హి రామస్య కదాచి దపి సంమతమ్ః
విశేషేణాశ్రమస్థస్య సమీపే స్త్రీ జనస్య చ"

అరణ్య 15 15

ఎటువంటి స్థితియందు గూడ శ్రీరాము డనృతమును పలుకుట

కష్టబడడు అందును ఆశ్రమవాసియగు స్త్రీ జనసంనిధానమునందు అన్యత్ర ప్రసక్తికసలు తావే లేదు కనుకనే శ్రీరాముడు శూర్పణఖతో తన యధార్థ వృత్తాంతము చెప్పెను

అయితే శూర్పణఖ తనను భార్యగా గ్రహించుమని రాము కోరినది కామపాశావపాశితయైన శూర్పణఖతో రాము డిట్లనెను

"కృతదారోఽస్మి భవతి భార్యేయం దయితా మమ
త్వద్విధానాం తు నారీణాం సుదుఃఖా ససపత్నతా"
అనుజ స్త్వేష మే భ్రాతా శీలవాన్ప్రియదర్శనః ।
శ్రీమా నకృతదారశ్చ లక్ష్మణో మమ వీర్యవాన్"
అపూర్వీ భార్యయా చార్థీ తరుణః ప్రియదర్శనః ।
అనురూప శ్చ తే భర్తా రూపస్యాస్య భవిష్యతి"
ఏవం భజ విశాలాక్షి భర్తారం భ్రాతరం మమ ।
అసపత్నా వరారోహే మేరు మర్కప్రభా యథా॥

ఓ శూర్పణఖా నేను కృతదారుడను అనగా నా భార్య సీత నా సన్నిధి యందేగలదు మరల నీవు గూడ భార్య వైన, సీతతో నీకు సవతిబాధ గలుగును నా తమ్ముడు అసన్నిహితభార్యుడు అనగా భార్య సంవిధాన మున లేనివాడు కనుక నీ వాతనికి భార్యగా నుండవచ్చును

శ్రీరాముని మాటలను బట్టి శూర్పణఖ లక్ష్మణుని సమీపించుట

లక్ష్మణుడు త్రిప్పిపంపుట   ఇట్లు తరువాత కథాభాగము నడచును

ఇచట తనకు వివాహమైనట్లును, లక్ష్మణునకు వివాహము కాలే దనియు అందువలన అతనికి భార్య కాగల వని శూర్పణఖకు రాముడు చెప్పినట్లును ఆ వెనుక రాము డనృతదోషదూషితుడని కొందరనుట వినబడుచుండును

గురుణాపి సమం హాస్యం కర్తవ్యం కుటిలం వినా" అను న్యాయము ననుసరించి ఉదాత్తహాస్యము శాస్త్రసంమత మగుటవలన రాముడు లక్ష్మణుని విషయమున హాస్యము పలికె ననిసంప్రదాయాను బద్ధముగా వ్యాఖ్యాతలు వివరించిరి అట్లు గాకుండా గూడ "కృతదారః" అను పదమునకు సన్నిహితభార్యః అని, "అకృతదారః" అనగా "అసన్ని హితభార్యః" అని అర్థమును గ్రహించిన దోషము లేదని వ్యాఖ్యాతలు వివరించిరి ఆ దృష్టితోనే శ్లోకార్థములను సమన్వయము జేసిరి కనుక మహోదాత్త పురుషున కనృతదోషము వర్ణించుట వృద్ధసంమతము గాదు.

తన మాటల కపార్థము కల్పించి నాయకునకు అనృతదోష మంట గట్టుదు రను దృష్టితోనే వాల్మీకి మహర్షి శూర్పణఖాప్రస్తావనారంభములో

"అనృతం న హి రామస్య కదాచి దపి సంమతం

విశేషేణాశ్రమస్థస్య సమీపే స్త్రీజనస్య చ"

అని శ్రీరాముని స్వభావమును స్పష్టీకరించి యున్నాడు అతనికి సహజస్వభావమే గాక ఆశ్రమస్థ స్త్రీజనముతో విశేషించి అనృత విషయ మున శ్రద వహించునని చెప్పుటచే శూర్పణఖ దగ్గర శ్రీరాము డనృతక్షి

వలికెననుభావమునకు తావుండదు కనుక శూర్పణఖాసన్నివేశము రాముని రామత్వమునకు భంగకరము గాదు సహృదయులట గల వ్యాఖ్యానములు పరికించగలరు

రాముడు మహర్షులు

ధర్మాచరణము ద్వారా ధర్మోపదేశము ద్వారా లోకమును రంజింప జేసిన రాముని రామత్వము మహర్షుల విషయమున తత్త్వతః సార్థక మగుచున్నది రంజకత్వ మన లోకోత్తరాహ్లాదజనకత్వము అధికారి భేదము ననుసరించి ఈ ఆనందానుభూతి తరతమ భేదములతో విలసిల్లుచుండును. వారి ఆనందము అకామహత శ్రోత్రియానందము ఆ యానందము వినిర్మలము నిత్యము కనుకనే తత్త్వతః లోకోత్తర మగుచున్నది పరబ్రహ్మ సాక్షాత్కారము వలననే తత్త్వదర్శనము వలననే అట్టి లోకోత్తరానందానుభూతి యేర్పడచున్నది దుష్టశిక్షణ శిష్టరక్షణ జేసి లోకము నుద్ధరించుట కవతరించిన పరమేశ్వరుడే శ్రీరాముడని మహర్షులు దర్శించిరి కనుకనే వా రట్టి ఆనందానుభూతిని పొందిరి

విశ్వామిత్రుడు సిద్ధాశ్రమమున యాగము సేయ దలచి యాగరక్షణకై శ్రీరాముని దీసికొని పోవుటకు దశరథుని సమీపించెను విశ్వామిత్రుడరణ్యమునం దున్నను, అయోధ్యయం దున్నను, రామ మహత్త్వము నెఱిగి యుండెను రాముని రామత్వము మహర్షులకే గద తెలియును అయోధ్యలో ఇంట నున్నను, కన్నకొడుకైనను, దశరథుడు రాముని మహిమను

తెలిసికొన లేదు కనుకనే విశ్వామిత్రుడు కోరినపుడు రాముని పంపవనెను. అపుడు విశ్వామిత్రుడు ఇట్లనును

"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్
వశిష్ఠోzపి మహాతేజాః యే చేమే తపసి స్థితాః"

"నీ కుమారుడు లోకోత్తరపురుషుడు ఆ మహాత్ముని స్వరూపమును నేను వశిష్ఠుడు తపస్సంపన్నులైన మహర్షులు ఎఱుగుదురు"

విశ్వామిత్రుని యీ మాట ననుసరించి రాముని లోకాభిరామత్వము మహర్షి హృదయైకవేద్యమని తెలియుచున్నది ఈ విషయము శ్రీరాముని సుతీక్ష్ణమహర్షి ఆశ్రమ ప్రవేశము ఋజువు చేయుచున్నది.

రాముడు సుతీక్ష్ణమహర్షి ఆశ్రమమునకు వచ్చినప్పుడు ఆమహర్షి ఇట్లనుచున్నాడు

"స నిరీక్ష్య తతో ధీరో రామం ధర్మభృతాం వరమ్
సమాశ్లిష్య చ బాహుభ్యాం ఇదం వచన మబ్రవీత్"
"స్వాగతం తే రఘుశ్రేష్ఠ రామ సత్యభృతాం వర ।
ఆశ్రమోzయం త్వయాz క్రాంత స్సనాధ ఇవ సాంప్రతమ్"
"ప్రతీక్ష మాణ స్త్వామేవ నాzరోహేzహం మహాయశః
దేవలోక మితో వీర దేహం త్యక్త్వా మహీతలే"

ఓ రామా ! నిన్ను కన్నులార గాంచి ధన్యత నొందుటకే తనువు వీడి స్వర్గమునకు బోకుండ నీ దర్శనమునకు వేచియున్నాను

సుతీక్ష్ణమహర్షి ఎక్కడో కాననమున నుండి గూడ రామ మాహాత్మ్యమును గుర్తెఱుగుటచే ఆ మహాత్ముని దర్శనమున కింతకాలము నిరీక్షించి యుండెను ఇపుడు కనులార గాంచి రామసాక్షాత్కారముతో కృతకృత్యుడాయెను. దీనిని బట్టి లోకసిద్ధమైన పదార్థ మేదియు మహర్షులను రంజింపజేయ లేదనియు లోకసిద్ధపదార్థము లెన్ని యున్నను, ఎంతమంది ఆప్తు లున్నను, అన్నిటికంటె, అందరకంటె తత్త్వతః రంజింపజేయు వాడు రాముడే నని తెలియుచున్నది రామలక్ష్మణులు మతంగాశ్రమమునకు జేరినపుడు శబరి వారలతో ఇట్లనుచున్నది

"చిత్రకూటం త్వయి ప్రాప్తే విమానై రతులప్రభై : ।
ఇత స్తే దివ మారూఢాః యా నహం పర్యచారిషమ్
తైశ్చాహ ముక్తా ధర్మజ్ఞైః మహాభాగై ర్మహర్షిభిః ।
ఆగమిష్యతి తే రామ స్సుపుణ్య మిద మాశ్రమమ్"
సతే ప్రతిగ్రహీతవ్య స్సౌమిత్రిసహితోऽతిథిః ।
తంచ దృష్ట్వా వరాన్ లోకా నక్షయాం స్త్వం గమిష్యసి"

అరణ్య 74 14 to 16

ఓ రామా! నీవు చిత్రకూటము జేరినపుడు ఈ ఆశ్రమమున నాచే ఆరాధింపబడు మతంగశిష్యులు దివ్యవిమానముల నధిరోహించి ద్యులోక

మునకు బోయిరి వారు పోవుచు "శ్రీరాముడీ యాశ్రమమునకు లక్ష్మణ సమేతుడై రాగలడు- శ్రద్ధాభక్తులతో రామునకు అతిధిమర్యాదలు జరిపి ఆ మహాత్ముని యనుగ్రహమున నీవు ఉత్తమలోకముల బొందగ వు" దీనిని బట్టి శ్రీరాముని మహత్త్వమును అందరిమహర్షుల వలె మతంగ శిష్యులు దర్శించినట్లు తెలియుచున్నది ఇట్లు మహర్షి హృదయరంజకుడు తనుకనే శ్రీరాముడు రమయతాం వరుడుగా కీర్తింపబడుచున్నాడు సర్వ లోక రంజకు డైనాడు

శ్రీరాముడు హనుమంతుడు

ప్రప్రథమమున రామలక్ష్మణులను ఋశ్యమూకమున హను మంతుడు చూచును సుగ్రీవాజ్ఞ ననుసరించి శఠబుద్ధితో భిక్షువేషమున వారిని సమీపించును రామదర్శనసమనంతరమే భిక్షువేషమున నున్న హనుమంతుడు తత్త్వతః భిక్ష వయ్యెను అపుడు అచట హనుమంతునకు గలిగిన రామసాక్షాత్కార మాతనిని రామదూతను గావించినది కనుకనే

"యత్ర యత్ర రఘునాధకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిం బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్"అను కీర్తిని హనుమంతుడు రామానుగ్రహమున సంపాదించుకొనినాడు శ్రీరామునిచె రంజితులైన వారిలో ప్రధానుడు హనుమంతు డనవచ్చును

ఈ విధముగ శ్రీరాముడు వారివారి యర్హతల ననుసరించి అంద రిని రంజింపజేయును గాన శ్రీరాముడు సార్థకనామధేయుడే యగు చున్నాడు.

ఈ దృష్టితో చూచినపుడు రామాయణమున ప్రతివిన్న సన్నివేశము ప్రత్యక్షముగనో పరోక్షముగనో రామనామ సార్థకతను సూచించుచున్నదగుచున్నది. శ్రీరాముడు వారి వారి యర్హతల ననుసరించి ప్రవృత్తి మార్గమున సంచరించు వారికి, నివృత్తి మార్గమున సంచరించు మహాత్ములకు రాముడై లోకాభిరాముడై ఆత్మారాముడై సాక్షాత్కరించుచున్నాడు అట్లు రాముని ఆత్మారామునిగ దర్శించిన వాల్మీకి మహర్షి దివ్యానుభూతియే "రామో రమయతాం వరః" అను భూతార్థవ్యాహృతి

రామాయణమున పై విధముగ ఆ యా పాత్ర హృదయ పరిశీలనాదుల వలన రాముడు వీరు వారను భేదము లేక అందరను రంజింప జేసినట్లవగత మగుచున్నందున శ్రీరాముడు సార్థకనామధేయు డని గ్రహింపవలెను శ్రీరాముని రంజకత్వవిషయమున భూతభవిష్యద్వర్తమానములందు సందియము కలుగదు కలుగలేదు కలుగబోదు ఎట్టి సందియము లేక భక్తితో శ్రీరాము నారాధించిన వారికి శ్రీరాముడు రమయతాం వరుడై సాక్షాత్కరించును "రామో రమయతాం వరః"అను వాల్మీకిమహర్షి యుపదేశ మందరను సదా రంజింపజేయుగాక

"నిముక్తభారతీరమ్యః హరిసోదర సేవితః
స రంజయతు నో నిత్యం రామో రమయతాం వరః।"

# రామాయణము - సంధ్యోపాసన

# ( గాయత్రి )

రామాయణమహాకావ్యము కాంతాసంమితముగ ఉపదేశించిన వైదిక ధర్మములలో సంధ్యోపాసన అగ్రస్థాన మలంకరించుచున్నది. "అహ రహ స్సంధ్యా ముపాసీత" అను శ్రుత్యుపదేశమును రామకథాసం విధానము ద్వారా లోకమున కందించుటయే రామాయణలక్ష్యము శాంతి సౌభాగ్యములకు, ఆత్మోద్ధరణమునకు సంధ్యోపాసనయే సంధ్యాతత్త్వ దర్శనమే ప్రధానావలంబము కనుకనే వేదమున సూత్రప్రాయముగ జేయబడిన ఉపదేశమునకు భాష్యప్రాయ మగుచు రామాయణ మడుగడు గున సంధ్యాప్రాశస్త్యమును తదుపాసనావశ్యకతను, గుర్తింపజేయు చున్నది

సంధ్యా శబ్దము నిర్వచనము

"యౌగికం యోగరూఢం చ తథా లాక్షణికం తతః

సంధ్యాపదం త్రిధా ప్రోక్తం స్మృతిషు స్మృతి కర్తృభిః"

సంధ్యాతత్త్వసుబోధిని 14

స్మృతులయందు సంధ్యాశబ్దము యౌగికము, యోగరూఢము, లాక్షణికము అని మూడు విధములుగా ప్రయోగింపబడినది

సంధ్యాశబ్దము యౌగికము

యోగ మన అవయవశక్తి (పదవ్యుత్పత్తి) అవయవశక్తితో అర్థమును బోధించు శబ్దము యౌగికము "సంధౌ ఉపాస్యా సంధ్యా" అని సంధ్యాశబ్దవ్యుత్పత్తి స్మృతియే ఈ వ్యుత్పత్తిని సూచించినది

"ఉపాస్తే సంధివేలాయాం నిశాయా దివసస్య చ,

తా మేవ సంధ్యాం తస్మాత్తు ప్రవదంతి మనీషిణః"

వ్యాస స్మృతిః

అహోరాత్రసంధియందు ఉపాసింపబడు దేవత గాన (సంధౌ ఉపాస్యా) ఆమె సంధ్య యగుచున్నది ఇట్లు అవయవార్థమును బోధించుచున్నందన ఇచట సంధ్యా శబ్దము యౌగికము.

"సంధియందు ఉపాసింపబడునది" అని యర్థము

సంధిస్వరూపమును తెలిసికొనిన సంధ్యాస్వరూపము స్పష్టముగా తెలియును

సంధి సంధ్య సంహిత

సంధి సంధ్యా సంహితలు మూడు అవినాభావ సంబంధము కలిగి

యుండును సంహిత యున్నప్పుడే సంధి యేర్పడును ఆ సంధియందు సంధ్య విరాజిల్లుచుండును

విభిన్నముగా నున్న రెండు పదార్థములు కలియుట సంధి "సంధిః శ్లేషే" అని అమరము రెండు కలియుట శ్లేష రెండు కలియుటకు ఆ రెండు అత్యంతసన్నిహితములై యుండుటయే సంహిత

"పర స్సన్నికర్ష స్సంహితా"అని పాణిని సూత్రము (1 4 109) వర్ణానా మతిశయితః సన్నిధిః సంహితా సంజ్ఞ స్స్యాత్

వర్ణములయొక్క అతిశయితసన్నిధి సంహిత యని వ్యాకరణ శాస్త్రము వర్ణవిషయక సంహితాలక్షణము నితరత్ర గూడ గ్రహింప వచ్చును కనుక వర్ణవిషయమున వలె కాలాదివిషయమున గూడ సంహితా వ్యవహారమును గ్రహింప నగును

తైత్తిరీయోపనిషత్తు పంచసంహితలు

తైత్తిరీయోపనిషత్తు పంచ సంహితలను పంచ సంధులను వర్ణించినది

"అధిలోక మధిజ్యౌతిష మధివిద్య మధి ప్రజ
మధ్యాత్మం తా మహాసంహితా ఇత్యాచక్షతే ।"

అధిలోకము అధిజ్యౌతిషము అధివిద్యము అధిప్రజము అధ్యాత్మము అనునవి మహా సంహితలు వర్ణవిషయమున చెప్పబడిన సంహిత

పృధివ్యాది విషయమున మహాసంహిత యైనది అచట మహత్త్వము దర్శ నీయము మహా సంహితా స్వరూపమును శ్రుతియే ఇట్లు వివరించు చున్నది

"అథా ధిలోకం పృధివీ పూర్వరూపం ద్యౌ
రుత్తరరూపం ఆకాశస్సంధిః వాయు స్సం
ధానం ఇత్యధిలోకమ్ "

అధిలోకసంహితయందు పృధివి పూర్వరూపము. ద్యులోక ముత్తర రూపము ఆకాశ మీ రెండిటికి సంధి, సంధి యేర్పడుటకు సంధానము వాయువు

వాయువు చలనాత్మకము వాయువు చలించుటకు ఆకాశ ముండ వలెను ఆ ఆకాశము ద్యావాపృథువుల సంధిరూపము ఈ సంధియందు (ఆకాశమునందు) ద్యావాపృథువులు రెండును కలియుచున్నవి. ఆ కలయిక యే సంధి ఏః శ్రుతి ననుసరించి ద్యావాపృథువుల సంధి ఆకాశ మని గుర్తింపవలెను

అధిజ్యోతిషసంహిత

అధిజ్యోతిషసంహితయందు పూర్వరూపము అగ్ని ఉత్తరరూప మాదిత్యుడు అపస్సు (ఉదకము) ఈ రెండింటికి సంధి వైద్యుతాగ్ని సంధానము

"అగ్నిః పూర్వరూపం అదిత్య ఉత్తరరూపం అప స్సంధిః వైద్యుత స్సంధానం ఇ త్యధిజ్యోతిషమ్'' శ్రుతి

అధి విద్యసంహిత

విద్యావిషయమును బోధించు సంహిత అధివిద్యసంహిత ఈ సంహితయందు గురుశిష్యులు పూర్వోత్తరరూపులు విద్య గురుశిష్య సంధిరూపము అచట సంధానము ప్రవచనము

"ఆచార్యః పూర్వరూపం అంతేవా స్యుత్తరరూపమ్ ।

విద్యా సంధిః ప్రవచనగ్ం సంధానం ఇత్యధివిద్యమ్'' శ్రుతి

అధిప్రజసంహిత .

ప్రజాతంతు స్వరూపమును విశదీకరించు సంహిత ప్రజాసంహిత ఇచట తల్లిదండ్రులు పూర్వోత్తరరూపులు ప్రజ సంధి ప్రజననము సంధానము

"మాతా పూర్వరూపం పితో త్తరరూపం ప్రజాసంధిః

ప్రజననగ్ం సంధానమ్ ఇ త్యధిప్రజమ్" శ్రుతి ।

ఇచట ప్రజననము పరస్పరభిన్నులైన తల్లిదండ్రులకు పరస్పరా నురాగజననము ద్వారా వారి హృదయములకు తాదాత్మ్య మేర్పరచి అతి శయిత సన్నికర్ష రూప సంహితాభావమును రూపొందించును అట్టి హృదయ

ములతో విలసిల్లు తల్లిదండ్రుల పరస్పరానందగ్రంధిరూపమే సుప్రజ (ఉపాస్య సంధిరూప సత్సంతతి)

అట్టి సుప్రజ (అపత్యము)తల్లిదండ్రుల తాదాత్మ్య భావనాసంకేతము కనుకనే అట్టి సుప్రజను శ్రుతి సంధి యనినది (ప్రజాసంధిః)

ఈ శ్రుత్యుపదిష్ట ప్రజాసంధి తత్త్వమునే కాంతాసంమితముగా భవభూతి మహాకవి యిట్లు వర్ణించెను

"ప్రసవః ఖలు ప్రకర్షపర్యంతః స్నేహస్య పరం
చైత దన్యోన్యసంశ్లేషణం పిత్రోః" ,
"అంతఃకరణ తత్త్వస్య దంపత్యోః స్నేహసంశ్రయాత్
ఆనందగ్రంథి రేకో zయ మపత్య మితి పఠ్యతే ।"

ఉత్తరరామచరిత 3 1

"దంపత్యోః జాయాపత్యోః అంతఃకరణతత్త్వస్య హృదయవస్తునః స్నేహసంశ్రయాత్, స్నేహః ప్రీతిః, శ్రయః సమ్యక్ శ్రయణం అవిశ్లేష ఇతి యావత్ స్నేహ శ్చ సంశ్రయ శ్చేతి సమాహార ద్వంద్వః తస్మాన్నిమిత్తా దిత్యర్థః అన్నా ద్వసతీ త్యత్ర యథా అన్నఫలకో వాస ఇతి బోధః తద్వ దత్రాపి స్నేహసంశ్రయ ఫలకః ఆనందగ్రంథి రితి బోధః ఏకః ముఖ్యః ఏతేన దాంపత్యాపేక్షయా వైలక్షణ్యం సూచ్యతే తథావిధానందగ్రంధః ఆనందమయగ్రంథిః ఆనందపదేన గ్రంధ్యంతరవ్యావృత్తిః

అపత్య మితి పర్యతే పరిభాష్యతే పరిభాషా చేహ యోగరూఢిః తత్రవ పతితో న విశ్లిష్యతో దంపతీ అనేనే త్యయం యోగార్థో వివక్షితః"
వ్యాఖ్య

శ్రుతియందున్న ప్రజాశబ్ద మిచట అపత్య శబ్దముగా కవిచే గ్రహింపబడినది

సీతాదేవి వాల్మీకి తపోవనమున దారకద్వయమును (కుశలవులను) ప్రసవించెను శ్రీరాముడు ఆదారకద్వయమును (తనపుత్రులను) ప్రేమతో ఉద్ధార లేదని సీత పరితపించును అపుడు సీతకు "అపత్య తత్త్వమును తమస బోధించును

సంతానము దంపతుల పరస్పర ప్రేమ మరాగానుబంధములకు పరాకోటి, దంపతుల హృదయ వస్తువుయొక్క పరస్పర ప్రేమ మబంధ సంశయణ ఫలముగా ఏర్పడిన విలక్షణమైన ఆనందగ్రంధియే అపత్యము

గ్రంథి యన ముడి ముడి యనునది భిన్నములుగా నున్న సూత్రముల గలిపి నొకటిగా జేయును అట్లే ఆనందగ్రంథి రూపమైన అపత్యము నందు దంపతుల ఆనందములు ముడివడి యుండును అపత్య మట్టి వాడు గనుకనే శ్రుతి యాతవిని ప్రజాసంధి యనినది

అధ్యాత్మసంహిత

ఈసంహితయందు అధరోత్తరహనువులు పూర్వోత్తరరూపములు వాక్కు సంధి జిహ్వా అచట సంధానము

మనము మాట్లాడ సంకల్పించినపుడు అధరోత్తరహనువుల సంహిత యావశ్యకము అచట జిహ్వా సంధానకర్త్రి యగును అపుడు అధరోత్తర హనువుల సంశ్లేషరూప వాక్సంధి యవతరించుచున్నది

"అథాధ్యాత్మం అధరాహనుః పూర్వరూపం ఉత్తరాహనురుత్తర రూపం వాక్సంధిః జిహ్వా సంధానం ఇత్యధ్యాత్మమ్" శ్రుతి

ఈ విధముగ శ్రుతి పంచసంధుల స్వరూపమును వివరించి పంచ సంహితోపాసనలను విధించినది యధార్థమున కొకసంహితా స్వరూపము పదేశించిన మిగిలిన సంహితల నూహించు కొనవచ్చును కాని ప్రత్యే కించి శ్రుతి పంచసంహితల నుపదేశించుట లోని తాత్పర్యమును అంతర్య మును గూర్చి విచారింపనగును

లోకమున నెన్నియో సంహిత లున్నను ప్రతివారు తప్పక ఈ మహాసంహితాస్వరూపము నుపాసన జేయవలె నని శ్రుతి తాత్పర్యము. ఈ పంచవిధ మహాసంహితా విజ్ఞానము వలన ఇతర సంహితాజ్ఞానము సులభసాధ్యము

ఈ పంచసంహితలు జగత్తత్త్వమును దర్శింపగోరిన జిజ్ఞాసువు యొక్క దర్శన క్రమరూపము లని యూహింపవచ్చును ఇచట క్రమ ముగ "ఆకాశ స్సంధిః ఆప స్సంధిః విద్యా సంధిః ప్రజా సంధిః— వాక్సంధి" అని అయిదు సంధులు క్రమముగ నిర్దేశింపబడినవి.

అకాశస్సంధిః ?

సాధకుడు మొదట ప్రపంచమును స్థూలదృష్టితో జూచుచున్నప్పుడు అకాశమును పంచభూతాంతర్గతమైన అదిభూతముగా తెలిసికొనుచున్నాడు ప్రపంచమును పంచభూతదృష్టితో గాక ద్యావా పృథివీరూపముగ జూచి నపుడు అకాశమును ద్యావా పృధివీసంధిగా దర్శించుమని శ్రుతి యాదేశించుచున్నది అకాశమును అదిభూతమునుగా చూచిన దృష్టి వేఱు ద్యావా పృదువుల సంధిగా దర్శించిన దర్శనము వేఱు ఇచట అకాశము సాధకుని కుపాస్యదేవతారూప మగుచున్నది సంధిగా దర్శన మిచ్చు అకాశము ద్యావాపృధివీవిలక్షణమై అనిర్వచనీయ శక్తిసంభరితమై సంహితాపర మార్ధమును బోధించును

అపస్సంధిః

సాధకుడు ద్యావాపృధివీదర్శనము తరువాత పృదివీద్యులోకాధి పతులుగా కీర్తింపబడెడి అగ్న్యాదిత్య మిధునమును దర్శించును పూర్వము పంచభూతాంతర్గతముగా కన్పట్టు అపస్సును ఇపుడు సంధిగా దర్శించి ఉపాసించును అకాశము సర్వభూతాశ్రయము కనుక ద్యావాపృధివీ సంధిగా ప్రప్రధమున అకాశమును దర్శించుట జరిగినది తరువాత తల్లో కాధిపతుల సంధిరూపమైన అపస్సు దర్శింపబడుచున్నది ఈనాడు శాస్త్ర జ్ఞు చే అపస్సు H2o గా దర్శింపబడుచున్నది ఇందు 'H అనునది అదిత్య ప్రతీక యని O అనునది అగ్నికి ప్రతీకయని, H2o యనునది అగ్న్యా దిత్య సంశ్లేషరూపమని ఊహింపవచ్చునేమో। ఈ విషయమును శాస్త్రజ్ఞులు వివరింపగలరు

విద్యాసంధిః .

మొదట లోకమును ద్యావాపృథివీరూపముగ దర్శించుట తరువాత లోకనిర్వాహకమైన జ్యోతిస్సును అగ్న్యాదిత్యరూపముగా దర్శించుట జరిగినది తరువాత విద్యాలోకము అచార్యాంతేవాసిరూపమున రెండు విధములుగా దర్శింపబడుచున్నది ఆ ఆచార్యాంతేవాసి సంహితయందు విద్య సంధి సంధులలో అపస్సు ప్రధానజీవయాత్రానిర్వాహక మైనట్లు విజ్ఞానయాత్రానిర్వహణమున విద్యప్రధానకారణ మగుచున్నది పురుషార్థ సాధనమునకు విద్య గాక మరియొకమార్గము లేదు అయితే భౌతికవిద్య ఆచార్యాంతేవాసిసంధిరూప మైనను అది లోకయాత్రానిర్వహణమునకు మాత్రమే ఉపకరించును సంప్రదాయానుగతమై గురుపరంపరాప్రాప్తమైన విద్యారూపసంధి ఆత్మతరణసాధకము లోకకళ్యాణకారకముగూడ నగును కమక ఆ విద్య ఉపాస్యదేవతారూపము అట్లు ఆచార్యాంతేవాసి సంధి రూపముగాక స్వతంత్రముగా అభ్యసింపబడిన విద్య సంధియైనను ఉపాస్య గాదు ఒకప్పుడు లోకహానికరము గూడ నడుగుచున్నది

ప్రజాసంధిః

ఇది ఉపాసనాప్రకరణము ఇచట ప్రజ సంధిగా కీర్తింపబడినది ఉపాస్య మాతా పితృసంహితాంగమైన ప్రజారూప సంధియు ఉపాస్యమే. కావున ఉపాస్యమైన ప్రజ సుప్రజయే యగును అట్టి సుప్రజయే విద్యా గ్రహణయోగ్యమై ఉపాస్య మగుచున్నది లోకమున అందరు అపత్య శబ్దముచే చెప్పబడుదురు ఎవరు శ్రుతిబోధిత తాత్త్వికవిద్యా సంస్కార

సంపన్ను లగుదురో వారిని శ్రుతిబోధితసంధి స్వరూపులునుగా దర్శించి ఉపాసింపవలెను అట్లు పాసించిన వారే శ్రుతిచే బోధింపబడిన ప్రజాసంధి స్వరూపమును చక్కగ తెలిసికొనగలరు అనగా సద్ధర్మాచరణము గలిగి పవిత్రజీవనుడై మాతాపితరులగర్భమున కలంకారుడైన సత్పుత్రుడే శ్రుతిబోధిత ప్రజాసంధి స్వరూపుడు అతడే పైన చెప్పబడిన విద్యాసంధి స్వరూపమును దర్శించి తాను కృతార్థుడై ఇతరుల తరింపజేయగలిగిన వాడు ఈ సంబంధమును గుర్తింపజేయుటకే విద్యాసంధి తరువాత ప్రజా సంధి శ్రుతిచే ఉపదేశింపబడినది

వాక్సంధిః

ఇదియు లోకయాత్రానిర్వాహకమే ఇది ఉపాసనా ప్రకరణము గాన ఎట్టి వాక్కు ఉపాస్యయగును? ధర్మబ్రహ్మతత్త్వబోధకము, సృష్టిరహస్య విజ్ఞానసముల్లసితము, పారమైశ్వర్యవిభూతి ప్రతిబోధకమును అగువేదవాక్కు సంధిరూపమున ఉపాస్యయగును మరియు వేదవిదులగు మహర్షుల యొక్కయు మహాత్ములయొక్కయు వాక్కు గూడ ఉపాస్య యగుచున్నది అట్టి వాక్కు లోకక్షేమంకరము శ్రుతియు "అన్యా వాచో విముంచథ" అని అనుచు మిగిలిన వాక్కులను పరిహరించి విజ్ఞానతత్త్వప్రతిబోధకమైన వాక్కునే ఉపాసించుమని హెచ్చరించుచున్నది ఈ ఉపాసననే నాదోపాసనగాను శబ్దబ్రహ్మోపాసనగాను శ్రుతి స్మృతి పురాణాదులు బహువిధముల కీర్తించుచున్నవి.

పంచసంహితోపాసన తాత్త్వికదర్శనము

ద్యావాపృథివ్యాత్మక ప్రపంచదృష్టితో ప్రారంభమైన సాధకుని ఆకాశసంధిదర్శనము క్రమముగ తత్తదవాంతర దర్శనముల ద్వారా వాక్సంధి దర్శనముతో సమాప్తమైనది ఈవాక్సంధినుండి పై సంధి క్రమమును బరిశీలించిన శ్రుతిహృదయ మవగత మగును

వాక్సంధి యొక్క ఉపాసన యనగా పారమైశ్వర్య తత్త్వావబోధక మగు వేదవాక్కు నుపాసించుట యే అట్టి వాక్సంధ్యు పాసకుడు సుప్రజారూపుడై వెలయుట సహజము సుప్రజారూపుడైన అట్టి సాధకుడు విద్యాసంధిని ఉపాసించి తద్విద్యాప్రతిపాద్య ధర్మబ్రహ్మవిద్యోపాసకు డగును అట్టి యుపాసకుడే ద్యావాపృథివ్యాత్మక మైన జగత్తును అగ్న్యాదిత్య దివ్యజ్యోతిస్పంద్యాత్మకముగ అనగా అపోమయముగా దర్శించును ఆపో వా ఇదగ్ంం సర్వం" అని అనుచు శ్రుతియు జగత్తును అపోమయముగా దర్శించు మని ఉపదేశించుచున్నది అపోమయముగ లోకమును దర్శించి సాధకుడు ఆకాశతత్త్వపరిశీలకు డగును ఆకాశ సంధియందు సంధానము వాయువు అధిభౌతికముగ పృథివీద్యులోకములకు వాయువు సంధానము ఈవాయువు అనేకరూపముల దర్శింపబడుచున్నది ఆధ్యాత్మికముగ ఉపాసనా సంప్రదాయమునను సరించి సాధకుని శరీరముననే పృథివీద్యు లోకములు గలవని సంప్రదాయ విదులు చెప్పుదురు ఈ పృథివీద్యు లోకములకు సంధాన మేది? "అపోమయః ప్రాణః" అని శ్రుతి పైన చెప్పిన దివ్యజ్యోతిరూప అపోమయమే ప్రాణము ఉత్తమసాధకుడు యోగశాస్త్ర ప్రసిద్ధము లైన యమనియమాదుల ననుష్ఠించుచు ప్రాణా

యామసాధన జేసి కుంభకసిద్ధిని బడసి నిర్మలము నిష్క్రియము, దహరాకాశాత్మకము నగు పరంజ్యోతీరూప సంధిదర్శనము జేసి కృతార్థు డగును

ఈ సంహితోపాసన ఇట్లు మహామహిమాన్వితము నగుటచేతనే ఈ మహాసంహితోపాసనను ఉపనిషత్తుగా శ్రుతికీర్తించినది

"అథాత స్సంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః" శ్రుతి

ఉపనిషద్రూపమైన ఈ సంహితోపాసనకు ఐహికఫలమే గాక ఆముష్మికఫలమును గూడ శ్రుతి కీర్తించినది

"య ఏవ మేతా మహాసంహితా వ్యాఖ్యాతా వేద। సంధీయతే ప్రజయా పశుభిః బ్రహ్మవర్చసే నాన్నాద్యేన సువర్గేణ లోకేన" శ్రుతి సంహితాస్వరూపమును స్థూలముగాగాక చక్కగా వ్యాఖ్యానించి పరిశీలించి తెలిసికొని యుపాసించుడు అప్పుడే బ్రహ్మవర్చసాది ఉత్తమఫలసిది కలుగు నని శ్రుతి యాదేశము (వ్యాఖ్యాతా వేద)

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
అయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః॥

అను మనుస్మృతిశ్లోక ప్రతిపాద్య పరంజ్యోతీరూప నారాయణ తత్త్వమును ఈ దృష్టితోనే పరిశీలింపదగినది జ్యోతిర్మయములైన ఆ వస్తువులను వ్యాపించి వానియం దంతర్యామియై పరంజ్యోతీరూప మగు

నారాయణ తత్త్వము విలసిల్లు చుండు నవి పై శ్లోకతాత్పర్యము స్నానసమయమున జలములను నారాయణస్వరూపములుగా దర్శించి ఉపాసించుచు స్నానకర్మను నిర్వ రించు ఆచారము నేటికిని ప్రచారములో నున్నది

"యో సౌ సర్వగతో విష్ణుః చిత్స్వరూపీ నిరంజనః ।
స ఏవ ద్రవరూపేణ గంగాంభో నాఽత్ర సంశయః "

సంధౌఉపాస్యా సంధ్యా పైన జెప్పిన అహోరూపసంధి యందు ఉపాస్య మగుచు పరంజ్యోతీరూప నారాయణుడే సంధ్యాశబ్దాభిలక్షిత సంధ్యాదేవత యని పై సంహితోపాసనాపరమతాత్పర్యముగా గ్రహింపనగును
సంధ్య స్వప్నావస్థ

శ్రుతి పై పంచసంధులనే గాక ప్రసక్తానుప్రసక్తముగా అట నట మరికొన్నిసందులను గూడ ఉపదేశించినది "సంధ్యం తృతీయం స్వప్నస్థానమ్" అని శ్రుతివచనము ఈ శ్రుతి నాధారము జేసికొని సంధ్యే సృష్టి రాహ" (3 2 1) అని బ్రహ్మసూత్రము ప్రవృత్త మైనది

శ్రుతి సంధ్యశబ్దమును స్వప్నార్థమున ప్రయోగించినది స్వప్నము జాగ్రత్సుషుప్తుల సంధిరూపము జాగ్రత్సుషుప్తుల కంటె విలక్షణము

జాగ్రత్సుషుప్తి సంధిరూపమగు స్వప్నసమయమున మనస్సే

చిత్రవిచిత్రములైన అననుభూత పూర్వములైన పదార్థముల నెన్నిటినో దర్శింపజేయుచూ సుఖదుఃఖానుభవముల గలిగించుచుండును కాన ఇట మనస్సే సంధ్యారూపిణియైన సృష్టికర్త్రి ఈ జన్మయందు జన్మాంతరమునందు కలిగిన సంస్కారవిశేషములతో వాసితమై జీవుని సుకృత దుష్కృత కర్మానుగుణముగా భావిఫలసూచకముగా ఒకప్పుడు కళ్యాణకరమైన వస్తుసముదాయమును, ఒకప్పుడు అమంగళకరవస్తుసముదాయమును దర్శింపజేయుచుండునని పెద్దలు చెప్పుదురు "యా సంధ్య సా జగత్సూతిః" అను సంప్రదాయవచనము ననుసరించి ఇచట జగత్సూతియైన సంధ్య స్వాప్నిక మనోరూప సంధ్యశక్తియే జాగ్రద్దశయందు కన్పించు జగము వ్యావహారిక సత్యము సంధిరూపస్వప్నమున భాసించు జగత్తు ప్రాతిభాసికము కనుకనే సంధి రూపమైనతః స్వప్నమున కన్పించు జగము మిధ్యారూపమని ప్రబ్రహ్మసూత్రము వర్ణించుచున్నది ఈ శ్రుతి వచనము ననుసరించి పూర్వోత్తర రూపము లున్న చోటులందంతట సంధిని తద్గతశక్తివిశేషమును అనగా సంధ్యాతత్త్వమును దర్శించవలయునని తెలియును

నది గిరిసంధులు తత్త్వభావము

సంధియందు దపూర్వశక్తి విరాజిల్లుటచే నదీసంధులు భగవదారాధనోపయుక్త క్షేత్రము లని శ్రుతి వర్ణించుచున్నది

"ఉపహ్వరేగిరీణాం సంగమే చ నదీ నాం
ధియా విప్రో అజాయత"

ఋగ్వేద 8 6 28 వాజసనేయసంహిత 26 10

"గిరీణాం పర్వతానాం ఉపహ్వరే ఉపహ్వర్తిప్యే ప్రాంతె నదీనాం సరితాం సంగధే సంగమనే చ ఈ దృగ్విధే ప్రదేశే క్రియమాణయా ధియా యాగక్రియయా స్తుత్యా వా విప్రః మెధావీ ఇంద్రః అజాయత ప్రాదుర్భవతి అతః వయ మపి తాదృశే ప్రదేశే యజామః స్తుమో చతి భావః నదీసంగమములకు ప్రయాగ లని పేట అట్టి ప్రయాగలందు పర్వతప్రాంతములందు యజ్ఞకర్మల నాచరించి నపుడు తప మ చరించి నపుడు ఇంద్రప్రాదుర్భావము జరుగును. అనగా యాగక్రియా తపశ్చర్యాది సామర్థ్యముచే యజమానుడు ఇంద్రరూపు డగును అనగా పారమైశ్వ ర్యశక్తిసంప ద్విలసితు డగును ధియావిప్రో అజాయత కనుక నదీసంగ మములు మహామహిమాన్విత ప్రదేశము లని శ్రుతి యుపదేశము వాజసనేయసంహితయం దీ మంత్రమిట్లు వ్యాఖ్యానింపబడినది

"గిరీణాం పర్వతానాం ఉపహ్వరే నికటే నదీనాం
గంగాదీనాం సంగమే విప్రః మేధావీ సోమః అజా
యత ధియా బుద్ధ్యా విప్రాదయః మయా యజ్ఞం
కరిష్యం తీతి విచార్యేత్యర్థః" మహీధరభాష్యమ్

"మహాత్ములు లోకకళ్యాణమునకై నాసాయముతో యజ్ఞములు జెయుదు రను దృష్టితో సోమలత నదీసంగమములందు ఆవిర్భ వించును"

ఈ రెండు భాష్యములు నదీసంగమప్రాభవమును తెలియజేయు నవియే ఈ నాటికిని ప్రయాగలు ఉత్తమోత్తమ తీర్థభూములుగా ఆరాధింపబడుచున్నవి దివ్యాలయములు మహాత్ముల ఆశ్రమములు పర్వత ప్రాంతము లందు నదీసంగమము లందు ఉండుటలోని అంతరార్థ మిదియే

భరద్వాజాశ్రమము గంగాయమునా సంధియందున్నట్లు రామాయణము వర్ణించుచున్నది

"ధన్వినౌ త సుఖం గత్వా లంబమానే దివాకరే
గంగాయమునయో స్సంధౌ ప్రాపతు ర్నిలయం మునేః"
రామాయణ 2-54 8

రామలక్ష్మణులు గంగాయమునా సంధియం దున్న భరద్వాజాశ్రమమును జేరి రట దీనినిబట్టి వాల్మీకిమహర్షి నదీసంధిమహత్త్వమును సూచించుచున్నా డని తెలియగలము

ఇట్లు నదీసంధులయందు వలెనే కాలభాగములగు క్షణ ఘటికా అహోరాత్ర పక్ష మాస ఋతు అయన సంవత్సర సంధులు గూడ మహామహిమాన్వితములే అంతటను సంధ్యాస్వరూపమును దర్శింపవచ్చును, ఉపాసింపవచ్చును

సంధ్యా శబ్దము యోగరూఢము

సంధ్యాశబ్దము యౌగికార్థము (అవయవార్థము సంధౌ భవా)

నమనసరించి సంధియందు ఉపాసింపబడునది యని యర్ధము బోధించుచూ రూఢిననుసరించి జగత్తును సృజించు ఈశ్వరీశక్తిని గూడ బోధించును )యోగేన రూఢ్యా చ అర్థప్రతిపాదక శబ్దః యోగరూఢః), సంధ్యా శబ్దము మొదట సంధికాలోపాస్య దేవతాసామాన్యవాచక మగును రూఢి ననుసరించి సంధికాలోపాస్య చిచ్ఛక్తిరూప దేవతావిశేషవాచక మగుచున్నది అవయవార్థముకన్న రూఢ్యర్థము బలీయము (యోగా ద్రూఢి ర్బలీయసీ) గాన"సంధ్యాదేవి" యనిన నిఖిలలోకముల సృజించు చిచ్ఛక్తి యని గ్రహింపవలయును కనుకనే సంధ్యాస్వరూపమును వశిష్ఠమహర్షి ఇట్లు వివరించుచున్నాడు

"యా సంధ్యా సా జగత్సూతిః మాయాతీతా హి నిష్కలా
ఈశ్వరీ కేవలా శక్తిః తత్త్వత్రయ సముద్భవా"
"ధ్యాత్వా ర్కమండలగతాం సావిత్రీం వై జపే ద్బుధః"

వశిష్ఠమహర్షి "సంధ్యాదేవి జగత్తును సృజించుచిచ్ఛక్తిస్వరూపిణి అర్కమండల ంతర్గతమై విలసిల్లు ఆ దేవి నిత్యోపాస్య'' అని చెప్పుచున్నాడు.

"సమ్యక్ ధ్యాయ్యతే అరాధ్యతే సదా ఇతి సంధ్యా"

(అందరిచే ఎల్లప్పుడు అరాధింపబడునది సంధ్యా అను శబ్దవ్యుత్పత్తి రూఢ్యర్ధమునే బోధించుచున్నది

సంధ్యాశబ్దము లాక్షణికము

లక్షణయా అర్థమును బాధించు శబ్దము లాక్షణికము

(లక్షణయా అర్థప్రతిపాదక శ్శబ్దః లాక్షణికః )

సంధ్యాస్నానం జపో హోమః దేవతానాం చ పూజనమ్

అతిధ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినేదినే" పరాశరః

పై శ్లోకమున షట్కర్మలు నిర్దేశింపబడినవి షట్త్వసంఖ్యా సిద్ధికై సంధ్యాస్నాన మనునది ఒకే కర్మ యని గ్రహింపవలెను అట్లుగాక సంధ్యా స్నానం అని విడదీయుచో కర్మన పక మగును షట్త్వసంఖ్య సిద్ధించదు కనుక "సంధ్యాస్నాన"మనునది ఏకపదము "సంధ్యార్థం స్నానం సంధ్యాస్నాన" మను విగ్రహవాక్యమును సంప్రదాయ విదులు చెప్పుదురు ఇట సంధ్యాశబ్దము సంధ్యాదేవతోపాసనారూప కర్మకాలకై చేయుస్నాన మని యర్థము ఇట్లు ముఖ్యార్థత్యాగము చేయవలసి వచ్చుటచే సంధ్యాశబ్ద మీ శ్లోకమున సంధ్యాదేవతోపాసనారూప కర్మప్రతిపాదకమగుచు లాక్షణిక మగుచున్నది అట్లే సంధ్యోపాసన క్రియాయోగ్య కాలపర మగు సంధ్యాశబ్దము గూడ లాక్షణికమే యగును

జాబాలోపనిషత్తు సంధ్యోపాసన

"కతమ చ్చాస్య స్థానం భవతీ తి భ్రువో ర్ఘ్రాణస్య చ య

స్సంధిః. స ఏష ద్యౌ ర్లోకస్య పరస్య చ సంధిర్భవ తీతి

ఏత ద్వై సంధిం సంధ్యాం బ్రహ్మవిద ఉపాసత ఇతి
సోऽ విముక్తం జ్ఞాన మాచష్టే యో వై ۽ దేత దేవం వేద"
ద్వితీయః ఖండః జాబాలోపనిషత్

అధి భౌతికముగ అవిముక్త స్థానము వారణాసి అది వరణ అసి రూప నదీద్వయ సంగమస్థానము ఆధ్యాత్మికముగ భ్రూఘ్రాణ మధ్య స్థానము అవిముక్తక్షేత్రము ఇది ఇడా పింగళ లనెడి గంగాయమునల సంగమస్థానము కావున సంధిరూపము ఇంతియే కాదు భ్రూఘ్రాణ మధ్యప్రదేశము ద్యులోకసత్యలోకముల సంధిస్థానము లలటమునుండి పైభాగము సత్యలోకము క్రిందిభాగము తపోలోకాంతమైన ద్యులోకము

(ఘ్రాణమూలా దర్వాక్ ద్యులోక స్తపోలోకాంతః
లలాటా చ్చాऽరభ్య పర స్సత్యలోకః
అనేన శరీరే ऽపి బ్రహ్మండ సన్నివేశోऽ స్తీతి సూచితమ్ టీక

కాన ద్యులోక పరలోక రూపలోకద్వయసంధిరూప భ్రూఘ్రాణ మధ్యస్థానము సంధ్యారూప పరంజ్యోతియొక్క ఉపాస్య స్థానము ఇది సంధి ఇట్టి సంధియందు పరంజ్యోతి సంధ్యాదేవతను బ్రహ్మవేత్తలు పాసింతురు

ఈ జాబాలోపనిషత్తు నందు జెప్పబడిన అవిముక్త సంధ్యోపాసన వెనుక జెప్పబడిన పృధివీద్యులోకసంహాతోపాసనకు వ్యాఖ్యానరూపమని సూక్ష్మదృష్టితో పరిశీలించిన స్పష్ట మగును అచట సంధిస్థానము

ఆకాశము ఇచట భ్రూఘ్రాణమధ్యమైన అవిముక్తస్థానము సంధి స్థానము అచట దహరాకాశరూప పరంజ్యోతి ధ్యేయము ఇచట భ్రూఘ్రాణమధ్యరూపమగు అవిముక్తమున సంధ్యారూపమగు అపరం జ్యోతియే ధ్యేయము

ఉపాసనాసంప్రదాయము ననుసరించి భ్రూమధ్యము ఆజ్ఞాచక్ర స్థానము బ్రహ్మగ్రంథిస్థానము మనస్తత్వాత్మకము జ్ఞానేంద్రియములకు కర్మేంద్రియములకు నేతృత్వము మనస్సునకు కలదు ఇచటనే జ్ఞాన కిరణోదయ మగును అచట కుండలినీశక్తి ఉత్తమసాధకునకు తటిల్లేఖ వలె భాసించిమూడు లిప్తల కాలములో బ్రహ్మగ్రంథిని భేదించి స్ప్రారమునకు పోవును అచట శివశక్తిసమ యోగ మేర్పడును మనస్తద్వి జయముచే దూరదృష్టి దూరశ్రవణాది దృష్టులు సిద్ధించును ఈ ప్రదేశము శ్రీ చక్రమున చతుష్కోణాత్మక మగుభూపుర మని చెప్పుదురు ఈ సంప్రదాయమునుబట్టి పంచాక్షరక్రమసంపన్నుడైన సాధకుని మనస్సే బుద్ధియే ఆధ్యాత్మికముగ సంధిరూప మగు అవిముక్తస్థానము

పరమహంసోపనిషత్తు సంధ్యదర్శనము.

"పరమాత్మాత్మనో రేకత్వ జ్ఞానేన తయో ర్భేద
ఏవ విభగ్నః సా సంధ్యా" 2
"జీవబ్రహ్మణో రైక్యజ్ఞానేన మహావాక్యజేన

తయో ర్యః ప్రతీతో భేదః స విశేషేణ భగ్నః
పునః భ్రాం త్యనుదయాత్ యే య మేకత్వబుద్ధిః
స వోభయో రాత్మనోః సంధ జాతత్వాత్ సంధ్యా
అహోరాత్రయో స్సంధా వనుష్ఠీయమానా
క్రియా యథా సంధ్యా తద్వత్"

నారాయణదీపికా వ్యాఖ్య

లోకప్రసిద్ధమైన జీవేశ్వర భేద మెది గలదో అది "తత్త్వమసి" త్యాది మహావాక్యజన్యజ్ఞానముచే సవ లముగ భగ్న మగును అవిద్యాత త్కార్యనాశమగుటచె "అహంసంసారీ అహంమనుష్యః" అనెడి భ్రాంతి తిరిగి ఉదయింపదు "అహంబ్రహ్మాzస్మి త్యాకారక అఖండబ్రహ్మాకార వృత్తి" ఉదయించును ఇట్లు జీవపరమాత్మల సంధియందు ఉదయించు ఎకత్వబుద్ధియే సంధి అహోరాత్రసంధియం దనుష్ఠింపబడు ఉపాసనాక్రియ యెట్లు సంధియగునో అట్లే శం ఏకత్వబుద్ధియు సంధ్యయగును ఇదియే బ్రహ్మవేత్తలు చెప్పెడు సంధ్యోపాసన

ఈ విధముగా అధికారిభేదము ననుసరించి "అహరహ స్సంధ్యా ముపాసీత" అని శ్రుతిబోధితసంధ్యోపాసనాస్వరూపమును దర్శింపవలెను జీవేశ్వరైకత్వబుద్ధి యను సంధ్యను దర్శించుట సాధకుని ప్రధాన లక్ష్యము ఆ లక్ష్యసాధనకై బాల్యమునుండి వివిధరీతుల వారివారి యధి కారి తారతమ్యమును బట్టి సంధ్యోపాసన జేయబడుచున్నది "అహరహ

స్సంధ్యా ముపాసీత" అను శ్రుతి వాక్యము నందలి "అహరహః" అను ద్విరుక్తి అనుదినము అనుక్షణము సంధ్యోపాసనావశ్యకతను గుర్తింప జేయుచున్నది

సంధ్యావందనము ఫలము

సంధ్యోపాసనా ఫలవిషయమున దర్శనకారుల మధ్య స్వల్పమైన అభిప్రాయభేదము కన్పట్టును సంధ్యోపాసన నిత్యకర్మ నిత్యకర్మలకు ఫలము లేదని పూర్వమీమాంసకులలో ప్రాభాకరులు చెప్పిరి వారిలో భాట్టులు సంధ్యోపాసనకు ప్రత్యవాయరూప దురితక్షయము ప్రయోజన మనిరి వేదోపదేశరూప నిత్యకర్మరూప సంధ్యోపాసన జేయని యెడల ప్రత్య యము సంభవించును అట్టి ప్రత్యవాయరూప దురితక్షయమే సంధ్యోపాసనా ఫలము, వేరు ఫలము లేదని వారియభి ప్రాయము కాని శ్రుతి స్మృతులు సంధ్యావందనమునకు బ్రహ్మలోక ప్రాప్తి (ముక్తియే) ఫల మని బోధించుచున్నవి

"సంధ్యా ముపాసతే యే తు సతతం సంశ్రితవ్రతాః

విధూతపాపా స్తే యాంతి బ్రహ్మలోకం సనాతనమ్"

అను గోభిలవచనము నిరతము సంధ్యోపాసకులకు బ్రహ్మలోక ప్రాప్తి ఫలమనుచున్నది

"శుచి ర్వా ప్యశుచి ర్వా యః కాలే సంధ్యాం సదా ద్విజః

ఉపాస్తే బ్రహ్మభూయాయ కల్పతే నా త్ర సంశయః"

అను విష్ణువచనము బ్రహ్మపరోక్షజ్ఞానమే ఫల మని బోధించు చున్నది

బ్రహ్మసూత్రభాష్యమున శ్రీ శంకరులు అతివాహికాధికరణమున సంధ్యోపాసనకు దురితక్షయమే ఫలము గాక ఫలాంతరము గలదని ముక్తకంఠముగ చెప్పిరి ఫలాంతరము నివృత్తిమార్గమున ప్రవర్తిల్లు సాధకునకు ముక్తియే యగుచున్నది

'న చ కార్యే ప్రత్యభిసంధిః". బ్రసూ 4, 3 14

"న చ నైమిత్తికానుష్ఠానాత్ ప్రత్యవాయానుత్పత్తిమాత్రం న పునః ఫలాంతరోత్పత్తి రితి ప్రమాణ మస్తి। ఫలాంతరస్యా ప్యను విష్వాదినః సంభవాత్। స్మరతి హ్యాపస్తంబః తద్యథామ్రే ఫలార్థే నిర్మితే ఛాయాగంధా వనూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్య న్తే" ఇతి।

ఫలములకొఱకు మామిడిచెట్టును పెంచినపుడు ఆ వృక్షము వలన ఫలములే గాక చాయాగంధరూప ప్రయోజనములు గూడ ఆనుషంగికముగా సిద్ధించునట్లు దురితక్షయార్థము సంధ్యోపాసన జేసినను ఆ ఉపాసన క్రమముగ ముక్తిదాయక మగుచున్నది

శ్రీ విద్యారణ్యులును "ఉద్యంత మస్తం యంతం బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అను తైత్తిరీ యారణ్యక వ్యాఖ్యావసరమున సంధ్యోపాసనకు బ్రహ్మపరోక్షజ్ఞానమే అర్థాత్ ముక్తియే ఫలమని వర్ణించిరి

శ్రుతి ఉద్య న్త మ స్తం యంతమాది త్య మిత్యాది తై అ22

సా భా "అయం పరిదృశ్యమానః అదిత్యః బ్రహ్మేతికాస్రతో విద్వాన్ పుమా నుద్యంత మ స్తంయంతం వా ఆదిత్యం తథా ధ్యాయన్ ప్రదక్షిణంచ కుర్వన్ వర్తతే। స పుమాన్ సకలం భద్ర మశ్ను తే। యః పుమా నాదిత్యో బ్రహ్మేతి వేద స పుమా న ఏర్వ మజానన్న పి స్వయం వస్తుతః బ్రహ్మేవ సన్ ప్రాప్తాద్ వేదనా దజ్ఞానాపగమే సతి స్వాzనుభవేనా z పి బ్రహ్మzప్నోతి"

దీనినిబట్టి సంధ్యోపాసనకు పరమార్ధదర్శనమేఫల మని స్పష్టముగ తెలియుచున్నది

# శివుడు - సాంధ్య నృత్యము

ఈ సందర్భమున మహ నటుడైన శివుని సాంధ్యనృత్యస్వరూపము తత్పరమార్థము గూడ దర్శింపనగును

మహాకాలో మహానటః

పరమేశ్వరుడు జగన్నాటక సూత్రధారి సూత్రధారి మాయామయమగు నాటకమును ప్రవర్తింప జేసి సహృదయరంజనము గావించుచుండుట లోకప్రసిద్ధము లౌకికనాటకమున పాత్రధారులు ఎంత ప్రావీణ్యము గలవారైనను నటులే మహానటు డొక్క శివుడే యని శాస్త్రపరిభాష.

శివుని నటనలో గల మహత్త్వమేమి ?

శివుడు ఉభయసంధ్యల యందును నృత్యము జేయుచుండునని సూతసంహితయందును శివప్రదోషస్తోత్రాదుల యందును గానవగును ఆ శివుని తమోగుణాత్మక తత్త్వమును దర్శింపజేయునది తాండవనృత్యము శివుడు భైరవస్వరూపుడై శ్మశానముల యందు నృత్యము సలుపుచుండునని శైవశాక్త తంత్రములందు వర్ణనలు గన్పించును ఇది శివుని రెండవ నృత్యరూపము మూడవది చిదంబర నటరాజ నృత్యము అభ్రసభ యను పేరు గాంచిన స్వర్ణసభయందు నటరాజు నృత్యము జేయుచుండును

నటరాజును "ఆనందతాండవమూర్తి" యని స్తుతించెదరు నటరాజు యొక్క ఈ త్రివిధనృత్యములు అధిదైవికరూపములు

సృష్టి స్థితి సంహార తిరోధానానుగ్రహము లనెడి పంచకృత్యములే పరమేశ్వరనృత్యములు ఆధిభౌతికముగ దర్శింప దగిన నృత్యస్వరూప మిదియే ఇక ఆధ్యాత్మిక నృత్యము

ప్రాణికోటియొక్క బుద్ధివృత్తి పరిస్పందనములు ధీప్రచోదనము నళత్యపరమేశ్వరుని ఇంగితములై కాగా సృష్టిచక్ర ప్రవర్తనము సంసార చక్రపరిభ్రమణము అంతియు నటరాజుయొక్క దివ్యనటనా విలాసము కావుననే ఆయన మహానటుడు ఇదియే ఆయన నటన యందలి మహత్వము

ఈ నృత్యము అధికారి భేదము ననుసరించి వారివారి చిత్తసంస్కారము ననుసరించి దర్శింప దగినది సాధారణజనుల దృష్టిలో నటరాజు ఉభయసంధ్యల యందు సాంధ్యనృత్యకళా కోవిదుడుగా మహానటుడుగా కీర్తింపబడి ఆరాధింపబడుచున్నాడు సంస్కారము వృద్ధిజెందు కొలది సాధకుడు శివుని పరిచ్ఛిన్న విగ్రహమూర్తిగా మాత్రమే గాక సర్వవ్యాపక తత్త్వముగాను జగన్నాటక సూత్రధారిగాను విశ్వము నంతటిని పరమేశ్వర నృత్య కళాత్మకముగాను దర్శించి భావించి ఉపాసించును ఇట్లు సంస్కారక్రమ సంపన్నుడైన ఉత్తమసాధకునకు జీవేశ్వరసంధి యందు జీవేశ్వరభేదభావము తొలగి కలుగు అఖండ బ్రహ్మాత్మానందానుభవమే ఆనందతాండవమూర్తి యగు నటరాజు యొక్క దివ్య సాంధ్యనృత్యము

ఉభయసంధ్యల యందు జేసెడి సంధ్యోపాసనముయొక్క పరమలక్ష్యము బ్రహ్మాత్మానందానుభవరూప మగు ఆనందతాండవసిద్ధియే ఇతరుల మెర మెచ్చులకు చేసెడి నాట్యము గాక బ్రహ్మానందపారవశ్యమున మైమరచి మహాజ్ఞానులు యోగసమాధిదశలో పొందెడి నిర్మలానందానుభవమే ఆనం దతాండవనృత్యము ఇదియే చిదంబర నటరాజ నృత్యకళారహస్యము

శ్రీరంగమున యోగనిద్రా ముద్రితలోచనుడైన శ్రీరంగశాయి సౌఖ్యైకానందతాండవమూర్తి. ఈ మూర్తి బ్రహ్మానందానుభవ పర వశులై యోగనిద్రావిద్రితు లగు బ్రహ్మజ్ఞానులకు ప్రతీక యన పెద్దలు చెప్పుదురు కావుననే ఇచట రంగపదము పరమేశ్వరుని రంగస్థల నృత్య కళాకోవిదత్త్వమును మహానటత్వమును తెలియజెయుచున్నది ఒకడు నట రాజు మరియొకడు రంగరాజు ఇద్దరును రాజులే మూర్తులయందు మాత్రమే భేదము తత్త్వమొక్కటియే ఈతత్త్వమే సాంధ్యదేవత మరియు–

"అంగనా మంగనా మంతరే మాధవః

మాధవం మాధవం చాంతరే చాంగనాః"

అనుచు వర్ణింపబడెడి శ్రీకృష్ణగోపికా రాసక్రీడా నృత్యము గూడ ఆనందతాండవ నృత్యభంగిమలలో నొకటిగా తెలియనగును ఆనంద పారవశ్యమున చైతన్యప్రభువు మొదలగు మహాభక్తులు చేసెడి నృత్యము సాంధ్యనృత్యమే

తాండవనృత్యము

లోకదృష్టిలో మధురోద్ధత భేదములచే లాస్యము తాండవము అని అలంకారికులు నృత్యమును రెండువిధములుగా నిర్దేశించిరి శాస్త్రీక

ద్వ్దలో తాండవస్వరూపము వేఱు. పైన చెప్పిన విధముగా శివుని
ప్రళయతాండవము గాని నటరాజు రంగరాజుల ఆనందతాండవము గాని
ద్వైతప్రపంచభానము లేని యపుడు గలిగెడి సహజానందతాండవస్ఫూర్తిని
ఉపదేశించుచున్నది కనుక ద్వైతప్రపంచతాండవమే ద్వైతప్రపంచో
పమర్దనమే ఇట తాండవము తడి తాడనే తండవే " అను ధాతువు
సంది తాండవశబ్దము నిష్పన్నమైనది తాండవ మొక నృత్యకళ లౌకిక
నాటకాంగము ఈ నృత్యము చాక్షుష్కతువని సంప్రదాయజ్ఞుడైన మహాకవి
కాళిదాసుమాళవికాగ్నిమిత్ర నాటకమున అభివర్ణించెను ఈ నృత్యము
ప్రాపంచిక విషయములను దేహభావమును తాడవము జేసి అనగా ప్రవిలా
పంము జేసి మైమరపించి లోకోత్తరానందస్ఫూర్తిని కలుగజెయుచుండును
ఈఆనందము బ్రహ్మానంద సబ్రహ్మచారియగు ఆనందమని ఆలంకారిక
సమయము ఇది సాధారణ జనులకు పరమేశ్వర లోకోత్తర తాండవ
స్వరూపమును దర్శించుటకు శిక్షణ నిచ్చెడి అభ్యాసము ఇచట గలిగెడి
ఆనందానుభూతి తాత్కాలికము అక్షయ శివతాండవానందానుభూతికి మార్గ
దర్శకము కాగా లోకదృష్టిలో గాని తాత్త్వికదృష్టిలో గాని తాండవ
మనగా ద్వైతప్రపంచ తాడవముచే ద్వైతప్రపంచోపమర్దనముచే
కలుగు లోకోత్తరానంద పారవశ్యము ఇదియే పరమార్థమున సాంధ్య
శివతాండ నృత్య మని అభిజ్ఞుల యుపదేశము

42 )

శ్రీ శంకరులు శ్రీశైలమున మల్లేశ్వరుని దర్శించి ఆశివుని "సంధ్యారంభ విజృంభిత తత్త్వముగా" శివానందలహరి స్తోత్రమున [శ్లో–50] గానము జేయుట గమనార్హము

సంధ్యాప్రశంస.

అహోరాత్రసంధియందుపాపింపబడు సంధ్య అనంతఫలదాయక మగుటచే సంధ్యోపాసన మహాత్మ్యంచే వివిధరీతుల కొనియాడబడినది

"శుచి ర్వాప్యశుచి ర్వా యః కాలే సంధ్యాం సదా ద్విజః
ఉపాస్తే బ్రహ్మభూయాయ కల్పతే నాత్ర సంశయః విష్ణు
"సంధ్యా ముపాసతే యే తు సతతం సంశితవ్రతాః
విధూతపాపా స్తే యాంతి బ్రహ్మలోకం సనాతనమ్"
గోభిలః

"అశ్వమేధసహస్రాణి వాజపేయశతాని చ
నైవాప్నువంతి తులనాం సంధ్యోపాస్తే ర్ద్విజోత్తమాః"
మార్కండేయపురాణః

"విప్రో వృక్ష స్తస్య మూలం హి పంధ్యా వేదా శ్శాఖా
దర్మకార్యాణి పర్ణాః
తస్మా న్మూలం యత్నతో రక్షణీయం భిన్నే మూలే నైవ
శాఖా న పర్ణాః"
భవిష్యపురాణమ్,

బ్రహ్మజ్ఞానసంపన్నుడైన మహాత్ముడొక వృక్షము ఆ వృక్షము నకు మూలము సంధ్య వేదములు శాఖలు ధర్మకార్యములు పర్ణములు కనుక మూలమైన సంధ్యను యత్నముతో ప్రత్యేకశ్రద్ధతో రక్షించ వలయును మూలయే భిన్నమైనపుడు శాఖలు లేవు పర్ణములు లేవు

"యోఽన్యత్ర కురుతే యత్నం ధర్మకార్యే ష్వపి ద్విజః
విహాయ సంధ్యాప్రణతిం స యాతి నరకాయుతమ్"
"అతిక్రమతి యో మోహాత్ సంధ్యా మవ్యపరాయణః
స సాదుభి ర్బహిష్కార్యః సర్వస్మా ద్ద్విజకర్మణః"
"యః సంధ్యాం కాలత ప్రాప్తాం ఆలస్యా దతివర్తతే
సూర్యహత్యాం సమాప్నోతి ఉలూకత్వ మయా త్తతః
వ్యాసః"

ఈ విధముగా స్మృతికర్త లందఱు సంధ్యోపాసనావశ్యకతను బోధించిరి సంధ్యోపాసన జేయని వారు ఎన్ని ధర్మము లాచరించినను ప్రయోజన ముండదని ఉపదేశించిరి

రామాయణము సంధ్యోపాసన

సంధ్యోపాసన ఇట్లు ప్రధానాతిప్రధానమైనది గనుకనే వాల్మీకి మహర్షి చేత ప్రతిచిన్న సన్నివేశమునందును సంధ్యోపాసన గుర్తింప జేయ బడుచున్నది.

"కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥"
రామా 1 23 2

అను శ్లోకము ద్వారా మహర్షి కంఠోక్తి ముట్టమొదట సంధ్యోపాసనావశ్యకతను చెప్పుచున్నాడు సంధ్యాసమయమున నిద్రించుటను శాస్త్రములు నిషేధించినవి సంధ్యాసమయమున నిద్రించిన వాడు ఉలూకజన్మను (గుడ్లగూబ) పొందగలడని శాస్త్రనిర్ణయము యజ్ఞసంరక్షణార్థము విశ్వామిత్రుని వెంట వచ్చిన రామలక్ష్మణులు నిద్రించుచుందురు ప్రాతఃకాలిక సంధ్యాసమయ మాసన్నమైనపుడు విశ్వామిత్రుడు "ఉత్తిష్ఠ నరశార్దూల!" అని శ్రీరాముని మేలుకొలుపుచు "కర్తవ్యం దైవమాహ్నికం" అని దైవోపాసనాదేశించును ప్రాతఃకాలిక సంధ్యాసమయము భగవదుపాసనాసమయము కనుక లేచి సంధ్యముపాసింపమని విశ్వామిత్రుడు శ్రీరాముని ప్రబోధించుచున్నాడు ఇచట విశ్వామిత్రుని "కర్తవ్యం దైవ మాహ్నిక" మను ఆదేశము "అహరహస్సంధ్యా ముపాసీత" యను శ్రుతివచనప్రతిరూపమే యగును, కనుక ఈ శ్లోకమందటిని సంధ్యోపాసనకై నిద్రనుండి మేలుకొలుపుచున్న దనుకొనవచ్చును

విశ్వామిత్రుని ఆదేశప్రకారము రామలక్ష్మణు లిరువురు సంధ్యనుపాసించిరి

"తస్సర్షేః పరమోదారం వచ శ్రుత్వా నృపాత్మజౌ ।
స్నాత్వా కృతోదకౌ వీరౌ జేపతుః పరమం జపమ్"

ఇట ఋషియొక్క ఉపదేశమును పరమోదారముగా అనగా పరమ గంభీరమైన ఉపదేశముగా శ్రీరాముడు గ్రహించినట్లు పై శ్లోకమువలన తెలియును

విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో అనంగాశ్రమమును ప్రవేశించి నపుడు అటనున్న మహర్షులు వారికి అతిధిసత్కారము జేసిరి తరువాత వారందఱు సంధ్యనుపాసించిరట

"సత్కారం సమనుప్రాప్య కథాభి రభిరంజయన్ ।
యథార్హ మజపన్ సంధ్యా మృషయ స్తే సమాహితాః" 1 24 20

తరువాత తెల్లవారు జామున సంధ్యాకార్యము నిర్వర్తించిన విశ్వామిత్రునితో రామలక్ష్మణులు నదీతీరమును జేరిరట

"తతః ప్రభాతే విమలే కృతాహ్నికమరిందమౌ ।
విశ్వామిత్రం పురస్కృత్య నద్యా స్తీర ముపాగతౌ ॥" 1 24 1

శ్రీరాముడు తాటకను సంహరించును. అరాత్రి వారందరు తాటకా

వనమున విశ్రమింతురు ప్రభాతవేళయందు విశ్వామిత్రుడు యథాపూర్వము "ఉత్తిష్ఠ నరశార్దూల" అని ప్రబోధించును

"ఉవాస తస్మిన్ మునినా సహైవ ప్రభాతవేళాం ప్రతిబోధ్యమానః"

ప్రభాతవేళయందు విశ్వామిత్రుడు శ్రీరాముని నిద్రనుండి లేపెనట విశ్వామిత్రుడు సిద్ధాశ్రమము ప్రవేశించి యజ్ఞదీక్షితుడై నపుడు రామలక్ష్మణులు ప్రాతఃకాలికసంధ్య నుపాసించి విశ్వామిత్రుని సమీపించిరట

"కుమారా వపి తాం రాత్రి ముషిత్వా సుసమాహితౌ ।
ప్రభాతకాలే చోత్థాయ పూర్వాం సంధ్యా ముపాస్య చ॥
స్పృష్టోదకౌ శుచీ జప్యం సమాప్య నియమేన చ।
హుతాగ్నిహోత్ర మాసీనం విశ్వామిత్ర మవందతామ్ ॥

1 30 32

యజ్ఞసమాప్త్యనంతరము మరునాడు తెల్లవారు జామున
కృతపౌర్వాహ్ణికక్రియలగు రామలక్ష్మణులు విశ్వామిత్రుని
సమీపించిరట

"ప్రభాతాయాం తు శర్వర్యాం కృతపౌర్వాహ్ణికక్రియౌ।
విశ్వామిత్ర మృషిం శ్చాన్యాన్ సహితా వభిజగ్మతుః"

1 31 1

రామలక్ష్మణులు విశ్వామిత్రునితో జనకుని యజ్ఞమును చూడ బోయిరి దారిలో శోణానదీతీరమున నిద్రించు రామలక్ష్మణులను విశ్వామిత్రు డిట్లు ప్రబోధించెను

"సుప్రభాతా నిశా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే గమనా యాభిరోచయ"

1 35 2

ఇంతకు పూర్వము ఉత్తిష్ఠ నరశార్దూల। అని ప్రబోధించిన విశ్వామిత్రు డిపుడు ఉత్తిష్ఠోత్తిష్ఠ" అని అనుట విశేషము, తరువాత వారు గంగానదీతీరమును జేరి విశ్రమించిరి

"తత స్స్నాత్వా యథాన్యాయం సంతర్ప్య పితృదేవతాః।
హుత్వా చై వాగ్నిహోత్రాణి ప్రాశ్య చామృతవ ద్ధవిః॥
వివిశు ర్జాహ్నవీ తీరే శుచౌ ముదితమానసాః"

వారు గంగయందు స్నానము జేసి యథాశాస్త్రము విధి నిర్వహణము గావించి రట ఇచట "యథాన్యాయం" అను పదము వారి సంధ్యోపాసనను సూచించుచున్నది తరువాత వారు మిథిలానగర ప్రాంతము కు జేరినపుడు తత్త్వదర్శియైన జనకుడు సంధ్యోపాసన జేసి వచ్చి విశ్వామిత్రునకు స్వాగతము పలికెనట

"తతః ప్రభాతే విమలే కృతకర్మా నరాధిపః।
విశ్వామిత్రం మహాత్మాన మాజుహావ సలక్ష్మణమ్"

1-66 1

దీనిని బట్టి తత్త్వదర్శనము జేసినవారు కూడ లోకసంగ్రహా ముపకై సంధ్యోపాసన జేయుదు రని తెలియుచున్నది

పట్టాభిషిక్తుడు కానున్న శ్రీరాముడు శ్రద్ధగా సంధ్య నుపాసించి నట్లు తెలియుచున్నది.

"శ్రీమత్యాయతనే విష్ణోః శశ్యే నరపరాత్మజః
ఏకయామావశిష్టాయాం రాత్ర్యాం ప్రతివిబుధ్య సః'
పూర్వాం సంధ్యా ముపాసీనః జజాప యతమానసః ।

దీక్షితుడై విష్ణుమందిరమున నిదురించిన రాముడు తెల్లవారుజామున పూర్వసంధ్యనుపాసించెను

శ్రీరాముడు వనవాసమునకు బయలుదేరుటకు ముందు వశిష్ఠపుత్రు డగు సుయజ్ఞుని రమ్మని కబురంపును సుయజ్ఞుడు సంధ్య నుపాసించి వచ్చెనట

"తత స్సంధ్యా ముపాస్యా శు గత్వా సౌమిత్రిణా సహ ।
జుష్టంతత్ప్రావిశ ల్లక్ష్మ్యారమ్యం రామనివేశనమ్"

2 32–3

సుయజ్ఞుడు సంధ్యనుపాసించి వెంటనే లక్ష్మణునితో కలసి వచ్చెనట

సింహాసనమును వదలి అడవిని ప్రవేశించిన రాముడు సంధ్యను మరువ లేదని ఈ శ్లోకము తెలియజేయుచున్నది

తత్రైవ గచ్ఛత స్తస్య వ్యపాయా ద్రజనీ శివా ।
ఉపాస్య స శివాం సంధ్యాం విషయా న్తం వ్యగాహత ।
2 50 2

సీతారామలక్ష్మణులు గంగను దాటి ఒక మహా వృక్షమును సమీపించిరి ప్రొద్దుగ్రుంకినందున రాముడు వెంటనే సంధ్య నుపాసించెనట

"స తం వృక్షం సమాసాద్య సంధ్యా మన్వాస్య పశ్చిమాం ।
రామో రమయతాం శ్రేష్ఠ ఇతి హోవాచ లక్ష్మణమ్ ॥"
2 53 1

దశరథుడు యౌవనములో నున్నప్పుడు ఒకనాడు అటవికి బోయి తెలియక మునికుమారుని బాణముతో సంహరించుట అపుడా బాలుని తండ్రి దుఃఖించు విధానము సంధ్యోపాసనావశ్యకతను గుర్తింప జేయుచున్నది

"కో మాం సంధ్యా ముపా స్యైవ స్నాత్వా హుతహుతాశనః
శ్లాఘయిష్య త్యుపాసీనః పుత్రశోకభయార్దితమ్ ॥"
2 64 34

ఆ ముని కుమారుడు ప్రతిదినము స్నానానంతరము సంధ్య నుపాసించి హుతహుతాశనుడై (అగ్నిని సేవించిన వాడగుచు) తల్లిదండ్రుల సేవించెడి వాడు ఈనాడట్లు సంధ్యాదికర్మల నిర్వహించుచు నన్నాదరించు కుమారు డేడని ఆ మహర్షి దుఃఖించెను దీనిని బట్టి తండ్రి కుమారుని సంధ్యోపాసనానిరతిని శ్లాఘించినట్లు తెలియుచున్నది

మాతులగృహము నుండి తిరిగి వచ్చిన భరతుడు చేసిన ప్రతిజ్ఞ సంధ్యామహాత్త్వమును గుర్తింప జేయుచున్నది

"ఉభే సంధ్యే శయానస్య యత్పాపం పరికల్ప్యతే ।

తచ్చ పాపం భవే త్తస్య యస్యార్యోఽనుమతే గతః ।"

2 75 44

శ్రీరాము డడవికి పోవుటయందు నాకంగీకార మున్న (యస్యార్యోఽనుమతే గతః) ఉభయసంధ్యల యందు నిద్రించు వానికి పాపము కలుగు గాక।

భరతుని ఈ భీషణప్రతిజ్ఞ సంధ్యోపాసనా సమయమున నిద్రించుట మహాపాతకహేతు వని తెలియజేయుచున్నది

సుతీక్ష్ణమహర్షి ఆశ్రమమునకు జేరినపుడు శ్రీరాముడు ఉభయ సంధ్యల నుపాసించి నట్లు తెలియుచున్నది

"త మేవ ముక్త్వా వరదం రామ స్సంధ్యా ముపాగమత్ ।
అన్వాస్య పశ్చిమాం సంధ్యాం తత్రా వాస మకల్పయత్ ॥
సుతీక్ష్ణస్యా శ్రమే రమ్యే సీతయా లక్ష్మణేన చ"

3 7 ౪౦

సుతీక్ష్ణమహర్షి సంధ్యాసమయము దాటిన తరువాత వారలకు స్వయముగ ఆతిథ్య మిచ్చెనట

తత శ్శుభం తాపసభోజ్య మన్నం స్వయం సుతీక్ష్ణః పురుషర్ష భాభ్యామ్ ।
తాభ్యాం సుసత్కృత్య దదౌ మహాత్మా సంధ్యానివృత్తౌ రజనీ మవేక్ష్య"

3 8 24

సంధ్యాకాలానంతరము రాత్రిప్రవేశమున నాతిథ్యమిచ్చె ననుట వలన సంధ్యాసమయము ఆహారాదులు స్వీకరించుటకు నిషిద్ధసమయ మని తెలియుచున్నది

సుతీక్ష్ణమహర్షి ఆశ్రమమున రామలక్ష్మణుల దినచర్యావిధానము సంధ్యావిషయమున రామలక్ష్మణులకు గల ఆసక్తి, లక్ష్యము తెలియజేయు చున్నది.

"ఉత్థాయ తు యథా కాలం రాఘవ స్సహ సీతయా ।

ఉపాస్పృశ త్సుశీతేన జలేనోత్పలగంధినా ॥"
"అదథేzగ్నీన్ సురాం శ్చైవ వై దేహీ రామలక్ష్మణౌ ।
కాల్యం విధివదభ్యర్చ్య తపస్వి శరణే వనే ॥
ఉదయ స్తం దినకరం దృష్ట్వా విగతకల్మషాః ॥"

ఆశ్రమమందు శ్రీరాముడు యథాకాలము నిద్దురలేచి సీతాలక్ష్మణ సమేతుడై సకాలమున భగవదారాధన జేసెను ఉదయించు దివకరుని దర్శించి విగతకల్మషుడాయెను

శ్రీరాముడు సాయంకాలసంధ్య నుపాసించియే అగస్త్యమహర్షిని దర్శించెను

"ఉపాస్య పశ్చిమాం సంధ్యాం సహ భ్రాత్రా యధావిధి ।
ప్రవివేశా శ్రమపదం త మృషిం సో zభ్యవాదయత్ ॥"

3 11 70

పంచవటియందు వారు దైనందినము ఉద్యత్సూర్యుని అరాధించిరట

"తర్పయిత్వాz ధ సలిలైః తే పితౄాం న్దైవతాని చ ।
స్తువంతి స్మోదితం సూర్యం దేవతా శ్చ సమాహితాః ।"

3 16 42

ఇచట రామలక్ష్మణులతోపాటు సీతగూడ ప్రతిదినము ధాస్యం

వందనతత్పరు రాలై నట్లు తెలియుచున్నది సీత సంధ్యోపాసకురా లను విషయము సుందరకాండయందలి సంనివేశము విశదీకరించుచున్నది

రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ ।
సంధ్యాకాలమనాః శ్యామా ధ్రువ మేష్యతి జానకీ ॥
నదీం చేమాం శివజల ం సంధ్యార్థే వరవర్ణినీ "

4.14 49

హనుమంతుడు అశోకవనమున శింశుపావృక్ష మధిరోహించి సీతజాడల తెలిసికొనుటకు ప్రయత్నించును. "సీత రామశోకాభిసంతప్త, వన సంచారకుశల వనేచర సహవాసకాంక్షిణి, కనుక ఆమె తప్పక వనసంచార మునకు రాగల దని" హనుమంతు డనుకొనెను అంతేగాక "ఆమె సదా సంధ్యోపాసన తత్పర (సంధ్యాకాలమనాః). కనుక ఆమె సంధ్యోపాసనకు తప్పక పవిత్రజలములతో విలసిల్లుచు అటనున్న నదిని సేవించుటకు తప్పక రాగలదు " అని నిశ్చయించుకొని హనుమంతుడామె రాకకు నిరీక్షించెను

సీత సంధ్యాకాలమనాః

హనుమంతు డింతవరకు సీతను చూడలేదు సీత స్వభావము హనుమంతున కెట్లు తెలియును హనుమంతుడు సీతను "సంధ్యాకాలమనాః" అని వర్ణించుచున్నాడు సీత సంధ్యావందనతత్పర యని హనుమంతున కెట్లు తెలియును సంధ్యోపాసనను స్త్రీలు గూడ పురుషులవలె

జేయుచు ౦ను విషయ మంత ప్రసిద్ధము గాదు అయినను అపహృతయై భర్తృవియోగముతో క్రుంగిపోవుచున్న సీత శ్రద్ధగా తెల్లవారుజామున లేచివచ్చి ఏకాంతముగ నదియందు సంధ్య నుపాసించు నని ఊహించుట యెట్లు?

హనుమంతుడు రామలక్ష్మణులను కలసినప్పటినుండి వారి దిన చర్యను తిలకించుచునే యున్నాడు.

"ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్"

అని విశ్వామిత్రుడు ఆదేశించినట్లు రామలక్ష్మణులు యథావిధి సకాలసంధ్యోపాసన జేయుచునే ఉన్నారు పంచవటియందు సీతగూడ రామలక్ష్మణులతో కలసి సంధ్యనుపాసించినట్లు తెలియుచునే యున్నది ప్రసక్తానుప్రసక్తముగ హనుమంతుడు సీతాప్రవృత్తిని తెలిసికొనియే యుండును రామసాహచర్యము సీతను సంధ్యోపాసనా తత్పరురాలను జేసినది కనుకనే ఆమె సదా "సంధ్యాకాలమనస్కురాలై విరాజిల్లినది" అని హనుమంతుని విశ్వాసము రామసాహచర్యమునకు పూర్వ మామె జనకగృహవాసిని జనకగృహ మాస్తిక ధర్మమునకు పుట్టినిల్లు కనుక సీతకు సంధ్యోపాసనాభ్యాసము పుట్టినింట యంకురించి రామసాహచర్యమున వర్ధిల్లినది

"రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ"

అను హనుమంతుని వాక్య మీవిషయమును తెలియ జేయు చున్నది

ఈ సన్నివేశము ద్వారా వాల్మీకిమహర్షి వీరువారను భేదము లేక అందరు సంధ్య నుపాసింపవలయు నని యుపదేశించెను స్త్రీపుంభేదము లేకుండ ఉత్తమ సంస్కార సంపన్నులైన వారందఱు నిత్యసంధ్యోపాసన కులే లోకసంగ్రహార్థము మహాత్ములు జేయు సంధ్యోపాసన లోకమున కాదర్శప్రాయమై ఇతరులను గూడ ఆ మార్గమున పయనించుట కువక రించుచున్నది జనకవిశ్వామిత్రాదు లట్టి వారు వారి కారాధ్యమూర్తులైన సీతారాముల సంగతి వేరుగ చెప్పనక్కరలేదు

వాల్మీకిమహర్షి అడుగుజాడలలో నడచిన వ్యాసమహర్షి గూడ యుద్ధరంగమున గూడ సంధ్యోపాసనాప్రసంగమును మరువలేదు

"తే తదైవ మహారాజ దంశితా రణమూర్ధని ।
సంధ్యాగతం సహస్రాంశుం అదిత్య ముపతస్థిరే ॥"

యద్ధభూమియందు గూడ ధర్మమూర్తులగు యోధులందుఱు ధూళితో సంధ్యయం దాదిత్యున కర్ఘ్యమిచ్చిరట దీనిని బట్టి మహాకవుల కందఱకు కావ్యలక్ష్యమొక్కటియే యని తెలియును

హనుమంతుడు సంధ్యాస్వరూపము

లోకమునకు సంధ్యోపాసనాప్రాభవము నుపదేశించు వాల్మీకి సదా సంధ్యాదేవీ దివ్యసాక్షాత్కారపులకితచిత్తుడు కనుకనే హనుమంతుడు సము ద్రలంఘనము జేయుచు అకాశమున పయనించుచున్నప్పుడు భావనాగగన విహారము జేయు మహాకవికి అరుణారుణ కాంతులతో విలసిల్లు హనుమం

తుని మోము సంధ్యారాగసమభిస్పృష్టమైన సూర్యమండలముగా భాసించినది

"ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్రమాబభౌ ।
సంధ్యయా సమభిస్పృష్టం యథైక త్సూర్యమండలమ్ ॥"
4 1 60

ఉద్యత్సూర్యుడు సాంధ్యారుణకాంతులతో పరివ్యాప్తుడై దివ్య పవిత్రతేజోమూర్తియై ప్రకాశించుచుండును హనుమంతుని నాసికాభాగ మరుణకాంతి సంశోభితము అట్టి నాసికా దివ్యారుణ కాంతిపుంజములు నిండుకొనియున్న రామభక్తుని ముఖము సాంధ్యరాగపరిక్లుప్త సూర్యమండలమువలె నున్నదట.

చిన్నతనమున హనుమంతుడు సూర్యమండలమును సమీపించి నపుడు ఆతని ముఖము సూర్యరశ్మిచే దగ్ధమైన దనియు అందువలన నాతని ముఖ మట్లుండు నని పురాణవర్ణన అంతరార్థము హనుమంతుడు బాల్యము ననే సవితృవరేణ్యభర్గొపాసకుడు బాల్యమునుండియు ఆతని ముఖము సవితృదివ్యతేజోవిలాససుందరము హనుమంతుని దివ్యసౌందర్యమును ప్రప్రథమమున దర్శించి జగమున కుపదేశించిన దేశికుడు వాల్మీకి కనుకనే హనుమంతుని వదనారవిందమును 'సంధ్యయాసమభిస్పృష్ట సూర్యమండల' మని యుపదేశించెను

యుద్ధకాండలో గూడ వాల్మీకి మహర్షి సంధ్యను స్మరింపజేయుట

మహర్షియొక్క నిరంతర సంధ్యా స్వరూపభావన అవగతమగు చున్నది

"ఆశ్వాసితో లక్ష్మణేన రామ స్సంధ్యా ముపాసత ।
స్మరన్ కమలపత్రాక్షీం సీతాం శోకాకులీకృతః ॥"

6 5 23

వానరసేనతో శ్రీరాముడు సముద్రమును సమీపించును సీతా వియోగదుఃఖితుడైన రాముని లక్ష్మణు డూరడించును అపుడు రాముడు సంధ్య నుపాసించెను

వాల్మీకిమహర్షి మానసోద్యానమున సదా సంధ్యాసుందరి విహరించు చుండుట వలననే మహర్షి కాంతాసంమితముగ సంధ్యాస్వరూపము నభివర్ణించెను

"తా మాససా దాతిబలో భ్రాతృభ్యాం రహితాం వనే ।
రహితాం చంద్రసూర్యాభ్యాం సంధ్యా మివ మహత్తమః ॥"

కనకహరిణమును శ్రీరాముడు వెంబడించును మారీచుని మాయా హాహాకారములతో మోహితయైన సీత ప్రేరణతో లక్ష్మణుడు గూడ రాము నకు సాయబడుటకు పోవును అపుడు రామలక్ష్మణ రహితయై యున్న సీతను సూర్యచంద్రరహితయైన సంధ్యను తమస్సువలె రావణుడు సమీపించెను

సంధియందు ఉపాస్యమావదేవత సంధ్యయని పూర్వము వివరింప బడినది ప్రకృతమున అహోరాత్ర సంధియందు విలసిల్లు దేవత ప్రతి దినము మనచే అరాధింపబడుచున్నది అహోరాత్రములు సూర్యచంద్ర (నక్షత్ర) జ్యోతిస్సుల కుపలక్షణము ఆ సూర్యచంద్ర (అహోరాత్ర) జ్యోతిస్సుల సంధియే అహోరాత్ర సంధి ఈ అహోరాత్ర సంధియందు సూర్యనక్షత్రవిలక్షణమై విరాజిల్లు దివ్య తేజస్సు సంధ్య అని వాల్మీకి మహర్షి శాస్త్రప్రసిద్ధ లక్షణమును ఉపమాన రూపమున వర్ణించెను

"సంధౌసంధ్యాముపాసీ తాజ్యోతిషో దర్శనా త్సన్ధిః"
అని ఛాందోగ్యశ్రుతి.

అస్యార్థః అత్ర జ్యోతిష్పదం సూర్యనక్షత్రవాచకమ్ ।
తథా చాZజ్యోతిషో దర్శనా దర్ధాస్తమిత సూర్యదర్శన
కాల మారభ్య నక్షత్రోదయ పర్యంతం యః కాలః స
సన్ధిః తత్ర సాయం సంధ్యా ముపాసీత విదధీత ।
తదుక్తమ్

"అర్ధాస్తమితకాలా త్యః సంధి రాతారకోదయాత్ ।
తత్ర సంధ్యా ముపాసీత సాయం కాలే సమాహితః ।
తత్ర ప్రాత స్సంధ్యా ముపాసీ తేతి స్మృత్యంతరే విశేష ఉక్తేః
"అహోరాత్రస్య య స్సంధి స్సూర్యనక్షత్రవర్జితః ।
తత్ర సంధ్యాముపాసీత సాయం ప్రాత స్సమాహితః"
కృష్ణపండితవిరచిత సంధ్యావందనభాష్యమ్.

అర్ధాస్తమిత సూర్యతేజస్సుతో ప్రారంభమై నక్షత్రోదయ (చంద్ర) పర్యంతము సంధ్యాసమయము అందు సూర్యనక్షత్రవర్జిత సంధి యందు తేజరిల్లు దివ్యశక్తి సంధ్యా దేవత యను శ్రుత్యుపదేశమును వాల్మీకి మహర్షి సీతావ్యాజమున వివరించెను

సంధ్య గాయత్రి

సంధ్య యనిన తోడనే గాయత్రీ పరాదేవత సహృదయులకు హృదయపీఠమున సాక్షాత్కరించును వాల్మీకి మహర్షి గాయత్రీ నామము సాక్షా దుచ్చరించక పోయినను ఇంగితైః చేష్టితైః నిమిషితైః గాయత్రీదేవతను స్మరింపజేయుచుండును ఇరువది నాల్గువేల శ్లోకములతో రామాయణమును రచించి తన కావ్యము గాయత్రీరూప మని మహాకవి స్ఫురింపజేయుట సకలలోకవిదితము

స్థూల దృష్టితో జూచినపుడు సంధ్యాగాయత్రీ దేవతలు భిన్నముగా కన్పించినను తత్త్వదృష్టిలో ఇద్దరు ఒక్కటియే

"యా సంధ్యా సైవ గాయత్రీ ద్విధా భూతా వ్యవస్థితా"

అను సూక్తి ఈ విషయమునే బోధించుచున్నది అయితే వినియోగ భేదము ననుసరించి వ్యవహారభేదము తప్పదు

"అన్యా సంస్కారగాయత్రీ కర్మ స్వన్యా ప్రవర్తతే ।
అన్యా జపప్రబంధేషు సా త్వేకైవ ప్రతీయతే ॥"
వాక్యపదీయ 2 283

మహావైయాకరణుడగు భర్తృహరి గాయత్రి త్రివిధరూపిణిగా కన్పట్టినను తత్త్వతః ఆమె ఒక్కటియే యని యనుచున్నాడు

కర్మలయందు ప్రవృత్తమైన గాయత్రి వేఱు జపప్రబంధము లందు ప్రవృత్తయైన యామె వేఱు సంస్కారగాయత్రి వేఱు కాని తత్త్వతః ఉన్నది ఒక్క చైతన్యమే గాయత్రియే

సంధ్యోపాసన యందాదిమధ్యావసానముల యందు గాయత్రియే ఆరాధింపబడుచున్నది. సంధ్యావందనము కాయిక వాచిక మానసిక క్రియా రూపముగా మూడు విధములుగా నొప్పారుచున్నది

అర్ఘ్యాంతము కాయికము జపము వాచికము సూర్యోపస్థానము మానసికము ఈ మూడును కర్మ భక్తి జ్ఞానయోగములకు ప్రతీకలు కర్మ భక్తి యోగముల యందు గాయత్రి ఉపాసింపబడినను జ్ఞానయోగమున ఆ గాయత్రి సంస్కార గాయత్రి యగు నని శ్రీ భర్తృహరి యుపదేశించుచున్నాడు కర్మభక్తియోగములందు గాయత్రి ఆరాధకుని సంస్కరించినను జ్ఞాన యోగమునందే ఆరాధకుడు తత్త్వమును దర్శించి కృతకృత్యు డగుచున్నాడు గాన కర్మభక్తియోగములందుకన్న జ్ఞానయోగమ ననే ఆరాధకులు శ్రవణ మనననిధిధ్యాసాదులద్వారా గాయత్రి నుపాసించి ఆమెచే సంస్కరింపబడుచున్నాడు కనుక ఆమె సంస్కారగాయత్రి యగుచున్నది జీవేశ్వర రూప ద్వైతభావమును బోనాడి అద్వైతానుభూతి నందిచ్చు మహావాక్యమే సంస్కారగాయత్రి.

గాయత్రి అట్లు మహామహిమాన్వితమైనది. కనుకనే శాస్త్రములు గాయత్రి నిట్లు ప్రశంసించినవి

"గాయత్రీ వేదజననీ గాయత్రీ పావనాశినీ ।
గాయత్ర్యా స్తు పరం నా స్తి దివిచేహ చ పావనీ "

గాయత్రి వేదజనని ఆమె ప్రప్రథమున ఓంకార రూపమున ఆవి ర్భవించినది ఆ ఓంకారము "భూః భువః స్వః " అను వ్యాహృతుల రూపమునను ఆ వ్యాహృతులు చతుర్వింశత్యక్షరాత్మక త్రిపదా గాయత్రి రూపమునను ఆ గాయత్రి తుదకు త్రయీరూపిణి యగు వేదమాతృ రూపిణిగను ఆవిర్భవించినది ఇట్లు మంత్రబ్రాహ్మణాత్మక వేదరాశియం తయు గాయత్రి యగుచున్నది

"వా గ్వై గాయత్రీ వా గ్వా ఇదం సర్వం భూతం
యదిదం కిం చ గాయతి చ త్రాయతే చ"

అని ఛాందోగ్య శ్రుతి పరమార్థ దర్శక వాఙ్మయమంతయు గాయత్రి యని వర్ణించుచున్నది ఈ శ్రుతి

"యా భూతజాతాని గాయతి త్రాయతే చ సా గాయత్రీ"
యని గాయత్రీ శబ్దవ్యుత్ప త్తిని దర్శింపజేయుచున్నది
పురాణములు గాయత్రి స్వరూపము నిట్లు వివరించుచున్నవి
"ప్రతిగ్రహా దన్నదోషా త్పాతకా దుపపాతకాత్।
గాయత్రీ ప్రోచ్యతే తస్మా ద్గాయంతం త్రాయతే యతః"

తన నారాధించు భక్తుల యొక్క ప్రతిగ్రహ అన్నదోష పాతక ఉపపాతకాదుల పోగొట్టి వారల కాపాడు నదిగాన ఆమెగాయత్రి

"ప్రాణాగయా ఇతి ప్రాణాః త్రాయతే తానధాz వా"

అను వాక్యము "గాయత్రి ప్రాణరక్షకరీ"యను నర్థమును బోధించు చున్నది గయాన్ ప్రాణాన్ రక్షతీతి గాయత్రీ ప్రాణములకు గయ లని పేరు ఆ ప్రాణముల నామె రక్షించును గాన గాయత్రి ప్రాణరక్షకరీ

సంధ్యావందనాంగముగ ప్రాణాయామము విధింపబడినది పూరక కుంభకరేచకరూప మగు ప్రాణాయామము గాయత్రీ మంత్రోచ్చారణ రూప మున చేయబడుచున్నది అపుడు గాయత్రి ప్రాణముల దివ్యశక్తి సంభరితములుగా చేయుచున్నది

గయశబ్దమునకు వాగాదీంద్రియము లని గూడ అర్థము గయలను అనగా వాగాదీంద్రియములను రక్షించునది గాయత్రి అనగా గాయత్ర్యు పాసనము వలన వాగాదీంద్రియములు సంస్కరింపబడి రక్షింపబడు చుండును

"గయాన్ వాగాదీంద్రియాన్ త్రాయతే ఇతి గాయత్రీ ।
గాయత్ర్యాః పాదత్రయరూపాః భూర్భువస్స్వః ।
ఋగ్యజుస్సామాని ప్రాణాపానవ్యానాః"

అని బృహదారణ్యక శ్రుతి (5 14 8) ఈ విషయము నుపదేశించుచున్నది

"గీయతే పరతత్త్వ మనయా ఇతి గాయత్రీ"

అను వ్యుత్పత్తి ననుసరించి పరతత్త్వదర్శక మగుటచే మంత్ర జాతమంతయు గాయత్రియే యగుచున్నది. కనుకనే వేదవాఙ్మయము తరువాత పరతత్త్వదర్శకము మంత్రకల్పరూపమైన రామాయణము గాయత్రిగా అరాధింపబడుచున్నది అందుకనియే రామాయణము గాయత్రీ రామాయణమని పేరుగాంచినది ఈనాడు 24శ్లోకముల విడదీసి గాయత్రీ రామాయణముగా స్థూలదృష్టితో ఉపాసింపబడుచున్నది తత్త్వదృష్టిలో రామాయణ మంతయు గాయత్రీ రామాయణమే

"1) గాయంతం త్రాయతే 2) గాయతి త్రాయతే
3) గయాన్ త్రాయతే 4) గీయతే అనయా బ్రహ్మతత్త్వం"

అను వ్యుత్పత్తులన్నియు అదికావ్యమున సమన్వయమగుచు సార్థకతను పొందుచున్నవి గాన చతుర్వింశతిసహస్రాత్మక రామాయణము గాయత్రియే లేక రామాయణము వాల్మీకిమహర్షి ఉపాస్య దేవతా గాయత్రీ ప్రతిరూపమే

సంధ్యోపాసన గాయత్రీ నిష్కృతి

ప్రాతఃకాలసంధ్యయందు సంధ్యాదేవత బ్రాహ్మీ రూపిణిగాను మధ్యాహ్నసమయమున రౌద్రీరూపిణిగాను, సాయం సమయమున వైష్ణవిగాను, అరాధింపబడుచున్నది అనగా ఒకే దివ్యచైతన్యశక్తి త్రివిధరూపములతో అరాధకుల చిత్తసంస్కారము ననుసరించి

త్రివిధరూపిణిగా విలసిల్లును ఆమె మరియొక ప్రసంగమున మహాకాళీ మహాలక్ష్మి మహాసరస్వతిగాను, బాల లలిత రాజరాజేశ్వరిగాను, అదితి అనుమతి సరస్వతి రూపమువను, సంధ్యా సావిత్రీ గాయత్రీ రూపముగను, సంధ్యా విద్యా సరస్వతీ రూపమునను ఆరాధింపబడుచున్నది

"గాయత్రీ నామ పూర్వాహ్ణే సావిత్రీ మధ్యమే దినే ।
సరస్వతీ చ సాయాహ్నే సైవ సంధ్యా త్రిధామతా ॥"

అను శ్లోకము సంధ్యారూప దివ్యచైతన్యశక్తి యొక్క త్రివిధ రూపముల వర్ణించుచున్నది ఈ త్రివిధస్థితి సాధకునకు త్రివిధాతీతతురీయ తత్త్వదర్శక మగుచున్నది ఈ తురీయస్థితియే నిమృజి "నిమార్ష్టీతి నిమృజీ" జగదతీత స్వరూపిణి యని అర్థము నిమృజి తురీయరూప మని తెలియ జేయుటకే సంధ్యాంగతర్పణమున తురీయ దేవతగా నిమృజి' త్రికాల మందును భేదములేకుండ ఆరాధింపబడుచున్నది.

సంధ్యోపాసన గాయత్రి పంచశీర్ష

"చతుర్వింశత్యక్షరా త్రిపదా షట్కుక్షిః
పంచశీర్షోపనయనే వినియోగః ॥"

అని ప్రతిదినము గాయత్రి పంచశీర్షగా దర్శింపబడుచున్నది

"ముక్తావిద్రుమహేమనీల ధవళచ్ఛాయైః ముఖైః"

అని గాయత్రిని ప్రార్థించుచున్నాము గాయత్రి ముక్త విద్రుమ

హేమ నీల ధవళ కాంతులతో కూడిన ముఖములు కలిగి యుండు నని శాస్త్ర మర్యాద అసలు దేవతకు అయిదుముఖములుండుట విశేషము ఆ ముఖములు గూడ అన్నియు ఒకే వర్ణము కలిగియుండక భిన్నభిన్న వర్ణములు కలిగియుండుట తావ గాంభీర్య స్ఫోరకము సూక్ష్మదృష్టితో పరిశీలించిన గాని గాయత్రీస్వరూపము గాయత్రియొక్క పంచశీర్షత్వము పంచవర్ణాత్మకత్వము అవగతము కాదు

గాయత్రీ శబ్దమునకు "తననారాధించు వారిని రక్షించునది" యని అర్థము యథార్థదృష్టితో పరిశీలించినపుడు మనల రక్షించునది దేవతను గ్రహించిన మైన మన సద్బుద్ధియే మనస్సు మారనంతవరకు మనోమాలి న్యము తొలగ నంతవరకు మనము కృతకృత్యులము కాలేము ఎంత వేద విదుడైనను ఎన్ని సత్కర్మల నాచరించినను సద్బుద్ధియేర్పడనందువలన రావణాదులు నశించిరి రావణుని గాని దుర్యోధనాదులను గాని నశింప జేసినది దోషదూషితమైన వారి దుర్బుద్ధియే ఎచటో మాకమూలమున్నను మహర్షులారాధింపబడుటకు కారణము వారి పరిణతబుద్ధియే సద్బుద్ధియే పరమేశ్వరునకు 'సత్' అని నామము సద్బుద్ధియన పరమేశ్వరాకారాకా రితమైన బుద్ధియే బుద్ధి భగవదాకారాకారితమగుటకు భగవదుపాసనయే ప్రధాన కారణము భగవంతుని మనమే రూపమున ధ్యానింతుమో క్రమ ముగ బుద్ధి తదాకారాకారితమగు చుండును నాకు చక్కని బుద్ధినీయమని త్రికాలములందు గాయత్రినుపాసించి నపుడు మన బుద్ధి క్రమముగా

తదాకారాకారితమగును అపుడు ఆ తల్లి మన బుద్ధిరూపమున మనలను రక్షించును బుద్ధికి పంచేంద్రియములు ముఖములు పంచేంద్రియములు పంచభూతాత్మకములు పంచభూతముల వర్ణములే ముక్తా విద్రుమ హేమ నీల ధవళములు ఆరాధకుని బుద్ధి పరాదేవతారూపము దాల్చినపుడు బుద్ధిరూపిణియైన గాయత్రి పంచశీర్షయై ముక్తా విద్రుమ హేమ నీల ధవళవర్ణములతో విరాజిల్లును మహాత్ములదర్శించినపుడు వారి వదనములు అవ్యక్తదివ్యజ్యోతుల వెలయుచుండుట అనుభవసిద్ధమే ఆ దివ్యజ్యోతిస్సుల అవాంతర విభాగములే ముక్తావిద్రుమాది వర్ణములు పంచభూతముల వర్ణములను సంప్రదాయ మిట్లు నిర్దేశించుచున్నది

| వర్ణములు | భూతములు | ఇంద్రియములు | గుణములు |
|---|---|---|---|
| ముక్త | జలము | రసనేంద్రియము | రసము |
| విద్రుమ | అగ్ని | చక్షురింద్రియము | రూపము |
| హేమ | వాయువు | త్వగింద్రియము | స్పర్శము |
| నీల | ఆకాశ | శ్రోత్రేంద్రియము | శబ్దము |
| ధవళ | పృధివీ | ఘ్రాణేంద్రియము | గంధము |

దీనినిబట్టి పంచభూతములు పంచవర్ణాత్మకము లని తెలియును లోకదృష్టిలో ఆకాశవాయువులు రూపరహితములైనను శాస్త్రదృష్టిలో ఆ భూతములు రూపసహితములే। అయితే ఈ భూతవర్ణములు యోగిజన హృదయవేద్యములు సామాన్యుల కవగతముగాదు కనుక పంచ

శివుడు సాంధ్యనృత్యము

భూతాత్మకమైన పంచేంద్రియములు పంచవర్ణాత్మకములు అట్టి పంచ వర్ణాత్మక పంచేంద్రియవిలసిత మహత్ముల సద్బుద్ధియే పంచశీర్ష ఆ సద్బుద్ధియే వారిపాలిటి గాయత్రి. "ఉద్ధరేదాత్మనాత్మానం" మను పెద్దల యుపదేశ తాత్పర్యమిదియే:

వాల్మీకిహృదయము నారదోపదేశానంతరము గాయత్రీ పరాదేవతా సవ్యభావసంపరిప్లుష్టము కనుకనే ఆ మహాత్ముని హృదయం దంతట అవ్యక్తరూపిణియై గాయత్రి తేజరిల్లుచుండును

వాల్మీకి మహర్షి గాయత్ర్యుపాసనశీలత

వాల్మీకిమహర్షి తనఉపాస్య దేవతను కన్నులారగాంచుచు రామాయ ణమును రచించెను అరుణారుణ కాంతులతో వెలయు సంధ్యాదేవతో పాసనతో దినారంభ మైనట్లు నవనవారుణదివ్య తేజఃపుంజములతోనలరారు బాలా దేవతానుధ్యానముతో రామాయణారంభ మైనట్లు నవనవారుణదివ్య తేజఃపుంజములతో నలరారు బాలాదేవతానుధ్యానముతో రామాయణ మారంభమైనది నిత్యోపాస్యయగు బాల రామాయణమున బాలకాండగా యవతరించినది

వాల్మీకిమహర్షి తన ఉపాస్యదేవతయైన గాయత్రిని ఆయాసన్ని వేశములందు వివిధరూపములతో సాక్షాత్కరించుకొని ఉపాసించినట్లు తెలియును

గాయత్రి పాదుక

వాల్మీకి మహర్షి గాయత్రిని పాదుకారూపిణిగా ఉపాసించెను. లోకోత్తరము సర్వతోవిలక్షణమైన పాదుకాపట్టాభిషేక వ్యాజమున మహర్షి తన పాదుకాంతదీక్షాపరత్వమును సూచించె నని తెలియుచున్నది

"పాదుకా సా పరాశక్తిః పరానందస్వరూపిణీ"

పాదుక యన పరానందస్వరూపిణి యైన పరాశక్తియే

"స్వప్రకాశ శివమూర్తి రేకికా ।

తద్విమర్శ తను రేకికా తయోః ।

సామరస్య వపురిష్యతే పరా ।

పాదుకా పరశివాత్మనోః గురోః"

అను పాదుకా స్వరూపము "స్త్రియం పురుషవిగ్రహం" అను భావమును స్ఫురింపజేయుచున్న దనుకొన వచ్చును

"ఆదిశంకరులు నమశ్శివాయై చ నమశ్శివాయ"

అని అనుచు మహాదేవుని స్త్రీపుంసాత్మక స్వరూపునిగా అర్ధనారీశ్వరస్తోత్రమున వర్ణించుట ప్రసిద్ధమే శ్రీచక్రార్చన గూడ శివశక్త్యాత్మక పరతత్త్వార్చనయే యగుటయు ప్రసిద్ధము.

వాల్మీకిమహర్షి ఆదిత్యహృదయము

రమణీయ పరాదేవతా సాక్షాత్కార చమత్కృతి సంపత్తి

హృదయుడగు వాల్మీకి మహర్షి దృష్టి యుద్ధ కాండయందును పరానంద స్వరూపిణియగు పరాశక్తి పాదద్వంద్వమునందే లగ్నమై యున్నది. ఆదిత్యహృదయము వాల్మీకి మహర్షి యొక్క పరాశక్త్యుపాసనకు గాయత్రీమహామంత్రార్థ దర్శనమునకు పరాకాష్ఠారూపము

రావణుడు యుద్ధభూమికి మరలద్విగుణీకృతోత్సాహముతో తిరిగి వచ్చెను అపుడు యుద్ధపరిశ్రాంతుడై యున్న శ్రీరాముడు రావణవధో పాయమును గూర్చి ఆలోచించుచుండును అపు డగస్త్యమహర్షి వచ్చి రామున కాదిత్యహృదయము నుపదేశించును

ఇంతకు పూర్వము అగస్త్యుడు బ్రహ్మాస్త్రమును శ్రీరామున కుప దేశించి యుండెను

"జగ్రాహ స శరం దీప్తం నిశ్వసంత మివోరగం
య మస్మై ప్రథమం ప్రాదా దగస్త్యో భగవా నృషిః"
యుద్ధ 111 3

ప్రకృతమున రావణవధోపాయమును చింతించు శ్రీరామునకు దైవీసంపత్సిద్ధికి ఆదిత్యహృదయము నుపదేశించును

ఆదిత్యహృదయ మను నామ మపూర్వము ఋషి దృష్టము అగస్త్యోపదేశమునకు ఆదిత్యస్తోత్రమని నామము గాక ఆదిత్యహృదయ మనుటలో వాల్మీకి మహర్షి యొక్క వాగ్విదాంవరత్వము ప్రస్ఫుట మగు చున్నది వాక్కనగా వేదజనని గాయత్రి వాగ్విదు లన గాయత్రీ

పరమార్థ ద్రష్టలు వాగ్విదాంవరు లన తత్త్వదర్శనులు జీవన్ముక్తులైన మహాత్ములు. వాల్మీకి అట్టి మహాత్ముడు కనుక దర్శించిన గాయత్రీ మహా మంత్రార్థమును లోకసంగ్రహణదృష్టితో ఉపదేశించెను.

గాయత్రీ మహామంత్రము సవితృవరేణ్య భర్గము నుపాసించమని యుపదేశించుచున్నది ఆరాధకుల బుద్ధిని పరమార్థ దర్శనమునకై ప్రేరే పించునది ఆ దివ్యవరేణ్యభర్గమే.

ఆదిత్య హృదయోపదేశము గూడ నదియే

"ఆదిత్యస్య సూర్యస్య హృత్ అయత ఇతి హృదయమ్ ।
ఆదిత్య హృద్గతోంతర్యామీ ఆదిత్యహృదయ శబ్దే నోచ్యతే"

వ్యాఖ్య

ఆదిత్యమండలాంతర్గత పరంజ్యోతియే ఆదిత్యహృదయము సవితృమండలాంతర్గత పరంజ్యోతిస్సు యొక్క ఉపాసనయే గాయత్ర్యు పాసన అదియే ఆదిత్యహృదయోపాసన

ఆరాధకుల బుద్ధి సంస్కారక్రమ సంపన్నమగుచు క్రమముగా తదాకారాకారిత మగుటయే నిఖిల వేదార్థలక్ష్యము అదియే రామాయణ లక్ష్యము అదియే ఆదిత్యహృదయ లక్ష్యము

సంధ్యావందనమున జ్ఞానయోగప్రతీక రూపమగు సూర్యోపస్థానమే సంధ్యోపాసనా రూపమైన రామాయణమున ఆదిత్యహృదయ స్థాన మలంకరించుచున్నది.

ఈ విధముగ పరిశీలించిన రామాయణము వాల్మీకిమహర్షి యొక్క ఉపాసనాక్రమ పరిణతి రూపమని దర్శింపవచ్చును

వాల్మీకిమహర్షి సీతాదేవి సంధ్య

రామపూర్వతాపనీయోపనిషద్వ్యాఖ్యానమున ప్రాతః మధ్యాహ్న సాయంకాలములందు రామసంధ్యనుపాసించు విధానము నిర్దేశింపబడినది.

"సాయం ప్రాతశ్చ మధ్యాహ్నే రామసంధ్యాం సమాచరేత్"
ఉపనిషద్వ్యాఖ్య

ఈ అనూచాన సంప్రదాయము ననుసరించి వాల్మీకిమహర్షియు రామాయణమున రామసంధ్యోపాసనా విధానమునే ఉపదేశించెను తాను గూడ రామసంధ్య నుపాసించును

"దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి ।
తన్నో రామః ప్రచోదయాత్"

అని రామ గాయత్రీ మంత్రజపమే రామసంధ్య యని స్థూలముగ కన్పించును

కాని శ్రీరామసంధ్యకు వాల్మీకిమహర్షి పూర్వోత్తర రూపముల వ ంచి సంధ్యాస్వరూప సమగ్రతను దర్శింపజేసెను.

ఈ సంధ్యయందు రాముడు పూర్వరూపము లక్ష్మణు డుత్తర రూపము రామలక్ష్మణుల మధ్య విరాజిల్లు సీతయే సంధి ఆమె

పరమార్థ ద్రష్టలు వాగ్విదాంవరు లన తత్త్వదర్శనులు జీవన్ముక్తులైన మహాత్ములు. వాల్మీకి అట్టి మహాత్ముడు కనుక దర్శించిన గాయత్రీ మహా మంత్రార్థమును లోకసంగ్రహణదృష్టితో ఉపదేశించెను

గాయత్రీ మహామంత్రము సవితృవరేణ్య భర్గము నుపాసించమని యుపదేశించుచున్నది ఆరాధకుల బుద్ధిని పరమార్థ దర్శనమునకై ప్రేరేపించునది ఆ దివ్యవరేణ్యభర్గమే.

ఆదిత్య హృదయోపదేశము గూడ నదియే

"ఆదిత్యస్య సూర్యస్య హృత్ అయత ఇతి హృదయమ్ :
ఆదిత్య హృద్గతోంతర్యామి ఆదిత్యహృదయ శబ్దే నోచ్యతే"

వ్యాఖ్య

ఆదిత్యమండలాంతర్గత పరంజ్యోతియే ఆదిత్యహృదయము సవితృమండలాంతర్గత పరంజ్యోతిస్సు యొక్క ఉపాసనయే గాయత్ర్యుపాసన అదియే ఆదిత్యహృదయోపాసన

ఆరాధకుల బుద్ధి సంస్కారక్రమ సంపన్నమగుచు క్రమముగా తదాకారాకారిత మగుటయే నిఖిల వేదార్థలక్ష్యము అదియే రామాయణ లక్ష్యము అదియే ఆదిత్యహృదయ లక్ష్యము

సంధ్యావందనమున జ్ఞానయోగప్రతీక రూపమగు సూర్యోపస్థానమే సంధ్యోపాసనా రూపమైన రామాయణమున ఆదిత్యహృదయ స్థాన మలంకరించుచున్నది.

ఈ విధముగ పరిశీలించిన రామాయణము వాల్మీకిమహర్షి యొక్క ఉపాసనాక్రమ పరిణతి రూపమని దర్శింపవచ్చును

వాల్మీకిమహర్షి సీతాదేవి సంధ్య

రామపూర్వతాపనీయోపనిషద్వ్యాఖ్యానమున ప్రాతః మధ్యాహ్న సాయంకాలములందు రామసంధ్యనుపాసించు విధానము నిర్దేశింపబడినది

"సాయం ప్రాతశ్చ మధ్యాహ్నే రామసంధ్యాం సమాచరేత్"

ఉపనిషద్వ్యాఖ్య.

ఈ అనూచాన సంప్రదాయము ననుసరించి వాల్మీకిమహర్షియు రామాయణమున రామసంధ్యోపాసనా విధానమునే ఉపదేశించెను తాను గూడ రామసంధ్య నుపాసించును

"దాశరధాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి ।
తన్నో రామః ప్రచోదయాత్"

అని రామ గాయత్రీ మంత్రజపమే రామసంధ్య యని స్థూలముగ కన్పించును

కాని శ్రీరామసంధ్యకు వాల్మీకిమహర్షి పూర్వోత్తర రూపముల వంచి సంధ్యాస్వరూప సమగ్రతను దర్శింపజేసెను.

ఈ సంధ్యయందు రాముడు పూర్వరూపము లక్ష్మణు డుత్తర రూపము రామలక్ష్మణుల మధ్య విరాజిల్లు సీతయే సంధి ఆమె

యందు సాక్షాత్కరించు బ్రహ్మవిద్యారూపమే సంధ్య తత్త్వోపాసనయే సంధానము వాల్మీకికి ఉపాసించిన దా సాంధ్యసౌందర్యమునే సుందర కాండయందు హనుమద్వ్యాజమున తానే పరాదేవతా స్వరూపాన్వేషణము జేసిజేసి దర్శించినది సీతాసాంధ్య దేవతా సౌందర్య సంపదనే

"సీతారక్షిత వామాంకం లక్ష్మణేనోపశోభితమ్ ।
ధ్యాయ న్నేవ జపే న్మంత్రం వర్ణలక్షం విచక్షణః"

అను శ్లోకమును (రామతాపనీయోపనిషద్వ్యాఖ్య) రామలక్ష్మణుల మధ్య సీత నుపాసించు మని బోధించుచున్నది

ఉపనిషద్రహస్య తత్త్వజ్ఞు డగు వాల్మీకిమహర్షి సీతను జనక సుతగాను శ్రీరామధర్మపత్నిగా మాత్రమే గాక క్రమముగ బ్రహ్మవిద్యా స్వరూపిణిగా వేదమాతగా సాంధ్యసుందరిగా దర్శించి ఉపాసించెను కాంతా సంమితముగా సీతను సంధ్యాస్వరూపిణిగా దర్శింపజేసినాడు.

తా మాససా దాతిబలో భ్రాతృత్వం రివాతాం వనే ।
రహితాం చంద్రసూర్యాభ్యాం సంధ్యా మివ మహత్తమః"

సూర్యాస్తమయానంతరము చంద్రోదయమునకు (నక్షత్రోదయము నకు) బూర్వము మధ్య అవ్యక్తతేజ ముండును ఆ అవ్యక్త తేజము సూర్యచంద్ర రహితయైన దివ్యసంధ్య రామలక్ష్మణులు సూర్యచంద్ర సదృశులు వారిమధ్యయందు గోచరించు అవ్యక్తదివ్యసౌందర్యరాశి సీత

"అహరహస్సంధ్యాముపాసీత" అని వేదము ఉపాసించు మనిన దా సంధ్యనే వేదావతారరూపమైన రామాయణమున వాల్మీకి యుపాసించినది బ్రహ్మవిద్యాస్వరూపిణియైన ఆ సీతాసాంధ్యసుందరినే రామాయణపారకు లారాధింప వలసినది గూడ ఆ సౌభాగ్య లక్ష్మినే

రామాలయములందు రామునితో పాటు లక్ష్మణ ప్రతిష్ఠలోని అంత రార్థము రామలక్ష్మణ మధ్యగతయైన సీతను జీవేశ్వర సంధియందు విరాజిల్లు బ్రహ్మవిద్యాస్వరూపిణివిగా సాంధ్యదేవతగా దర్శింపజేయుటకే

వాల్మీకి మహర్షియొక్క ఆశయప్రతిరూపమే, రామాయణ తాత్పర్యరూపమే భద్రాద్రిరామాలయము

# వందే వాల్మీకి భారతీమ్

1. సీతాకోమల పల్లవ లసద్రామ తరు శ్రియమ్ ।
ప్రాచేతసీం కళాం వందే శ్రీమద్రామాయణీం గిరమ్ ॥

2. వాల్మీకి హృదయాంభోజ క్వణన్మధుర షట్పదీమ్ ।
వాల్మీకి ముఖలక్ష్మీం తాం వందే ఏక మధుస్వరామ్ ॥

3. బాలాం వాల్మీకి హృదయాం సప్తసంఖ్యా విభూషితామ్ ।
వైదేహీం మహతీం విద్యాం వందే వాల్మీకి భారతీమ్ ॥

4. సీతా కావ్యశ్రియం వందే రామ నామామృతాప్లుతామ్ ।
అయోధ్యా మటవీం దివ్యాం కిష్కింధాం సుందరోజ్వలామ్ ॥

5 వాల్మీకాశ్రమ సారంగీం సువర్ణాలంకృతిం పరామ్ ।
అశోకచ్ఛాయ వసతిం వందే శ్రీరామ లాలితామ్ ॥

6 విశ్వామిత్రాం చ సుగ్రీవాం రావణీం పాపకర్మణామ్ ।
శ్రుతిశ్రవాంచ సర్వజ్ఞాం వందేతారాం సుశోభితామ్ ॥

7 వాల్మీకి వదన జ్యోత్స్నాం సర్వశ్రుతి మనోహరామ్ ।
మాధుర్య లహరీం వందే రామచంద్ర పదాశ్రితామ్ ॥

8 వాచం మధుమతీం వందే నవసాం సర్వమంగళామ్ ।
వాల్మీకి మానసోల్లాస వైభవాం ఋషి భారతీమ్ ॥

9. రామకల్పక సుచ్ఛాయాం సీతావిద్యుల్లతాద్యుతిమ్ ।
హిరణ్య హారిణీం వందే వాల్మీకాంకగతాం ప్రియామ్ ॥

# హనుమంతుడు - సురసాసింహికలు

రామదూత హనుమంతుడు లంకయందు సీత నన్వేషించుటకు బయలుదేరును. సముద్ర లంఘమున కుపక్రమించెను "శ్రేయాంసి బహువిఘ్నాని" ఒక సత్కార్యము చేయసంకల్పించి నపుడు మన కార్య దీక్షను, దృఢతమ సంకల్పమును, ధీరత్వమును పరీక్షించుట కెన్నియో విఘ్నములు సంభవించును హనుమంతుని కార్యదీక్షను దృఢతమ సంకల్పమును, ధీరత్వమును పరీక్షించుట కెదురొచ్చిన వారే సురసాసింహికలు.

సీతాన్వేషణమునకు వానరసేన సముద్రతీరమును చేరును. అచట సముద్రమును లంఘించి లంకకు పోయి తిరిగి రాగలవా రెవ్వరను మీమాంస యేర్పడెను అచట గజ, గవాక్ష, గవయ, శరభ, గంధమాదనా దులు తమ సామర్థ్యమును వర్ణించిరి జాంబవంతుడు తనశక్తి సామర్థ్య ముల నిట్లు వివరించెను

పూర్వము తాను బలిచక్రవర్తి యజ్ఞసందర్భమున, త్రివిక్రము డగు వామనుని ప్రదక్షిణము జేసిన సందర్భమున తాను బ్రహ్మాండము నంతయు అవలీలగ తిరిగి వచ్చినట్లును ఈనాడు వార్ధక్యవశమున అట్లు తిరిగి వచ్చుటకు శక్తి లేనట్లు చెప్పును అంగదుడు గూడ తన అశక్తతను తెలియజేయును. అపుడు జాంబవంతుడు ఏకాంతమున సుఖోపవిష్టుడై

యున్న హనుమంతునకు అతని జన్మవృత్తాంతమును శక్తిసామర్థ్యములను తెలిపి సముద్రలంఘనమునకు ప్రోత్సహించెను

జాంబవంతుని ఆశీస్సు తో శ్రీరాముని అనుగ్రహముతో హనుమంతుడు బయలుదేరెను

ధైర్యోత్సాహములు ముప్పిరిగొన హనుమంతు డంబర మధ్యమున కెగసి పయనించుచుండ సముద్రుడాతనికి సాయపడ దలచి ఆనయందు దాగియున్న మైనాక పర్వతమును పైకి వచ్చి హనుమంతునకు విశ్రాంతి నొసగు మని కోరును మైనాకుడు పైకి వచ్చి హనుమంతుని విశ్రాంతి తీసుకొనుమని కోరును హనుమంతుడు దానిని విఘ్నముగా భావించును కార్యవ్యగ్రతతో ముందడుగు వేయుచున్నవారికి మధ్యలో ఎలకరింపులు విఘ్నములుగా భాసించును కనుకనే హనుమంతుడు మైనాకుని తన వక్షఃస్థలముతో నవలీలగా దూరముగా పారద్రొలినట్లు వాతరంహసుడగు హనుమంతుని వేగము అంతటి మైనాకుని గూడనవలీలగ క్రిందకు పడవేయగల్గెను

మైనాకుని కోరిక ననుసరించి హనుమంతు డాపర్వతమున క్షణకాలము విశ్రమించి వెంటనే ఇనుమడించిన వేగముతో అకాశమున పయనించెను అపుడు దేవతల ప్రేరణ ననుసరించి నాగమాత యగు 'సురస' రాక్షసరూపము దాల్చి హనుమంతుని మ్రింగబోయెను హనుమంతుడు దేహమును పెంచిన కొలది సురస తన అస్యమును తత్ోzధికము పెంచ

జొచ్చెను ఆ సమయమున యుక్తితో హనుమంతుడు తన దేహమును సూక్ష్మీకరించి సురస ఆస్యమున ప్రవేశించి మరల ఆమె వదనము నుండి వెలుపటికి వచ్చి "దాక్షాయణి నమోఽస్తుతే" అను ఆమెకు నమస్కరించెను ఇట్లు వాకచక్యముతో ప్రతిభావైదగ్ధ్యములతో సురసను జయించిన హను, మంతుని భూతగణములు ప్రశంసించినవి.

ఆ రీతిగా నావిఘ్నము నుండి అవలీలగ బయటబడిన హనుమంతుడు ఇతోధిక దీక్షతో గగనమధ్యమున పయనము జేయుచుండ, మరల 'సింహిక'యను రాక్షసి అతని ఛాయను గ్రహించి అతనిని పంగూకృత పరాక్రముని గావించెను అట్లు సింహికచే గ్రహింపబడిన హనుమంతుడు శక్తిహీను డాయెను. సముద్రమధ్య మందున్న మహాసత్త్వమే తనను శక్తి హీనుని జేసినట్లు గ్రహించి హనుమంతు డామెను యుక్తితో జయించెను హనుమంతుని శక్తిసామర్థ్యములను ఆకాశచరము లగు భూతములు అభి నందించినవి. ఈ విధముగ విఘ్నములను సాహసముతో యుక్త్యుత్సాహములతో దాటుకొని హనుమంతుడు సముద్రతరణము జేసెను ఇది క్లుప్తముగ హనుమంతుని సముద్రతరణ కథారూప వృత్తాంతము.

హనుమత్సముద్రతరణము అధిదైవికార్థము —

వేదవాక్యములందు అధిదైవికాధ్యాత్మికార్థముల దర్శించినట్లు వేద సంమిత మగు రామాయణము నందు ఆయా కథాసంనివేశములందు గూడ అధిదైవిక ఆధ్యాత్మికార్థముల దర్శించుట యుక్తము. అందుచే హను

మంతుని సముద్రతరణము తత్సందర్భమున సురసా సింహికా వృత్తాంతము వందు గూడ అధిదైవికార్థముల దర్శింప దగియున్నది. ముందు అధిదైవికార్థమును దర్శింతము.

సురస .

హనుమంతుని ప్రప్రథమముగా సముద్రతరణమున అడ్డగించినది సురసః ఆమె తనంతట తాను వచ్చి హనుమంతు నడ్డగించలేదు. దేవ సిద్ధ,గంధర్వాదులు, మహర్షులు హనుమంతుని బలమును పరీక్షించుటకు సురసాసాహాయ్యము నర్థించిరి.

"తతో దేవా స్సగంధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః ।
అబ్రువన్ సూర్యసంకాశాం సురసాం నాగమాతరమ్ ॥
అయం వాతాత్మజ శ్శ్రీమాన్ ప్లవతే సాగరోపరి ।
హనుమా న్నామ తస్య త్వం ముహూర్తం విఘ్న మాచర ॥
రాక్షసం రూప మాస్థాయ సుఘోరం పర్వతోపమమ్ ।
దంష్ట్రాకరాళం పింగాక్షం వక్త్రం కృత్వా నభస్సమమ్ ॥
బల మిచ్ఛామహే జ్ఞాతుం భూయ శ్చాస్య పరాక్రమమ్ ।
త్వాం విజేష్య త్యుపాయేన విషాదం వా గమిష్యతి ॥

సుందర- 145 to 148

దేవ, సిద్ధ, గంధర్వాదులు హనుమంతుని బలపరాక్రమ పరీక్షకు సురసను ప్రార్థింప, వారి ప్రార్థన నంగీకరించి ఆమె హనుమంతున కడ్డ

వచ్చెను. సురస యను నామ మామె యొక్క సహజ రసపూర్ణహృదయ మును సూచించుచున్నది. సురస నాగమాతగా రామాయణమున కీర్తింప బడుచున్నది.

"అబ్రువన్ సూర్యసంకాశాం సురసాం నాగమాతరమ్"

లౌకిక వాఙ్మయమున 'సురస' యను నామముచే 'సర్పాక్షి' యను మహౌషధి చెప్పబడుచున్నది. "నాగసుగంధి" యను నామము సురసకు నాగసంబంధమును తెలియజేయుచున్నది. అట్లు నాగమాతయైన సురస కశ్యప ప్రజాపతికి రెండవ భార్య. మొదటి భార్య వినత. ఆమెకు సువర్ణ యని నామాంతరము. ఆమె పుత్రుడు గరుడుడు. రెండవ భార్య కద్రువ కశ్యప ప్రజాపతి రెండవ పత్ని యగు కద్రువయే రామాయణమున సురసగా వర్ణింపబడుచున్నది.

హనుమంతుని శక్తిపరీక్షకు దేవగంధర్వాదులు నాగమాతను ఎన్ను కొనుటలోని అంతర్యము గమనింపదగినది

సముద్రతరణమునకు మహోద్ధతవేగ మావశ్యకము. వేగము. ప్రసిద్ధి జెందిన వారిరువురు. ఒకరు వాయువు. మరియొకడు గరుడుడు అయితే, జాంబవదాదుల కా శక్తి యుండి యుండవచ్చును కాని, ఆ శక్తి వారి కాగంతుకము తత్తత్కాలనియతము. వాయువునకు, గరుడునకు, వేగశక్తి స్వభావసిద్ధము, నియతము, అనశ్వరము. హనుమంతుడు వాయు పుత్రు డగుటచే అతని కా శక్తి పితృతనుగ్రహప్రాప్తము కనుకనే, హను

మంతుడు వాయు, గరుడులతో సమానుడు. ఈ విషయమున హనుమంతుడు తన వేగమును గూర్చి అనిన మాటలు గమనింపదగినది.

"ఉదయా త్ప్రస్థితం వాऽపి జ్వలంతం రశ్మిమాలినమ్ ।
అన స్తమిత మాదిత్యం మభిగంతుం సముత్సహే ॥
తతో భూమి మసంస్పృశ్య పున రాగంతు ముత్సహే ।"
కిష్కి. 67 15

సూర్యు డుదయాద్రి నుండి బయలుదేరినపుడు ఆయనతోపాటు బయలుదేరి ఆయన కంటే ముందే అస్తగిరి చేరి మరల అటనుండి తిరిగి మధ్యాహ్నమున ప్రజ్వరిల్లుచున్న సూర్యున కెదురుగా రాగలను. మరల క్రిందకు వచ్చి భూమిని స్పృశింపకయే పైకెగయగలను.

"పన్నగాశన మాకాశే పతంతం పక్షిసేవితే ।
వైనతేయ మహం శక్తః పరిగంతుం సహస్రశః ।"
కిష్కి 67 14

ఆకాశమున వేగముగా పయనించుచు పన్నగములకై సారాత్తుగ భువికి దిగివచ్చి పైకెగయుచుండు పన్నగాశనుని గరుత్మంతుని వేయి మారులు ప్రదక్షిణము చేయగలను.

"వైనతేయస్య సా శక్తిః మమ వా మారుతస్య వా ।
ఋతే సుపర్ణరాజానం మారుతం వా మహాజవమ్ ।
న తద్భూతం ప్రపశ్యామి యన్మాం ప్లుత మనువ్రజేత్ "
కిష్కి 67 24

నాశక్తి, వాయుదేవత యొక్కశక్తి యేదిగలదో, గరుడుని శక్తి గూడ నదియే. వాయువు గరుడుడు గాక, ఇతరు లెవ్వరు వేగమున నెగురుచున్న నన్ననుసరింపలేరు.

హనుమంతుని ఈ ప్రోత్సాహవచనములు హనుమంతునకు, గరుడునకు సమానత్వమును తెలియజేయుచున్నవి. హనుమంతుడు గరుడుడు సమానులు గాన హనుమంతుడు తనను సువర్ణునిగా భావించెను.

"ఉత్పపాతాzథ వేగేన వేగవానవిచారయన్ ।
సుపర్ణమివ చాత్మానం మేనే స కపికుంజరః"

సుందర I 44

కథాభాగమననుసరించి ఈ శ్లోకమున "ఇవ"శబ్దమును సాదృశ్యార్థకముగ గ్రహించినను తత్త్వార్థమును ఏవార్థకముగా గ్రహింపవచ్చును. "ఆత్మానం సువర్ణమేవ మేనే". హనుమంతుడు తనను సుపర్ణునిగానే తలచెను అని అర్థము.

విష్ణువాహనము గరుడుడు. శ్రీరాముని వాహనము హనుమంతుడు. అవతారభేదముచే రూపభేదమే గాని దేవతాతత్త్వమొక్కటియే.అట్లే గరుడహనుమంతుడు గూడ రూపభేదమే గాని, బలశౌర్యౌదార్యపరాక్రమాదులు ఇరువురి యందేకరూపములే. తత్త్వతః వారు ఏకరూపులే, మరియు నొక

విశేషము. కిమేష భగవాన్నందీ” “ఇతడు శివువివాహనమైన భగవాను డగు నందీశ్వరుడా॥ అని తన కొలువుకూటమున ప్రవేశించుచున్న హనుమంతుని జూచి రావణు డాశ్చర్యపడును హనుమంతుని దివ్యాకృతి అట్టిది. కనుక, వాల్మీకిమహాకవి దృష్టితో గరుడనందీశ్వరులు హనుమ దనన్యరూపులు హనుమంతుడు గరుడాభిన్నుడు గనుకనే, వాల్మీకి మహర్షి అడుగడుగున హనుమంతుని గరుడునితో పోల్చుచు ఈ రహస్య మును కొంతా సంమితముగా గుర్తింపజేయుచున్నాడు ఈ క్రింది ఎర్గనలను పరికించిన ఈ విషయము స్ఫుటముగా తెలియగలదు.

“ప్లవమానం సమీక్ష్యాథ భుజంగా స్సాగరాలయాః ।
వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే ॥”

సుందర 1 75

“సముద్రమున వసించు పన్నగములు హనుమంతుని ఆకాశమున పయనించు గరుత్మంతునిగా భావించినవి.”

“స సాగర మనాధృష్య మభ్యేత్య వరుణాలయమ్ ।
జగామాకాశ మావిశ్య వేగేన గ. డోపమః ॥”

సుందర 1 16।

సురసను జయించి గరుడోపముడగు హనుమంతు డాకాశమున ‘గసి పయనించెను

"అనుపూర్వ్యేణ వృత్తం చ లాంగూలం రోమభి శ్చితమ్ ।
ఉత్పతిష్యన్ విచిక్షేప పక్షిరాజ ఇవోరగమ్ ॥
తస్య లాంగూల మావిద్ధం ఆత్తవేగస్య పృష్ఠతః ।
దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః ॥"
సుం 1 3

హనుమంతు డాకాశమున కెగురబోవుచు తన వాలమును, గరుత్మంతుడు సర్పమును విదుల్చునట్లు విదిల్చెను మరియు వేగముతో పయనించు హనుమంతుని వెనుక వంకరగా వ్రేలాడు అతని వాలము గరుడునిచే తీసికొని పోబడుచున్న మహోరగము వలె నుండెను.

మహర్షిచే చేయబడిన ఈ పై వర్ణనలు కాంతాసంమితముగ హనుమంతుని గరుడాభిన్నునిగ దర్శింపజేయుచున్నవి. అంతేగాక, హనుమంతుని వాలవర్ణనవ్యాజమున నాగములకు గరుడునికి గల సహజ వైరము గుర్తింప జేయబడుచు హనుమంతుని యందు గరుడ భావనను మహర్షి ధ్రువీకరింప జేయుచుండుట గమనార్హము. హనుమంతుడు గరుడాభిన్నుడు కనుకనే, హనుమంతుని బలపరాక్రమ పరీక్షకు దేవసిద్ధగంధర్వాదులు గరుడుని సవతితల్లియగు నాగమాత నాశ్రయించిరి నాగమాత ఇంతకు పూర్వము గరుడుని పరీక్షించి యున్నది. గరుడుడు నాగములకు బద్ధవిరోధిగదా! గనుక, గరుడుని విషయమున నాగమాత అన్యథా భావమును కలిగియుండుట సహజము. హనుమంతుడు గరుడరూపుడే గనుక నాగమాత దేవతల

ప్రార్థన నంగీకరించినది. రాక్షసీరూపము దాల్చి హనుమంతు నడ్డుకొనినది. మ్రింగబోయినది. ఆమె అట్లు ప్రవర్తించినను హనుమంతు డామె యెడ వినయముతో ప్రవర్తించెను. ఆమెను యుక్తితో జయించెను ఆమె కెట్టి యపకారమును తలపెట్టలేదు. అంతేగాక ఆమెకు వినయముతో భక్తితో

"ప్రవిష్టోఽస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోఽస్తుతే" అని నమస్కరించెను. సురస హనుమంతుని ముందు రాక్షసిగా నటించినను. హనుమంతుడు మాత్ర మామెను మాతృమూర్తిగనే దర్శించెను, ఆరాధించెను. దాక్షాయణిగా ఆమె నారాధించి ఆశీస్సుల నందుకొనెను.

హనుమంతుని కార్యసాధన యందు ప్రథమ విఘ్నరూపమైన ఈ సురసావృత్తాంతము హనుమంతుని యొక్క శౌర్యపరాక్రములనే గాక, అతని సమయస్ఫూర్తిని, సమయజ్ఞతను, వినయసంపదను, దూరదృష్టిని తెలియజేయుచున్నది.

"ఇంట గెలిచి రచ్చగెలువు"మను సామెత ననుసరించి హనుమంతుడు మాతృపరీక్ష యందు ఆప్తజనపరీక్షయందు కృతార్థుడైనట్లు సురసావిజయవృత్తాంతము తెలియజేయుచున్నది ఇక రచ్చ గెలుపును సూచించు సింహికావృత్తాంతము చూతము.

సింహిక .—

సురస దేవప్రేరణతో వచ్చి హనుమంతు నడ్డుకొనెను. సింహిక అట్లు గాక స్వయముగనే వచ్చి హనుమంతుని చాయను గ్రహించి

అతనిని శక్తిహీనుని గావించెను కనుక, సురసస్వరూపము వేఱు. సింహికాస్వరూపము వేఱు: సురస వలన గలిగిన విఘ్నము దైవికము సింహిక వలన గలిగినది ఆగంతుకము. ఉత్తమ కార్యసాధనమున దైవికాగంతుకవిఘ్నములు సంభవించుట సహజము.

జాంబవంతుడు దక్షిణ సముద్రమున ఇట్టి ప్రమాద మున్నట్లు ముందే హనుమంతుని హెచ్చరించియుండెను. కనుకనే సింహికను జూచి హనుమం డిట్లనుకొనుట సంభవించెను

"కపిరాజేన కథితం సత్త్వ మద్భుతదర్శనమ్‌
ఛాయాగ్రాహి మహావీర్యం తదిదం నాత్ర సంశయః
—సుందర. 1–178

దక్షిణసముద్రమున ఛాయాగ్రాహి యగు మహాసత్త్వమిదియే". సందియము లేదు

ఈ విధముగ హనుమంతుడు పూర్వము జాంబవంతుడు చెప్పిన విషయమును స్మరించి సముద్రగతమై అద్భుతదర్శనము గల ఆ మహాసత్త్వమే తన ఛాయను గ్రహించినట్లు తెలిసికొనెను.

సింహిక సురస వలె హనుమంతుని సరాసరి మ్రింగబోవలేదు. ఆమె హనుమంతుని ఛాయను గ్రహించెను. ఛాయాగ్రహణము వలన హనుమంతుడు కుంఠితప్రజ్ఞు డాయెను.

"సాగరం శోషయిష్యామి దారయిష్యామి మేదినీమ్ ।
పర్వతాం శ్చూర్ణయిష్యామి ప్లవమానః ప్లవంగమాః ॥"
కిష్కింధ 67 17

సముద్రమును శోషింపజేయుదును, భూమిని బ్రద్దలు చేయుదును పర్వతముల చూర్ణము జెయుదును." అని ధీరుడై పలికిన హనుమంతుడు క్షణములో ఛాయాగ్రహణమున శక్తిహీను డగుట ఆశ్చర్యము.

"ఛాయాయాం గృహ్యమాణాయాం చింతయామాస వానరః ।
సమాక్షిప్తోఽస్మి సహసా పంగూకృతపరాక్రమః ॥
ప్రతిలోమేన వాతేన మహానౌ రివ సాగరే ॥"
సుందర 1 116

ప్రతిలోమవాతమున సముద్రమున నౌకవలె హనుమంతుడు తాను కుంఠితప్రజ్ఞు డైనట్లనుకొనును. ఇట్లనుకొనుట హనుమంతుని జీవితమున ప్రధమ పర్యాయ మగుచున్నది.

అయితే ఇచట సింహిక చాయను గ్రహించుట యననేమో స్పష్టముగ తెలిసికొనవలసియున్నది. ఛాయ యన తేజస్సు యొక్క అభావ రూపము అభావరూపమైన ఛాయను గ్రహించుట సాధ్యమా? లేక, ఇచట ఛాయాపదము శక్తివిశేషరూపమా? విచారింపనగును.

సింహిక అంగారిక .

సుగ్రీవుడు మొదట వినతాది వానరులను సీత నన్వేషించుటకు

పంపుచు సముద్రప్రాంతమున జాగరూకులై యుండు డని హెచ్చరించుచు ఇట్లు చెప్పెను.

"ఊర్మిమంతం సముద్రం చ క్రోశంత మనిలోద్ధతమ్ ।
తత్రాసురా మహాకాయాః ఛాయాం గృహ్ణంతి నిత్యశః "
"బ్రహ్మణా సమనుజ్ఞాతాః దీర్ఘకాలం బుభుక్షితాః ।
తం కాలమేఘప్రతిమం మహోరగనిషేవితమ్ "
"అభిగమ్య మహానాదం తీర్థేనైవ మహోదధిమ్ ।"

కిష్కింధ 40 38to40

మహాసముద్రమందు ఛాయాగ్రాహకు లగు రాక్షసు లుందురు.

వారు చిరకాలము నుండి ఆకలి గొని యుందురు. వారల నుపాయముతో (తీర్థేన ఉపాయేన) తప్పించుకొనవలెను

ఇట్లు సుగ్రీవుడు చెప్పి మరల ప్రత్యేకించి హనుమంతునితో దక్షిణసముద్రముమ గూర్చి యిట్లు చెప్పెను.

"దక్షిణస్య సముద్రస్య మధ్యే తస్య తు రాక్షసీ ।
అంగారకేతి విఖ్యాతా ఛాయా మావృత్య భోజినీ ॥"

కిష్కింధ 41 28

దక్షిణసముద్రమధ్యమున ఛాయాగ్రాహిణియై ప్రాణుల భక్షించుచు

అంగారికగా లోకప్రసిద్ధి నొందిన (అంగారకేతి విఖ్యాతా) రాక్షసి గలదు."

మహాసముద్రమునందు పుంరూపమున వర్ణింపబడినది. స్త్రీవధ విషయమున హనుమంతుని ధర్మనిర్ణయమును పరీక్షించుటకే స్త్రీ రూపమున సింహికావతరణ మని యూహింపవచ్చును. ఇతర మహాసముద్రములందు ఛాయాగ్రాహకులగు రాక్షసు లున్నారని చెప్పి దక్షిణసముద్రమున ఛాయాగ్రాహిక యగు రాక్షసి యున్నదని మాత్రము చెప్పక, "అంగారిక"యని [redacted]నామము చెప్పబడినది అంతేగాక, ఆమె నామము లోకమున మని గూడ చెప్పబడుచున్నది- "(అంగారికేతి విఖ్యాతా)" ఆ ప్రసిద్ధి [redacted]దో విచారించుదము

"అంగారః అస్యాః అస్తీతి అంగారికా" నిప్పుకణిక కంగార మని పేరు. అట్టి అంగారము కలది అంగారిక. అంగారిక శక్తి యని తెలియు చున్నది,

"అంగాని అరయతీత్యంగారికా" అనియు అంగారికా శబ్దమునకు మరియొక వ్యుత్పత్తి కలదు. ఆ వ్యుత్పత్తి ననుసరించి "ప్రాణ్యంగముల హింసించునది" అని యర్థము. అంగారిక అట్టిది గనుకనే, హనుమంతుని అంగములను శక్తిహీనముల గావించి హింసించినది. హింసించు స్వభావము గలది గనుకనే, అంగారిక సుందరకాండ యందు సింహికగా సాక్షాత్కరించినది.

ప్రాణి హమున జఠరాగ్ని యున్నట్లు సముద్రమున బడబాగ్ని

యుండునని శాస్త్రమర్యాద. ప్రచండ వాతప్రకోపాదుల వలన సముద్ర జలములకు మితిమీరిన ఒత్తిడు లేర్పడినపుడు ఉత్తుంగప్రచండ తరంగ సంక్షోభ క్షుభిత మగుచున్న మహార్ణవము నుండి అపూర్వానూహ్యనల దివ్యశక్తి అభివ్యక్త మగుచుండును అట్లు క్షుభిత మహార్ణవ సంజాతానిర్వచనీయ దాహకశక్తియే అంగారిక ఆ అంగారిక ప్రాణుల యొక్క ఛాయను అనగా శక్తిని సామర్థ్యమును తేజస్సును కుంఠితము జేయును. ప్రచండ మహావాతగతిని గూడ అతిక్రమించి మహావేగమున పయనించు హనుమంతుని వేగోద్ధతి వలన సంక్షుభిత మహార్ణవమున బడబానల ముద్భూత మగుట సహజమే. యుక్తిసహమే ఆ బడబానలమే అంగారికగా ప్రసిద్ధి చెందిన సింహిక (ప్రపంచమున ఇతర సముద్రముల కన్న దక్షిణసముద్రమున నీ శక్తి యెక్కువేమో సహృదయులు విమర్శింతురు గాక.)

ప్రావృషేణ్య పయోవాహము లంగి జలములు సంక్షోభము జెంది వానినుండి వైద్యుతాగ్ని యావిర్భవించుట లోకానుభవసిద్ధమే. శాస్త్ర సంమతము గూడ. పృథివీగతాగ్నియే అంతరిక్షగత మైనపుడు వైద్యుతాగ్నిగా వ్యవహరింపబడుచున్నది ఈ అగ్నులకు ఉపాధికృతభేదమే గాని, వాస్తవముగ తేజోరూపమున ఈ రెండు నేకరూపములే. వైద్యుదాగ్ని మహాశక్తిమంతమైనది: కొన్నియెడల శ్రుతి దీనిని ఇంద్రుని కులిశ రూపమున (వజ్రాయుధ రూపమున) వర్ణించుచున్నది. కొన్నియెడల దీని

48)

యందు గల సంహారకశక్తిని పురస్కరించుకొని శ్రుతి దీనిని సింహమనియు వర్ణించినది. ఈ క్రింది ఋక్కును చూడుడు.

"ఆవిష్ట్యో వర్ధతే చారురాసు జిహ్మానా మూర్ధ్వః స్వయశా ఉపస్థే।
ఉభే త్వష్టుర్బిభ్యతు రాయమానాత్ ప్రతీచీ సింహం ప్రతిజోషయేతే॥
ఋ 1 95 5

మేఘములందవ్యక్తముగా నుండు వైద్యుతాగ్ని కుటిలములై అనగా సంక్షోభము చెందిన మాతృరూపములగు జలముల యుత్సంగమున సహజకీర్తిశాలియై ఊర్ధ్వజ్వలనము కలిగి అభివ్యక్తము అగుచు వర్ధిల్లుచుండును

(మేఘస్థాస్వప్సు వైద్యుతాత్మనా వర్తమానోzగ్నిః జిహ్మానాం కుటిలానాం మధ్యే తిర్యగవస్థితానాం తాసా మపా ముత్సంగే స్వయశాః స్వాయత్తయశస్కోzగ్నిః ఊర్ధ్వః ఊర్ధ్వజ్వలన స్సన్ ఆవిష్ట్యో వర్ధతే ఆవిర్భూతః ప్రకాశమానో వృద్ధిం ప్రాప్నోతి.")

ఈ వైద్యుతాగ్ని ప్రాదుర్భావముచే ద్యావాపృథువులు భీతిల్లుచుండును.

అట్టుభీతిల్లజేయు వైద్యుతాగ్నియే సింహము అది సహన

శీలము అభిభవనశీలము, అనగా దేవినె పను ఎదుర్కొను సామర్థ్యము గలది, ఎం శక్తిసంపన్నమై, అవిర్భవించిన ఆ సింహమును లేక మహా వైద్యుతాగ్ని స్వరూపు డగు ఆ దేవుని ద్యావాపృథువులు తదభి ముఖగతి గతి గలవై సేవించుచుండును

"ఉభే ద్యావా పృథివ్యౌ తస్మా దగ్నేః బిభ్యతు భయం ప్రాపతుః తదనంతరం ముత్పన్నం సింహం సహనశీలం అభిభవనశీలం తమగ్నిం ప్రతీచి ప్రత్యంచంతౌ ప్రతిగచ్ఛంతౌ అభిముఖ్యేన ప్రాప్నువంతౌ జోషమేతే సేవేతె భాష్య"

పై మంత్రము దనుసరించి సర్వాభిభవనశక్తి గల మహావైద్యుతాగ్ని సింహము. ఆ సింహగత శక్తియే సింహికా।

సంఏద్రజలములం దనభివ్యక్తమై యున్న ఉడబాగ్ని సంక్షుభిత మహార్ణవజలము నుండి యభివ్యక్తమై సింహ మగుచున్నది తద్గత మహాశక్తి అంగారిక యాపుదాల్చిన తదధిష్ఠానశక్తియే సింహికగా కవిచే వర్ణింపబడినది. సింహిక సర్వాభిభవన శక్తిగలది. కనుకనే హనుమంతుని చాయను తేజస్సును శక్తిని అకర్షింపగలిగినది. (ఇచట ఛాయాశబ్దముచే కాంతి గ్రహింపబడుచున్నది ఛాయా కాంతి ర్ద్యుతిశ్ఛవిః, అమరః) అందువలననే అంతటి బలపరాక్రమ సంపన్నుడైన హనుమం తుడు గూడ సింహికచే వైద్యుతాగ్నిచే పంగూకృతపరాక్రము డాయెను

టికిని వైద్యుతాగ్ని స్పర్శమాత్రముచె ప్రాణులు విస్తేజస్కు లగుట గాంచుచునే యున్నాము. ఇట్టి శక్తిని నిర్జించుట మానవసాధ్యముగాదు. మహాతపస్సంపన్నులు మాత్రమే దీనిని జయించగలరు హనుమంతు డట్టి తపోబలసంపన్ను డగుటచే సింహికను జయించెను. ఈ విషయమును వాల్మీకిమహర్షియే వివరించెను

"తస్య తాం స్పృశతో గాత్రం తపసా న వినాశితమ్ ।
న తదగ్నిశిఖా కుర్యా త్సంస్పృష్టా పాణినా సతీ "

సుందర 59 4

మహాపతివ్రత యైన సీతను రావణుడు స్పృశించినపుడు సీతాపాతివ్రత్యాగ్ని తపస్సంపన్నుడైన రావణుని దహింపలేదట తపఃప్రభావ మట్టిది

అట్లే లంక యందు సీత అగ్నిప్రవేశము జేసినను, అగ్నిదాహకశక్తి సీతాతపఃప్రభావముచే కుంఠితమైనది।

ఇట్లు తన తపఃప్రభావముచే హనుమంతుడు సింహికను నిర్జించెను.

తీవ్ర సంక్షోభసంమూర్ఛిత మహార్ణవసంజాత బడబానల మహాదాహకశక్తియే సింహిక యని సూచించుటకే సింహికాప్రాదుర్భావమున కుపోద్ఘాతకముగా వాల్మీకిమహర్షి హనుమంతుని వేగోద్ధతిక్రమమును

తదనుగుణముగ సముద్రజలతీవ్రసంక్షోభక్రమమును మొదటి నుండి సాధి ప్రాయముగ మనోహరముగ వర్ణించుట గమనించదగినది.

హనుమంతుడు మొదట తన గమనోద్ధతిని తానే ఇట్లు వర్ణించుకొనెను.

"యథా రాఘవనిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః ।
గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణపాలితామ్ "
సుందర 1 40

రాఘవనిర్ముక్త శర మెట్లు వాయువేగమున అప్రతిహతగతితో లక్ష్యమును జేరునో నేను గూడ అట్లే లంకను జేరగలను.

లోకమున వాయువేగము వలె శరవేగము సుప్రసిద్ధము. ఇక రాఘవశరవేగము ఊహ కందనిదే యగుచున్నది. హనుమంతుడట్లు తానన్న ప్రకారమే పయనించినట్లు తరువాతి వర్ణన తెలియజేయుచున్నది.

"సముత్పతతి తస్మింస్తు వేగా త్తే నగరోహిణః ।
సంహృత్య విటపాన్ సర్వాన్ సముత్పేతు స్సమంతతః ॥"
"స మత్తకోయష్టిమకాన్ పాదపాన్ పుష్పశాలినః ।
ఉద్వహ న్నూరువేగేన జగామ విమలేఽంబరే ॥"

హనుమంతు డాకాశమున నెగురగానే అతని వేగము వలన ఆ పర్వతము నందలి వృక్షము లన్నియు కొమ్మలతో గూడ పైకెగిరినవి.

అంతేగాక, పక్షులు (కొంగలు) కలిగిన కొమ్మలతో -డిఃు వృక్షములను తన ఊరువేగముతొ వహించుచు హనుమంతు డాకిసమున కెగిరెను

"ఊః ుపెగొద్ధతా వృక్షాః ముహూర్తం కపి మన్వయుః ।
ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబంధుమివ బాంధవాః ।
తమూరుపేగోన్మథితా స్సాలాః శ్చాన్యే నగోత్తమాః ।
అనుజగ్ము ర్హనూమంతం సైన్యా ఇవ మహీపతిమ్ ।

సుపుష్పితాగ్రై ర్బహుభిః పాదపై రన్వితః కపిః ।
హనుమా న్పర్వతాకారొ బభూవాద్భుతదర్శనః ।"

సుందర. 1 49

హనుమంతుని ఊరువేగమునకు ఎగిరి వచ్చిన వృక్షములు చాల దూరము పోదలచిన బంధువును బంధువులు సాగనంపునట్లు హనుమంతుని వెంబడించినవి మద్ది మొదలగు ఒహావృక్షములు హనుమంతుని ఊరు వేగ నకు పైకెగిరి సైనికులు రాజును వలె వెంబడించినవి పర్వతాకారు డైన ఆ హనుమంతుడు చక్కగా పుష్పించిన వృక్షముల నడుమ నుండి చూచువారల కాశ్చర్యము గలిగించెను.

ఈ వర్ణన క్రమము ననుసరించి హనుమంతుని ఊరువేగోద్ధతి ఊహ వచ్చును మద్దివంటి మహావృక్షములు పెకలించుకొని వచ్చిన వనిన హనుమంతుని వేగోద్ధతి ఎట్లుండునో ఊహకందరానిదె అగుచున్నది. మహారాజును సేన లనుసరించినట్లు వృక్షములు హనుమంతుని మర్యాదగా

గాక, తప్పనిసరిగ వెంబడించిన వనుట హనుమంతుని మహావేగౌద్ధత్య మవగత మగుచున్నది.

ఇంతవరకు హనుమంతుని వేగోద్ధతిని తెలుపు వృక్షముల పరిస్పందనము వర్ణింపబడినది. ఇక అకాశమున హనుమంతుని స్వరూపము వివరింపబడుచున్నది.

"తస్య విద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః ।
నయనే విప్రకాశేతే పర్వతస్థా వివానలౌ ॥
పింగే పింగాక్షముఖ్యస్య బృహతీ పరిమండలే ।
చక్షుషీ సంప్రకాశేతే చంద్రసూర్యా వివోదితౌ ॥"

సుందర 1 58,59

అకాశమున మెరుగుచున్న విద్యుత్ప్రకాశము గల హనుమంతుని నేత్రములు రెండును పర్వతమున నున్న రెండగ్నిహోత్రముల వలె నుండినవి.

గుండ్రముగా నుండి పింగళవర్ణము గల హనుమంతుని నేత్రములు ఏకకాలమునందుదయించు చంద్రసూర్యుల వలె ప్రకాశించుచున్నవి.

హనుమంతుని నేత్రస్థితి వర్ణన ద్వారా హనుమంతు డెంత వేగముగ పయనించుచున్నది తెలియుచున్నది.

హనుమంతుని స్థితిని వర్ణించి మహర్షి తరువాత ఆకాశగత వాత ప్రకాపస్థితి వర్ణించెను

తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్ ।
కక్షాంతరగతో వాయుః జీమూత ఇవ గర్జతి ।
ఖే యథా నిపతంత్యుల్కా హ్యుత్తరాంతా ద్వినిస్సృతా ।
దృశ్యతే సానుబంధా చ తథా స కపికుంజరః ।"

సుం. 1 64 65

సముద్రమును లంఘించు హనుమంతుని కక్ష్యగతమైన వాయువు మేఘము గర్జించునట్లు ధ్వనించుచుండెను.

ఆకాశమునందు ఉత్తరపు దిక్కునుండి దక్షిణపు మొగముగా పయనించు తోకచుక్క కన్పట్టిన ఆదేశమునకు పీడ గల్గునని శాస్త్ర సంప్రదాయము హనుమంతు డట్టి తోకచుక్క వలె ప్రకాశించుచుండెను.

ఈ పై వర్ణన ననుసరించి హనుమంతుని వాలసింహసత్వము స్ఫుటమగుచున్నది

"కపివాతశ్చ బలవాన్ మేఘవాతశ్చ నిస్సృతః ।
సాగరం భీమనిర్ఘోషం కంపయామాసతు ర్భృశమ్ ।"

సుం 1 70

హనుమంతుడు దక్షిణమునకు పయనించుచున్నపుడు తత్సహాయ

భూతముగ ఉత్తరమునుండి దక్షిణమునకు పెనుగాలులు వీచినవి. అపుడు కపివాతము మేఘవాతము రెండును కలిసి సముద్రమును కంపింప జేసినవి

"వికర్ష న్నూర్మిజాలాని బృహంతి లవణాంభసి ।
పుప్లువే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ ।

సుం. 1 71

హనుమంతుడు వేగమున నెగిరిపోవుచున్నప్పుడు సముద్రమున పెద్ద పెద్ద అలలు లేచుచుండెను. భూమిని అకాశమును విభజించు తలంపున హనుమంతు డాయలలను ఆకాశమున కీడ్చుకొని పోవుచున్నట్లుండెను.

"మేరుమందరసంకాశా నుద్ధతాన్ స మహార్ణవే ।
అతిక్రామ న్మహావేగ స్తరంగాన్ గణయన్నివ ।"

సుం. 1 72

"హనుమంతుడు తన వేగముచే లేచిన మేరుమందరసదృశములైన ఉత్తుంగ తరంగముల లెక్కపెట్టుచు పోవుచున్నవాడు వలె నుండెను.

"తస్య వేగసముద్ధూతం జలం సజలదం తథా।
అంబరస్థం విబభ్రాజ శారదాభ్ర మివాతతమ్"
తిమి నక్ర ఝషా కూర్మా దృశ్యంతే వివృతా స్తదా।
వస్త్రాపకర్షణేనేవ శరీరాణి శరీరిణామ్।

సుం 1 74

హనుమంతుని స్థితిని వర్ణించి మహాకవి తరువాత ఆకాశగత వాత ప్రకోపస్థితి వర్ణించెను

తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్ ।
కక్షాంతరగతో వాయుః జీమూత ఇవ గర్జతి ।
ఖే యథా నిపతంత్యుల్కా హ్యుత్తరాంతా ద్వినిస్సృతా ।
దృశ్యతే సానుబంధా చ తథా స కపికుంజరః ।"

సుం. 1 64 65

సముద్రమును లంఘించు హనుమంతుని కక్ష్యగతమైన వాయువు మేఘము గర్జించునట్లు ధ్వనించుచుండెను

ఆకాశమునందు ఉత్తరపు దిక్కునుండి దక్షిణపు మొగముగా పయనించు తోకచుక్క కన్పట్టిన ఆదేశమునకు పీడ గల్గునని శాస్త్ర సంప్రదాయము హనుమంతు డట్టి తోకచుక్క వలె ప్రకాశించుచుండెను

ఈ పై వర్ణన ననుసరించి హనుమంతుని వాలసింహసత్వము స్ఫుటమగుచున్నది

"కపివాతశ్చ బలవాన్ మేఘవాతశ్చ నిస్సృతః ।
సాగరం భీమనిర్ఘోషం కంపయామాసతు ర్భృశమ్ ।"

సుం 1 70

హనుమంతుడు దక్షిణమునకు పయనించుచున్నపుడు తత్సహాయ

భూతముగ ఉత్తరమునుండి దక్షిణమునకు పెనుగాలులు వీచినవి. అపుడు కపివాతము మేఘవాతము రెండును కలిసి సముద్రమును కంపింప జేసినవి

"వికర్ష న్నూర్మిజాలాని బృహంతి లవణాంభసి ।
పుప్లువే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ ।
సుం. 1.71

హనుమంతుడు వేగమున నెగిరిపోవుచున్నప్పుడు సముద్రమున పెద్ద పెద్ద అలలు లేచుచుండెను. భూమిని అకాశమును విభజించు తలం పున హనుమంతు డాయలలను ఆకాశమున కీడ్చుకొని పోవుచున్నట్లుండెను.

"మేరుమందరసంకాశా నుద్ధతాన్ స మహార్ణవే ।
అతిక్రామ న్మహావేగ స్తరంగాన్ గణయన్నివ ।"
సుం. 1 72

"హనుమంతుడు తన వేగముచే లేచిన మేరుమందరసదృశములైన ఉత్తుంగ తరంగముల లెక్క పెట్టుచు పోవుచున్నవాడు వలె నుండెను.

"తస్య వేగసముద్ధూతం జలం సజలదం తథా ।
అంబరస్థం విబభ్రాజ శారదాభ్ర మివాతతమ్"
తిమి నక్ర ఝషా కూర్మా దృశ్యంతే వివృతా స్తదా ।
వస్త్రాపకర్షణేనేవ శరీరాణి శరీరిణామ్ ।
సుం 1 74

ప్లవమానం సమీక్ష్యాథ భుజంగా స్సాగరాలయాః।
వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే।

హనుమంతుని వేగోద్ధతికి సముద్రజలమంతయు పైకెగసి ఆకాశ మున జేరెను అట మేఘములతో గలసి స్వచ్ఛముగా నుండు సముద్ర జలము ఆకాశమున క్రమ్ముకొనిన తెల్లని శరన్మేఘము వలె ప్రకాశించెను

అపుడు హనుమంతుని వేగమునకు సముద్రజల మంతయు పైకెగురుట జేసి తిమింగిలములు మొసళ్ళు పెద్ద పెద్ద చేపలు తాబేళ్లు మొదలగు సముద్రచరములు వస్త్రమును విడిచిన మనుష్యుల అవయవముల వోలె కన్పట్టినవి।

"యేనాసౌ యాతిబలవాన్ వేగేన కపికుంజరః।
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః।"

సుం 1 79

హనుమంతుడు వాయువు వలె వేగముతో ఏవైపు పయనించెనో అట సముద్రము ద్రోణీకృతము వలె తొట్టిగా జెయబడినది వలె గన్పట్టెను

ఈ పై వర్ణనల వలన సముద్రమున హనుమంతుని వేగోద్ధతి వలన కలిగిన క్రమపరిణామము సంక్షోభము తెలియుచున్నది సముద్ర జలము లంబరమును దాకిన వన సముద్రమునం దేర్పడిన తీవ్రాతితీవ్ర సంక్షోభ మూహింపవచ్చును. అట్టి సముద్రమున బడబానలోద్భూతి సంభవమే అగుచున్నది—

సముద్రమధ్యమున అంగారిరాఖ్య సింహికాప్రాదుర్భావమున కనుగుణముగా మహాకవి వాల్మీకి ఆదినుండి జాగ్రతగా హనుమంతుని సముద్రలంఘనమును సర్వతోముఖ పరిశీలనముగా క్రమగతితో వర్ణించుట గమనింపదగినది స్థూలదృష్టితో చూచినపుడు వాల్మీకివర్ణనలు అతిశయోక్తులుగా అభూతకల్పనలుగా గన్పించును. వాల్మీకిభాషితము లట్టివి గావు.

"ఉపస్పృశ్యోదకం సమ్యఙ్మునిః స్థిత్వా కృతాంజలిః
ప్రాచీనాగ్రేషు దర్భేషు ధర్మేణాన్వేషతే గతిమ్।
తతః పశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగ మాస్థితః
పురా యత్తత్ర నిర్వృత్తం పాణావామలకం యథా" బాల 3—2,6.

వాల్మీకిమహర్షి ప్రాచీనాగ్ర దర్భాసనోపవిష్టుడై యోగనిష్ఠుడగుచు గుర్వనుగ్రహపూతుడై బ్రహ్మయొక్క ఆశీఃప్రభావముతో సర్వమును యథాతథముగ దర్శించెను. రామచరిత్ర మా మహర్షికి పాణియందు దామలకము వలె భాసించెను. ఇట్టి యోగి— మహాతపస్వి క్రాంతదర్శి— అతడన్న మహర్షి అతిశయోక్తులు పలుకుననుట కవకాశమే యుండదు— అతడన్న దంతయు భూతార్థవ్యాహృతియే కనుక, హనుమంతుని వేగోద్ధతి వర్ణన అంగారికాదా వివలన సముద్రములయందు గలిగిన మహాసంక్షోభము విర్భావము యథార్థరూపమే.

# హనుమంతుని సముద్ర తరణము
## ఆధ్యాత్మికతత్త్వపరిశీలనము

సీత కొఱకై హనుమంతుడు సముద్రమును లంఘించెను. ఇది ప్రస్తుత కథాభాగము. ఋషివచనములు మననశీలములైన మంత్రాత్మకములు. అధికారిభేదము ననుసరించి వివిధార్థ స్ఫోరకములు. సంప్రదాయజ్ఞుడైన మహాకవి కాళిదాసదృష్టిలో సాగరతరణ మెట్టిదో చూడుడు.

"ప్రవృత్తా వుపలబ్ధాయాం తస్యాః స్సంపాతిదర్శనాత్‌
మారుతి స్సాగరం తీర్ణః సంసారమివ నిర్మమః"

రఘు. 12 61

సంపాతిదర్శనము ద్వారా లంకయందు గల సీత యొక్క ప్రవృత్తిని తెలిసికొని మమకారమును విడిచిన మహాత్ముడు సంసారతరణము జేయునట్లు హనుమంతుడు సముద్రతరణము జేసెనట, సంసారసాగరతరణ మెంత దుష్కరమో సాగరతరణ మంత దుష్కరమని సామాన్యార్థము. ఇచట "నిర్మమః" అను విశేషణము హేతుగర్భము; సార్థకము మమతారహితుడై క్రమముగ అహంకారదూరుడై (నిర్మమః అను పదము మమతాహంకారముల కుపలక్షణము.) మహాత్ముడు సంసారతరణ మెట్లు జేయునో,

హనుమంతుడు గూడ మమతాహంకారరహితు డయియే శ్రీరాముని కృప వలన సముద్రతరణము జేసినట్లు మహాకవి నిపుణముగ సూచించెను

ఈశ్వరానుగ్రహ పూర్ణమైన పురుషకారమే కార్యసిద్ధికి దోహదము సేయును. ఈ విషయమును మహాకవి మాఘు డిటు వివరించెను.

"నాలంబతే దైష్టికతాం న నిషీదతి పౌరుషే ।
శబ్దార్థౌ సత్కవి రివ ద్వయం విద్వా నపేక్షతే ॥" శిశు ౨-౪౪

కొందఱు కవులు శబ్దచమత్కారమునకే ప్రాధాన్యమిత్తురు. కొందఱు అర్థచమత్కృతికి ప్రాధాన్య మిత్తురు. అట్లుగాక శబ్దతత్త్వము అర్థతత్త్వము వానికి గల సంపృక్తత్వము నెఱిగి సమదృష్టితో శబ్దార్థముల ప్రయోగింపగలవాడే సత్కవి యని సత్కవిలక్షణమును ఉపమానవ్యాజమున మహాకవి మాఘకవి సూచించినాడు. సత్కవికి శబ్దార్థములు రెండును ఉపాదేయము లైనట్లు ఉత్తమ సాధకునకు దైవము పౌరుషము రెండును గ్రాహ్యము లగునని శ్లోకతాత్పర్యము, హనుమంతుడు కేవలము శ్రీరాముని మీద భారము వైచి కార్యసాధనకు దిగలేదు అట్లని ఉపాస్యదైవమును మఱచి స్వభుజబలదర్పితుడై కార్యరంగమున దూకి లేదు. దైవపురుషకారములు రెండును మూర్తీభవించిన మూర్తి హనుమంతుడు. గరుడునకు వలె హనుమంతునకు జ్ఞానైశ్వర్య బలపరాక్రమసంపద పుష్కలముగా గలదు. పుట్టిన తోడనే గరుడుడు మింటి కెగసినట్లు హను

మంతుడు గూడ మింటి కెగసి సూర్యమండలమును గ్రసింపబోవుట ఇందుకు నిదర్శనము అట్టి హనుమంతుడు దైవపురుషకార సంపదతో సాగరతరణము జేసెను. హనుమంతుని యందు మూర్తీభవించిన దైవ పురుషకారసంపత్తిని సాగరతరణ సమయమున అత డొనర్చిన చతుర్విధ సాహస కృత్యముల ద్వారా భిన్నరీతులలో వాల్మీకిమహర్షి అభివ్యక్తము జేసెను. అందు సాగరతరణమునకై హనుమంతుని ప్రయాణ సంరంభము దాని ననుసరించి మహోద్ధతవేగముతో ఆకాశమున పయనించుట మొదటిది హనుమంతుని ఈ సాహసమును మైనాకు డిట్లు ప్రశంసించెను.

"దుష్కరం కృతవాన్కర్మ త్వ మిదం వానరోత్తమ ।
"నిపత్య మమశృంగేషు విశ్రమస్వ యథాసుఖమ్ ॥"

సుం 1 112

హనుమంతుడు తన లంఘనమున కడ్డు వచ్చిన మైనాకుని వక్షస్థలముతో దాకి క్రిందకు త్రోసివేయును. తరువాత అతని అభ్యర్థన ననుసరించి అట క్షణకాలము విశ్రమించి వెంటనే కార్యవ్యగ్రతతో మరల అంబరవీధిని జేరి పయనించును. దీనిని హనుమంతుని ద్వితీయ కర్మగా దేవత లిట్లు కీర్తించిరి.

"తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్ ।
ప్రశశంసు స్సురా స్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః ॥"

సుం– 1–137

రాక్షసీరూపము దాల్చి అంబరవీథి యందు తనను మ్రింగవచ్చిన సురసను జయించుట హనుమంతుని తృతీయ సాహసకార్యము ఈ సాహసమును తృతీయ సుదుష్కర కర్మ యని భూతజాతము వర్ణించు చున్నది:

తత్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్ ।
సాధు సాధ్వితి భూతాని ప్రశశంసు స్తదా హరిమ్ ॥"

సుం. 1–183

హనుమంతుని నాల్గవ భీషణ కృత్యము సింహికా దమనము. ఇట చతుర్థకర్మ మైనను దీనిని చతుర్థకర్మగా పరిగణనము జేయక ఆకాశ చరములగు భూతములు భీమకర్మగా వర్ణించుట గమనార్హము.

"తాం హతాం వానరేణాశు పతితాం వీక్ష్య సింహికామ్ ।
భూతా న్యాకాశచారీణి తమూచుః ప్లవగోత్తమమ్ ॥"
భీమ మద్య కృతం కర్మ మహత్సత్త్వం త్వయా హతమ్ ।
సుం. 1–188

ఈ విధముగ విక్రమముల ప్రదర్శించి సాగరము యొక్క ఆవలి యొడ్డును జేరిన హనుమంతుడు వీతమోహుడై స్వస్థుడై యున్న ఉత్తమ సాధకుని వలె నుండెను. మరియు త్రివిక్రమముల ప్రదర్శించి బలివీర్యమును హరించిన హరివలె నుండెను.

"తత శ్శరీరం సంక్షిప్య తన్మహీధరసన్నిభమ్ ।
పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇవాత్మవాన్ ॥
తద్రూప మతి సంక్షిప్య హనుమాన్ప్రకృతౌ స్థితః ।
త్రీ న్క్రమా నివ విక్రమ్య బలివీర్యహరో హరిః ।"

పై శ్లోకములందు హనుమంతుని వీతమోహుడై స్వస్థుడై ఆత్మవంతుడై యున్న ఉత్తమసాధకునితో పోల్చి ఆ తరువాత త్రివిక్రమములతో బలిని హరించిన హరితో కవి పోల్చెను. ఇచట గమనింపదగిన అంశము గలదు

"దేవతలు అణిమాధిసిద్ధి సంపన్నులైనను పరాక్రమవంతులయ్యును బలిని జయింపలేకపోయిరి. విష్ణువు త్రివిక్రమముల ప్రదర్శించి "ఇట్లు త్రివిక్రమముల ప్రదర్శింపగలవారే బలిని జయించగలరు" అని త్రివిక్రమావతారవ్యాజమున లోకమున కుపదేశించెను. బలి యనగా కథాపరముగా బలిచక్రవర్తి. ఆధ్యాత్మికముగా మహాబలసంపన్నము దుర్జయము అయిన అహంకారము "బల మస్యా సీతి బలీ" బలము గలిగినది అని అర్థము. బలసంపన్నమైన ఈ అహంకారము బాహుబలముతో జయించుటకు సాధ్యము కానిది కర్మ భక్తి జ్ఞానాత్మక త్రివిక్రమములతో మాత్రమే ఇది జయింపదగినది, అహంకారాత్మక బలిహరణమునకై జేయదగినదవి కర్మభక్తిజ్ఞానయోగ పరినిష్ఠితత్త్వరూప త్రివిక్రమములే అట్లు కర్మభక్తి జ్ఞానయోగములందు పరినిష్ఠితుడైన జీవుడే" తన యహంకారము మలిబ

యి చ్చ "తత్" స్వరూపు డగును. అనగా త్రివిక్రమాత్మక పరమేశ్వర స్వరూపు డగును " అను విషయము పై శ్లోకములందలి రెండు ఉపమాన ముల ఫలితార్థము.

హనుమంతుడు దట్టి త్రివిక్రమునంవన్నాడు బలివీర్యహరుడు. సముద్రతరణసమయమున అతడొనర్చిన దుష్కర కర్మలె అతని త్రివిక్ర మము లని కవి భావించినట్లు పై ఉపమానముల ద్వారా తెలియుచున్నది.

హనుమంతుని ఈ సాగరతరణమును సంసారతరణముతో బోల్చుట వలన సాగరతరణసమయమున హనుమంతుడు సురసాసింహికల ఎదు ర్కొనినట్లు సంసారసాగరతరణ సమయమున గూడ సాధకుడు సురసా సింహికల నెదుర్కొనవలసి యుండును అని ఇట సూచిత మగుచున్నది

అయితే ఈ సురసాసింహిక లెవరు ?

సురస

సంసారము ప్రీతి, అప్రీతి, మోహకర మని శాస్త్రజ్ఞులుచెప్పుదురు. విషయలంపటులకు సంసారము ప్రీతికరము ఏది ప్రీతికరమో అదియే క్రమముగా కొంతకాలమున కప్రీతికరము. సాధారణముగా సంసారము జీవుల మోహపరవశుల గావించును. దుఃఖమేవ సర్వం వివేకినః వివేకవంతుల దృష్టిలో ఈ విషయ జాత మంతయు దుఃఖాకరము. శ్రీ శంకరులు లక్ష్మీ నృసింహస్తోత్రమున సంసారమెంత భయంకరమైనదొ వివిధోపమాన వ్యాజమున చక్కగ వివరించెను సంసారవిషయమై

వివేకవంతుల దృష్టి యిట్లుండునని శ్రీ శంకరుల యుపదేశము. "సంసార సాగరవిశాల కరాళకాల నక్రగ్రహ గ్రసన నిగ్రహ విగ్రహస్య వ్యగ్రస్య రాగర సనోర్మినిపీడితస్య లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్॥

శ్రీ శంకరు డంతటివాడే తనను రాగరసనోర్మినిపీడితునిగా వర్ణించుకొనెను. ఈ సంసార రాగరసనోర్మియే సురసాస్వరూపము. ఏది రసనీయమై ఆస్వాద్యమై- హృద్యమై తాత్కాలికముగ మోహ పరవశుని గావించునో అదియే వివేకవంతుడగు సాధకుని దృష్టిలో నాల్కను జాచి మ్రింగబోవుచున్న సురస భయంకరాకృతి. వివేకవంతుడు తన వివేకబలముతో తీవ్ర వైరాగ్యసంపదతో సంసారమున ప్రవేశించియుండియు తద్భీకరతీవ్రదంష్ట్రాకరాళ విషదగ్ధుడు గాడు. ఇట్లుండుటయే సురసా జయము. ఏది భయంకరముగ మ్రింగజొచ్చినదో దానినే సాధకుడు నమస్కరించును, ఉపాసనాబలముతో దేవతగా దర్శించి ఉపాసించును. మొదట భయంకర మూర్తియై గోచరించిన సురస తుదకు హనుమంతునకు దేవతామూర్తియై దాక్షాయణియై సాక్షాత్కరించినది. మొదట భీకర మహార్ణవముగా కన్పించిన సంసారము లేక జగము క్రమముగ సాధకునకు దేవతారూపమున సాక్షాత్కరించును. (సర్వం విష్ణుమయం జగత్). అట్లు విశ్వమున కలుగు విశ్వాత్మక దేవతాసాక్షాత్కారమే సాధకునకు కలుగు సురసాసాక్షాత్కారము; సురసావిజయము.

సురస - నాగమాత :-

"సురస నాగులకు మాత." (నాగానాం మాతా - నాగులకు మాత) అని పైన వివరింపబడినది.

యోగ_ఉపాసనా సంప్రదాయముల ననుసరించి నాగమాత యొక్క స్వరూపము నిట్లు చెప్పుదురు.

"నాగరూపిణీ మాతా నాగమాతా" ప్రాణి దేహములందున్నగల వ్యష్టి కుండలినీ శక్తిని నాగరూపిణినిగా వర్ణించుట సంప్రదాయము.

"మూలాధారైక నిలయా – బిసతంతు తనీయసీ"

ఇత్యాది నామములు కుండలినీ శక్తిని వర్ణించుచున్నవి.

భోగిన్యైనమః – లలితా సహస్రనామము :–

భోగః సుఖసాక్షాత్కారః_తద్వతీభోగినీ_భాస్కరరాయవ్యాఖ్య.

"భుజగాకార రూపేణ మూలాధార సమాశ్రితా శక్తిః కుండలినీనామ బిసతంతు నిభా శుభా – వామకేశ్వర తంత్రము. భాస్కరరాయ వ్యాఖ్య.

ఇట్లు, కుండలినీ శక్తిని నాగరూపిణియైన పరాదేవతగా వర్ణించుట బహు తంత్రగ్రంథములందు ప్రసిద్ధము. కాబట్టి యోగవిదులదృష్టిలో యోగసిద్ధుడైన వాల్మీకి చే వర్ణింపబడిన నాగమాతయైన సురస నాగరూపిణి యైన కుండలినీ శక్తియే. హనుమంతుడు సూక్ష్మదేహముతో సురసా కాయమున ప్రవేశించి తాత్త్వికముగా నాగమాతయైన కుండలినీ శక్తిని దర్శించి ఆ పరాదేవతానుగ్రహము వడసి మరల బయలు వెడలివచ్చెనని చెప్పుదురు. సూక్ష్మదేహమున హనుమంతుని సురసాముఖప్రవేశ నిర్గమ నాది వాల్మీకి వర్ణన ఈ సంప్రదాయ రహస్యమును గుర్తింపజేయువదియే.

సింహిక :–

సాధకుడెంత వివేకవంతు డయ్యును అహంకార మమకారముల

చిగురించుచునే యుండును. అవి ఎంతటివారినైనను ఉద్ధరుని జేయుగలవు. విశ్వామిత్రగాథ ఇందుకు నిదర్శనము.

"అహంకారో హి భూతానాం సహజన్మా మహానలః।

అగ్ని ర్దహ త్యంకగతాన్ అహంకారస్తు సర్వతః।"

అహంకార మనునది ప్రాణులకు తోడబుట్టిన మహాగ్ని. అగ్ని దగ్గరగా అందు బాటులోనున్నవానినే దహించును. అహంకారాగ్ని కట్టి దూరసామీప్య వ్యవస్థలు లేవు. అహంకారము ముల్లోకముల నైతము భస్మీకరింప జాలును. ఇది అహంకారము యొక్క నైజస్వభావము. దీనిని జయింపజాలినవారు "మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్"అని అనినట్లు ప్రాణికోటియందు ఒకరిద్దరు మాత్రమే వ్రేళ్ళమీద లెక్కపెట్ట దగియుందురు. ఇది లోకానుభవసిద్ధమైన విషయము. అహంకారమున కేమాత్ర మెడ మీయక తన సర్వస్వమును శ్రీరాముని కంకితము జేసికొనిన మహా భాగ్యశాలి హనుమంతుడు. తనకు మైనాకుడు గాని సురసగాని, అడ్డుబడి నపుడు "రామ కార్యార్థమై పోవుచుంటిని"విఘ్నమాచరింపవలదని కోరెను. కాని, "బలపరాక్రమసంపన్నుడ నైన నా యెదుట నిలుచుటయా" యని హుంకరింపలేదు, సురసామైనాకులు తనకు సాయపడ వచ్చినవారని గ్రహించుటచే వారిని సంహరించుటకు పూనుకొనలేదు. సింహికావిషయ మట్లుగాదు. అమె హనుమంతుని గ్రసింపవచ్చిన మహామారి. కనుకనే హనుమంతు డామెను హతురాలను జేసెను. ఇది కథాపరము.

అధ్యాత్మికముగ ఉత్తమ సాధకుని విజయమునకు అడ్డుపడు సింహికాస్వరూపమును దర్శింపవలెను.

రెండు పాదములతో త్రైలోక్యమును వ్యాపించి బలి యొక్క సర్వస్వమును హరించెను. అట్లు చేయుటచే "ఇది నాది" అను మమకారమున కాస్కారము లేకపోయెను. ఇట్లు బలిచే మమకార త్యాగము చేయబడినది. ఇక మిగిలినది బలి యొక్క దేహము. తన మూడవ పాదముచే ఆ దేహమును గూడ వ్యాపించి అహంకారత్యాగము చేయించవలయును. ఇది ప్రభువగు త్రివిక్రముని ఆశయము అని గుర్తెఱిగి పక్షిరాజగు గరుడుడు బలిని వారుణపాశములతో సుత్యాహస్సునందు బంధించెను. అని శ్రీధరీయగ్రంథ తాత్పర్యము.

సామాన్యముగా యజ్ఞమునందు యజమానుడు పశువును బంధించును ఇచట గరుడుడు యజమాని యగు బలినే బంధించెను ఈ బంధనమహంకారత్యాగమును సిద్ధింపజేయుట కొఱకని చెప్పబడుచున్నది. అదియును అనగా, ఆ అహంకారత్యాగమును త్రివిక్రముని తృతీయ పదవ్యాప్తిచే గాని సిద్ధింపజేయ బడలేదు. అనగా ఏ అహంకార మెపుడు విష్ణుపదవ్యాప్తమగునో అపు డహంకార మణగద్రొక్కబడి నిర్వ్యాపారమగుచున్నది, అందుచేతనే గాబోలు: దేవాలయములందు విష్ణుపాదుకలు లేక రుద్రపాదుకలు భక్తితో శిరమున దాల్చుట యనెడి యాచారము శిష్టసంమతమై అనూచానముగ వరలుచున్నది. భరతుడు శ్రీరాముని పాదుకలను శిరమున దాల్చుట ఈ సంప్రదాయతత్త్వమునే స్ఫూర్తికి దెచ్చుచున్నది కాగా అహంకారగ్రంధివినాశనమునకు సింహికావిలయమునకు సర్వవ్యాపక త్రివిక్రమ తత్త్వానుభూతి యావశ్యకము అట్టి సర్వవ్యాపక తత్త్వానుభూతి చేతనే "అహధియా హతుడైన" గజేంద్రు

నకు అహంకార నక్రగ్రహమునుండి మోక్షము సంభవించినట్లు శ్రీమద్భాగవతము వలన తెలియుచున్నది,

"నాయం వేద స్వమాత్మానం యచ్ఛక్త్యాఽహంధియా హతః
తం దురత్యయమాహాత్మ్యం భగవంత మితోఽస్మ్యహమ్"

భాగ 8 3 29

గజేంద్రో భగవత్స్పర్శాత్ విముక్తో జ్ఞానబంధనాత్ ప్రాప్తో భగవతో రూపం పీతవాసాశ్చతుర్భుజః

భాగ 8 4 6

రామాయణమున సింహికారూపిణియైన అహంకృతి భాగవతమున గజేంద్రుని బంధించిన భయంకర నక్రగ్రహరూపమును దాల్చినది. అహంకారవిజయ మిట్టి దుష్కర కర్మయగుట చేతనే రామాయణమున సింహికాదమనము భీమకర్మగా వాల్మీకిచే చెప్పబడినది

మనోరథాత్మకమైన ఈ అహంకారమే ధర్మశాస్త్రములందు ఉగ్రరథ భీమరథ పదములచే సాంకేతికముగ నిర్దేశింపబడినది. షష్టి పూర్త్యుత్సవ సందర్భమున ఉగ్రరథశాంతియు సహస్రచంద్రదర్శనోత్సవ సమయమున భీమరథశాంతియు శాస్త్రములచే నిర్దేశింపబడినవి. ఇంద్రియాశ్వారూఢయై భీమరథారోహణము జేసిన అహంకృతిశక్తిని జయించుట దుస్సాధము. కావుననే వాల్మీకి సింహికారూప అహంకారశక్తి విజయమును భీమకర్మగా అభివర్ణించినాడు.

ఇట్టి భీమకర్మమ సాధించుటకు వలసిన గుణసంపద రామాయణ మున ఇట్లు నిర్దేశింపబడినది.

"తాం హతాం వానరేణాశు పతితాం వీక్ష్య సింహికామ్ ।
భూతా న్యాకాశచారీణి తమూచుః ప్లవగో త్తమమ్ ।
భీమ మద్య కృతం కర్మ మహత్సత్వం త్వయా హతమ్ ।
సాధయార్థ మభిప్రేత మరిష్టం ప్లవతాం వర ।
య స్యత్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ ।
ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి ।"

సుం 1 187 to 190

సింహికా సంహారము జెసిన హనుమంతుని ప్రశంసించుచు ఆకాశ చరములగు భూతములు ఇట్లు చెప్పినవి.

"ప్లవగోత్తమా ! సింహిక యనెడి మహాసత్త్వమును చంపుట సామాన్యమైన పని గాదు. ఇది భీమకర్మ అట్టి దానిని నీవు సాధిం చితివి. ఇక నీ లక్ష్యమును సాధించుకొనుము. ఎవరియందు ధృతి దృష్టి మతి దాక్ష్యములు నాల్గును విరాజిల్లునో అట్టివారు నీవలెనే స్వకార్యనిర్వహణదక్షు లగుదురు. విషాదము చెందరు."

పై శ్లోకముల వలన సింహికాసంహారమునకు అహంకార విలాసమునకు ధృతి దృష్ట్యాదులు నాల్గును అవశ్యకములని

తెలియును. హనుమంతుని యందు ధృతి ధైర్యము, దృష్టి దూర దృష్టి మతి ప్రతిభ వివేకము దాక్ష్యము శక్తి, సామర్థ్యము సాగరంతరణసమయమున అభివ్యక్తము లైనవి. వానరు లెవ్వరును సాహసింపని సాగరతరణమునకు బూనుకొనుట అతని ధృతికి నిదర్శనము మైనాకుడు సాగరమధ్యమున ఆతిథ్యమీయబోవ ఆ యాతిథ్యము గూడ విఘ్నమని భావించి లక్ష్యసిద్ధియందే, దృష్టిని నిలుపుట అతని ఏకాగ్ర మనస్కతకు తార్కాణము. సురసావిషయమున హనుమంతుడు జూపిన నేర్పు వివేకము గమనార్హము, ఆమె రాక్షసీరూపమున వచ్చినను ఆమెను హింసింప బూనుకొనక ఆమెను దేవతామూర్తిగ దర్శించి నమస్కరించుట అతని వివేకమును చాటుచున్నది ఇక సింహికావధమన మనెడి భీమకర్మ అతని దక్షతను సామర్థ్యమును మహానుభావత్వమును నిరూపించుచున్నది. సాగరతరణము సంసారసాగరతరణముతో పోల్చబడుటచే సాగరతరణమునకు వలెనే సంసారతరణమునకును ఈ చతుర్విధ గుణసంపత్తి ఆవశ్యక మని మహర్షి ఉపదేశించుచున్నాడు.

ఈ చతుర్విధ గుణసంపత్తి హనుమంతునియందు నిసర్గసిద్ధము, హనుమంతుని ప్రసక్తి వచ్చినపుడెల్ల రామాయణమున హనుమంతుని యందుగల యీ గుణసంపత్తి కీర్తింపబడుచుండును: లంకయందు సీతను జూచి తిరిగివచ్చి మధువనమున ఆనందోల్లాసములతో వానరులు

ధ్వంసము జేసినపుడు దధిముఖుని ద్వారా వార్త వినిన వెంటనే సుగ్రీవుడు హనుమంతుని గుణములను లక్ష్మణుని యెదుట ప్రస్తుతించెను,

"దృష్టా దేవీ న సందేహో నచాన్యేన హనుమతా
నహ్యన్య స్సాధనే హేతుః కర్మణోऽస్య హనూమతః॥
కార్యసిద్ధి ర్మతిశ్చైవ తస్మిన్ వానరపుంగవే
వ్యవసాయశ్చ వీర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్॥

సుం 63 17, 18, 19

హనుమంతుడు సుగ్రీవుని కడకు రాలేదు తాను సీతను చూచి వచ్చినట్లు చెప్పలేదు. సుగ్రీవుని కడకు వచ్చుటకు పూర్వమే ప్రభువగు సుగ్రీవునకు ప్రాణప్రదము అత్యంత. ప్రీతిపాత్రమునైన మధువనమున యథేచ్ఛముగా మధువును త్రాగి ధ్వంసము జేయుట సుగ్రీవునకు ఆగ్రహము తెప్పింపలేదు. ప్రభుధిక్కారమును సైతము మరపించెను. వారి యానందోత్సాహములకు కారణము సీతాదేవిసందర్శనమే. సందేహము లేదు అందును ఇట్టి ఘనకార్యమును నిర్వహింప సమర్థుడు హనుమంతుడే కాని ఇతరులు కారు. ఏలయన ఆ వానరపుంగవుని యందు వివేకము ప్రతిభ (మతి కార్యదీక్షతత్పరత దూరదృష్టి (వ్యవసాయః) వీర్యము కార్యనిర్వహణసామర్థ్యము దాక్ష్యము విజ్ఞానము తత్త్వార్థదర్శనము (శ్రుతం) ఇవి యన్నియు పుష్కలముగా గలవు. ఇది హనుమంతుని గూర్చిన సుగ్రీవుని దర్శనము. ఇక హనుమంతుని గూర్చిన శ్రీరాముని దర్శనమును చూతము.

"అరజే వాససీ దివ్యే శుభా న్యాభరణాని చ
అవేక్షమాణా వైదేహీ ప్రదాదౌ వాయుసూనవే॥
అవముచ్యాత్మనః కంఠా ద్ధారం జనకనందినీ
అవైక్షత హరీన్ సర్వాన్ భర్తారం చ ముహు ర్ముహుః॥
తా మింగితజ్ఞ స్సంప్రేక్ష్య బభాషే జనకాత్మజామ్
ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాऽసి భామిని॥
పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్మి న్నేతాని సర్వశః
దదౌ సా వాయుపుత్రాయ తం హార మసితేక్షణా॥

యుద్ధ 131 17 to 20

రావణవధానంతరము అయోధ్య యందు పట్టాభిషేకోత్సవ సందర్భమున తన విజయమునకు తోడ్పడిన వానరుల నందఱను శ్రీరాముడు యథోచితముగా సత్కరించెను. సీతయు దివ్య వస్త్రాభరణములతో హనుమంతుని సత్కరించెను. మరియు తన కంఠహారమును దీసి "ఇది ఎవరికి బహూకరించుటయా" యని యాలోచించుచు ఇటు వానరులను అటు భర్తను మరల మరల పర్యవేక్షించెను ఆమె హృదయము నెఱిగిన శ్రీరాముడు " ఎవరియందు పౌరుషము విక్రమము బుద్ధి ఈమూడింటిని సమగ్రముగ దర్శించి పరితుష్టురాల వైతివో వారి కీ హారమును బహూకరింపుము" అని సబహుమానముగా చెప్పగా ఆమె యా హారమును వెంటనే హనుమంతునకు బహూకరించెను.

ఇది హనుమంతుని గూర్చిన శ్రీరామదర్శనము ఈ దర్శనము లన్నిటిని సూక్ష్మముగ పరిశీలించిన మొదట కీర్తింపబడిన చతుర్విధ గుణ సంపత్తియే భిన్నభిన్న నామములతో సమాస వ్యాసరూపమున సంగృహీత మైనట్లు స్పష్ట మగును. హనుమంతు డిట్లు గుణసంపత్తి కలవా డగుటయే గాదు తనను నమ్మి సేవించిన భక్తులకు ఇట్టి గుణసంపత్తిని ప్రసాదించెడి భక్తదైవతము కావుననే హనుమత్స్మరణను గూర్చిన సంప్రదాయ శ్లోకము ఆయన మహానుభావత్వము నిట్లు చాటుచున్నది

"బుద్ధి ర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా ।
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమత్స్మరణాద్భవేత్ ॥"

నిర్మమో నిరహంకారః

హనుమంతుడు పైన వివరించిన విధమున శ్రీరామపాదార్పిత పరిశుద్ధ మనస్కుడు. ఈ కార్యనిర్వహణ విషయమై మమతారహితుడు. తనను గూర్చిగాని, తన శరీరమును గూర్చిగాని, ఏమియగునోః యను భయముగాని ఎట్టి చింతయు లేనివాడు. కర్తవ్యమిత్యేవ కర్మ తేన కృతమ్ః కర్తవ్య విధి నిర్వహణమే ఆయన ప్రధాన లక్ష్యము ఆయన మమతారహితుడై శరీరాభిమానరహితుడై కర్తవ్యదీక్షాపరతంత్రుడై మన కండ్ల యెదుట సాక్షాత్కరించును. "నిర్మమో నిరహంకారః" అను గీతా శాస్త్రవచనమునకు లక్ష్యభూతుడుగా సాగరతరణ సమయమున గన్పట్టును. వాల్మీకిమహర్షి హృదయమర్మజ్ఞు డగుటచేతనే మహాకవి కాళిదాసు తాత్త్వి

కముగ సాగరతరణమును సంసారతరణ రూపముగా వివరించెను. వాల్మీకి మహర్షి సురసా సింహికా కథావర్ణన వ్యాజమున నిర్మమనిరహంకార సుందరహనుమన్మూర్తిని సాక్షాత్కరింపజేసి రామాయణము వేదసంమిత మగుటను కారితానంమితముగ నిరూపించెను. అట్టి సుందరహనుమన్మూర్తి సౌందర్యలహరీ విలాసమే సుందరకాండము.

శ్రీరాముని దివ్యసౌందర్యానుభూతియే జ్ఞానియగు హనుమంతుని సౌందర్యవిలాసము. హనుమత్సౌందర్యస్ఫోరకములే సముద్రతరణమున సురసాసింహికా సన్నివేశములు శ్రద్ధతో భక్తితో సుందరకాండ నధ్యయనము జేసి హనుమత్సౌందర్యవిలాసముల దర్శించి చరితార్థుల మగుదుము గాక!

"అత్రైతే శ్లోకా భవంతి."

1 నవరసభరితా జగతీ
ఆస్వాద్యా మోహినీ సురసా
సైవ హి విదుషో భీకర
నక్రగ్రహసంకులా విరసా॥

2 ఆత్మా సింహః ప్రోక్తః
తద్గతమాయా చ సింహికా ప్రథితా
ఛాయాగ్రాహే కుశలా
నిర్మూలా భవతి విద్యయా యా హి॥

3 సాగరతరణమనోజ్ఞం

సురసామైనాక సింహికా విజయమ్

విక్రమవిరహంకారం

సీతాసౌందర్య సాక్షిణం వందే॥

4 సురసా సింహికా తత్త్వస్ఫోరకాయ మహర్షయే

సురసాయ నమో సింహరుచయే వల్మీక జన్మనే"

# స్త్రీయం పురుషవిగ్రహమ్

శ్రీరాముడు పితృవాక్య పరిపాలనమునకై అడవికి బయలుదేరును. శోకసంతప్తయైన కౌసల్య నూరడించి ఆమె ఆశీస్సుల నందుకొనును. తరువాత వనవాస వృత్తాంతమును తెలుపుటకు సీతయొద్దకు వచ్చును. తన అరణ్యగమన వృత్తాంతమును ఆమెకు తెలియజేయును. తాను వనవాసము నకు బోయినపుడు ధైర్యముగ నయోధ్య యందుండుమని యిట్లు బోధించును.

"అహంచాఽపి ప్రతిజ్ఞాం తాం గురోస్సమనుపాలయన్ ।
వనమద్యైవ యాస్యామి స్థిరీభవ మనస్వినీ"
"యాతే చ మయి కళ్యాణి వనం ముని విషేవితమ్।
వ్రతోపవాసపరయా భవితవ్యం త్వయాఽనఘే"
"కల్య ముత్థాయ దేవానాం కృత్వా పూజాం యథావిధిః
వందితవ్యో దశరథః పితా మమ జనేశ్వరః"
"మాతా చ మమ కౌసల్యా వృద్ధా సంతాప కర్శితా ।
ధర్మమేవాగ్రతః కృత్వా త్వత్తస్సంమానమర్హతి"

"వందితవ్యాశ్చ తే నిత్యం యా శేషా మమ మాతరః
స్నేహ ప్రణయ సంభోగైః సమా హి మమ మాతరః"
"భాతృపుత్ర సమౌ చాపి ద్రష్టవ్యౌ చ విశేషతః
త్వయా భరత శత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ"
(రామా 2 26 33)

సీతా! నేను అడవికి పోవుచున్నాడను నీ విచట ధైర్యముగా నుండుము. నేను ముని నిషేవితమైన వనమున నుందును. నీ విచట వ్రతోపవాస పూజా దీక్షితురాలవై యుండుము. ప్రత్యూషము ననే లేచి యథావిధి భగవదారాధన జేయుచు అత్తమామలను సేవించుము. కైకేయీ సుమిత్రలు నాకు కౌసల్య వంటి వారే నా కందఱు మాతృదేవతలే. ఎట్టి భేదము చూపక ధర్మ దృష్టితో వారల సేవింపుము. భరత శత్రుఘ్నులు నాకు ప్రాణతుల్యులు. నీవును వారిల నట్లు చూచికొనుము.

సీతకు శ్రీరాముడు సింహాసనమును వదలి అడవికి పోవుట దుఃఖ కారణము కాలేదు తా నడవికి బోవుచు తనను (సీతను) అయోధ్యయం దుండు మనుట సీతకు దుఃఖకారణ మాయెను.రాముడు పట్టాభిషిక్తుడై నపుడు పట్టపురాణిగా నుండి తానెంత యానంద మనుభవించునో వనవాసమున్న గూడ రామ సన్నిధానమున నుండి తానట్టి యానందమునే పొందగలదు. భర్తృ సాన్నిధ్యముకన్న ఆమె కానంద దాయకము మరియొకటి లేదు.

శ్రీరాముడు తనతో వనమునకు రమ్మని పిలువనందుల కామె బాధపడి సంక్రుద్ధయై భర్తతో ఇట్లనును.

"భర్తుర్భాగ్యం హి నార్యేకా ప్రాప్నోతి పురుషర్షభ ।
అతశ్చైవాఽహ మాదిష్టా వనే వస్తవ్య మిత్యపి॥
న పితా నాత్మజోవాత్మా న మాతా న సఖీజనః ।
ఇహప్రేత్యచ నారీణాం పతి రేకో గతిస్సదా ॥
యది త్వం ప్రస్థితో దుర్గం వనమద్యైవ రాఘవ।
అగ్రత స్తే గమిష్యామి మృద్నంతీ కుశకంటకాన్ ॥

భర్త సౌభాగ్యమును పొందుటకు భార్య యొక్కతియే అర్హురాలు అట్టి సౌభాగ్యము నందుకొనుటకు నీతోపాటు నాకు వనవాసము నిర్దేశింప బడినది. తల్లిగాని తండ్రిగాని సంతతిగాని సఖీజనముగాని భర్త్రు సాన్నిధ్యమువలె సంతోషపెట్ట జాలవు. నీ వడవికి బయలుదేరిన నేను ముందు నడచుచు, మార్గముననున్న కుశకంటకాదుల తొలగించుచు నడిచెదను.

"ప్రాసాదాగ్రే విమానైర్వా వైహాయసగతేన వా ।
సర్వావస్థాగతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే ।
అనుశిష్టాస్మి మాత్రాచ పిత్రా చ వివిధాశ్రయమ్ ।
నాఽస్మి సంప్రతి వక్తవ్యా వర్తితవ్యం యథా మయా ।

నీవులేని సమయమున ప్రాసాదాగ్రవాసముగాని విమాన సంచారముగాని నన్నానందింపజేయవు. సర్వావస్థలయందు నీ సన్నిధానమున

మండి సదా నీకు చేయు పాదసేవయే (పాదచ్ఛాయ) నాకు తత్త్వతః ఆనందదాయకము.

నే నయోధ్యకు వచ్చునపుడు నా తల్లిదండ్రులు ఏ స్థితిలో నున్నను భర్తృ పాదసేవ వీడరాదని ఆదేశించిరి. కనుక నిన్ను సేవించుటకు నేనడవికి రాగలను నన్ను వారించవద్దు

"ఫలమూలాశనా నిత్యం భవిష్యామి న సంశయః
న తే దుఃఖం కరిష్యామి నివసంతీ త్వయా సదా।
అగ్రత స్తే గమిష్యామి భోక్ష్యే భుక్తవతి త్వయి।
ఇచ్ఛామి పర్వతాన్ శైలాన్పల్వలాని సరాంసిచ"

కందమూల ఫలాదులను తినుచు నీతో కాలమును గడిపెదను. నా వల్ల నీకెట్టి బాధను కలుగనీయను. నీ వాహారమును తీసికొనిన తరువాతనే నేనాహారమును గ్రహింతును. నీకు సాయముగ నీ ముందు నడిచెదను పర్వత సరిత్సరస్సులను తిలకించెదను.

సీత ఇంత వివరించి చెప్పినను కలిసి వనవాసము చేయుట కెంత యభిలాషజూపినను శ్రీరాముడు సీతను వెంటతీసికొని వెళ్లుట కంగీకరింపడు. కన్నీరు కార్చుచున్న ఆమెను బ్రతిమాలుచు వనవాసము ఆపదలకు నిలయమని చెప్పుచు వనవాస దోషముల నిటు వర్ణించును

"హితబుద్ధ్యా ఖలు వచో మయైత దభిధీయతే ।
సదా సుఖం న జానామి దుఃఖమేవ సదా వనమ్ ।

లతా కంటక సంకీర్ణాః కృకవాకూపనాదితాః ।
నిరపాశ్చ సుదుఃఖాశ్చ మార్గా దుఃఖ మతో వనమ్"

నీ క్షేమ మాలోచించియే వనమునకు రావలదనుచున్నాను. వన మార్గములు లతా కంటక సంకీర్ణములు. క్రూరమృగ సంచార భయం కరములు.

"ఉపవాసశ్చ కర్తవ్యః యథా ప్రాణేన మైథిలీ ।
జటాభారశ్చ కర్తవ్యో వల్కలాంబర ధారణమ్ ।
దేవతానాం పితౄణాం చ కర్తవ్యం విధిపూర్వకమ్ ।
ప్రాప్తానా మతిథీనాం చ నిత్యశః ప్రతిపూజనమ్ ।
కార్య స్త్రి రభిషేకశ్చ కాలే కాలే చ నిత్యశః ।
చరతాం నియమేనైవ తస్మాద్దుఃఖతరం వనమ్ ।
ఉపహారశ్చ కర్తవ్యః కుసుమైః స్వయమాహృతైః ।
ఆర్షేణ విధినా వేద్యాం సీతే దుఃఖ మతో వనమ్ ।

సీతా! వనవాస దీక్షయందు అనేక కఠిన నియమములు పాటింప వలయును అందు ఉపవాసము జటాధారణము వల్కలాంబరధారణము

నీకు మిక్కిలి క్లేశమును కలిగించును. నిత్యము దేవతలు పితరులు వచ్చిన అతిథులుగూడ మనచే పూజింపబడవలెను అంతేగాక ప్రతిదినము పుష్పముల దెచ్చి వేదియందు ఆర్షధర్మవిధి ననుసరించి బలికర్మ(ఉపహారః) జరుపవలెను. అనగా గృహమునందువలె అచట గూడ శాస్త్రవిధి ననుస రించి వేదియందు పూజ తప్పక జరుగవలెను.

మరియు వనమున ఆహారము లభించుననీ నియమములేదు దొరి కిన దానితో తృప్తిజెందవలయును. వనచరులతో సహవాసము జేయవల యును. ప్రళయ ఝంఝూమారుతములను గాఢాంధకారములను భరింపవలెను కనుక వనవాసము భయంకరము.

రాము డిట్లు వనవాసమును గూర్చి చెప్పుచున్నప్పుడు కన్నీరు గార్చుచు సీత మెల్లగ ఇట్లనును.

వన నివాసమును గూర్చి నీవు చెప్పిన దోషము లన్నియు నాకు గుణములే నీ సమీపమున నున్న నన్నెవరేమి చేయలేరు. నా కెట్టి భయ మూండదు పతిహీనయైన నారి బ్రతుక జాలదు. నన్నయోధ్య యందుండు మని చెప్పుచు నీవును నా కాదారినే చూపుచున్నావు.

అథాऽపిచ మహాప్రాజ్ఞ బ్రాహ్మణానాం మయా శ్రుతమ్ ।
పురా పితృగృహే సత్యం వస్తవ్యం కిల మేవనే ।
లక్షణిభ్యో ద్విజాతిభ్యః శ్రుత్వాऽహం వచనం గృహే ।
వనవాస కృతోత్సాహా నిత్యమేవ మహబల ।
కన్యయా చ పితుర్గేహే వనవాసః శ్రుతో మయా ।
భిక్షిణ్యాః శమవృత్తాయాః మమ మాతు రిహాగతః ।
ప్రసాదితశ్చ వై పూర్వం త్వం మే బహువిధం ప్రభో
గమనం వనవాసశ్చ కాంక్షితం హిత్వయా సహ"

నేను వనవాసము జేయుదునని చిన్నతనమున మా యింటియందు బ్రాహ్మణులు మా నాన్నగారితో చెప్పుట వినియున్నాను, అంతేగాక

శమదమాది గుణసంపన్నయు భిక్షిణియగు కన్య మాతల్లిగారి యెదుట "నేను వనవాసము జేయుదున"ని చెప్పి యున్నది. ఆమె మాట లనృత ములు కావు అదియును గాక నేను ఇచటనే ఇదివరకే నాకు వనవాస కుతూహలమున్నట్లనేక మాటలు తెలిపితిని. కనుక నన్ను వారింపవదు.

మరియు మరణించి న పరలోకమందు గూడ నీసాహచర్యము నా కానందదాయకము ఇక బ్రతికియున్న కాలమున విన్నువిడిచి యుండుటెట్లు ?

"ప్రేత్యభావేऽపి కళ్యాణః సంగమో మే సదా త్వయా।
శ్రుతి ర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినామ్।
ఇహలోకే చ పితృభి ర్యా స్త్రీ యస్య మహాబల।
అద్భి ర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేऽపి తస్య సా"

ఈ లోకమున తండ్రిచె ధారాదత్తము చేయబడిన (అద్భి ర్దత్తా) కన్యను ఎవరు పరిగ్రహించెదరో మరు జన్మమునం దామె అతనినే భర్తగా పొందును. నేను నీకట్టి భార్యను. కనుక నన్ను నిషేధింప వద్దు నన్ను వారించుటకే శాస్త్రమంగీకరించదు. నన్ను వద్దనుటకు కారణము గూడ కన్పించదు భక్తురాలు పతివ్రత దీన సుఖ దుఃఖములను సమాన ముగా భావించు నీ భార్యను నీ వెందుకు వారించుచున్నావు.

"యది మాం దుఃఖితా మేవం వనం నేతుం నచేచ్ఛసి।
విష మగ్నిం జలంవాహ మాస్థాస్యే మృత్యు కారణాత్॥
(వా రా. 2 20-21)

ఇట్లు దుఃఖితురాలైన నన్ను వెంట తీసికొనిపోవనిచో విషపానము జేసి గాని. అగ్ని జల ప్రవేశము జేసి గాని ప్రాణత్యాగము జేయుదున. సీత అట్లు నిర్మోహమాటముగా వెంటవత్తునని యడిగినను శ్రీరాముడు ఎట్లయినను ఆమె నయోధ్యయందుండుమనియే కోరెను. బహువిధ ప్రమాదములకు నిలయమైన వనమునకు తనతో రావలదని ఎన్నో విధముల బ్రతిమాలి చెప్పదొడగెను.

ఇంతవరకు సీత ఎంతో సహనము సహించి భర్తను ప్రార్థించినది. కాని భర్తకు మనసు మారలేదు. క్రమముగ ఆమె సహనము కోల్పోయినది.

"సా త ముత్తమ సంవిగ్నా సీతా విపుల వక్షసమ్
ప్రణయాచ్చాభిమానాచ్చ పరిచిక్షేప రాఘవమ్॥
"కిం త్వాzమన్యత వై దేహః పితా మే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుష విగ్రహమ్॥
"అనృతం బత లోకోzయం అజ్ఞానా ద్యది వక్ష్యతి।
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే॥
"కిం హి కృత్వా విషణ్ణస్త్వం కుతో వా భయమస్తి తే
యత్పరిత్యక్తు కామస్త్వం మామనన్య పరాయణామ్॥
"ద్యుమత్సేనసుతం వీరం సత్యవంత మనువ్రతామ్
సావిత్రీ మివ మాం విద్ధి త్వ మాత్మ వశవర్తినీమ్॥
(వా. రా. 2 30 1 to 6)

శ్రీరాముని మాటలకు సీత భయభ్రాంతురాలైనది (ఉత్తమ సంవిగ్నా) భయావేశముతో చనువుతో ఆత్మాభిమానముతో శ్రీరామునితో ఎన్నడును పలుకని విధముగ విలక్షణ వాక్యముల పలుకును. (పరిచిక్షేప విలక్షణ వచన ముచ్చారయామాస రామటీక), నిందావాక్యములు పలికెనని సామాన్యార్థము.

మిథిలాధిపతియగు నా తండ్రి నీ నిజస్వరూపమును తెలిసికొనలేదు నీవు ఆకారములో మాత్రము పురుషుడవు. క్రియయందు పురుషత్వము కన్పించదు. స్త్రీవలె భయ స్వభావము గలవాడివి. అట్టి (స్త్రియం పురుష విగ్రహామ్) నీతత్త్వమును నా తండ్రి తెలిసికొనలేదు తెలిసిన నన్ను నీకిచ్చి వివాహము జేయడు

"పురుష విగ్రహ మాకారేణ పురుషం క్రియయా తు స్త్రియ మేవ త్వాం జామాతరం ప్రాప్య మే పితా కిమమన్యత।త వ త త్త్వం నజ్ఞాతవా నిత్యర్థః। శ్రీ ది జానీయాత్ మాం తుభ్యం న ప్రయచ్ఛే దితి శేషః

తిలక వ్యాఖ్య॥

ఆకాశమధ్యమున ప్రకాశించు సూర్యుడువలె శ్రీరాముడు తేజస్సంపన్నుడని లోకము నిన్ను ప్రశంసించుట అనృతమే యగుచున్నది. నన్ను వదలి వనమున కేగిన నిన్ను తేజస్సంపన్నుడ వని లోకమనుట యనృతయేయగుచున్నది. నీవే గతి యని నిన్ను నమ్ముకొన్న నన్ను వదలి వెళ్ళ నీవు ఎందుకు విషణ్ణుడవై యున్నావు।ద్యుమత్సేన సుతుడైన సత్యవంతుని అనుసరించియుండు సావిత్రివలె ఎల్లప్పుడు నీ యాత్మవశవర్తినినై యుండు దానినిగా నన్ను తెలియుము "

"కిం త్వామన్యత వైదేహః పితా మే మిథిలాధిపః ।
రామజామాతరం ప్రాప్య ప్రియం పురుష విగ్రహమ్"

జామాతా జా అపత్యం తస్య నిర్మాతా యాస్కానిస్తక్తమ్

అపత్య నిర్మాత గావ జామాత. ఈ నిర్వచనము ననుసరించి జామాతయందును మాతృత్వము దర్శింపవలసి యున్నది దీని ట్టి స్త్రీ పురుష లిరువురికిని మాతృత్వము సాధారణము కాన స్త్రీ వలె జామాతయు మాతయే, జామాతయందలి మాతృత్వము పుంరూపముగా లోక ప్రసిద్ధము. ఇది లోకసిద్ధ జామాతృత్వము ఈ విషయ మింకను పరిశీలింపదగినది.

జాయత ఇతి జా జగత్‌;తస్యాఃమాతా జామాతా.జగన్నిర్మాత యని యర్థము సీత లోకమాత। శ్రీరాముడు జగన్నిర్మాత. లోకమున స్త్రీ పురుషుల కపత్యనిర్మాతృత్వమును సంఘటితము జేయును, ఇట్లే మాయాశక్తి రూపిణియైన పరాదేవత పరమేశ్వరునియందు జా మాతృత్వమును జగన్నిర్మాతృత్వమును సంఘటితము జేయును. శ్రీరాము డట్టి జామాత కావ పై శ్లోకమున "జామాతరం ప్రాప్య" అను హేతుగర్భ వచనము సార్థకము.

ఈ పై శ్లోకమున "వైదేహః" అను పదము జనకుని యొక్క మహాజ్ఞానిత్వమును సూచించుచున్నది। జనకుడు శ్రీరాముని లోకసిద్ధ జామాతగా మాత్రమే దర్శింపలేదు. జామాతగా జగన్నిర్మాతగా గూడ దర్శించెను. లోకమున మానవులు జామాతను పురుషునిగా దర్శింతురు.

జనకు దచ్ఛగార తా_త్త్విక దృష్టితో పుంరూపమున జరించెడి పరాదేవతగా రాముని దర్శించెను ఆ విషయమునే సీత రామునకు గుర్తుజేయుచున్నది. రామా! మిథిలాధిపతి యగు నా తండ్రి మన యిరువురికిని గల అనన్య భావమును గు_ర్తించియే నిన్ను జామాతగా స్వీకరించెను (రామ! జామా తరం ప్రాప్య) నీవు ప్రాకృత పురుషుడవు కావు. మాయాశ_క్తి సంవళిత చై_తన్యమూ_ర్తివి అనగా సీతా సంవళిత చై_తన్యమూ_ర్తివి. నీవు పురుష రూపమున చరించుచున్నావు. మన యిరువురికిని గల అనన్యత్వము గు_ర్తించుము నన్ను విడిచి అరణ్యమునకు పోవుదు వనుమాట పొసగదు. మఱియు నీ అవతారప్రయోజనము సిద్ధించుట నేను నీ వెంటనున్నప్పుడే సంభవ మగును, కనుక నీ వెంట నేనుండవలసినదే!

ఈ విషయము సీతాహృదయమును గు_ర్తెఱిగి తరువాత పలుకు శ్రీరాముని మాటలవలన విశదమగుచున్నది

"యత్సృష్టాసి మయా సార్ధం వనవాసాయ మైథిలీ ।
న విహాతుం మయా శక్యా కీ_ర్తి రాత్మవతా మివ"
(అయోధ్య 36 29)

"జానకీ! వనవాసమున కయియే నీ యావిర్భావము ఆత్మవంతుని కీ_ర్తియెడబాసి యుండజాలనియట్లు నిన్నెడబాసి నే నుండుటకు వీలులేదు." అని శ్రీరాముడు సీత నోదార్చెను. ఇట కీ_ర్తి కీ_ర్తిమంతుల సంబంధమెట్టిదో సీతారాముల సంబంధ మట్టిది విడదీయరానిది, కీ_ర్తి పరతంత్ర కీ_ర్తి మంతు నాశ్రయించి తదనన్య రూపిణియై విలసిల్లును.

అట్లే శక్తిరూపిణియై పరతంత్రయైన సీత శక్తిమంతుని శ్రీరాము నాశ్రయించియే తదన్యరూపిణి యయియే విరాజిల్లును. మరియు ఈ ఉప మానము ద్వారా ఆత్మవంతుడైన శ్రీరామునియొక్క కీర్తిస్వరూపిణి సీత యను నర్థము సూచితమగును. "స్త్రియం పురుష విగ్రహా" మను నీ వచనము స్త్రీ పురుష తత్త్వమును తెలిపెడి ఋగ్వేద మంత్రము నొక దానిని స్ఫూర్తికి దెచ్చుచున్నది.

"స్త్రియ స్సతీ స్తా ఉమే పుంస అహుః పశ్య ద క్షణ్వా న్న
విచేత దంధః
కవి ర్యః పుత్రః స ఈ మాచికేత య స్తా విజానా
త్స పితుః పితా సత్"
(ఋగ్వేద 1 164 16)

ఇది అధి దైవికముగ సూర్యకిరణముల గూర్చి చెప్పెడి మంత్రము. లోక వ్యవహారము ననుసరించి సూర్యకిరణములు పుంరూపములు శాస్త్రదృష్టితో చూచిన నట్లుకాదు వస్తుతః ఇవి స్త్రీ రూపములై పురుష రూపమున వ్యవహరింపబడుచున్నవి. గర్భధారణము స్త్రీ ధర్మము సేక్తృత్వము పురుషధర్మము.జలరూప గర్భధారణచే వీనియందు స్త్రీత్వము సిద్ధమై యుండగా జలసేక్తృత్వమను ధర్మమును పురస్కరించుకొని వీని యందు పుంరూపత్వ మారోహితమగుచున్నది.ఇట్లు స్త్రీమూర్తులను పురుష మూర్తులుగ దర్శించుట తాత్త్వికలక్షణము.అట్లు దర్శించినవారే చక్షుష్మంతులు ఇట్టి దృష్టిలేని వారు కన్ను లున్నను అంధులే. జనకుడు

శ్రీరామునియం దిట్టి తత్త్వమును దర్శించిన చక్షుష్మంతుడు

వేదముగూడ ఎడనెడ స్త్రీ మూర్తులను పుంరూపమున వ్యవహరిం చుట ఇందుల కుదాహరణము

"స్తుతో మయా వరదా వేదమాతా"

(తైత్తిరీయారణ్యక 36అనువాక)

వేదమాతా ఇది స్త్రీలింగ వాచక పదము స్త్రీలింగ వాచక శబ్దమునకు విశేషణము స్త్రీ లింగవాచక మయియే యుండవలెను. ఇది సంస్కృత భాషాసంప్రదాయము కాని అంతకు భిన్నముగా "వేదమాతా స్తుతః అని శ్రుతి నిర్దేశించినది వేదము ఎడనెడ స్త్రీమూర్తులను పుంరూపమున వ్యవహరించుటను ఇచట స్తుతః అను విశేషణ శబ్ద స్వారస్యము వలన తెలియగలము.

గాయత్రి

ఆదిత్య రూపా చిచ్ఛక్తి రేవ గాయత్రీ అని గాయత్రిని శక్తి రూపిణినిగాను ఆశక్తినే "ధ్యేయ స్సదా సవితృ మండల మధ్యవర్తీ నారాయణః" అని నారాయణ స్వరూపునిగాను ఆరాధించుట శిష్ట సంప్ర దాయము ఇచట స్త్రీ మూర్తియైన గాయత్రిని పురుష విగ్రహగా భావించి ధ్యానించుట తాత్త్విక దృష్టిని సూచించుచున్నది. గాయత్రీ బీజ సంపుటిత మైన శ్రీమద్రామాయణమును ప్రవర్తింపజేసిన వాల్మీకి మహర్షి సీతను

వరేణ్య భర్గస్వరూపిణియైన శక్తిగాను తదన్య రూపుడైన శ్రీరాముని ఆదిత్య మండలాంతర్గత హిరణ్మయ పురుషునిగాను భావన జేసిజేసి గాయత్రీ మంత్ర చింతన ఫలముగా "స్త్రియం పురుష విగ్రహ"మని పరతత్త్వ స్ఫోరకమైన తన యనుభూతిని సీతా ముఖమున వెల్లడించినట్లు తెలియచున్నది,

తిరుపతి వేంకటేశ్వరుడు .

'స్త్రియం పురుష విగ్రహ' మను వాల్మీకి వచన ప్రతిరూపములో యన్నట్లు మన దేశమున కొన్ని సుప్రసిద్ధ దేవాలయములు వెలసి యున్నవి అందు సర్వతః ప్రసిద్ధమైనది తిరుమల యందలి వేంకటేశ్వర క్షేత్రము అచట దేవుడు వేంకటేశ్వరుడుగాను శ్రీనివాసుడుగాను అర్చింపబడుచున్నాడు. ఆ దేవుడే బాలాజీ అను పేరుతో గూడ దేశమున ప్రసిద్ధి జెందియున్నాడు. "బాలా" యన పరాదేవతామూర్తి. సంప్రదాయ విదులు పరదేవతను ప్రాతస్సంధ్యయందు బాలగాను మధ్యాహ్నమున లలితగాను సాయం సమయమున రాజరాజేశ్వరిగాను ఆరాధించు చున్నారు. వాల్మీకి మహర్షి యుపాస్య దేవతయు బాలయే. వాల్మీకి సీతను బాలాzనన్యరూపిణిగా నుపాసించెను

"తరుణాదిత్య సంకాశాం తప్తకాంచన భూషితామ్ ।
రక్తాంబర ధరాం బాలాం నీలకుంచిత మూర్ధజామ్"

(రామా. యుద్ధ 121 3)

యుద్ధ కాండమున అగ్నిప్రవేశము జేసిన సీతను అగ్నిదేవుడు మరల రాముని కిచ్చెద నని చెప్పు సందర్భమున సీత బాలా రూపిణిగా దర్శింపజేయబడుట గమనార్హము కనుక రామాయణము మహత్త్వసంపన్నమైన బాలా చరితమే అగుచున్నది. (సీతాయా శ్చరితం మహత్) అట్లు వాల్మీకి మహర్షికి ఉపాస్యదేవతయైన బాలా పరాదేవతయే తిరుమలయందు లోక సంగ్రహార్థమవతరించె నని పెద్దలు చెప్పుదురు భరతాగమనానంతరము వాల్మీకి మహర్షి చిత్రకూట మునున్న తన ఆశ్రమమును వదలి దక్షిణదేశమున తమసా నదీతీరమును తన తపోభూమిగా గ్రహించినట్లు ఉత్తరరామాయణగాథ వలన తెలియు చున్నది. రామాయణ వ్యాఖ్యాతలు గూడ అట్లే వివరించిరి. (చిత్రకూటే వాల్మీకే ర్వాసః భరతాగమనానంతరం ఋషిభి ర్నిర్గమనకథనా త్తతః ప్రభృతి తమసాతీర ఇతి జ్ఞేయమ్ గోవిందరాజీయవ్యాఖ్య)—బహుశః వాల్మీకిమహర్షి ఈ శ్రీ పర్వత (తిరుమల) ప్రాంతమును గూడ తపో భూమిగా కొంతకాలము స్వీకరించెనేమో!

తిరుమలయందు వెలసిన బాలాదేవత వేంకటేశ్వరుడుగా శ్రీనివాసుడుగా పూజ లందుకొనుట తరతరముల నుండి జరుగు చున్నది దీనినిబట్టి "ప్రియం పురుష విగ్రహం" అను వాల్మీకి వచన మునకు తిరుపతి వెంకటేశ్వరుడే ప్రత్యక్షోదాహరణ రూపుడు.ఈ"ప్రియం పురుష విగ్రహం" అనుపదము వాల్మీకి మహర్షికి తిరుపతి క్షేత్రమునకు

ఏదో తెలియరాని సంబంధమును సూచించుచున్నదా యని యనిపించు చున్నది. సహృదయు లిచ్చట ప్రమాణము

గోదావరి మండలము ర్యాలి క్షేత్రము

తిరుపతి క్షేత్రము తరువాత "స్త్రియం పురుషవిగ్రహ" మను వాల్మీకోపదేశమును తిరుపతి క్షేత్రముకన్న సుస్పష్టముగా సాధకుల కందించుచున్న దివ్య క్షేత్రము ర్యాలి. ఈ క్షేత్రము గోదావరీ మండల మున వశిష్ఠ గౌతమీ నదుల మధ్య కౌశికాతీరమున నున్నది ఇచ్చట లోకోత్తరమైన జగన్మోహినీ చన్నకేశవస్వామివారి ఆలయముకలదు

క్షీరసాగరమథన సమయమున ఆవిర్భవించిన అమృతమును పంచుటకు శ్రీమహావిష్ణువు జగన్మోహినీ రూపమును దాల్చెను. ఆ సమయ మున శివు డామోహినీసౌందర్య విమోహితుడై ఆమె వెంటబడెను. కొంత దూరము పరువెత్తిన తరువాత జగన్మోహిని మోమును ప్రక్కకు త్రిప్పి శివుని జూచెను శివు డామెవైపు జూడ శివున కామెయందు విష్ణురూపము గోచరించెను స్త్రీయని భ్రమపడి జగన్మోహినివెంట పరువిడిన శివు డామె యందు పురుష విగ్రహమును దర్శించి ఆశ్చర్యముతో అచటనే స్థాణువై లింగరూపమున నిలచెను. జగన్మోహినియు అటనుండి ముందు విష్ణురూపముతో వెనుక స్త్రీ రూపముతో శిలారూపమునొంది అచటనే నిలచిపోయెను. ఈ సంఘటన జరిగిన దివ్యక్షేత్రమే పుణ్యభూమియే

పవిత్రస్థలమే జగత్ప్రసిద్ధ ర్యాలి క్షేత్రము. ఇటగల శివాలయమున సోమ సూత్రములేదు అభిషేకజల మంతయు గర్భాలయముననే ఇంకిపోవును.

జగన్మోహిని పువ్వు విడుచున్నప్పుడు ఆమె జడనుండి చెమటబిందువులు రాలినందున ఆ క్షేత్రము "రాలి" (ర్యాలి) అను సార్థక నామమును ధరించినట్లు స్థలపురాణవిదులు చెప్పుదురు.

ప్రకృతమున శివుడు పురుష విగ్రహముతో నున్న స్త్రీమూర్తిని దర్శించినట్లే క్షేత్రగాథవలన తెలియుచున్నది ఈ నాటికి భక్తులు ర్యాలి క్షేత్రమున ముందు చన్నకేశమూర్తిని దర్శించి కృతార్థులగుచున్నారు. ఈ రెండు మూర్తులు ఒకే సాలగ్రామ శిలయందు రూపొందింపబడియున్నవి. దానిభావము రెండును రెండు మూర్తులు గావనియు ఒకే స్త్రీ మూర్తి యొక్క రూపాంతరములని తెలియజేయుటకును వెనుకనున్న స్త్రీ మూర్తిని పురుష విగ్రహముగా దర్శింపవలయునని తెలియజేయుటకేయనియు విజ్ఞులు చెప్పుదురు అందు ముందు చన్నకేశవ రూపము వెనుక మోహినీ రూపము చిత్రించుట "స్త్రియం పు ష విగ్రహ" మను వాల్మీకి భావమును సుస్పష్టముగా కన్నుల గట్టినట్లు సామాజికలకు బోధించుటకే వాల్మీకి మహర్షి భావమునకు ఈ క్షేత్రము సుస్పష్టభాష్య రూప మనుట యథార్థమే యగుచున్నది

తపోధనుడగు వాల్మీకి మహర్షి ఈ క్షేత్రమున బహుకాలము నిలచి తన తపస్సును ధారబోసి యుండవచ్చునని తోచుచున్నది. ఈ క్షేత్రము "స్త్రియం పురుష విగ్రహమను తత్త్వము నుపదేశించుటతోపాటు

ఈ క్షేత్రము వశిష్ఠ గౌతమీనదుల సంధియందుండుటగూడ ప్రధాన కారణ మగుచున్నది. వాల్మీకి మహర్షి నిత్య సంధ్యోపాసకుడు అహో రాత్ర సంధియందే గాక పవిత్రనదీ సంధులుగూడ ఆర్షదృష్టిలో సంధ్యాక స్థానములు వాల్మీకి మహర్షి అట్టి సంధ్యోపాసకుడు చూ వందే వాల్మీకి

కొకిలం ముగాటి వ్యాసము

వాల్మీకి హృదయ ప్రతిబింబ రూపములగు ర్యాలి తి`పతి క్షేత్రములందు భగవద్వాల్మీకి మందిరముల నిర్మించి ఆక్షేత్ర తత్త్వ రహస్యమును (వాల్మీకోపదేశమును) ప్రచారము జేయుట యుక్తమేమో.

స్త్రియం పురుష విగ్రహమ్ శంకర సంప్రదాయము

శంకర సంప్రదాయముతో ఏర్పడిన పీఠాధిపతుల నామధేయముల పరిశీలించిన ఈ భావ మవగత మగుచున్నది. శ్రీ విద్యా నృసింహభారతి శంకరానంద భారతి శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతి ఇత్యాది నామములను పీఠాధిపతులు ధరించుచున్నారు ఇచట "భారతి" అను పదము స్త్రీ రూపమును తెలియజేయుచున్నది. పీఠాధిపతులు పురుష విగ్రహాలు భారతిని వేద జననిని చంద్రశేఖర విద్యానృసింహాది రూపమున దర్శించు చున్నాము. ఈ సంప్రదాయము "స్త్రియం పురుష విగ్రహ మను" వాల్మీకి సూక్తి వ్యాఖ్యాన రూపమే. శ్రీ శంకరులు వాల్మీకి హృదయము సంప్రదాయ రూపమున ప్రవర్తింపజేసిన మహనీయమూర్తి జగద్గురువు

స్త్రియం పురుష విగ్రహమ్ ఉపాసనా సంప్రదాయము.

"వామా శివా తథా జ్యేష్ఠా శృంగాటాకారతాం గతా।
రౌద్రీ తు పరమేశాని జగద్గ్రసనరూపిణీ ॥
ఏషా సా పరమాశక్తి రేకైవ పరమేశ్వరీ ।
త్రిపురా త్రివిధా దేవి బ్రహ్మవిష్ణ్వీశరూపిణీ ॥

నిత్యాషోడశికార్ణవః 4 9 10

వామా జ్యేష్ఠా రౌద్ర్య ఏవ పుంవేషేణా విష్టా
బ్రహ్మ విష్ణురుద్రా భవంతి సేతుబంధవ్యాఖ్యా

"స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" అను శ్రుత్యర్థమే పై శ్లోకములందు వివరింపబడినది. "జ్ఞాన ఇచ్ఛా క్రియా శక్తులు మూడును సహజసిద్ధములైన సూక్తులు అవి శ్రుత్యర్థము. ఆ శక్తులు వామాజ్యేష్ఠా రౌద్రీ రూపములు ఈ శక్తులు లోకదృష్టికి భిన్నభిన్నములుగా గన్పట్టినను వాస్తవమునకు భిన్నములు కావు ఈ శక్తుల సమష్టిరూపమే పరాశక్తి సంస్కృత వ్యాకరణ పరిభాష ననుసరించి శక్తులు స్త్రీరూపములు, అవియే పుంరూపమును దాల్చి యథా క్రమముగ బ్రహ్మవిష్ణురుద్రులుగా వ్యవహరింపబడుచున్నారు "అని పై గ్రంథ తాత్పర్యము. కావున ఇట్టి ఉపాసనాసంప్రదాయమును దృష్టిలో నిడికొనియే వాల్మీకి మహర్షి స్త్రియం పురుష విగ్రహ"మని సూత్రప్రాయముగ పై రవాక్యము నభివ్యక్తము జెసెననుట స్పష్టము ఈ తత్త్వము సీతాదేవికి తెలియును. శ్రీ

రామునకు తెలియదనిగాదు. అహం మానుషవేషేణ" అని మానుషవేషము నభినయించుచున్న శ్రీరామునకు తత్త్వప్రత్యభిజ్ఞాసోపానకముగా శ్రీ రాముని దృష్టికి సీతతెచ్చిన దని యే గ్రహింపవలెను ఈ విధముగా పరిశీలించిన నిఖిలసంప్రదాయ విజ్ఞానము మూర్తీభవించిన ఆదికవి జ్ఞానావతారమురూపు దని స్ఫుటమగు చున్నది,

)o(



